# పోతన భాగవతం - శృంగారం

డాక్టర్ మేళ్లచెర్వు భానుప్రసాదరావు
ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.
రీడర్ : తెలుగు విభాగం
శ్రీ సుబ్బరాయ & నారాయణ కళాశాల
నరసరావుపేట - 522 601

నాగార్జున విశ్వవిద్యాలయం నుండి
పిహెచ్.డి. పట్టం పొందిన సిద్ధాంత వ్యాసం



This book is published with the Financial Assistance of
**TIRUMALA TIRUPATHI DEVASTHANAMS**
under their scheme Aid to Publish Religious Books

---

ప్రథమ ముద్రణ
యువ, దీపావళి
అక్టోబరు, 1995
ప్రతులు : 1000



ముద్రణ :
**గోల్డెన్ గ్రాఫిక్స్**
గుంటూరు

వెల : రూ. **80 /-**

ప్రతులకు

**శ్రీమతి మేళ్లచెర్వు లక్ష్మీ కుమారి**
'భరద్వాజ' 4-2-6, బండల బజారు
మునిసిపల్ హైస్కూల్ వెనుక, నరసరావుపేట - 522 601

నమస్కారాలతో అమ్మకూ నాన్నకూ



మేళ్లచెర్వు శేషాచలం, అనంతలక్ష్మి



భారద్వాజుడు మల్లయోద్ధ హనుమద్భక్తుం డుపాధ్యాయుడున్
సారోద్ధాముడు తండ్రికిన్, సదయకున్ సచ్ఛీల మా తల్లికిన్
శ్రీ రంజిల్లగ నిత్తు నీ కృతి నొగిన్ శేషాచలానంతల
క్ష్మీ రాగోదయ రమ్యమై హృదయ రాజీవంబు పుష్పింపగన్.

- భానుప్రసాదరావు

ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం
'విద్యాలంకార్'

బి - 31, శ్రీనివాసనగర్
గుంటూరు - 6

# ముందుమాట

పోతన కవీశ్వరుని భాగవతం వ్యాసభగవానుని భాగవతానికి అనువాదం కాదు, అనుసృజన (Transcreation). అందువల్లనే సంస్కృత భాగవతమెంతగానో తెలుగులో ప్రపంచితం. ఇందుకుగల అనేక కారణాల్లో ప్రముఖమైంది శృంగార రస పరిపోషణంలో పోతన కవీశ్వరునకు గల నికషోపలకౌశలం. అది అతి శ్రీనాథం. అతిమానసం. శ్రీ అరవిందులు పేర్కొన్న 'అతిమానస కవిత' (Over head Poetry) కు పోతన కవిత లక్ష్యభూతం.

ఆ కళాకౌశలం పోతన తొలిరచన 'భోగినీదండకం'లోనే బీజ ప్రాయంగా ఎలా గోచరిస్తుందో విశదీకరించాడు శ్రీ భానుప్రసాదరావు తన లఘు సిద్ధాంత వ్యాసం 'శృంగార రసవాహిని - భోగినీ దండకం' లో. దాన్ని కూడా ప్రత్యేకంగా ప్రచురిస్తే బాగుంటుంది.

తదనంతర నిరంతర కృషి ఫలితంగా పోతనార్యుని ఏతత్కళా కౌశలం భాగవత సృష్టిలో ఏ రీతిగా విశ్వరూపం దాల్చిందో ఈ ప్రవిమల సిద్ధాంత వ్యాస దర్పణంలో ప్రతిబింబింప జేసాడు డాక్టర్ భానుప్రసాద్. నా మనోభీష్టం మనోజ్ఞంగా నెరవేర్చిన ఇతడికి నా నెనరు.

'నా మూలం లిఖ్యతే కించిత్, నానపేక్షిత ముచ్యతే' అన్న మల్లినాథ సూరి వర్యుని ప్రతిజ్ఞను ఈ పరిశోధక సూరి అక్షరాలా పాటించటం పాఠకులు పరిశీలించగలరు. అందుకే ఈ రచన పరిమాణంలో చిన్నదిగా కనిపిస్తుంది. లక్ష్య లక్షణ సమన్వయంలో ఈ రచయిత బుద్ధివైశిత్యం సర్వే సర్వత్ర సందర్శనీయం.

ఆంధ్ర భాగవతం దివ్య శృంగార రత్నాకరం. దాని లోలోతుల్లోని ఎన్నెన్ని అనర్ఘరత్నా లీ పరిశోధనలో బయటికి వెలార్చ బడ్డాయో సహృదయ పాఠకులు చెప్తే విని ఆనందించాలని నా అభిలాష. "ఆపరితోషాత్ విదుషాం" అని గదా కాళిదాసోక్తి.

"సహనౌయశః, సహనౌ బ్రహ్మవర్చసమ్"
"పిబత భాగవతం రసమాలయం
ముహురహో రసికాః భువిభావుకాః"

విమర్శనాత్మక భాగవత రసాస్వాదన కిదో మహావకాశం.

- బొడ్డుపల్లి పురుషోత్తం

ది. 12-10-1995

గుంటూరు శేషేంద్ర శర్మ

జ్ఞాన్‌బాగ్ ప్యాలెస్, గోషామహల్
హైదరాబాద్ - 500 012

# భూమిక

అసలు వ్యాసుడు కృష్ణుడే. ఆయనే జయదేవుడు. ఆయనే లీలాశుకుడు. ఆయనే నారాయణ తీర్థులు. ఆయనే మన తెలుగు మొర ఆలకించి పోతనై పుట్టాడు. తెలుగు దేశాన్ని పరిమళ భరితం చేశాడు. మహానుభావుడయిన ఆ పోతన భాగవతము తెలుగు జాతిని తరింపజేసే మహోజ్జ్వల సంపద. అది విష్ణుభక్తి పీఠము. అందులో దశమ స్కంధము మధురభక్తి అనబడే కృష్ణ శృంగారానికి గర్భస్థలి.

పోతన భాగవతమంటే వ్యాస భాగవతమనే నా అభిప్రాయం. ఈ రెంటికీ అభేదం భావించి చెప్పుతున్నాను. మహాభాగవతంలో కేవలం రసకవిగా దర్శనమిచ్చిన వ్యాసుడు భాగవత పురాణంలో గొప్ప అలంకార కవిగా ప్రత్యక్షమౌతాడు. సుచారు శబ్దావళీ సంచయనము, మర్మార్థప్రతీతి జనక శబ్దగ్రథనము ఉన్న రచనా కౌశలంలో అనన్య సామాన్య ప్రతిభ చూపిస్తూ భాగవతమనే పేరుతో ఒక మహారమణీయ కావ్యమును సృష్టించాడు.

శ్రీ డా॥ భానుప్రసాదరావుగారు పోతన చిత్రించిన కృష్ణ శృంగారాన్ని, మూలాన్ని, అనువాదాన్ని బహుకావ్యశాస్త్ర గ్రంథావళిని ఇంకా ఎన్నిటినో తీసుకొని వాటి నుంచి ప్రమాణాలను ఉల్లేఖిస్తూ స్వోపజ్ఞమైన బుద్ధి కౌశలంతో నిర్మించిన అత్యాకర్షక రచనా శిల్పము ఈ 'పోతన భాగవతం - శృంగారం' అనే Ph.D. సిద్ధాంత వ్యాసము. ఆయన చెప్పిన విషయాలు అందుకు వాడిన భాష ద్రాక్షాగుళుచ్ఛాలు వ్రేలాడే తీగెలా చదివిన తర్వాత కూడా చాలాసేపు మది మాధుర్య రసప్లావితంగానే తల్లీనమై ఉండిపోతుంది.

భాగవతంలో ప్రసిద్ధ ఘట్టములైన గోపికా వస్త్రాపహరణము, కృష్ణ విరహితలైన గోపికల వేదన భ్రమరగీతలు భాను ప్రసాదరావు గారిచేత ఎంతో మనోహరంగా ఆవిష్కరింపబడ్డాయి. శృంగారాన్ని యింత సూక్ష్మ సూక్ష్మతర సూక్ష్మతమ అంశల్లో శాస్త్రసమ్మతంగా పరిశీలించిన ధిషణోజ్జ్వల సాహిత్య విపశ్చిద్వర్యుడు నేనెరిగినంతలో మరొకరు కనిపించలేదు. ఈ గ్రంథమంతటా భాను ప్రసాద్ గారు సాహిత్య శిల్పిగా కన్పిస్తాడు. భాగవతం కల్పించే తన్మయత్వం శ్రీభాను ప్రసాదరావు గారి గ్రంథం కూడా కలిగిస్తుంది. ఇది గొప్ప విశేషము. ఈ మేరు సమాన గ్రంథం నన్నెంతో ఆలోచింపజేశింది. ఆస్వాదింప జేశింది. మళ్ళీ భక్తుడ్ని చేశింది.

హైదరాబాద్
19-10-1995

- శేషేంద్ర

**DONEPUDI VENKAYYA**, "Vajranakha"
Literary Critic

Krishna Lanka
Vijayawada - 13

## AN APPRECIATION

This thesis entitled, "Pothana Bhagavatham - Sringaram", (Sringara in Bhagavatha, the Telugu poetic version written by Pothana) presented to the Nagarjuna university for the degree of Ph.D., represents the investigation carried on by Dr. Mellachervu Bhanuprasada Rao, Reader, S.S & N. College, Narasaraopet in Andhra Pradesh, as a research scholar under the guidance of Professor Boddupalli Purushotham. This thesis gives an exhaustive and critical exposition of Bhagavatha in Telugu, a Moksha Sastra, as a Kama Sastra (Science of sexology) too.

The unique contribution of Dr. Bhanuprasada Rao through this book to critical literature lies in the fact that he has thrown light on the hitherto unknown and unnoticed facets of Kama Sringara in the love episodes of Gopis and Krishna, Kubja and Krishna, Rukmini and Krishna, Usha and Anirudha, Sarmishta and Yayathi, Urvasi and Pururava, Rishya Sringa and Courtesans, Mohini and Parameswara and such others, drawing authority from works like Sringara Prakasa, Bhava Prakasa, Rasarnava Sudhakara and also Kama Sutras of Vatsyayana. He has also shown how the seed of Sringara in Sanskrit Bhagavata of Veda Vyasa has been grown into a huge tree in Andhra Maha Bhagavatha by Pothana.

While citing the introductory poem "Lalithaskandhamu......" the writer has, perhaps for the first time in Telugu literature, interpretes that Bhagavatha is a wish - fulfilling tree, which blesses the enlightened readers with the fruit of Sringara. He has also demonstrated well how the stotras written by Pothana in various contexts in Bhagavatham are filled to the brim with Sringara. With his erudition and a very original mind, the author has discussed all the prevailing theories of Alankara Sastra at length and given his verdict that Sri Krishna, the Sringara - rasa Incarnate, is the best 'Vaisika' nayaka. This is really path-breaking, if not breath-taking.

The various steps and intimate poses leading to the sexual union, as vividly described by Pothana and quoted and commented upon by Dr. Bhanuprasada Rao, may be shocking to those prudes and kill-joys for whom sex is a forbidden territory. But the same would inform, educate and enlighten those married couples who want to have the experience of conjugal bliss to their heart's content (see page 198) and at the same time would work like an invigorating tonic to those lovers who are under the magic spell of that irresistible angelic instinct, that life's greatest stimulant. Pothana, the poet par excellence, who never looked upon sex with abhorrence - that is the Indian way any way - wrote Bhagavatha as a Sringara Kavya in as much as he knew, as rightly pointed out by the writer, that the bliss experienced by lovers imparadised in a passionate and mutual embrace is akin to heavenly bliss (see page 134) and that Kama Sringara is the most effective and suggestive image of Moksha Sringara. The writer also has showed, liberally quoting from Pothana's poems, how Sringara in Bhagavatha gives aesthetic ecstasy and makes one transported to and transfixed on the threshold of divine ecstasy.

Every thing in this book - including the title, the colour and the Gopikrishna picture on the cover page, the picture of parrot on the inner page, the printing, the get-up - symbolizes Sringara. The book excites, exhilarates and gives the feeling of an electric shiver tingling through the veins and is comparable to the sweet sexy song (Kama - gita - see page 181) sung by Krishna, the cow-herd boy, on his flute, out of which enthralling sounds proceed like the arrows of Cupid, piercing the hearts of gopis and driving them mad with love for Krishna.

A special attraction of this sweet and smart book is its style - crisp and brisk, hence flowing and well - chiselled and perfected, hence charming. The book is likely to cause quite a stir in Telugu literary circles and in even a wider field if a translation of the same is brought out.

Yuva, Diwali
23-10-1995

*- Donevudi Venkaiah*

డాక్టర్ చేరెడ్డి మస్తాన్ రెడ్డి
ఎం.ఏ., పిహెచ్.డి.
డాక్టర్ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి
ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.

తెలుగు విభాగం
ఎస్.కె.ఆర్. బి.ఆర్. కళాశాల
నరసరావుపేట - 522 601

# ఉద్దీపనం

భాగవతాన్ని భక్తి ప్రయోగశాలగా నిరూపించిన నిరూఢ మనీషు లనేకు లున్నారు. కానీ దాన్ని శృంగార రస రంగభూమిగా భావించి భాషించిన కోవిదులు మాత్రం కొల్లలుగా లేరు. అరుదుగా వున్న ఈ మార్గంలో ప్రయాణించి డాక్టరేట్ బిరుదాన్ని పొందిన మా మిత్రుడు మేళ్ళ చెర్వు భానుప్రసాదరావు బహుధా ప్రశంసనీయుడు.

శృంగార ప్రకాశ భావప్రకాశన రసార్ణవసుధాకర ప్రముఖ అలంకారిక గ్రంథాలతో బాటుగా కామశాస్త్రోపనిషత్తయిన వాత్స్యాయన కామసూత్రాలను గూడా మథించి ఒక క్రమబద్ధమైన ప్రణాళిక నేర్పాటు చేసుకొని భాగవతంలోని విషయాలను సమీకరించి సమన్వయించి పోతనను శృంగార రససిద్ధుడుగా నిరూపించాడు మా భాను.

భాగవతారంభంలో వున్న 'లలిత స్కంధము ......' అనే పద్యాన్ని శృంగార మూలకందంగా వీరు సమన్వయించిన తీరు అనిదంపూర్వం. శృంగార రస సర్వస్వమైన శ్రీకృష్ణుడ్ని వైశికనాయక శిఖామణిగా విశ్లేషించటం అసలైన సిసలైన పరిశోధన. వీర శృంగారాల లాంటి అవిరోధ రసాలలోనే కాకుండా కరుణ శృంగారాల లాంటి విరోధి రసాలలో గూడా శృంగార తత్త్వాన్ని అవిష్కరించటమూ స్తుతులలో గూడా శృంగార గతులను వెదకటమూ మా భాను పరిశోధనలో మనల్ని ఆకర్షించే ప్రత్యేక విషయాలు.

మన భారతీయ సంస్కృతికి ప్రాణప్రదమైన అంశం వివాహ వ్యవస్థ. ఏకపత్నీవ్రతం, పాతివ్రత్యం అనేవి ఈ వ్యవస్థకు నేత్రద్వయం. ఈ రెండింటి సమైక్యాన్ని కౌలీన శృంగారంగా అలంకారికు లభివర్ణించారు. మా భాను దాన్ని పసిగట్టి భాగవతంలోని ఆ జాడల నన్వేషించి ఇందులో పొందుపరిచాడు. ఈ దాంపత్యాగమ రహస్యాల్ని ప్రణయ జీవనులైన దంపతు లందరూ చదివి ఆనందించాలి. ఆచరించాలి. ఈ విధంగా సమాజంలో ఈ విలువల వెలుగులను విరజిమ్మిన మా భాను అభినందనీయుడు.

ఏ గ్రంథ స్యందనానికైనా భాషా భావాలు జోడు గుఱ్ఱాలు. భాను నిగ్రహ ప్రగ్రహాలను స్వాధీనంలో ఉంచుకొని ఆ జోడు గుఱ్ఱాల చేత కదను త్రొక్కించాడు. ఈ దృష్టితో పరికిస్తే ఈ సిద్ధాంత గ్రంథం ఒక రస రంజిత వచన ప్రబంధంగా మనకు దర్శన మిస్తుంది.

జగతః పితరులూ ఆది దంపతులూ ఐన పార్వతీ పరమేశ్వరుల అనుగ్రహం వలన ఈ సిద్ధాంత గ్రంథానికి ప్రచుర ప్రచారం లభించాలని ఆకాంక్షిస్తున్నాం !

- చేరెడ్డి మస్తాన్ రెడ్డి
- పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి

యువ, విజయదశమి
ది. 3-10-1995

# కృతజ్ఞతలు

శృంగార రస సిద్ధుడైన పోతన తన భాగవత రచన ద్వారా రసలోకాన్ని శృంగార రస సమ్ముగ్ధం కావించాడు. ఆయన రచించిన భాగవత భాగాలను పరిశోధించి 'పోతన భాగవతం-శృంగార రసపోషణం' అనే సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించి 1993లో నాగార్జున విశ్వ విద్యాలయం నుండి పిహెచ్.డి. పట్టాన్ని పొందాను. ఆ సిద్ధాంత గ్రంథాన్నే 'పోతన భాగవతం-శృంగారం'గా ఇప్పుడు మీ ముందుంచుతున్నాను.

నా పరిశోధన వ్యాసంగానికి నాగార్జున విశ్వవిద్యాలయం వారు అవకాశం కల్పించారు. మా కళాశాల పాలకవర్గ అధ్యక్షులు కపలవాయి కాశీరామారావుగారు, కార్యదర్శి నాగసరపు రామారావుగారు అభిమానంతో అనుమతించారు.

మా గురువర్యులు భాషావ్యాకరణ సాహిత్యాలంకార చతురాస్యులు ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తంగారు నా ఎం.ఫిల్., పిహెచ్.డి. పరిశోధనలను పర్యవేక్షించారు. ఆచార్య పి.ఎస్. సుబ్రహ్మణ్యంగారు, ఆచార్య జి. నాగయ్యగారు, ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారు ఈ పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసానికి న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు.

'సాహితీ మేఖల' వ్యవస్థాపకులు మా పెద తండ్రిగారైన కీ॥శే॥ కవిరత్న అంబటిపూడి వెంకటరత్నంగారు ఆశీర్వదించి ప్రోత్సహించారు. వారి గ్రంథాలయంలోని అలంకార గ్రంథ సామస్త్యాన్ని వారి కుమారుడు మా ప్రియతమ సోదరుడైన సుబ్రహ్మణ్యశాస్త్రిగారు నాకిచ్చి సహకరించారు. మా మేనమామ 'వజ్రనఖ' దోనెపూడి వెంకయ్యగారు అనేక విషయాలు వివరించి సందేహ నివృత్తి కావించారు. అభిప్రాయాన్ని అందించారు.

మా నిత్య సాహిత్య గోష్ఠి సహవ్రతులు సతీర్థులు ప్రాణాధిక మిత్రులు డా॥ చేరెడ్డి మస్తాన్ రెడ్డి, డా॥ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి నా పరిశోధనా వ్యాసంగంలోనూ గ్రంథముద్రణ విషయంలోనూ అన్నిటికన్నిటా వెన్నంటి కొండంత అండగా నిలిచారు. అభిప్రాయాన్ని అందించారు.

మా సహాధ్యాపకులు ఆప్తమిత్రులు డా॥ కొఱ్ఱపాటి శ్రీరామమూర్తి, అరిపిరాల హరిహరనాథ శాస్త్రి, డా॥ నలుకుర్తి రాంబాబు గార్లు, మా ప్రియ మిత్రులు డా॥ పి.సి. వేంకటేశ్వరరెడ్డి, డా॥ బూదాటి వేంకటేశ్వర్లు, కీ॥శే॥ ఎస్.పి. వెంగళరెడ్డిగార్లు సర్వదా ప్రోత్సహించారు.

మా కళాశాల గ్రంథాలయం, మా పట్టణంలోని వైశ్య బాలమిత్ర గ్రంథాలయం, వేటపాలెంలోని సారస్వత నికేతనం అధిపతులు ఎంతో సహకరించారు.

ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తంగారు, మహాకవి గుంటూరు శేషేంద్ర శర్మగారు తమ అమూల్యాభిప్రాయాలతో ఈ గ్రంథానికి అలంకారాన్ని చేకూర్చారు.

ఇలా సహకరించిన అందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

- మేళ్లచెర్వు భానుప్రసాదరావు

# విషయ సూచిక



# పోతన భాగవతం - శృంగారం

## నేపథ్య సాహిత్య శృంగారం

కవి ఎంతటి ప్రతిభా సంపన్నుడైనా సహజ పండితుడైనా అతనిపై పూర్వ సాహిత్య ప్రభావం ఉండి తీరుతుంది. ఈ ప్రభావం కొందరిలో ప్రత్యక్షంగా ఉండవచ్చు. ఇంక కొందరిలో పరోక్షంగా గోచరించవచ్చు. మరి కొందరిలో అతి పరోక్షంగా కన్పించవచ్చు. లేదా ఈ త్రివిధ ప్రభావాలూ ఒకే కవిలో ఏకీకృతం కావచ్చు. పోతన్నను లోకం భక్తుడని ఎంతగా గౌరవించినా అతని రచనల్లో ప్రగాఢమైన శృంగార భావుకత అంతకంటే అధికాధికంగా గోచరిస్తుంది. అదే పోతన శృంగార జీవనాడికి పుష్టి నిచ్చింది. అందువల్లనే అతని కాలం వరకు వచ్చిన సర్వ సంస్కృతాంధ్ర సాహిత్యాకాశ శృంగార వీథుల్లో విహంగావలోకనంతో విహరించటం సముచితం. పూర్వకాలీన సాహిత్యాన్నీ శాస్త్ర సాహిత్యాన్నీ అగస్త్యుడులాగా అపోశన పట్టాడు పోతనామాత్యుడు. అతడు ఎంతగా వ్యుత్పన్నుడైనా అంతకు మించిన సహజ ప్రతిభా ప్రాభవుడు. అతని వ్యుత్పత్తి అతని ప్రతిభకు అణగి మణగి దాన్ని ప్రదీప్తం గావించింది.

## పూర్వ సంస్కృత సాహిత్యం - శృంగారం

కామమోహితమైన క్రౌంచ మిథున వ్యవహారమే సర్వభారతీయ సాహిత్య ప్రస్థానంలో నవరసభరితంగా తొలి మహేతిహాసమైన రామాయణ రచనకు స్ఫూర్తి నిచ్చింది. ఇది సీతారాముల ఆదర్శ దాంపత్య శృంగార జీవన విధానాన్ని లోకాని కుపదేశించి ఆరాధ్య మయింది. కవికులగురువు కాళిదాసు గౌరీశంకర ప్రణయ రసతరంగిణిగా కుమార

సంభవాన్ని సృష్టించాడు. అందుకే విప్రలంభ శృంగార ప్రధానంగా అపూర్వమైన మేఘసందేశ కావ్యాన్ని అందించి ప్రపంచాన్ని ప్రణయభావ తరంగితం చేశాడు. ఇవే గాక శృంగారతిలకం శృంగారరసాష్టకం కర్పూరమంజరి పుష్పబాణవిలాసం వంటివి కూడా కాళిదాస కవితా కళా విలాసాలే అంటారు. కాళిదాస చాక్షుష క్రతుత్రయంలో 'మాలవికాగ్ని మిత్రములోని శృంగారము ప్రచ్ఛన్నమై అయోగ రూపమున తహతహలాడి సంభోగమైనది: విక్రమోర్వశీయ శృంగార మఖిలాపాద్యున్మాదాంతము లైన యవస్థల బరిణమించి సంభోగమైనది - శాకుంతల శృంగారమో, ప్రసన్నమై సంభోగ రూపమున వెలసి పిదప వియోగమై తరువాత సంయోగమైనది'.[1]

దిజ్ఞాగుని కుందమాలా నాటకం కూడా ప్రేమ కథాతరంగితమే! భారవి కిరాతార్జునీయం మాఘుని శిశుపాలవధ కావ్యాలు ప్రకృతి వర్ణనాత్మకమై సుందరాంగనా జలక్రీడాది వర్ణనలతో నిండి శృంగారం అంగరసంగా హృదయంగమమైంది. శ్రీహర్షుని నైషధంలో కాళిదాస మహాకవి కుమారసంభవంలో లాగానే శృంగారం అతివేలంగా నడిచింది. అందుకనే శ్రీనాథుడు దీన్ని శృంగార నైషధంగా సింగారించాడు. భవభూతి ఉత్తరరామచరితంలో విప్రలంభ శృంగారం అంగరసంగా పోషింప బడింది. ఇతడి మాలతీమాధవం మధుర హృదయ మనోహర శృంగారరంగం. భట్టబాణుని గద్యకావ్యమైన 'కాదంబరి యందు సర్వ రసములు సముచితముగా సమాదృతములు.కాని అవి యన్నియు సంగ రసములు. శృంగార మొక్కటియే అసంగ రసము'[2]. ప్రణయ దేవతా ప్రతిరూపమైన వసంతసేన ప్రేమైక జీవనం ప్రధానవృత్తంగా నడిచింది శూద్రకుని మృచ్ఛకటికంలో. సురుచిర శృంగారమూర్తి అయిన అవంతీసుందరి పరిణయగాథ గల దశకుమారచరితం దండిమహాకవివిరచితం.జైనకవిధనపాలుడితిలకమంజరిలోనిహరివాహన తిలకమంజరులది ప్రణయ రస భరిత వృత్తాంతం. అది భోజుడి పెదతండ్రి (1000 - 1050) అయిన వాచస్పతిరాజు కానంద సంధాయక హేతు వయింది. భర్తృహరి శృంగారశతకం రచించి శృంగార కళల్లో స్త్రీ విలాసాల్ని వర్ణించాడు. అనంతర కాలంలోని వ్రజరాజు రసికరంజనం విశ్వేశ్వరకవిపండితుడి ఆర్యాశతకం కేవల శృంగార ద్యోతకాలే. గుణ పరిమాణంలో సైతం శృంగార సప్తశతి శేఖరీయ మయిందే. ఇందులో శృంగారనాయికా నాయకుల వివిధావస్థ లున్నాయి. 'ఏడు పద్ధతుల తోడి శృంగార సారసారిణి యను కావ్యము కామవైభవ కామినీ వైభవ భూషావయవాది వర్ణనలతో నిండి నూరు శ్లోకముల వెలయుచున్నది. ఇట్టివెన్నో!. కాన, అర్వాచీన సంస్కృత కవులు శృంగార మన్న నెంత చెవికోసికొనెడివారో తెలుపుటకు 'స్తనపంచక' మను నైదు శ్లోకముల కావ్యము గూడ నుదయించినదని చెప్పక తప్పదు. ఈ పంచకమునకు మకుటము - 'కుచద్వయ ముపాస్మహే కుముద బాన్ధవ స్యోదయే'.[3]

---

1 సంస్కృతవాఙ్మయ చరిత్ర, పుట, 377.

2 కాదంబరీ వసఙ్గత, పీఠిక.

3 సంస్కృత వాఙ్మయ చరిత్ర, పుట. 338.

పైన పేర్కొన్న వివిధ సాహిత్య ప్రక్రియలే కాక అలంకార సాహిత్యం కూడ ఆవిర్భవించి ప్రచారంలో ఉంది.దండి కావ్యాదర్శం భామహుడి కావ్యాలంకారం ఉద్భటుడి కావ్యాలంకారసారసంగ్రహం వామనుడి కావ్యాలంకారసూత్రం రుద్రటుడి కావ్యాలంకార టిప్పణం శృంగారతిలకం రాజశేఖరుడి కావ్యమీమాంస ధనంజయుడి దశరూపకం భోజుడి సరస్వతీకంఠాభరణం శృంగారప్రకాశ క్షేమేంద్రుడి ఔచిత్యవిచారచర్చ మమ్మటుడి కావ్యప్రకాశ రుయ్యకుడి అలంకార సర్వస్వం శారదాతనయుడి భావప్రకాశనం విద్యాధరపండితుడి ఏకావళి భానుదత్తుడి రసమంజరి విద్యానాథుడి ప్రతాపరుద్ర యశోభూషణం మొదలైనవి కొన్ని. వీటిలో కొన్నింటినైనా పోతన దర్శించి ఉంటాడు. ఆ సహజపండితుడు ఈ సాహిత్యదర్శనాన్ని అవలోకనంతోనే ఆపోశనపట్టి ఉంటాడు. ఇవి గాక మనుస్మృతి గతమైన కావ్యవిషయాలు సైతం అతడు దర్శించినట్లు భాగవతం సాక్ష్య మిస్తున్నది.

జయదేవుడి గీతగోవిందంలోని శృంగారం కేవలం మానుష విషయమైందిగా కాక అంతా అమానుషరూపుడైన కృష్ణభగవానుడి విషయ్యంగా వర్ణించటం వల్ల అది కేవలం కావ్యరసికులకే కాకుండా భాగవతాగ్రేసరులకు కూడ పరమాదరణీయం అయింది.[4] గేయ శైలిలో జయదేవుడు సాధించిన రాసిక్యాన్ని పద్యశైలిలో పోతన సాధించాడు. సంస్కృత భాగవత సాగర మథనానంతరం దక్కిన అమృతం శ్రీకృష్ణకర్ణామృతం. లీలాశుకుడు తనచుట్టూ జరుగుతున్నట్లే పరవశించి శ్రీకృష్ణ శృంగార లీలా చేష్టితాల్ని ఇందులో చిత్రించాడు. ఈ చిత్రాల వంటి వనేకం పోతన మనోభిత్తికపై చిత్రితమైనాయి. అది శంకరుడి స్తోత్రసాహిత్యమైన శివానంద సౌందర్యలహరులలోనూ కరావలంబాది స్తోత్రాలలోనూ కానవచ్చే శృంగారదృశ్య భావన పోతన్న చేతస్సు నాకర్షించి ఉంటుంది. వైదిక వాఙ్మయ ప్రభవాలైన సహస్రనామ స్తోత్రాల వంటి వాటిల్లోనూ భక్తి శృంగారాలు సమ్మిళితమై దేవతాపరమైన శృంగారభావన భావుక హృదయావర్జకంగా ఉంటుంది. ప్రాస్తావిక చాటుశ్లోకాలనేకం శృంగారరస సంభరితం. ఏతాదృశ శృంగారరస వాఙ్మయ ప్రభావం పోతన్నలో ఎంతో కొంత గోచరింపక మానదు.

## పూర్వాంధ్ర సాహిత్యం - శృంగారం

ఆదికవి నన్నయ్య ఆంధ్రసాహిత్య రంగంలో శృంగారాన్ని సుగంధ బంధురంగా రంగరించి అందించిన కవితల్లజుడు. సత్యవతీ పరాశర, శకుంతలా దుష్యంతాది గాథల్లోని శృంగార పోషణం హృదయైక వేద్యం. నన్నెచోడుడు మన్మథదాహం రతివిలాసం పార్వతి తపస్సు శివుని సాక్షాత్కారం పార్వతీ పరమేశ్వరుల సంభోగం వంటి సన్నివేశాలతో కుమార సంభవ కావ్యాన్ని శృంగార రసోదంచితం కావించాడు. తిక్కన 'విరాటపర్వమునందు కీచకవధ వృత్తాంతములో శృంగార వీరరసములను పోషింపదలచి రసభావముల

4 గీతగోవింద కావ్యము, పీఠిక, పుట. 4

సవిస్తారముగ విస్తరించి వ్రాసెను'.[5] కేతన దశకుమారచరిత్రలోని శృంగారం హాస్యంతో తొణికిసలాడుతూ తర్వాతి కవుల కాదర్శమయింది. మార్కండేయపురాణంలోనూ రంగనాథ భాస్కర రామాయణాలలోనూ శృంగార రసవత్కథ లనేకాలున్నాయి.

ఎఱ్ఱన శ్రీకృష్ణుని బాల్యలీలల్ని హరివంశంలో మనోజ్ఞంగా చిత్రించాడు. భారతంలో పలువర్ణనలు శృంగార రసాంచితాలు. నృసింహపురాణంలోని కథలు పోతన కనుసరణీయాలైనాయి. సాహిత్య రసపోషణ చణుడు సోమన. అతని హరివంశంలో రుక్మిణీ కృష్ణుల ఉషానిరుద్ధుల శృంగారం సుమనోహరం. రావిపాటి తిప్పన్న రచనలు మదన విజయం అంబికాశతకం ప్రేమాభిరామం. ఇతడు భక్తుడైనా అంబికాశతకంలో భక్తికన్న శృంగారాన్ని మిన్నగా గుప్పించిన శృంగార ప్రియుడు.

ఈ పూర్వాంధ్ర సాహిత్యాన్ని మనం త్రిధా వింగడించవచ్చు. మనది సిరులు పొంగే జీవగడ్డ కావటంచేత కలిగే సుఖైక జీవన భావనంవల్ల ఏర్పడ్డ శృంగార సాహిత్యం ఒకటి, పరలోక భావాలతో భక్తిభావాలతో విలసిల్లే కర్మభూమి కావటంవల్ల భక్తి సాహిత్యం మరొకటి, శృంగారచేతస్కుడైన కవి భక్తుడుగా మారటం వల్ల, భక్తి రక్తుల పట్ల సమానురాగం ఉండటం వల్ల భక్తిశృంగారం వేరొకటి. ఇలా ఈమూడూ మన సాహిత్య ప్రస్థానంలో ఏర్పడ్డాయి. ఆంధ్ర మహాభాగవతం కడపటి వర్గానికి చెందింద. సారాంశంగా పోతన భాగవతం శృంగార సంభరితం కావటానికి ప్రధాన కారణం అతడు నూటికి నూరుపాళ్లు సహజ శృంగారకవి. పూర్వ సాహిత్యంలో సర్వాంతర్యామిగా సందర్శన మిచ్చే శృంగార రచనా విలసనం పై కారణానికి దోహదం.

భాగవతాన్ని హరినామ స్తుతికావ్యంగా రచించి తనకు గల్గిన కొఱత తీర్చుకోమని నారదుడు వ్యాసమునిని ప్రబోధించాడు. అందు కుద్యమించిన వ్యాసభగవానుడు సహజమేధా సముజ్జ్వలమూర్తి కావటం వల్ల భాగవతం శాస్త్రంగా రూపొందింది. కళాధర్మం గౌణమైంది. 'విద్యావతాం భాగవతే పరీక్షా' అనే సూక్తి కాలవాలమైంది.

భాగవతం భక్తపాలన కళ మాత్రమేకాదు. అది నిగమకల్పవృక్షం కొట్టకొన కొమ్మన పచేళిమమైన ఫలం. శుకముఖ వినిర్గతమైన తద్రసం రసిక భావుకులు ముహుర్ముహుగా ఆస్వాదించవలసింది. ఏతద్రహస్యవేది పోతనార్యుడు. ఆయన ఆంధ్ర మహా భాగవతాన్ని తన ఉపజ్ఞ కొలదీ శృంగార రస పరిప్లావితం కావించి ఆంధ్రజాతికి నిత్యపాథేయమూ ఉపాదేయమూ ఐన కావ్యంగాఅందించాడు. దీని ప్రయోజనం శృంగార రసాస్వాదనమే.

# సమకాలీన సాహిత్యం - శృంగారం

పోతన నాటికే రెడ్డి పద్మనాయకరాజులు ఆంధ్ర సరస్వతికి అంగాంగ సుందరంగా అభరణాల్ని, అంగరాగాల్ని అర్పిస్తున్న రోజులవి. వా రేలింది రాజ్యాలనేకాదు సాహిత్య

5 ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము, పుట 21.

రసరాజ్యాలను కూడ. వారికి స్పర్థ ఆ రెండింటిలోనూ ఉంది. అందుకనే అవి రెం... సర్వతోముఖాభివృద్ధి చెందాయి. వారు కవిపోషకులే కాదు రాజకవులు కూడ. సర్వజ్ఞ బిరుద గ్రహణంలో కూడ వారు స్పర్థ వహించారు. ఇటువంటి నిరంతర సాహిత్య జిజ్ఞాస ఉన్న కవిపండిత సమాజంలోని సహజపండితకవి మీద ఆ ప్రభావం ఉండక తప్పదు. ఆనాటి ఏ ప్రజాకవియైనా, తన కావ్యం పదికాలాల పాటు పదిలంగా ఉండాలంటే దాన్ని శృంగారస్ఫోరకంగా తీర్చక తప్పదు. పోతన విషయంలోనూ అదే జరిగింది. అందువల్ల అప్పటి కాంధ్ర దేశంలో ప్రవర్థమాన మౌతున్న సంస్కృతాంధ్ర శృంగార వాఙ్మయాన్ని విహంగావలోకనం చేయటం ఎంతైనా అవసరం. ఈ కాలాన్ని రెడ్డి పద్మనాయక యుగంగా శ్రీనాథయుగంగా విజ్ఞులు గుర్తించారు. ఈ యుగంలో సంగీత సాహిత్య నాట్య గ్రంథా... అసంఖ్యాకంగా పరిఢవిల్లాయి.

యుగకర్తగా సాహితీలోక ప్రసిద్ధుడైన శ్రీనాథుడు తన రచనా సర్వస్వంతో శృంగార శ్రీనాథుడుగా స్థిరపడ్డాడు. శ్రీహర్ష నైషధాన్ని శృంగారనైషధంగా రసబంధురం చేశాడు. ఇతని శాలివాహన సప్తశతికి మూలమైన గాథాసప్తశతి శృంగార భావాల రసరమ్య భర్మ్యహర్మ్యం. ఇతని శృంగార చాటువులు ఆనాటి ప్రజాజీవన తత్త్వ నిరూపక సూచికలు. కుమారగిరిరెడ్డి వసంతరాజీయం అనే నాట్యగ్రంథాన్ని రచించాడు. అతడు తాను నిర్వహించిన వసంతోత్సవాలతో వీరభోగవసంతరాయలైనాడు. కాటయవేముడు కుమారగిరి రాజీయం అనే నామంతో కాళిదాస నాటకాల్ని వ్యాఖ్యానించాడు. అనవేమారెడ్డి రచనలేమీ కానరాకున్నా 'బహు సహస్ర సువర్ణదాన సంతోషిత మహాకవీశ్వర' బిరుద విరాజితుడు. సర్వజ్ఞ చక్రవర్తి పెదకోమటి వేమారెడ్డి రసికశేఖరుడు. సంస్కృతంలోని అమరుకశతకానికి శృంగార దీపిక నామంతో సంస్కృతంలోనే వ్యాఖ్య రచించాడు. ఇతడు హాలుని గాథాసప్తశతి నుండి శృంగారగాథాశతాన్ని ఏరి సప్తశతీసారటీకగా వివరించిన శృంగార హృదయుడు. ఇందులోని శృంగారం అవధులు దాటింది. శిష్టాచార సంపన్నమయింది. ఇతని సాహిత్యచింతామణిలో అప్పటి కవి నరసింహుని కాదంబరీ కల్యాణం విశ్వనాథుని సౌగంధికా హరణం అనే సంస్కృత కావ్యాల నుంచి లక్ష్యా లుదాహరించబడినై. అవి కూడ శృంగార సంబంధులే. పెదకోమటి ఆస్థానంలో శ్రీనాథునితో పాటు చిరకీర్తి నార్జించిన సంస్కృతకవి వామనభట్టబాణుడు విరూపాక్షదేవుని వసంతోత్సవ సమయంలో శృంగారభూషణభాణం అనే సంస్కృత గ్రంథాన్ని రచించాడు. ఇతని కనకలేఖా పరిణయం అనే సంస్కృత గ్రంథం శృంగార రసబంధురం. వేమభూపాల చరిత్రలో ద్రాక్షారామ వేశ్యావర్ణనం అధికం. వల్లభరాయుడు శ్రీనాథుని సాయంతో రచించిన క్రీడాభిరామం శృంగారాభిరామమే. అందులో భువనమోహిని చిన్నిపోతి అనే వేశ్యను గూర్చి ఆనాటి ప్రజల శృంగారాభిరుచిని గూర్చి తెలియవస్తున్నది. ఆ ఛాయలే భోగినీదండకంలో గమనించవచ్చు. జక్కన విక్రమార్కచరిత్రను శృంగారాత్మక వర్ణనలతో కూడిన రసవంతమైన కావ్యంగా పేర్కొనవచ్చు. శ్రీనాథుడి సమకాలం వాడుగా పరిగణింపబడుతున్న తాళ్ళపాక అన్నమయ్య శృంగార కీర్తనలతో సురుచిర కీర్తి నందుకున్నాడు. తెలుగులో

శృంగారమంజరి రచించాడు[6]. 'అన్నమయ్య శృంగార వైరాగ్యాలను పరిపూర్ణంగా సమానస్థాయిలో ఆరాధించిన మహనీయుడు'[7]. శ్రీనాథుడి శిష్యుడిగా లోకం వాకొంటున్న పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు కాళిదాసుని శాకుంతల నాటకాన్ని ప్రబంధంగా శృంగార రసాంచితం చేశాడు. ఈ 'శృంగార శాకుంతలము ప్రబంధ యుగమునకు వేగుజుక్క'[8]. రేచర్ల వెలమరాజులలోని అనవోతనాయకుని ఆస్థానంలో నాగనాథకవి ప్రసిద్ధుడు. రాచకొండ లోని కల్యాణ నారాయణుని వసంతోత్సవాల సమయంలో అతడు మదనవిలాస గ్రంథాన్ని రచించాడు. విశ్వేశ్వరకవిచంద్రుడు చమత్కారచంద్రికతో పాటు కందర్పసంభవాది రచనలు చేసి ఉంటాడని వేటూరి ప్రభాకరశాస్త్రిగారి ఊహ.[9]

సింగభూపాలుడు రసార్ణవసుధాకర కర్త. కవి పండిత పోషకుడు. సర్వజ్ఞబిరుద విరాజితుడు. ఈ రసార్ణవసుధాకరంలో ప్రాచీన సమకాలీన సంస్కృత గ్రంథాలనుండి అనేక ఉదాహరణలున్నాయి. ఆ గ్రంథాలిప్పుడు అనేకం మనకు అలభ్యాలు. అవి మాయా కురంగి మాధవీవీథిక కామదత్తం కామానందం శృంగారమంజరి కందర్పసంభవం వంటివి. శార్ఙ్గదేవుడి సంగీతరత్నాకరానికి సంగీతసుధాకరం అనే వ్యాఖ్యాన గ్రంథాన్ని నిర్మించిన సంగీతమర్మజ్ఞుడు సర్వజ్ఞసింగభూపాలుడు. ఇతడి రత్నపాంచాలికా నాటకంలోని శృంగారం సరసహృదయ హృదయోల్లాస కరంగా ఉంటుంది. మన శృంగార పోతన తన పూప వయస్సులోనే సింగభూపాలుని వారవనితను శృంగారరసవాహినిగా తన భోగినీ దండకంలో చిత్రించాడు. అది స్వతంత్ర శృంగార దండక సాహిత్యానికి మూలకేంద్రం. ఆ తర్వాత గౌరన లక్షణదీపిక అనంతామాత్యుడు రసాభరణం అనే అలంకార గ్రంథాలను రచించారు.

ఆ కాలంలోని కవులలో అధిక శాతం శృంగారాన్ని అగ్రస్థానంలో అధిష్ఠింప చేసి అగ్రతాంబూలం ఇచ్చి అభిమానించారు. ఇలా ఆనాటి రాజుల కవుల రాజకవుల ప్రజల శృంగార సంగీత అలంకార శాస్త్రాసక్తి పోతనను ఆకర్షించి ఈ నివర్గ శృంగార ధోరణికి దోహదించింది.

## రాజకీయ మత పరిస్థితులు - శృంగారం

కాకతీయ రాజ్య పతనానంతరం అవతరించిన రెడ్డి, వెలమనాయక రాజ్యాలు రెండింటిలోను ఆరంభంలో శైవమతం ఆదరింపబడినా కాల క్రమేపి వైష్ణవం శక్తిని పుంజుకుంది. ప్రోలయ వేమారెడ్డి అనవేమారెడ్డి శైవాభిమానులు. కాగా కుమారగిరిరెడ్డి కాటయవేమారెడ్డి నుండి రెడ్డి రాజ్యంలోనూ రేచర్ల వెలమ రాజ్యంలో సర్వజ్ఞ సింగ

---

6 శృంగార శ్రీనాథము, పుట. 288.

7 ఆంధ్రవాగ్గేయకారుల చరిత్రము, పుట. 128.

8 ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము, పుట. 164.

9 శృంగార శ్రీనాథం, పుట. 172.

భూపాలుడి నుండీ క్రమేపీ వైష్ణవాన్ని స్వీకరించి ఆదరించారు. యథారాజా తథాప్రజా. కానీ ప్రజల పేర్లలో మాత్రం శివకేశవ నామాలు రెండూ ఉన్నాయి. త్వరలో వైష్ణవం వృద్ధి చెందింది. శ్రీకూర్మం సింహాచలం వంటి వైష్ణవ క్షేత్రాలు విలసిల్లాయి. అప్పుడే తిరుమల వంశీయులైన వైష్ణవ పండితులు ఆంధ్రదేశానికి వచ్చారు. వారితోడి వాద ప్రతివాదాలతో 'మత మార్పిడులు' జరిగాయి. ఉత్సవాలు ఊరేగింపులు ఉద్ధృతమైనాయి. ఇలా నానాటికీ వైష్ణవం విజృంభించింది.

ఒక చెంప రెడ్డి వెలమరాజ్యాల మధ్య వైరానలం అలుముకుంది. మరోచెంప రాచకొండ బహ్మనీ సుల్తానుల మధ్య పచ్చగడ్డి భగ్గుమంటున్నది. దీనికి తోడు శైవవైష్ణవాలతో తెలంగాణం నిప్పుల కుప్పగా మారింది. ఇది రసహృదయుడైన పోతన మనోగత వేదనకు మూలకారణం. పరిష్కారమార్గంగా, విశ్వశ్రేయస్సు దృష్ట్యా పోతన భాగవత రచన కుపక్రమించాడు. ఆ కాలానికి పోతన పచేళిమ హృదయ కవి కాగా గత శతాబ్దంలో మతవైషమ్యాల క్లిష్ట సమయంలో రామానంద కబీరుదాసులు సాగించిన భక్తి సాహిత్య ప్రచారం అతనికి దృగ్గోచరమై స్ఫూర్తి నిచ్చింది. అయితే వారి కృషిలో భక్తి మత సామరస్యాలు మాత్రమే గోచరించాయి. కానీ సహజ శృంగార చేతస్కుడైన పోతన వీటితో పాటుగా లౌకిక శృంగార స్ఫోరకమైన భావాలతో తన్మయాత్మకాలైన భగవద్విషయాల్ని బోధిస్తూ పారలౌకిక ఆనందాన్ని అందించాడు. శ్రీ కైవల్యపదాన్ని ఆశించాడు. శివ కేశవాభేదమార్గాన్ని నిర్దేశిస్తూ —

తే ॥ చేతులారంగ శివుని పూజింపడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని 1-12

అంటూ భాగవత రచన కుపక్రమించాడు. ఆపై శృంగార రసాన్ని భగవత్కథలో నిర్వహించాడు.

జన్మతః శైవుడైన పోతన గంగాతీరంలో ధ్యానమగ్నుడు కాగా శ్రీరాముడు అయనకు దర్శనమిచ్చాడు. భాగవత రచనకు ప్రేరేపించాడు. తదుపక్రమంలో భాగవత కథానాయకుడైన శ్రీకృష్ణుని శృంగార రసస్వరూపం సాక్షాత్కరించింది పోతన్నకు. తత్ఫలితంగా భౌతిక శృంగార భావుకతను భగవత్పరం చేసి భాగవత పురాణ ఫలరస సిద్ధిని పొందాడు. కనుక శృంగారం సర్వరస సాధకంగా పోతన సంభావించాడు. అంతకు పూర్వమే ఆనందవర్ధనుడు శృంగారానికి సర్వాధిపత్యమిచ్చి 'శృంగార ఏవ మధురః' అని కీర్తించాడు.

ఈ కారణాలవల్ల భక్తి భావ సంకలితమైన భాగవతం శృంగార రసోల్లసితమైంది.

# సాంఘిక జీవనం - శృంగారం

పోతన కాలంనాటి జనజీవన విధానం వారి హృదయాంతరాళాల్లో నెలకొన్న సౌందర్యోపాసనాసక్తిని నిరూపిస్తుంది. అది ఆనాటి సాహిత్య ప్రక్రియల వల్ల వెల్లడౌతున్నది.

ఆ రచనలన్నీ రసికజన రంజితాలనటంలో సందేహంలేదు. శ్రీనాథ పోతనల శివకేశవ గాథల్లో భోగప్రవృత్తి గోచరిస్తుంది. ఆనాటి రాజులు శృంగార ప్రియులు. పండితులూ పామరులూ నాగరకులూ జానపదులూ అందరూ రాజమార్గానుగాములే. ప్రజలలో మత భేదా లెన్ని ఉన్నా అందరికీ శృంగారం అభిమతమే. ఆలయనిర్మాణాలు సంగీత నృత్యాభినయ హేలలు సర్వసామాన్యాలు. ఏ తత్సంబంధిత గ్రంథాలెన్నో ఆ కాలంలో ఉద్భవించాయి. రాజాస్థానాలు సర్వకళా నికేతనాలు. నాటి రాజనర్తకీమణులకు అగ్రగామి లకుమాదేవి. ఆమె రాజకార్యాలు కూడ తీర్చగల దిట్ట.

ఆకాలంలో భోగినీ వ్యవస్థ ప్లాదినీ వర్ధనం. వారికి సంఘంలో ప్రత్యేక గౌరవం ఉండేది. ధనవంతులకు వారు ఉంపుడుగత్తెలుగా ఉండేవారు. భువనమోహినిచిన్నపోతి మాచల్దేవి అనంగమంజరి భోగిని ఇటువంటివారే. ఆనాటి వేశ్యావాటికల్నీ శృంగార జీవనాన్నీ వేమభూపాల చరిత్ర శృంగారభూషణ భాణం క్రీడాభిరామం వంటి సమకాలీన సంస్కృతాంధ్ర గ్రంథాలు నిరూపిస్తాయి. నాటి కవులకు కనకాభిషేకాలూ బిరుద ప్రదానాది సత్కారాలూ జరిగేవి. రసికులకు శృంగార సూచకమైన రాజవేశ్యాభుజంగాది బిరుదులుండేవి. వసంతోత్సవాల్లో ప్రజలు విశేషంగా పాల్గొనేవారు. అందులో సుగంధ జలాలు కర్పూరపరాగం వసంతం పరస్పరం చల్లుకుంటూ వెన్నెల రాత్రుల్లో పాటలు పాడుకుంటూ విహరించేవారు. ఇవీ ఒక విధంగా రాసక్రీడలే. అవచితిప్పయసెట్టి చామి సెట్టి వంటివారు సుగంధద్రవ్యాల వ్యాపారం ద్వీపాంతరాలలో కూడ సాగించినట్లు తెలుస్తుంది. రసజ్ఞుడు ధనికుడు రాజమిత్రుడైన అవచి తిప్పయసెట్టిని శ్రీనాథుడు మెచ్చి కీర్తించటం శ్రీనాథుని శృంగార శేఖరీయతకు నిదర్శనం.

కం॥ కొమరగిరి నృప వసంతా
గమ కేళీ గంధసార కస్తూరీ కుం
కుమ కర్పూర హిమాంభ
స్సముదంచిత బహుసుగంధ శాలాధ్యక్షా ! హరవిలాసం 1-3

కళాకారులు వివిధ సంస్కృత 'వీధి' నాటకభేదాలు దేశీయ నాటకాలు ప్రదర్శించేవారు. స్త్రీలు శృంగార నాట్యాభినయాలు నేర్చి ప్రదర్శించేవారు. ఇలా సర్వ విధాలా నాటి ప్రజాజీవనం శృంగారరసోజ్జ్వల విలసనమై సర్వ వ్యాపారాల్నీ శృంగార ధోరణి లోనే పరిష్కరించుకొన్నదనటం సత్యదూరం కాదు.

ఏవంవిధ శృంగార రసోల్లసిత ప్రజాజీవనవిధా నాకర్షితుడైన సహజకవి పోతన తాను రచించిన భాగవతాన్ని తద్రస విష్యందిగా తీర్చిదిద్ది ప్రజాభిలషితం కావించాడు. దానితోనే వారికి తృతీయ పురుషార్థాన్నీ పరమార్థాన్నీ సమకూర్చాడు. పూర్ణ శృంగారిగా ప్రజాహృదయ పీఠాన్నలంకరించాడు.

# శృంగార రస భేదాలు

## అయోగ శృంగారం

అయా విభావాదుల వల్ల రాగ ముదయించిన ప్రేయసీ ప్రియులకు సంబంధం కలగకపోవటం అయోగ శృంగారం. ఈ అయోగ శృంగారంలో నాయికా నాయకుల కిద్దరికీ దశవిధావస్థ లుంటాయి.[1] వారికి పరస్పర దర్శనం అనేది సాక్షాద్దర్శనం ప్రతికృతిదర్శనం స్వప్నదర్శనం ఛాయాదర్శనం మాయాగుణదర్శనం మొదలైన విభావాల వల్ల కలుగుతుంది.[2] పోతన భాగవతంలో ఈ దశావస్థలు రమణీయంగా దర్శనమిస్తాయి.

విప్రలంభ భేదాలైన అయోగ వియోగాల రెండిటా విభావానుభావాలు సమానం. వీటిలో రతి రూపం అయిన స్థాయి అనువృత్తమయి ఉంటుంది. శృంగార భేదాలలో అయోగ శృంగారానికే పూర్వానురాగం అని కూడా వ్యవహారం. ఆంధ్ర మహా భాగవతంలో ఈ అయోగ శృంగార రసపోషణ కావింపబడిన రీతిని చూద్దాం.

## గోపికా పరిదేవనం

వేణునాదాకృష్టలై తనకోసం వచ్చిన వ్రజాంగనల నుద్దేశించి శ్రీకృష్ణుడు చేసిన హితబోధ శృంగారాత్మకం. గోపికలది వేణునాద శ్రవణ సంబంధి, సాక్షాద్దర్శన సంబంధి అయిన అయోగశృంగారం. సత్కులాంగనలకు జారవాంఛ తగదని అతని హితబోధలోని సారాంశం. జారవృత్తివల్ల స్త్రీలకు సౌఖ్యలేశం కూడా లేదని చెప్పి వారి గాఢ చిత్తానికి నిగూఢ పరీక్ష పెట్టాడు (10-977). ఈ ఘట్టంలో శ్రీకృష్ణుడు జారుడనే భావమే లౌకిక

1 శ్లో॥ దృఙ్మన స్సంగ సంకల్పో జాగరః కృశతా రతిః
ప్రీత్యాగోన్మాద మూర్ఛాంతా ఇత్యనంగ దశా దశ ॥ కావ్యాలంకార సంగ్రహము, పుట. 394

2 శ్లో॥ సాక్షాత్ప్రతికృతి స్వప్న చ్ఛాయా మాయా గుణాదిభిః ।
నాయికాయా నాయకస్య దర్శనంస్యా త్పరస్పరమ్ ॥ భావప్రకాశనము, పుట. 184

దృష్టికి గోచరిస్తుంది. అతడు పెట్టిన ఈ పరీక్షలోనే యమునానదీ సమీప వనసౌందర్యం వల్ల మనంబులు మేరదప్పెనో అని ప్రకృతి ఉద్దీపక శక్తిని గుర్తించాడు. దానికి లొంగరాదనే భావంతోనే కుల కాంతలు భర్తలపై మమకారం కలిగి ఉండాలని అమూల ప్రబోధం (10-977). ఆ హితబోధ అహితం కాగా దుఃఖంతో మౌనం దాల్చిన గోపికల రూప చిత్రణం వ్యాస పోతనల భావతీవ్రత నిరూపణల వ్యత్యాసాన్ని రూపిస్తుంది.

శ్లో ॥ కృత్వా ముఖాన్యవశుచః శ్వసనేన శుష్యా
ద్బింబాధరాణి చరణేన భువం లిఖన్త్యః ।
అస్రైరుపాత్త మసిభిః కుచ కుంకుమాని
తస్థుర్మృజన్త్య ఉరుదుఃఖ భరాః స్మ తూష్ణీమ్ ॥ 10-29-29

శ్లో ॥ ప్రేష్ఠం ప్రియేతరమివ ప్రతిభాషమాణమ్
కృష్ణం తదర్థ వినివర్తిత సర్వకామాః ।
నేత్రే విమృజ్య రుదితోపహతే స్మ కించిత్
సంరమ్భ గద్గద గిరోఽబ్రువతానురక్తాః 10-29-30

ఇలా వ్యాసావిష్కృతమైన భావత్రయాన్ని పోతన ద్విగుణీకరించి అయోగ విరహిణీ రూప సాక్షాత్కారం చేశాడు అనువాదంలో.

సీ ॥ విరహాగ్ని శిఖలతో వెడలు నిట్టూర్పుల
ముమ్మరంబుల గంది మోవులెండ
గన్నుల వెడలెడి కజ్జల ధారలు
కుచ కుంకుమంబుల గ్రొచ్చి పాఱ
జెక్కుల జేర్చిన చేతుల వేడిమి
మోముదమ్ముల మేలి మురువు డింద
బొరి బొరి ఖుంఖాను పుంఖంబులై తాకు
మదను కోలల ధైర్య మహిమ లెడల

తే ॥ దుఃఖభరమున మాటలు తొట్రుపడగ
బ్రియము లాడవి బ్రియు జూచి బెగ్గడిల్లి
చరణములు నేల వ్రాయుచు సంభ్రమమున
గాంత లెల్లను వగల నాక్రాంతలగుచు. 10-983

ఇందులో గోపికల చింతాలక్షణం[3] ఉన్మీలితం.

పరస్పర సన్నిహితులైనా అయోగంవల్ల కలిగిన చింతా సంభ్రమ వ్రీడాది

---

3 'ఇష్టప్రాప్త్యనిష్టప్రాప్త్యాదిజనితా ధ్యానాపరపర్యాయా వైవర్ణ్య భూలేఖ నాధోముఖత్వాది హేతు శ్చిత్తవృత్తి విశేషశ్చింతా' నవరసగంగాధరం, పుట. 212

వ్యభిచారుల వల్ల విరహ విజృంభణం సూచితమయింది. తమ సర్వాంగాలూ కృష్ణ సమర్పణాన్నే కోరుకుంటున్నాయనీ తమ మనస్సుల నంతగా ఎందుకు దొంగిలించా ?వనీ వారు ప్రశ్నించారు. అతని శృంగార లీలా వైశిష్ట్యాన్నీ తమ నిస్సహాయతనూ నిరూపించు కొన్నారు. తమను కాదనటం మగపోడిమి కాదని పరుషోక్తులాడారు. మన్మథబాణాలతో ఆయనకు దాసలమైనామని దీనలై విన్నవించుకొన్నారు.

కాగా కామతాప నివారక తంత్రాలుగా అధరామృత పానం కుచాలింగనం మున్నైన వాటిని కోరుకున్నారు. అవి వినా తమకు బ్రతుకులేదని బాధపడ్డారు (10-994). చతుర్విధమైన మన్మథ దౌష్ట్యాలను ఆయన లేకుండా భరించలేమని విరహ వ్యధను వ్యక్తీకరించారు పోతన్నగారి గోపికలు.

సీ ॥ ఈ పంచబాణాగ్ని నేమిట నార్తుము
        నీ మంజువాగ్వృష్టి నెగడదేని
    నీ మన్మథాంభోధి నేత్రోవ గడతుము
        నీ దృష్టి నావయై నిలువదేని
    నీ చిత్తజధ్వాంత మే జాడ జెఱుతుము
        నీ హాస చంద్రిక నిగుడదేని
    నీ దర్పక జ్వర మేభంగి నణగు నీ
        యధరామృతౌషధ మబ్బదేని

ఆ ॥ ఎట్లు నిర్వహింతు మేలాగు మాలాగు
    కరుణ సేయవేని గదియవేని
    మరుడు నిర్దయుండు మననిచ్చునే య:
    దాకుమార ! యువతి ధైర్యచోర ! 10-997

వారి దీనాలాపాలు సహృదయులనే కాదు, శిలా సదృశులను సైతం కరగించేవిగా ఉన్నాయి. అయినా ఉలకని పలకని అతని ఉదాసీనతను గూర్చి నిందాస్తుతిగా పల్కిన మాటలు (10-999) పూర్వ భావాన్నే విస్తరించినా, అతని అపర మారావతారాన్ని మననం చేసుకొని అతణ్ణి లోగొనటానికి వాడిన వాడి శిలీముఖాలు. ఇలా వారి విరహతీవ్రతవల్ల అయోగ శృంగారం పుష్టిమంతమయింది. చివరకు సురత వర్ణనం ఉన్నా ప్రధానమయింది అయోగ శృంగారమే. దాని రమ్య నిర్వహణంకోసం అమూలక రసరమ్య భావాల్ని జోడించాడు పోతన. ఆ యత్నంలో గోపికలతో తాదాత్మ్యాన్ని పొందాడు ఆ మహాకవి.

కల్యాణాత్మకమైనది రుక్మిణీ కల్యాణం. ఇదో స్వతంత్ర ప్రబంధం వంటిది. ఇందులో నాయికా నాయక ప్రతినాయకు లున్నారు. శృంగారం అంగిరసం. వీరం అంగరసం. ఇది ప్రధానంగా అయోగ శృంగార భరితం. అయినా వివిధ వర్ణనలతో కూడి సంభోగ శృంగార సూచనలతో ముగిసింది. ఇందులోని నాయిక 'బాలామణి' 'గుణవతీ

చూడామణి' అయిన రుక్మిణి. అనగా నాయిక కన్యక (10-1733). నాయకుడు లోకమునోభిరాముడు (10-1702) శ్రీకృష్ణుడు. రుక్మిణీ శ్రీకృష్ణుల పరస్పరైక కాల యౌవన పరిణత నిర్వహణం పరమ హృద్యం. వారి పరస్పర సుఖ సంవేద నాత్మకమైన అనుభూతీ పరస్పర భోగ్య భావోదయమైన రతిభావం కలిగిన తీరూ శృంగార రస నిర్వహణంలో పోతన చూపిన నూతన మార్గం. శ్రీకృష్ణుని రతిభావం హేతువు కాగా రుక్మిణీ యౌవనం ఫలించింది. ఆయన మనోదశావిశేషాలు ఆమె నిత్యనూతన తనూధర్మంగా పరిణమించినై. అనగా అవి అందుకు హేతువులైనాయి. అది నాయికా నాయకుల పరస్పర కర్మాను రూపవర్ణనం.

సీ ॥ దేవకీ సుతుకోర్కె తీగెలు వీడంగ
        వెలదికి మైదీగె వీడదొణగె
    కమలనాభుని చిత్తకమలంబు వికసింప
        గాంతి నింతికి ముఖకమల మొప్పె
    మధువిరోధికి లోన మదనాగ్ని వొడచూప
        బాలతికి జనుదోయి పొడవు సూపె
    శౌరికి ధైర్యంబు సన్నమై డయ్యంగ
        జలజాక్షి మధ్యంబు సన్నమయ్యె
ఆ॥ హరికి బ్రేమబంధ మధికంబుగా గేశ
    బంధ మధిక మగుచు బాల కమరె
    బద్మనయను వలన బ్రమదంబు నిండార
    నెలత యౌవనంబు నిండియుండె. 10-1669

ఇది వారి అనురూపమైన అవినాభావ సంబంధమైన పరస్పర సంవర్ధకమైన పూర్వజన్మ సంస్కార సంబంధమైన ప్రేమ స్ఫోరక వర్ణనం. దీనితో రుక్మిణీ శ్రీకృష్ణుల శృంగార రస చర్వణానికి సహృదయ హృదయాలు ఉన్ముఖాలైతాయి. 'దాంపత్య విషయమున పురుషునకు భోక్తృత్వము. స్త్రీకి భోగ్యత్వము సహజము. ఇది ప్రధాన దృష్టితో చెప్పినమాట. పురుషునకు భోక్తృభావము నందు విశ్రాంతి. స్త్రీకి భోగ్యభావము నందు విశ్రాంతి. వారి శరీర నిర్మాణము కూడ నిదియే చెప్పును. అందుచే పురుషునకు మానసికమైన భోగమధికము. స్త్రీకి శారీరకానుభూతి యధికము. ఇందుచేత మనో లక్షణము శ్రీకృష్ణుని యందును, శరీర లక్షణము రుక్మిణి యందును వర్ణితము'[4]

పరస్పరరూప గుణాది శ్రవణం వల్లనే వారికి పూర్వాను రాగం కలిగింది. పూర్వాను రాగాన్ని గూర్చి రసార్ణవసుధాకరం[5] వివరిస్తుంది. అయోగశృంగారంలో నాయికా నాయకులకు దశావస్థలుంటాయి. కన్యామణి రుక్మిణిలో దశావస్థల్లో కొన్నే గోచరిస్తాయి. అయితే

4 ఆంధ్ర భాగవతానుశీలనం, పుట. 242

5 శ్లో ॥ యత్ప్రేమ సంగమాత్పూర్వం దర్శన శ్రవణాదిభిః ।
    పూర్వానురాగః సజ్ఞేయః శ్రవణం తద్గుణ శ్రుతిః ॥ రసార్ణవసుధాకరం, పుట. 171

వస్తుఅందరికీ ఉండాలని లేదు. వాటిని పోతన్న రంజకంగా పోషించాడు. విపులలి వల్లనే కలిగిన మనస్సంగ మానంతరం కృష్ణసంగమానికి సంకల్పించింది రుక్మిణి. తుంటు... అగ్నిద్యోతనుడి ద్వారా దూతకృత్యం నడిపింది. ఆ సంగమ చింత కృష్ణానుగమనం దాకా సాగింది.ఆసందేశంలో శ్రీ కృష్ణుని బహిరంతర సౌందర్య గుణగానం చేసిందామె.

సీ ॥ ప్రాణేశ ! నీ మంజు భాషలు వినలేని
కర్ణరంధ్రంబుల కలిమియేల ?
పురుషరత్నమ! నీవు భోగింపగాలేని
తనులత వలని సౌందర్యమేల ?
భువనమోహన ! నిన్ను బొడగానగాలేని
చక్షురింద్రియముల సత్త్వమేల ?
దయిత ! నీ యధరామృతం బానగాలేని
జిహ్వకు ఫలరస సిద్ధియేల ?
ఆ ॥ నీరజాతనయన ! నీ వనమాలికా
గంధమబ్బలేని ఘ్రాణ మేల ?
ధన్యచరిత !నీకు దాస్యంబు సేయని
జన్మమేల ? యెన్ని జన్మములకు. 10-1708

'ఏనీ గుణములు కర్ణేంద్రియములు సోక' (10-1701) అంటూ రమణీయంగా ఉక్తిణి 'పంచేంద్రియ సంపుటిలో పంచభూతాల గుణాలను ధ్వనింప చేసింది.'[6] దానితో ఆమెలోని సర్వేంద్రియాలూ కృష్ణసమాగమానికి విరహవ్యథచెంది అభిలాష విప్రలంబ ముద్దీప్త మవుతున్నది. రసప్రవణ మైన ఆ సందేశంలోని భావోద్వేగం పోతన గారి శృంగార నాడిని విస్పష్టం చేసింది. ఆమెను సర్వోత్తమ ప్రేమమూర్తిగా తీర్చిదిద్దింది. సందేశానంతరం దూత 'సవరణగా' 'పల్లవ వైభవాస్పదములు పదములు' (10-1710) అని ఆమెనొక పవిత్ర దేవతామూర్తిగా విలోమవర్ణనం చేసింది ఆమెను శ్రీకృష్ణుని 'హృదయరాణి'గా నెలకొల్పటానికే.

మూలానుసరణం కొంతఉన్నా కొన్ని అమూల భావాలతో కూడిన రుక్మిణీ మనోగత వితర్కం రమణీయం. ఒక ముగ్ధ నాయికా సందిగ్ధావస్థ కామె ప్రతీక. 'లగ్నంబెల్లి వివాహముంగదిసె' (10-1723) వంటి సందేహాలెన్నోఆమె మనస్సును తుమ్మెదల గుంపులా ముసురుకున్నాయి. ప్రేమాధిక్యం ఉన్న చోటే సంశయా లధికంగా ఉంటాయి. వెంటనే ఆమెకు దైవచింతన కూడ మొదలయింది (10-1724). తర్వాత పద్యపంచకం (10-1726 నుండి 1729, 1731) లోని వితర్క విషాదౌత్సుక్య దైన్య త్రాసాది వ్యభిచారీ భావాలు అయోగ విప్రలంభ శృంగారరస పుష్టికి దోహదించాయి. ఆమె మనస్సాగరం ఉల్లోల కల్లోల

6 మందార మకరందాలు, పుట. 45

మయింది. ఆ విషాదంలో జాగరం అరతి అన్నీ శ్రీకృష్ణ నిరీక్షణానికే లక్షింపబడినాయి. కందర్ప పరికల్పితోద్వేగ జన్యమైన చింతా నిశ్వాస దైన్య స్తంభాది భావాలతో రుక్మిణి విరహతప్త అయింది (10-1727). ఈ మనఃకంపం వల్లనే ఆమెకు అశ్రుపాతం కృశత అరతి కలిగాయి. అందువల్లనే పరితప్త హృదయంతో (10-1728) ఆమె సర్వ శృంగార కళల్ని పరిత్యజించింది. అప్పుడు అరతి కారణంగా ఆమె చలించింది.

మ ॥ మలగున్ మెల్లని గాలికిన్ బటునటన్మత్త ద్విరేఫాళికిన్
దలగున్ గోయిల మ్రోతకై యలగు నుద్యత్ కీర సంభాషలన్
గలగున్ వెన్నెల వేడిమిన్ మలగు మాకందాంకుర చ్ఛాయకున్
దొలగున్ గొమ్మ మనోభవానలశిఖా దోదూయ మానాంగియై. 10-1731

ఇలా సర్వజన సంతోష సంధాయకాలైన ప్రకృతి ప్రణయ గీతాలూ ప్రకృతి గత రసరమ్య దృశ్యాలూ అన్నీ రసానంద దాయకాలైనాయి. అయోగ శృంగార పుష్టికి పోతన చేసిన రసవత్కల్పనం ఈ రుక్మిణీ విరహ వర్ణనం.

రుక్మిణీ ప్రథమ వీక్షణంలోని శ్రీకృష్ణ సౌందర్య వర్ణనం వల్ల అయోగ శృంగారం సంభోగ శృంగారంగా ధ్వన్యమాన మయింది మూలంలో. 'దదృశేచ్యుతం' (10-53-55) అనే వాక్య లేశం అనువాదంలో పూర్తిగా ఈక్రింది రసరమ్య పద్యంగా వృద్ధి చెంది 'విభావముఖంగా శృంగారరస సూచితం కావటం పరమౌచిత్యం.

మ॥ కనియెన్ రుక్మిణి చంద్రమండల ముఖుం గంఠీరవేంద్రావల
గ్ను నవాంభోజ దళాక్షు జారుతర వక్షున్ మేఘసంకాశ దే
హు నగారాతి గజేంద్రహస్త నిభ బాహుం జక్రి బీతాంబరున్
ఘన భూషాన్వితు గంబుకంఠు విజయోత్కంఠున్ జగన్మోహనున్. 10-1747

రుక్మిణీ సౌందర్యం విభావం కాగా వీరులైన రాజులు ఏకపక్షంగా కామవేగంతో విభ్రాంతులు కావటం అనుభావం. అది రసాభాసం. వారి విభ్రాంతి మూలంగా వారు దర్శించిన రుక్మిణీ స్వరూపం గమనార్హం. ఆమె వీరమోహిని, వారు విభ్రాంతాత్ములు. రసనిర్వహణంలోని రహస్యాలిట్టివి ఎన్నో పోతనలో గమనార్హాలు.

ఇలా శృంగార రసోజ్జీవంలో తాండవ మాడుతూ రుక్మిణీ కల్యాణ కథ పోతన్న శృంగార రస నిర్వహణ చాతురికి నికషోపలమై నిలిచింది.

# ఉషా పరిణయం

ఉషాపరిణయంలోని విరహం వివరణాత్మకం. శృంగార రస వ్యక్తీకరణలో పోతన కల్పనాశక్తి విజృంభిస్తుంది. 'ఈ కథనొక విచిత్రమైన ఫణితిని త్రొక్కించి రచనా - రస -

నిర్వహణంలో అపూర్వ శక్తిని చూపిన'[7] పోతన ఏతన్నిర్వహణంలో నాచనసోముని మార్గం ఒకటి ఉన్నా తన సురుచిర శృంగార రసమార్గంలోనే గమించాడు. సోముని ఉష ప్రౌఢ. పోతన గారి ఉష ముగ్ధ. మూలంలో —

శ్లో ॥ సా తత్ర తమపశ్యన్తీ క్వాసి కాన్తేతి వాదినీ ।
సఖీనాం మధ్య ఉత్తస్థౌ విహ్వలా వ్రీడితా భృశమ్ ॥ 10-62 -11

అని ఉన్న ఒక్క శ్లోకానికి వివరణగా వివిధ సంచారీ భావ సంపుటితో కథ తెలుగులో రసోదంచిత మయింది. స్వప్న సమాగమానంతరం అమె బోధావస్థ (10-ఉ. 326) సాశ్రుపాతం రమణస్య వీక్షణం వంటి రతి ఉత్తర కళలు[8] రసరమ్య నిలయాలు.

ఉషకు నాయకుని ప్రథమదర్శన సంగమాలు స్వప్నంలోనివే. అయినా ఇది ప్రత్యక్షానురాగమే. సర్వేంద్రియాలకూ అనుగతమయ్యే విజ్ఞానంప్రత్యక్షం. ఇది సాక్షాత్ ప్రతిబింబ ప్రతిభాన ఉత్ప్రేక్ష స్మృతి స్వప్నరూపాలని అరు విధాలు. ఈ స్వప్నాదులు ప్రమాణా భాసాలని కొంద రంటారు. అయినా అవి రాగ సూచకాలు కాగలవు.[9] కనుక ఉషాకన్యలో రతిరాగోదయం అయింది. స్వప్న జాగ్రదవస్థలు రెండింటా సంగమ సౌఖ్యాను భూతి సమానమే అయినందున 'ఉషాకన్య పొందిన విరహమయోగజన్యము వియోగ జన్యము కూడ'[10] అని శ్రీధూళిపాళ వారిచ్చిన తీర్పు శిరోధార్యం. అయోగ వియోగాల రెండిటా విభావాదులు మన్మథావస్థలు కూడ సమానమే.

అనిరుద్ధుని శయనోపచారకళా[11] నైపుణ్యభావనంలో ఉష ఉక్కిరి బిక్కిరి కావటం పోతన రస నిర్వహణ కౌశలమే.

చం॥ సరస మృదూక్తులుం గుసుమసాయకు కేళియు శాటికాకచా
కరషణముల్ నఖక్రియలు గ్రమ్మ గపోల లలాట మేఖలా
కర కుచ బాహుమూలములు గైకొని యుండుట లాదిగా దలో
దరి మదిగాఢమై తగిలె దర్పకు డచ్చున నొత్తినట్లయై. 10 ఉ . 329

---

7 శృంగారం - పోతన, పుట. 273

8 సాశ్రుపాతం రమణస్య వీక్షణం స్వయం శపథక్రియా ప్రస్థితానుగమనం పునర్నిరీక్షణం వంటివి. శృంగార ప్రకాశము, పుట. 258

9 శృంగార ప్రకాశము. పుట. 283

10 భాగవతానుశీలనం. పుట. 302

11 శయనోపచారకళలు : స్త్రీపురుష భావగ్రహణ, స్వరాగ ప్రకాశన, ప్రత్యంగదాన, నఖక్షత విచార, దంతక్షత విచార, నీవీ స్రంసన, గుహ్యస్పర్శా నులోమ్య, పరమార్థ కౌశల, హర్షణ, సమానార్థత, కృతార్థప్రోత్సాహన, మృదుక్రోధ ప్రవర్తన, క్రుద్ధ ప్రసాదన, గుహ్యగూహన రూపములు
- శృంగార ప్రకాశ, పుట. 258

ఇందులోని రతి భేదాలు నఖక్షతయా విశేషాలు మన్మథ కళాస్థాన గ్రహణ భేదాలూ నాయికా స్వరూపం అంతా పోతన కపోల కల్పనమే. అది ఆయన కామకళా విజ్ఞానమే. ఈ సందర్భంలోని నాయికా నాయకులది విశేష సంభోగాంతర్గత భేదం.[12]

ఉత్కంఠాది వ్యభిచారీ భావాలతో మనోబుద్ధి జన్యాలైన అనుభావాలతో సమృద్ధమైన భావశబలతకు ఉష లోనయింది. ఆమె విరహవేదనకు పోతన ఎత్తిన పతాక ఇది.

సీ॥ కలికి చేష్టలు భావ గర్భంబు లయినను
ప్రియు మీది కూరిమి వెగ్గలింప
బిదపిదనై లజ్జ మది బదనిచ్చిన
జెలి మేన బులకలు చెక్కులొత్త
మదనాగ్ని సంతప్త మానస యగుటకు
గురుకుచ హార వల్లరులు కంద
జిత్తంబు నాయకాయత్తమై యుంటకు
మఱుమాటలాడంగ మఱపు గదుర

తే॥ అతివ మనమున సిగ్గు మోహంబు భయము
బొదివి సుమ్ముమంచు నెత్తమ్మి బొదువు మాడ్కి
బ్రమిమి చింతాభరంబున బద్ధ నయన
కోకి తలచీరి వాటింప నేరదయ్యె. 10 ఉ. 330

ఇక్కడ మనస్సంగమ భావంతో రసనిష్పత్తి కలిగింది. ఇందులో నాయకుడు ఆలంబనం చేష్టలు ఉద్దీపనం. ఉషాకన్యలోని గూఢరాగం విరహోద్వేగం సఖీ సమక్షంలోని అవస్థా గోపనం అన్నీ ముగ్ధ నాయికా మనోహర ముద్రలే!

చం॥ పొరిబొరి వచ్చు నూర్పుగమి బుక్కిట నుంచి కుచాగ్ర సీమపై
బెరసిన సన్నలే జెమట బిందువు లొయ్యన నార్పు గమ్ములన్
దొరగెడు బాష్ప పూరములు దొంగలిఱెప్పలనాని చుక్కలన్
దరుణులు రండు చూతమని తా మొగమెత్తును గూఢరాగయై. 10 ఉ. 332

ఇలా కలలో కన్పించిన కమనీయ మూర్తిని గుర్తించటానికి చెలి చిత్రరేఖ సుందరాంగులైన రాకుమారుల చిత్రాలను రూపించి వర్ణించి చెప్పింది ఉషకు. ఈ సన్నివేశంలో స్వయంవర సందర్భం లేకున్నా ఇది ఇందుమతీ స్వయంవరాన్ని తలపించేదిగా ఉంది. ఈ వైనం కథకొక కలికితురాయి. ఈ మూల విస్తరణం పోతన కల్పనాశక్తి విజృంభించిన ప్రదేశం అనీ ఇంతటి కల్పనాశక్తి నారయకు లేదని పల్కిన

---

12 శృంగార ప్రకాశము. పుట. 305

సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యుల వారి నిర్ణయం ఔచితీమంతం[13]. ఏవం విధ రచనా విన్యాసం తెలుగు సాహిత్యంలోనే అపురూపం.

చెలికత్తె శోణపురానికి వెళ్లి యోగమాయతో అనిరుద్ధుని తెచ్చి చూపింది. ఉషాసతి కప్పుడు మనసులో అనురాగం కలిగి ఉత్సాహం చెలరేగింది. చెలికి కృతజ్ఞతలు చెప్పి తొందర చేసి బయటకు సాగనంపింది. అనంతరం ఏకాంత మందిరంలో మనోరాముని మనసును దోచింది. ఇట సర్వ కామోపచారాలతో పూర్వరాగానంతరం 'గృహప్రత్యాగమన సంభోగం' సూచితమయింది. ప్రథమరాగానంతర సంభోగ ఫలసిద్ధి కిది సూచకం. అయోగ శృంగారరస పరిపోషణంలో పోతన సిద్ధహస్తు డనటానికి ఏతాదృశ వర్ణనలే అనదృశ నిదర్శనాలు.

# సంభోగ శృంగారం

శ్లో ॥ స్థిరాసు రాగయోర్యూనోర్వినోదై రేవమాదిభిః ।
పరస్పరోపచారై శ్చ సంభోగః పుష్టిమశ్నుతే ॥ భావ ప్రకాశనము. పుట, 296

స్థిరమైన అనురాగం ఉన్న ప్రేయసీ ప్రియులకు ఏవం ప్రాయాలయిన వినోదాలతో వారు కూర్చుకొనే పరస్పరోపచారాలచే సంభోగం పరిపోషాన్ని పొందుతుంది. స్థిరానురాగం ఉండటం యువావస్థలో ఉండటం పరస్పరోపచారాలతో ఉండటం తత్తదృతు స్వభావోచితాలైన వినోదాలుండటం వల్ల వారి భోగ సంభోగాలకు పుష్టి తుష్టి కలుగుతుంది.

సంభోగ ప్రారంభం విప్రలంభ సమాప్తితో ఉండటం సంభావనీయం. చతుర్విధ విప్రలంభాల అనంతరం చతుర్విధ సంభోగాలు స్మరణీయాలు. అవి పూర్వానురాగానంతర సంభోగం మానానంతర సంభోగం ప్రవాసానంతర సంభోగం కరుణానంతర సంభోగం. ఆయా సంభోగాలకు ప్రేయసీ ప్రియుల సంభోగ సౌఖ్య భేదాలను బట్టి వరుసగా సంక్షిప్తం సంకీర్ణం సంపన్నం సమృద్ధిమంతం అని వ్యవహారం.ఈ విభాగం అధికంగా అటు శారదాతనయుడూ ఇటు సింగభూపాలుడూ కూడ అనుసరించారు. అందరికీ శృంగార విషయంలో ఆరాధ్యుడు భోజుడే. ఇక భాగవతంలోని ఆయా శృంగార ఘట్టాలలో సంభోగ శృంగార భేదాలను పరిశీలించటం వక్తవ్యాంశం.

# ప్రథమ రాగానంతర సంభోగం

ప్రథమాను రాగంలో సముత్పన్నమైన సంభోగ సమయంలో అభీష్టాలైన ఉపచారా లుండటం వలన సంభోగం పాల్యమవుతుంది. సంప్రాప్తమైన సంభోగాన్ని చక్కగా

13 భాగవతోపన్యాసములు, పుట. 73

ఉపచార కౌశలంతో పాలించటం, నిరంతరముపచార సంపన్న సముచిత సముల్లాసంతో అనువర్తించటం సముచితం.[14] ప్రథమ సమాగమ సమయంలో ప్రేయసీ ప్రియుల పరస్పరోపచార విశేషాలు సాధ్వసాధులతో కూడి ఉండటం వలన సంభోగ ప్రక్రియావిశేషాలన్నీ మితంగానే ప్రయుక్తమైతాయి.మిత ప్రయోగం ఉండటంవల్లనే దీనికి 'మిత సంభోగ'మని శారదాతనయుడి సిద్ధాంతం.[15]

ఈ ప్రథమానురాగానంతర సంభోగ విషయంలో శారదాతనయుడు భోజదేవోక్త విషయాన్నే పూర్తిగా అనుసరించాడు.[16] భోజుడు ఈ సంభోగం చతుష్షష్టి విధానాలతో నిరూఢమైతుందని రూఢి చేశాడు.[17] యాయాతి శర్మిష్ఠలకథలో శర్మిష్ఠ దేవయానీ పరతంత్ర. అందుచేత ఆమెకు యయాతి పట్ల కలిగిన అనురాగం 'మనుష్య పారతంత్ర్యం వల్ల కలిగిన పూర్వానురాగభేదం.'[18] శుక్రుడి నిషేధాన్ని ధిక్కరించిన వారి శృంగారచర్య పూర్వరాగానంతర సంభోగం. యయాతి వద్దకు శర్మిష్ఠ ఏకాంతంగా తానే వచ్చిన 'స్వయంగమన'[19]. ఈ భేదంవల్ల శృంగార పుష్టి నిరూఢం అవుతుంది. ఆమె 'చెలుకువింటి జోదు పువ్వుటంపర కోహటించి తన తలంపు సెప్ప'టం (9-540) ఉత్తమ సంభోగ సూచకం. లోకంలో స్త్రీ అనురక్త అయిన పిదపనే పురుషు డనురక్తుడు కావటం 'ఉత్తమ సంభోగం.'[20] ఇక్కడ యయాతి అందుకు చక్కని తార్కాణం.

ఉ॥ ఆ జవరాలి జూచి మన మాపగ లేక మనోభవార్తు డై
యా జనభర్త మున్ను కవి యాడిన మాట దలంచియైన జే
తోజ సుఖంబులం దనిపె........... 9-541

వీరిది ప్రథమ సంభోగం. దేవయాని చెలుగు మాసి వెలుపల ఉన్న సమయంలో ఎడరు వేచి ఆమె కన్నుగప్పి చాటుమాటున సాగించిన రతావసాన సూచకమైన ప్రథమాను రాగానంతర సంభోగమది. ప్రథమ సంభోగంలో మిత ప్రయోగముంటుంది. కనుక ఇది 'మిత సంభోగం' అవుతుంది. అందుకు వీరిలో దేవయానీ సంబంధమైన, శుక్ర నిషేధ

---

14 భావప్రకాశనము, పుట. 296

15 శ్లో॥ పరస్పరస్యోపచారైః యూనోర్భయాత్సాధ్వసాదిభిః
మితం ప్రయుజ్యతే భోగే ప్రథమే స మితోభవేత్ ॥ భావప్రకాశనము, పుట. 188

16 శృంగార ప్రకాశము - పుట. 300

17 అందే, పుట - 302

18 శ్లో॥ అత్రదేవయానీ పారతంత్ర్యేణ శర్మిష్ఠాయాః
యయాతి విషయః పూర్వానురాగః ॥ రసార్ణవసుధాకరం, పుట. 544

19 శృంగార ప్రకాశము, పుట. 302

20 'ఆదౌ వాచ్యః స్త్రియా రాగః' భావ ప్రకాశనము, పుట. 244

సంబంధమైన భయం దాగిఉండటం మరొక కారణం. ఆ దృష్టితోనే వారి సంభోగ విశేషాలను పోతన సూచించలేదు. మూలంలో శర్మిష్ఠ భర్తవద్దకు సంతానార్థిగా మాత్రమే వచ్చింది. కానీ ఆమె కామ భావంతో వచ్చినట్లు పోతన కల్పించటం అతని శృంగార సృష్టికి లోకదృష్టికి సహజం. పూర్వానురాగానంతరం అదను దొరికితే సంభోగానికి సంకల్పించటంలో ప్రథమంగా కామభావన, ఆతర్వాతనే సంతాన కామన కలుగటం నాయికా సహజం. అనగా మూలంలో అపత్య సంబంధమైన 'అర్థశృంగారాన్ని'[21] సూచించగా పోతన దానిని కాదని కామ శృంగారానికే ప్రాధాన్యాన్ని పరికల్పించాడు.

మోహినీ పరమేశ్వరుల ప్రణయంలో కూడా ప్రథమానురాగానంతర సంభోగం గోచరిస్తుంది. మోహినీ విహారంలోని కందుక క్రీడ వనవిహారం క్రీడాపర్వత ప్రదేశ సంచారం మొదలైన విహరణాలన్నీ దానికి నిరూఢిని కల్గించే చతుష్షష్టి భేదాంతర్గతాలే.[22] అయితే, పరమేశ్వరుడు ఆమెను 'పోకుము పోకువే యనుచు డాయంబారి కెంగేల దా/గబరీ బంధము బట్టి సంభ్రమముతో గౌగిళ్ల నూరార్చ' టం, ఆమె 'బహిః క్రియ నెట్టకేని గదియం దద్బాహా నిర్ముక్త (8-402) కావటం అనేవి ఏతత్ శృంగార క్రీడలు. అందులో సంభోగం బాహిరమైన పరిరంభాలే. కనుక ఇది 'మిత' సంభోగం. శివునికి ఏకత్రాను రాగమే ఉంది. కనుక నాయకపరంగా ఇది పరిహాస్యమైన 'అధమ సంభోగ' మౌతుంది[23]. ఆమెలో కపటాను రాగమే గోచరిస్తుంది. కాబట్టి ఇది రసాభాసం.

ఊర్వశీ పురూరవుల శృంగారం ఈ సందర్భంలో ఉగ్గడింప దగ్గది. దేవ సభలో పురూరవుడి సౌందర్య విక్రమాల శ్రవణ మాత్రం చేతనే వలపుగొన్నది ఊర్వశి. తర్వాత మిత్రావరుణుల శాప కారణంగా మనుష్య భావాన్ని పొంది పురూరవుడి పురోభాగాన నిలిచిన స్వయంగమన ఆమె. అప్పటి పరస్పరాలోకనం గూర్చి వ్యాసుని చిత్రణం ఇది.

శ్లో॥ మిత్రావరుణ యోశ్శాపాదాపన్నా నరలోకతామ్ ।
నిశమ్య పురుష శ్రేష్ఠం కందర్ప మివరూపిణమ్ ॥ 9-14-17

ధృతిం విష్టభ్యలలనా ఉపతస్థే తదన్తికే ।
సతాం విలోక్య నృపతిర్హ ర్షేణోత్ఫుల్లలోచనః ।
ఉవాచ శ్లక్ష్ణయా వాచా దేవీం హృష్టతనూరుహః ॥ 9-14-18

ఇందులో పురూరవుడు పొందిన ఆలంబన ఉద్దీపన విభావానుభావాల క్రమగతి ఉంది. కానీ, పోతన పురూరవుడిని ధీరలలితుడిగా తీర్చిదిద్దాడు. 'కందర్ప మివ రూపిణమ్' అన్నపదం ఎలా పరిణమించిందో గమనించవచ్చు.

---

21 ఆత్మనః సుఖసాధనానాం కలత్ర మిత్రాదీనాం అర్జనం అర్థః - శృంగారప్రకాశము, పుట. 262

22 శృంగార ప్రకాశము, పుట. 302.

23 శ్లో॥ ఏకత్రైవాను రక్తశ్చే ద్యూనోర్వాస్యః స చాధమః — భావ ప్రకాశనము, పుట. 244.

తు॥ సరసిజాక్షు మృగేంద్రమధ్యు విశాలవక్షు మహాభుజున్
సురుచిరానన చంద్ర మండల శోభితున్ సుకుమారు నా
పురుషవర్యు బురూరవుం గని పువ్వుటంపర జోదుచే
దొరగు క్రొవ్విరి తూపులన్ మది దూలపోవగ భ్రాంతయై. 9-387

అతడు సర్వనారీ మనోహర స్వరూపుడైనాడు పోతన చిత్రణంలో. ఇక సాక్షాద్దర్శనంలోనే, అంటే ప్రథమ దర్శనంలోనే పురూరవుడు ఆమెను జూచి విస్ఫారిత నేత్రుడైనాడు మూలంలో. కానీ ఆమె సౌందర్య సంపదను సూచించాడు పోతన హేతు నిరూపణం కోసం. ఊర్వశి మాత్రం భావ గోపనం చేసి ప్రౌఢగా పరిణమించింది. ఆమెను చూచిన పురూరవుడి విభ్రాంతి మిక్కిలిగా పోతన కల్పనమే.

ఉ॥ భావజుకేలియో మొగులు వాసి వెలుంగు మెఱుంగొ మోహినీ
దేవతయో నభోరమయొ దీని కరగ్రహణంబు లేనిచో
జీవన మేటికంచు మరుచే జిగురాకడిదమ్ము జిమ్ములన్
దా వడకెన్ బురూరవుడు తామరపాకు జలంబు కైవడిన్. 9-389

పోతన రచనలో ఆమె సౌందర్యం సామాన్య నాయికా స్థాయి నందు కుంది. కనుకనే అతడు స్మరశరజాల వేదనకు తాళజాలలేక చలించిపోయాడు. వచ్చిన ఊర్వశికి స్వాగతం పల్కి తనతో వివాహానికి అంగీకరించమని మాత్రమే మూలం (9-14-19). కానీ అనువాదంలో అతనికి తమకం అధికం.

ఉ॥ ఎక్కడి నుండి రాక మన కిద్దరికిందగు నీకు దక్కితిన్
మ్రుక్కడి వచ్చెనే యలరు ముల్కుల వా డడిదంబు ద్రిప్పుచే
దిక్కు నెరుంగ నో యబల ! దేహము దేహము గేలుగేల నీ
చెక్కున జెక్కు మోపి తగు చెయ్యుల నన్ను విపన్ను గావవే. 9-391

ఈ కుశల ప్రశ్నాదికాలతో ప్రారంభించి కామోత్కంఠతో సర్వాంగ పరిష్వంగ సంభృతాలైన తిలతండులక క్షీరజలకాది ఆలింగనాలను కోరుకున్నాడు.[24] ఊర్వశి వినా జీవనం లేదని బాధపడే 'విశేష విలాసాధికుడు' 'కందర్ప స్వరూపుడు' అయిన పురూరవుడు, తనను గాఢంగా భావించిన ఊర్వశితో ఇలా విశేషరతి సౌఖ్యాలు కోరటం సముచితమే. అతని అభ్యర్థనకు సమాధానంగా మూలంలో 'శ్లాఘ్యః స్త్రీణాం వరః స్మృతః' (9-14-21) అని మాత్రమే ఆమె మూలంలో పల్కగా, అనువాదంలో -

మ॥ ..... ...... . . . . . విశే
ష విలాసాధిక ! నీకు నాఘృతము భక్ష్యంబయ్యె నేనిన్ మనో

[24] శయన గతా వేవ ఊరు వ్యత్యాసం భుజ వ్యత్యాసం సం చ స సంఘర్ష మివ ఘనం సస్వజేతే తత్తిల తండులకమ్. వాత్స్యాయన కామసూత్రాలు, సం. 1 పుట. 185

జ వినోదంబుల నిన్ను దేల్తు --- (9-393) అని అతని విలాసలోలుపాన్ని గుర్తించి తన అంగీకారాన్ని వ్యక్తీకరించింది. సామాన్య నాయికా ధోరణిలో. ఇది వారి పూర్వ రాగ విశేషం. కాగా ఆ తర్వాత వారి అనంతర రతులు రమణీయతా నిధానాలైనాయి. 'రేమే సురవిహారేషు కామం చైత్రరథాదిషు' (9-14-24) అనే విహార విశేషాలను పోతన ఈ క్రింది విధంగా విస్తరించాడు.

ఆ॥ రాజు రాజముఖిని రతిదేల్పె బంగారు
మేడలందు దరుల నీడలందు
దోటలందు రత్న కూటంబు లందును
గొలకు లందు గిరుల కెలకు లందు. 9-397

ఈ సంభోగ శృంగార సూచనం విహార ప్రదేశ ప్రస్తారం అన్నీ వారి శృంగార ప్రస్థానానికి సముచితం, వారి నవానురాగానంతర సంభోగ శృంగారానికి పరిమితం. వారి రతి పరప్రకర్ష పొంది అనుభూత మయింది. ఇక ఏ ఉపచారానికీ అదరంలేదు. కనుక వారిది 'సమ్యగ్రతి'[25].

అనంతరం వారి ప్రేమ యాత్ర 'పయ్యెద కొం గడ్డమైన ప్రాణము వెడలు' నందాక సాగింది. కథారంభంలో ఊర్వశి భావగోపనగా ఉన్నా చివరకు రతిభావం ఇద్దరి కొక్కసారే కలగటం వల్ల వారిది మధ్యమ సంభోగం.[26]

ఈ కథలో ఊర్వశి దేవవేశ్య. వేశ్యా సంబంధమైన శృంగారం రసమా? రసాభాసమా? అనే సందేహం కలుగవచ్చు. కనుక ఏతద్విషయకంగా కొంత చర్చ ఈ కథాపరంగా అవసరం. అందులో ప్రధానంగా ముఖ్య విషయాలు మూడు. మొదటిది వేశ్యానురాగం. వేశ్యలకు రాగం లేదు. రాగంలేని వనితతో భోగం శృంగారం కాదు. ఎన్నడూ అది శృంగార రసం కాదు. అది శృంగారాభాసమే అని రుద్రటాలంకారికుని ఉద్దేశ్యం[27].

ఈ దృష్టితో పర్యాలోచిస్తే దేవవేశ్య అయిన ఊర్వశితోటి పురూరవుడి శృంగారం శృంగారాభాసమే. కానీ వారి శృంగార విహారం ఆమె ప్రవర్తనం అతడి సౌఖ్యానుభవం గమనిస్తే వారిది అనన్యానురాగం, శంకాతంక సంభోగం. ఈ సందర్భంలో శ్రీ పుట్టపర్తివారి తీర్పు గమనించదగ్గది. 'ఊర్వశీ పురూరవుల ప్రేమలో పురూరవుడు ప్రేమైక వశుడు, కడుంగడు దీనుడు కూడ. ఆ దేవత వానితో నెప్పుడును సేవ జేయించుకొన్నదే కాని

---

25 శృంగార ప్రకాశము, పుట. 301

26 శ్లో॥ అథ చేదేక కాలీనా యూనో రన్యోన్య రక్తిమా
ఏష సంభోగ లీలా స్యాత్పకామో మధ్యమః స్మృతః ॥ భావప్రకాశనము, పుట. 244

27 శ్లో॥ సాధారణ స్త్రీ గణికా సా విత్తం పర మిచ్ఛతి
నిర్గుణేపి న విద్వేషో న రాగోస్యా గుణిన్యపి
శృంగారాభాస ఏవ స్యా న్న శృంగారః కదాచన ॥
ఇతి ద్విషంత ముద్దిశ్య ప్రాహ శ్రీరుద్రటః కవిః - భావప్రకాశనము, పుట.206

వానికొక నాడైనను సేవజేసినట్లు కానరాదు. ఇది యనుకూల పతిక. ప్రౌఢనాయిక'[28] ఈ తీర్పును నిశితంగా పరిశీలిస్తే, ఊర్వశి మూలంగా ధీరలలితుడైన పురూరవుడు అపూర్వ ఆనందానుభవాలు పొందాడు. ఆమె అందుకొన్నది అందించింది. కనుక వారు పొందింది శృంగార రసానందమే. ఆమె వేశ్య అవటం చేతనే అతడికి అత్యంతానందం దక్కింది. కనుకనే ఈ సందర్భంలో వేశ్యలను గూర్చిన రుద్రటుడి భావం పరాస్తమవుతుంది. ఇక రుద్రటవాదాన్ని ఖండిస్తూ శారదాతనయుడు వేశ్యలను గూర్చి చేసిన చర్చ పరిగణింప దగ్గది. వేశ్యలకు రాగమే ఉండదా? వారు స్త్రీలు కారా? వేశ్యలైనంత మాత్రాన రాగం నశిస్తుందా? గణికలు ప్రకృతి సహజంగా రాగశృంగార నిర్ముక్తలైతే స్త్రీ సామాన్యంగా కలిగే కామం శునక భక్షిత మైతుందా? అని ప్రశ్నించాడు. దానికి సమాధానంగా తానే ఇలా చెప్పాడు. వేశ్యలు కేళాకుళి కుశలలు. పురుషులకు వారితో సురతం మనోరమం. ఈ సమయంలో అన్యస్త్రీ స్మృతి ఉండనే ఉండదు. కోపించిన శివుని నేత్రాగ్నిజ్వాలా భస్మీకృతుడైన కాముడు పూర్వం వేశ్యల విలోకనాల వల్లనే మరల ఉజ్జీవితుడైనాడు. వేశ్యలు కలావిలాస వైదగ్ధ్యాలకు వసతి. వారే పురుషుల సౌభాగ్యానికి వైదగ్ధ్యానికి నికషం వంటివారు. వారినెవరు నిర్మించారో వారు వారుగనే విలసిల్లారు. కులవనితల్లో ఈర్ష్య ఉంటుంది. వారి సంభోగం కషాయితం. నాయకుడికి పరాంగనలో నిశ్శంక సురతకేళి ఉండదు. కానీ వేశ్యలలో ఈ వెలితి ఉండదు. వేశ్య స్మరసర్వస్వం. వేశ్యలలో ఈర్ష్యా రహితమైన సంభోగవిలాసం లభిస్తుంది. ఇట్టిది రసాభాసమా?[29] అని సమాధానార్థ కంగా ప్రశ్నించాడు. ఈ సమాధానంతో రుద్రటుడి వాక్కులు పరాస్తమైనాయి. కనీసం అతడి భావం వేశ్యలందరిపట్ల అనువర్తితంకాదని తేలింది. వసంతసేనవంటి నాయికల శృంగా రాన్ని సహృదయలోకం ఆమోదించింది. రసంగానే పరిగణించి ఆనందించింది. ఇక్కడ ఊర్వశి దేవవేశ్య. ఆమె సంగతి కూడ అంతే. అయినా ఆమె శారదాతనయుడి నిర్వచన సార సర్వస్వం. పురూరవుడికి ఆమె స్మరసర్వస్వం. వారిది శంకాతంక రహితమైన సంభోగం. నిష్కలంకం. కనుకనే వారి సంభోగం రసాభాసం కాదు సంభోగ శృంగారమే అవుతుంది.

---

28 భాగవతోపన్యాసములు, పుట. 174.

29 శ్లో॥ . . . . . . . . .

కింతు తాసాం కలా కేలి కుశలానాం మనోరమమ్
విస్మారితా పరస్త్రీకం సురతం జాయతే నృణాం
కువ్యత్పినాకి నేత్రాగ్ని జ్వాలా భస్మీకృతః పురా
ఉజ్జీవితః పునః కామోమన్యే వేశ్యావిలోకితైః
కలావిలాస వైదగ్ధ్య వసతిర్గణికాజనః
పుంసాం సౌభాగ్య వైదగ్ధ్య నికష కేవ నిర్మితః ?
ఈర్ష్యా కులస్త్రీషు న నాయకస్య నిశ్శంక కేలి ర్న పరాంగనాసు
వేశ్యాసు చైతద్వితయం ప్రరూఢం సర్వస్వమేతా స్తదహో స్మరస్య ॥

భావప్రకాశనము, పుట. 206

రెండవది ఊర్వశీ సంభాషణరీతి. తర్వాత కథలో రసాంతరం కల్పితం. ఇంద్రుడు పంపిన దొంగలైన గంధర్వులను వెంటాడి ఖండించి ఆమెకు ప్రాణప్రదమైన తగళ్లను తీసుకురాక సుఖలోలుడై ఆమె కౌగిటిలోనే ఉండి కదలకున్నాడు పురూరవుడు. అందుకామె కోపించింది. సామాన్య నాయికోచితంగా పరుషోక్తులనే కరవాలాలను చెవులలో జొనిపింది.

ఆ॥ అధముడైన వాని కాలగు కంటె న
త్యధికు నింట దాసి యగుట మేలు
హీను బొంది యోని హింసింపగానేల ?
యువతి జనుల కూరకుంట లెస్స. 9 - 406

అనే, ఈ పరుషోక్తుల్ని గూర్చి శ్రీ వెంపరాల వారు 'ఈ పట్టున భాష యెంత లలితమో యెంత జాతీయమో, భావం అంత కటువూ అంత అశ్లీలంగా వుంటుంది. పోతన వంటి భక్త కవి పలికే మాటలేనా అని అనిపిస్తుంది. మూల విస్తరణం వల్ల కలిగిన వికారమేనేమో ఇదంతా'[30] అని భావించారు.

కానీ ఈ భావం పునరాలోచించవలసిందే. కారణం ఈ నాయిక సామాన్య. దేవవేశ్య. అట్టి పాత్రచేత సందర్భశుద్ధిగా పాత్రోచితంగా పల్కించటం ఏ భక్తకవికైనా తప్పదు. ఆమెకున్న రెండు తగళ్లూ దొంగల పాలవటంతో ఆమెకు అర్థదృష్టి (అర్థశృంగారం) కలిగింది. అది స్త్రీ సహజంగా ఆమెలో అధికంగా తొంగిచూచింది. అంతే కాదు స్త్రీలు సింగారాన్నే కాక పౌరుషాన్ని కూడ అధికంగానే కోరుకుంటారు. అది క్షీణించిన నాడు తిరిగి ప్రజ్వలింపచేసి తమ కార్యాన్ని సాధించుకోవటానికి ఎంత పరుషంగానైనా మాట్లాడుతారు. అందుకు ఏమాత్రం వెనుదీయరు. అలా తమ నాయకుణ్ణి కర్తవ్యోన్ముఖుణ్ణి చేస్తారు. అలా చేయకపోతే ఆమె స్త్రీయే కాదు. అంతేకాదు అతడు నిర్వీర్యుడై లోక నింద్యుడైతాడు. ఆపై లోకం ఆమెను కూడా నిందిస్తుంది. అందుకే ఊర్వశి అలా చేసింది, తన తగళ్లను సాధించుకుంది. అంత మాత్రాన ఆమెలో అనురాగం లేదనటం కానీ, అలా పరుషంగా మాటాడటం తగదనికానీ పల్కటం అసమంజసం. అసలు కులీన పాత్ర అయిన సీత చేతనే వాల్మీకి రాముణ్ణి 'రామ జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహం' (అయోధ్య. 30-3)అని అనిపించాడు వనవాసగమన సమయంలో. దానితో సీత వాంఛితం నెరవేరింది. సీతమాటల్లోని భావమే ఊర్వశి మాటలకన్న కటువైంది.

మూడవది ఆమె చెప్పిన వేశ్యా లక్షణం. సమయ భంగం కారణంగా వెళ్లి పోయిన ఊర్వశిని సరస్వతీ నదీతీరంలో దర్శించిన పురూరవుడి దైన్యం అతని వియోగ విప్రలంభానికి పరాకాష్ఠ (9-412). అతడి అభ్యర్థనకు ఆమె చెప్పిన సమాధానం మనకు కొంత భ్రాంతిని కలిగించి ఆమె 'పచ్చివేశ్య' అనీ, వారిది రసాభాసమనీ అనిపిస్తుంది. ఆ

---

30 పోతన, పుట. 34

సందర్భంలో వేశ్యాలక్షణాల్ని తానే ఉల్లేఖించింది. ఆ పై తనను తానే వేశ్యగా అభివర్ణించు కుంది.

మ॥ తలపుల్ చిమ్ములు మాట లుజ్జ్వల సుధాధారల్ విభుండైన పు
వ్విలుతున్ మెచ్చర యన్యులన్ వలతురే ? విశ్వాసమున్ లేదు క్రూ
రలు తోడుం బతి నైన జంపుదు రధర్మల్ నిర్భయల్ చంచలల్
వెలయాండ్రెక్కడ ? వారి వేడబము లావేదాంత సూక్తంబులే ? 9-416

ఈ మాటలుఅనటానికి గల కారణాలూహించవచ్చు. ఆమెకు సమయ భంగం కలిగింది. ఆమె దేవలోకానికి వెళ్లవలసిన సమయం వచ్చింది, పిలుపు వచ్చింది ఇంద్రుడి నుండి. అందువల్లనే తాత్కాలికంగా తనపట్ల అతడికి విరక్తి కలగటానికి అలా పల్కింది. కనుక ఆమె ఆడిన మాటలు కథాగతిలోనివే. అందువల్లనే తర్వాత తన పునరాగమనాన్ని సూచించింది. అతని అభీష్టాన్ని గమనించి అంగీకరించింది.

ఇలా వర్తనంవల్లగానీ మాటలతీరువల్ల గానీ జాతి లక్షణంవల్లగానీ ఊర్వశికి అనురాగంలేదని కేవలం వేశ్యగా పరిగణించటం సహృదయామోదం ఎంత మాత్రం కాదు. కనుక వారిది సంపూర్ణ సంభోగ శృంగారమే కాని శృంగార రసాభాసం ఏ విధంగానూ కాదు.

కుబ్జాకృష్ణుల శృంగారం సంపూర్ణమైంది. అది కామశాస్త్ర సమ్మతమైన సంభోగ శృంగార ఘట్టం. శ్రీకృష్ణుడు ఆమెతో 'మ/త్కామితము దీర్చి పిదపన్/నీ మందిరమునకు వత్తు నే డలుగకుమీ' (10-1279) అని ఆమెను ప్రథమాను రాగానంతరం ఊరడించి వదలి వెళ్లాడు. ఆ తర్వాత కంసవధాదిగా గల తన కార్యభారాన్ని మొత్తాన్నీ దించుకొని కొంతకాలానికి తిరిగి రావటం తటస్థించింది. ప్రథమానురాగానంతరం వారి సంభోగానికి కార్య హేతుక మైన ఉభయ సమ్మతమైన విలంబనం కలిగింది. కనుక కథాభాగరలో తెల్పకపోయినా కుబ్జ శ్రీకృష్ణుని కోసం అయోగ జన్యమైన విరహవేదనతో వేగినట్లే అధ్యాహారంగా భావించుకోవాలి. కనుక రెండవసారి శ్రీకృష్ణుడు కుబ్జను సందర్శించి రతిక్రీడ కుపక్రమించిన ఘట్టం 'కార్యహేతుకమైన ప్రథమానురాగానంతర సంభోగం'గా పరిగణించవచ్చు. అందువల్లనే 'దానిని మనం సర్వసామాన్యంగా అనుకుండే శృంగారంగా కాక శృంగారరస నిర్వహణకు ఒక నూతనోదాహృతిగా చూడాలె'[31].

ఇందులో నాయిక 'విభవజిత శక్రపురంధ్రి సైరంధ్రి'. ఆమెను 'రతి క్రీడలన్ దనుపం గోరి' 'పంచేము పంచేమడై' వచ్చిన నాయకుడు శ్రీకృష్ణుడు.

మ॥ తను మున్నంగజకేళి గోరిన లతాతన్విన్ రతిక్రీడలన్
దనుపం గోరి జనార్దనుం డరిగె రత్నస్వర్ణ మాల్యానులే
పన భూషాంబర ధూపదీప పరిదీప్తంబై మహోజ్జ్వలద్
వనమై యున్న తదీయ గేహమునకుం బంచేము బంచేమడై. 10-1484

---

31 శృంగారం - పోతన, పుట. 232

ఇలా సర్వమాంగలిక ద్రవ్యాలతో ఆమె తన గృహాన్ని సర్వాలంకృతం చేసుకొన్నది. ఆపై మత్తు గొల్పే పరిమళాల మొత్తం ఆ గృహమంతా అలముకొంది. అవే ఆమె మనోధర్మాన్ని బోధిస్తాయి. అవే శ్రీ కృష్ణుడికి ఉద్దీపనలైనాయి.

ఆ॥ కాము శరము బోలె కమలారి కళవోలె
మెలగి యాడనేర్చు మెఱుగు వోలె
నిఖిల భువన మోహినీ దేవతయు బోలె
జెలువు మెఱసియున్న చెలువ గనియె. 10-1486

ఇలా ఆమె కనువేదురు కలిగిస్తుంది. ఇంటికి తగ్గ ఇంతి. ఆ ఇంటిలోని పరికరాలకూ పరిమళాలకూ ప్రతిరూపం ఆమె రూపం. ఆ వచ్చిన వాసుదేవుడికి సంభ్రమంతో విహితోపచారాలు చేయించింది. 'మాలా మృగనాభిపంక మణిమయ భూషల' తోడి శృంగార దేవత వనరుహేక్షణుడిని కలియవచ్చింది మనః ప్రహర్షంతో. అప్పుడామె సేవించిన ఆసవ విశేషం పోతన స్వయంపాకం.

ఈ మహాహాలా మధుపానం వల్ల కలిగిన మత్తు వారి మదనతంత్రానికి 'మజా' నిచ్చింది. శృంగారలీలా విలాస వినోద లాలితమైన ప్రేమికుల బాహ్యచేష్టలలో ఈ మధుపానం ఒకటి. అది వివిధ సుగంధ పరిమళ మిళితమై గుబాళించటంతో మరింత శృంగారోద్దీపక మౌతుంది. ఈ రతి కల్పనం పోతనగారి శృంగార ప్రియంభావుకత్వం.

ఆ స్థితిలోని ఆమెను సరసాలోకన దృష్టితో సమ్యగ్వచో వైఖరితో కరగించి చేయిబట్టి తల్పాని కాకర్షించటం పరిరంభాదులతో ఆమె సిగ్గును పోగొట్టి మరుని సంభావించటం (10-1490) అనే కామశాస్త్ర సమ్మతమైన కన్యావిస్రంభణ విధానాలు[32] వ్యాసప్రోక్తమైనవే.

. శ్లో ॥ ఆహూయకాన్తాం నవసంగమ హ్రియా
విశంకితాం కంకణ భూషితే కరే
ప్రగృహ్య శయ్యా మధివేశ్య రామయా
రేమేఽను లేపార్పణ పుణ్యలేశయా ॥ 10-48-6

ఇందులో లలిత శృంగార చేష్టలతో మాత్రమే వారి ప్రథమాను రాగానంతర సంభోగం సూచితం. కానీ ఈ రసకందాయంలో పోతన గారి దర్శకత్వంలోని కుబ్జాకృష్ణులు 'మదన తంత్రంబుల లీలారణ్యవీథి' (10-1496) విహారం చేస్తారు.

ఉ॥ జాతియు గాలముం గళయు సత్వము దేశము భావ చేష్టలున్
ధాతువు బ్రాయముం గుణము దర్పశయున్ హృదయంబు జాడ్యయున్
బ్రీతి విశేషముం దెలిసి పెక్కు విధంబుల చొయ్యలిన్ మనో
జాత సుఖంబులం దనిపె శౌరి వధూ హృద యాపహారియై. 10-1491

32 వాత్స్యాయన కామసూత్రాలు. సం. 2 పుట. 10

ఇలా నవవధూలాలన విధానం ఎరిగిన పోతన శృంగారహృదయం ఇందులో విందులు చేస్తుంది. అతని కామకళా తంత్ర పరిజ్ఞానాని కిది నికషం. నాయిక ఇంగితాన్ని ఎరిగి కామోపచారాలు చేయాలి. దేశకాలపాత్రోచితమైన రీతిలో నాయికా భేదాన్ని గుర్తించి కామకళా తంత్రాన్ని నెరపగలగాలి. అటువంటివాడే 'వధూ హృదయాపహారి' కాగలడు. వాడే శృంగారి నాయకుడు, వైశికుడు కూడ.

తరువాత కుబ్జ కరపద్మాలతో మాధవుణ్ణి కరమొప్పునట్లు కౌగిలించటం 'స్తనాలింగన' భేదం. తచ్చర్యతో ఆమె కామానలం వర్ధించింది. దానితో 'కరమరుదని తోడి శశిముఖు' లంతా సంతసించారు. ఈ కథలో ఆరంభంనుండి శృంగారం అంతర్నిహితంగా వృద్ధి చెంది రసపర్యవసాయి అవుతుంది. తత్ఫలితమే వారి సంభోగ శృంగార సామ్రాజ్య సర్వస్వం.

ఇందులోని నాయకుడు 'శృంగారి'. ఆవిషయం అందరెరిగిందే. ఇక నాయిక సైరంధ్రి. కనుక నాయికా నాయకులకు జాతి భేదం గోచరించింది. అయినా రసాభాస అనటానికి వీలులేని రీతిగా పోతనగారి రచన సాగింది. ఆమె జాతి వృత్తి ఏ విధంగానూ అతని కార్యనిర్వహణానికి, అలాగే అతని రతికి అనుద్బోధకంగాను ప్రతిబంధకం గాను వర్ణింపబడలేదు. అంతేకాదు ఆమె అపురూప లావణ్యం అతనికి తగిన జోడుగా భావించి కవి వర్ణించాడు. ఆమె 'చిత్త జన్ముని చాపం' అతడు 'పంచేషుపంచేషుడు'.

కనుక వారి రతి పరస్పర ప్రరోచకంగా సాగి కథలో క్రమపరిణామం చెంది సహృదయామోదమౌతుంది. ఇందుకు మరొక కారణం కుబ్జ ప్రథమంగా అనురాగవతి అయింది. ఆ తర్వాతనే కృష్ణుడు అనురాగ వంతుడై సంభోగాని కుపక్రమించాడు. అందుచేత ఇది ఉత్తమ సంభోగానికి తగిన ఉత్తమ లక్ష్యం.

ఉషానిరుద్ధుల కథలోని నవానురాగానంతర సంభోగం నవ్యాతినవ్యంగా సాగింది. స్వప్నగతంగానే ఆమె నాయకునితో సంభోగం నెరపింది. అది స్వప్నమయినా సహజ సుందర సంపన్నంగా సాగింది. అందులో అనిరుద్ధుడి కామ కళా కౌశలాన్ని గూర్చిన ఉష భావన సంభావ్యం.

చం॥ సరస మృదూక్తులుం గుసుమ సాయకు కేళియు శాటికా కచా
కరషణముల్ నఖక్రియలు గ్రమ్మ కపోల లలాట మేఖలా
కర కుచ బాహు మూలములు గైకొని యుండుట లాదిగా దలో
దరి మదిగాఢమై తగిలె దర్పకు డచ్చున నొత్తి నట్లయి. 10-ఉ-329

ఈ సురతం కంచుకాది మోక్షణ రతావసాన విధానాలతో నిరూఢమయింది. నఖక్షత దంతక్షత నీవీ స్రంసనం మొదలైన శయనోపచారకళలతో[33] పరిఢవిల్లింది. నఖక్షత దంతక్షతాల వల్ల అన్యోన్యానురాగం అభివృద్ధి చెందుతుంది.[34]

నఖక్షతాలు చేయవలసిన తావుల్ని వాత్స్యాయనుడు ఇలా సూచించాడు.

'కక్షౌ స్తనౌ గళః పృష్ఠం
జఘన మూరూచ స్థానాని' వాత్స్యాయన కామసూత్రాలు, సం॥ పుట. 209

ఈ చోటుల్లో వాటిని ప్రయోగించటం వల్ల వారికి కామోద్రేకం కలుగుతుంది. ఆనందానుభూతి తీవ్రమౌతుంది. ప్రణయ రహస్యవేది అయిన అనిరుద్ధుడు దీన్ని గుర్తించి వర్తించాడు.

ఉష కన్య. రత్యనుభవ శూన్య. కనుక ఆమెను స్వాధీనం చేసుకోవటంలో స్వానుకూలం చేసుకోవటంలో కన్యావిస్రంభణ విధాన క్రమాన్ని పాటించాడు అనిరుద్ధుడు. ఇలా పలురకాలుగా స్వప్నసంగమంలో ఆలింగన అధరపాన మృదుభాషణలతో కావించిన కన్యా విస్రంభణ క్రమం అమూలం. ఇది పోతన గారి కామకళా పాండితికి కమనీయ నిదర్శనం. చెలికత్తె చిత్రరేఖ అనిరుద్ధుణ్ణి తన యోగమాయా విద్యతో శోణపురానికి తెచ్చింది, ఉషాసుందరీ తల్పతలం చేర్చింది. ఉష తన చెలి కార్యనైపుణిని వినుతించింది. తర్వాత తన నిజమందిరానికి పోవ పనిచింది. ఈ చర్యాక్రమం శాస్త్రసమ్మతమైన 'దూతీ విసర్జన' విధానం. ఇది పూర్వానురాగ సంభోగానికి నిరూఢినిస్తుంది. ఇందులో ఆమె నేర్పు అగణ్యం. ఆమె జాణతనం అనన్యం. ఆ తర్వాత వారి సంగమ విషయం షడక్షీణమే. అంటే ఆపై ముగ్గురికి మాత్రమే తెలుసు. కనుకనే పోతన దానిని క్లుప్తంగా గుప్తంగా సంపన్నంగా తీర్చిదిద్దాడు. అప్పటి అనిరుద్ధుడి మదన తంత్రం మనోజ్ఞం.

కం॥ సురుచిర మృదు తల్పంబున
పరిరంభణ నరసవచన భావకళా చా
తురి మెఱయ నా కుమారుడు
తరుణీమణి బొందె మదన తంత్రజ్ఞుం డై. 10 ఉ - 371

వీరి ఈ నవీనానురాగంలోని సంభోగం అభీష్టాలైన ఉపచారాలుండటంవల్ల పాలింప దగింది. ఇలా నిరంతరం ఉపచార సంపన్నంచేసి సముచిత సముల్లాసంతో అను వర్తించటం ఉచితం.[35] ఇదే వీరి సంభోగ శృంగార వర్ణనంలో సందర్శనీయ మయింది.

---

33 శృంగార ప్రకాశము, పుట. 258

34 రాగవృద్ధౌ సంఘర్షాత్మకం నఖ విలేఖనం. వాత్స్యాయన కామ సూత్రాలు - సం- 1 :పుట. 207
తథా దశనచ్ఛేద్యస్య సాత్మ్యవశాద్వా. అందే, పుట. 208

35 శ్లో॥ భుజిః పాలను కౌటిల్యాభ్యవహా రాసు భూతిషు
నవరాగానంతరజః పాల్యో ౣ భీష్టోపచారతః ॥ భావప్రకాశనము, పుట. 296

. వృద్ధ సౌభరి మహర్షికి యమునా జలగతమైన మీనరాజ శృంగారం ఉత్తేజాన్ని కల్గించింది. ఆ పై అతడు సంసారాన్ని అపేక్షించాడు. తత్క్షణం మాంధాత వద్దకు వెళ్లి ఒక్క కన్యనిమ్మన్నాడు కాపురానికి. కానీ ఆయన తన కన్యావరోధంలో స్వయంవరాన్నే కల్పించాడు. అప్పుడు తన వయసు లేమినిగూర్చి లోకరీతిని గూర్చి వగచి ఇలా తల పోశాడు.

ఆ ॥ బాల పువ్వుబోణి ప్రాయంపు వానిని
జెన్నువాని ధనము జేర్పువాని
మరగునేని కొంత మరగు గా కెదిరి ద
న్నెఱిగి ముసలితపసి నేల మరగు ? 9-174

లోకంలోని బాలా మనోభావాన్ని సౌభరికి తలపింప చేసి శృంగార భావోత్కర్షను కల్గించాడు పోతన. తర్వాత తన తపశ్శక్తితో సురూప సంపన్నుడైన సౌభరిని జూచిన రాజసుతలు మూలంలో -

శ్లో ॥ తాసాం కలి రభూద్భూయాం స్తదర్థేఽ పోహ్య సౌహృదమ్
మమాను రూపోనాయం వ ఇతి తద్గతచేతసాం ॥ 9-6-44

అని మాత్రమే భావించారు. కానీ పోతన స్వయం ప్రతిభా సంపన్నమైన అనల్ప కల్పనం రమణీయంగా సాగింది. అది స్వభావ సుందరమైన సంభోగ భావనకు దోహదం చేసింది. అది వారిలో ప్రథమంగా కల్గిన అనన్యమైన అనురాగ కల్పనం.

ఉ. కోమలులార ! వీడు నలకూబరుడో మరుడో జయంతుడో
యేమఱివచ్చె వీని దడ వేల వరింతుము, నేమ నేమ యం
చా మునినాథు జూచి చలితాత్మిక లై సౌరిదిన్ వరించి రా
భామిను లందఱున్ గుసుమబాణుడు ఫీ యని ఘంట వ్రేయగన్. 9-176

కుసుమ బాణుడి ఘంటా నాదంతో వారిలో రతి కుతూహలం సందడించినట్లు పోతన కల్పనం. అలా వారి ప్రథమాను రాగాన్ని సుస్పష్టం చేశాడు. తర్వాత తపశ్శక్తితో సర్వ శృంగార సంభారాల్నీ వసంతాన్నీ కల్పించుకొన్నాడు సౌభరి. ఆ తర్వాత -

తే ॥ పూట పూటకు నొక వింత పొలుపు దాల్చి
రాజకన్యల నందఱ రతుల దేల్చె. 9-178

ఇలా ప్రథమాను రాగానంతర సంభోగం సుద్యోతిత మవుతుంది. ఇక్కడ మరొక శృంగార కల్పనం ఉంది.

అది మాంధాత తన తనయల అనురూప దాంపత్య విశేషాలను గూర్చి వారినే అడిగి తెలుసుకున్న సందర్భం. అప్పటి వారి సమాధానం మేల్తరమైన అమూలక శృంగార స్ఫోరకం.

కం॥ నాతోడు లార ! మీపతి
మీతోడిద పనుల యెడల మేలే యనుడున్

"నాతోడిదె నాతోడిదె
తాతా ! మే" లనుచు ననిరి తరుణులు వరుసన్. 9-183

వారి ఈ మన్మథ సామ్రాజ్య భోగ భాగ్యాల స్వానుభవ సంతృప్త సమాధానం వారి సంభోగ శృంగార సంపన్నతనూ అనన్యానురాగాన్నీ సూచించి పఠితను రసోన్ముఖుని చేస్తుంది. సౌభరి సంసారం బహునాయికా సంబంధమైనది. అయినా అందులో అనుచిత విభావం లేదు. పైగా అతని దక్షిణ నాయక సామర్థ్యం గోచరిస్తుంది. కనుక వారి ప్రథమానురాగ సంభోగ శృంగారం సంభావ్యమే !

# మానానంతర సంభోగం

ప్రథమానురాగంలో గానీ తదనంతర సంభోగంలోగానీ దృష్టశ్రుతానుమితాపరాధాల వల్ల యువజంటల మానసాలలో కలిగే రోషానికే 'మాన' మని వ్యవహారం. అటువంటి మానానంతర సంభోగం కుటిలమైంది. అది ఎప్పుడూ కౌటిల్యాన్ని వీడదు. ఇందులోని ప్రేమకుటిలం. ఈ కౌటిల్యానికి అలవడిన ప్రేయసీ ప్రియులు అనంతర సంభోగంలో కూడ అంతర్నిహితంగా కౌటిల్యభావ సముపేతులైతారు. పరస్పరం కౌటిల్య సంబంధమైన శంకాతంకాలతో ఉంటారు. ఇలా కించిత్కలుష భావంతో ఉండికూడ సంప్రాప్తమైన సంభోగానంద సంభావనులైతారు.[36]

ప్రియుడొనర్చిన ప్రసాధన విధానంతో ప్రసాద ముదయించినా పూర్వాపరాధ స్మరణంతో కోప మనువర్తిస్తుంది. కనుక అప్పటి సంభోగం కోపసంకీర్ణమై ఉంటుంది. కనుక ఇది 'సంకీర్ణ సంభోగం'గా వ్యవహృతం.[37] ప్రేమ గతి స్వభావ కుటిలమయినందువల్ల అనురాగం కుటిలతను అవలంబించి 'మానము' అనదగిన దవుతుంది. శృంగార ప్రకాశంలో ఈ 'మాన' పదనిరుక్తిని గూర్చి మాధవరామశర్మగారి వ్యాఖ్యానం[38] గమనార్హం. మానావిర్భావంనుండి మానానంతర సంభోగ పరిసమాప్తి వరకు గల వివిధ పరిణామాలను గూర్చి వాటి విశేషాలను గూర్చి భోజదేవుడు ఇతర గ్రంథకర్తలకన్న ఇనుమిక్కిలిగా

---

36 భావ ప్రకాశనము, పుట. 297

37 శ్లో॥ ప్రసాదే౽పి వ్యలీకాది స్మృతే : కోపానువర్తనాత్
సంకీర్యతే యస్సంభోగ స్తస్మాత్సంకర ఈరితః ॥ భావప్రకాశనము, పుట. 188

38 మాన పూజాయాం - మన జ్ఞానే మను బోధనే - మాఙ్మానే అను ధాతువుల నుండి మానరూపము సిద్ధమగును.

1. 'మాన్యతే పూజ్యతే అనేన ఇతి మానః'
2. మన్యతే దుఃఖైక హేతుమపి సుఖసాధనం ఏనం
3. మనుతే బుధ్యతే అస్మాత్ ప్రేమాస్తిత్వం
4. మిమీతే పరిచ్ఛినత్తి ప్రేమ్ణః ప్రమాణం అసౌ

శిష్టప్రయోగమున్నందున మాన శబ్దం పుంలింగం. శృంగార ప్రకాశము, పుట. 278

వివరించాడు. అందులోని సారాంశాన్ని ఈ క్రింది విధంగా స్వీకరించవచ్చు. "మానినీ మణికి మానముండుట యుత్తమము. పురుషున కదికనీయాన్. ఇద్దరకు మానముండుట మధ్యమము. మానము చతుర్వింశతి ప్రకారము, మాన విషయాశ్రయా లంబనభేద, మానజాతి, మానవిశేష, విషయప్రకీర్ణ, ఆశ్రయ ప్రకీర్ణ, ఆలంబన ప్రకీర్ణ, విషయకర్మ, ఆశ్రయకర్మ, ప్రకీర్ణకర్మ, మానవికార, మానోపలక్షణ స్థాన, మానోత్పత్తికరణ, మానోపలక్షణ, మానోద్దీపన,మానవిలాస, మానమోట్టాయిత, మాన సుఖానుభవ, మానోత్పత్తి ప్రకీర్ణ, మానోపాధిభంగ, మానభంగకారణ, మానోపశాంతి, మానోపశమలక్షణ, మానభంగావధి, మానానుభవ సౌఖ్యములు ఇరువది నాలుగు. "ఇతి చతుర్వింశతిరర్థః" [39] ఇవి తిరిగి ఒక్కొక్కటి పలుభేదాలుగా ప్రవిభాజ్యమైనాయి.

రుక్మిణితో శ్రీకృష్ణుడు, కళాచతురత్వంతో చంచన్మందహాసంతో చేసిన ప్రసంగం పెరిగిపెరిగి సర్వలక్షణ లక్షితమైన మానానంతర సంభోగ పర్యవసానమైన కావ్యగౌరవాన్ని పొందింది. మానవతి రుక్మిణీ 'మానోత్పత్తి'కి మూల కారణం 'ప్రియకరణ' మైన విరసోక్తులు. అవి అప్రియమైనవి అగౌరవమైనవి అపూర్వమైనవి. కనుక అవి ఆమెకు దురంతమైన చింతకు మూలమైనాయి.

సీ ॥ కాటుక నెఱయంగ గన్నీరు వఱదలై
కుచ కుంభ యుగళ కుంకుమము తడియ
విడువక వెడలెడి వేడి నిట్టూర్పుల
లాలితాధర కిసలయము కంద
జెలువంబు నెఱిదప్పి చిన్న బోవుచునున్న
వదనారవిందంబు వాడు దోప
మారుతాహతి దూలు మహిత కల్పకవల్లి
వడువున మేన్ వడవడ వణంక
తే ॥ జిత్త మెరియంగ జెక్కిట జెయ్యి చేర్చి
కౌతుకం బేది పద తలాగ్రమున నేల
వ్రాసి పెంపుచు మో మర వాంచి వగల
బొందె మవ్వంబు గందిన పువ్వుబోలె. 10 ఉ. 237

ఇక్కడ మానోపలక్షణ స్థానాలయిన హృదయ చక్షు వక్త్ర వాక్ వపుః చేష్టితాల ద్వారా ఆమెలోని చింత వ్యక్తమయింది. ఆ చింతా లక్షణం 'ఆవేగం' అనే మానజాతి భేదంగా పరిణమించింది. ఆవేగం ఆమెకు అప్రియజన్య[40] మయింది. కనుక కళవళ పాటుకు కారణమయింది. అప్పటి ఆమె పరిస్థితి ఇది. ఆమె బాష్పావరుద్ధేక్షణ విస్రస్త

---

39 శృంగార ప్రకాశము, పుట. 289

40 భావప్రకాశనము, పుట. 48

ఏసూత్న భూషణ అలింగిత ధారుణి వీత తోషిణి. (10 - ఉ. 240). ఇలా 'మానోపలక్షణా' లన్నీ బహిర్గతం అయినందువలన ఇది 'ప్రకాశ' మనే 'మాన విశేషం' గా పరిఢవిల్లింది. ప్రణయ కలహంలో స్త్రీలు ఇలాగే వర్తిస్తారని వాత్స్యాయ నాభిభాషణం[41]. సత్య కైకేయిల కన్న స్వభావంలో భేదం ఉన్నందున రుక్మిణీ చర్యలో ఒకించుక వ్యత్యాసం గోచరిస్తుంది, అంతే.

ఆమెకు 'మానోపశాంతిని కూర్చటానికి దరిచేరిన శ్రీకృష్ణుడు వచనకౌశలం మాల్యవిధి శారీర సంస్కారం కౌశలం వంటి 'కామాశ్రయ కళల'[42] తోను, శీతలోపచారాల తోను ఆమెను అదరించాడు. దానితో ఆమె తేరుకొని చిత్తం మెత్తబడి తనకు స్వాయత్తం కావాలని ఆయన కాంక్ష.

సీ ॥ కని సంభ్రమంబున దనువున దనువుగా
　　　నను‌వున జందనం బల్ల నలది
కన్నీరు పన్నీట గడిగి కర్పూరంపు
　　　బలుకులు చెవులలో బాఱనూది
కరమొప్పు ముత్యాల సరులు చిక్కడలించి
　　　యురమున బొందుగా నిరవు కొలిపి
తిలకంబు నునుఫాల ఫలకంబుపై దీర్చి
　　　వదలిన భూషణావళుల దొడిగి

తే ॥ కమలదళ చారు తాలవృంతమున విసరి
పొలుచు పయ్యెద గుచముల బొందు పఱిచి
చిత్త మిగురొత్త నొయ్యన సేద దేర్చి
బిగియ గౌగిట జేర్చి నెమ్మొగము నిమిరి. 　　10 ఉ. 241

ఇలా ఆమెకు 'మానానుభవ సౌఖ్యాల' యిన ప్రసహోత్క్షేపం ప్రియ ప్రణ యోక్తులు శృంగార వృద్ధి శ్రీకృష్ణుడు కల్పించాడు. ఇది అతని కామకళా నైపుణికి నిదర్శనం.

ఆపై ఆమెకు ఇందిందిర గరుదనిల చలత్ప్రసూన కలికాంచిత సుందరశయ్యా సౌభాగ్యాన్ని (10.ఉ.243) కల్పించాడు. మృదు మధుర భాషణాలతో అనునయించాడు. ఇలా లాలించి ఆమెను శయ్యకు చేర్చినరీతి వాత్స్యాయన కామ సూత్రానుగుణ్యమే.

మానానుభవ సౌఖ్యంతో ఆమెకు 'మానోపశమ లక్షణా'లైన నయన మీలనం ముఖ ప్రసాదనం బాష్పమోక్షం పులకోద్భవం వంటివి కలిగాయి.

---

41 తత్ర సుభృశః కలహో రుదిత మాయాసః శిరోరుహాణా మవక్షేదనం ప్రహణన మానసా ద్ధ్రయనాద్యా మహ్యాం పతనం మాల్యభూషణావ మోక్షో భూమౌ శయ్యా చ.
వాత్స్యాయన కామ సూత్రాలు, సం : 1 : పుట. 321

42 శృంగార ప్రకాశము. పుట. 257.

కం॥ పురుషోత్తము ముఖకోమల
సరసిజ మయ్యిందువదన సవ్రీడా హా
సరుచి స్నిగ్ధాపాంగ
స్ఫురదవలోకనము లీలయ జూచిల్లనియెన్. 10 ఉ. 245

పతికృత శృంగార పరిచర్య కిలా పరవశించటం నతీలోక సహజం కదా ! కనుకనే ఆమె ఆనందంతో శ్రీకృష్ణుణ్ణి కీర్తించింది. ఇది వాత్స్యాయనోక్త విధానమే.

వేటలోను పోటులోను రతిలోను నొవ్వనాడిన మాటల్ని నిజంపట్ట రాదనీ మనసులో వ్యధ చెందరాదనీ శ్రీకృష్ణుని ముఖతః పోతన ప్రస్ఫుటం చేశాడు. అప్పటి సురుచిర ప్రసంగాలు అనురాగ వర్ధనాలు కావాలేకాని అవరోధం కారాదని ఆయన ప్రవచించిన ప్రణయసూక్త (10 ఉ. 263) సారాంశం. ఇలా ఆ సంభాషణలో శ్రీకృష్ణుడు పరిసాంత్వనం చిత్రచాటూక్తి అపరాధస్మరణంవంటి అనేక 'మానభంగోపాయాలను' ఆమెపట్ల ప్రదర్శించాడు.

ఈ సందర్భంలో పోతన మరొక అమూలకమైన రతి రహస్యాన్ని వెల్లడించాడు. రతి సౌఖ్యాన్ని అందించగల స్త్రీకి ఉండవలసిన లక్షణాలను ఉల్లేఖించాడు. స్త్రీలకు కూడ రతి పాండిత్యం ఉండాలని సూచించాడు.

ఉ॥ కింకలు ముద్దు బల్కులును గెంపు గనుంగవ తియ్యమోవియున్
జంకెలు తేటచూపు లెకసక్కెములున్ నెలవంక బొమ్మలున్
గొంకక పీడనాడుటలు గూరిమియుం గల కాంత గూడుటల్
అంకిలి లేక జన్మఫల మబ్బుట గాదె కురంగలోచనా ! 10ఉ. 265

అలా సర్వలక్షణ లక్షితమైన శృంగార రూపిణిగా రుక్మిణి ఉండాలని కోరుకున్నాడు శ్రీకృష్ణుడు. అప్పుడే పరస్పరానురాగం ప్రవృద్ధమై మనసు ఆనంద తుందిలం అవుతుంది. ఇక నఖక్షతాలు 'నెలవంక బొమ్మల' వంటివని పంచసాయక గ్రంథం పేర్కొంది[43].

ఈ అమూలక శృంగార ప్రసంగంతో పోతన, పాత్రతోపాటు పాఠకుణ్ణి ఆనందింప చేస్తాడు. అప్పుడామెకు అనిరుద్ధుడు వివిధాంబరాలు చారు భూషలూ అనేక వరాలతో మనసెరిగి కామోపచారాలు చేశాడు. స్త్రీల శీలవిశేషాల నెరిగి వారికి దేనిమీద స్పృహ ఉన్నదో తెలుసుకొని దానికి అనుగుణంగా కామోపచారాలు చేయటం రతి పండితులకు

43 శ్లో॥ అర్థేందు సంకాశ మిదం నఖక్షత మర్ధేందు సంజ్ఞం కథితం సమాసతః
కక్షా నితంబ స్తన పార్శ్వ మధ్యే దాతవ్యమేత త్కరజం సదైవ ॥

నైజం.[44] కారణం సహస్రగుణీనంగా ప్రతి క్షణం శృంగారానుభవ కాలంలో లభిస్తుంది గదా! అందుకని.

ఆమెకు మానోపశమనానంతరం వారిద్దరూ నవ్యభవ్యరతి కాంక్షతో ప్రకృతిలో విహరించారు. ఈ సందర్భంలో మూలంలో -

శ్లో ॥ ఏవం సౌరత సంలాపై ర్భగవాన్ జగదీశ్వరః ।
స్వరతో రమయా రేమే నరలోకం విడమ్బయన్ ॥ 10-60-58

అనిఉన్నది. ఇందులోని చరమవాక్య లేశాన్ని మాత్రమే ఆధారంగా స్వీకరించాడు పోతన.

చ॥ ఎలమి ఘటింపగా గలసి యాడెల సీతల మల్లికాలతా
వలి కరవీర జాతి విరవాదుల వీథుల గుబ్బ దెమ్మెరల్
పొలయు నవీన వాసముల బొన్నల దిన్నెల బచ్చరవ్వలన్
గొలకుల లే గెలంకులను గేరిక లీరిక లొత్త గ్రొత్తలై. 10ఉ. 27౦

ఇందులోని సురభిళ సుమనో వీథులన్నీ మానానంతర వ్యలీకాలన్నింటినీ మటుమాయం చేసి అన్యోన్యానురాగాన్ని వృద్ధి చేస్తాయి. అసలు శృంగార యాత్రల అంతర్యమే ఇది.

మానానంతరం కూడ కొత్తజంటలు అంతర్నిహితంగా కౌటిల్య భావ సముపేతులు గానే ఉంటారు. కనుక అప్పటి వారి సంభోగం కోప సంకీర్ణంగా ఉంటుంది. అది సంకీర్ణ సంభోగం లేదా సంకర సంభోగం అవుతుంది. ఇట లోకాదర్శకులైన వీరి శృంగారం వ్యలీక రహితంగా తీర్చటానికి ఇంతగా వనవిహార సమృద్ధిని సూచించాడు పోతన అమూలకంగా.

తర్వాతనే 'నందనందనుడు విదర్భరాజ నందనం దగిలి కందర్పకేళిలోలాత్ముడు' (10ఉ. 275) అయినాడు. మానానంతర సంభోగం 'ఏణనయనామనః పరమ బాంధవ' మైనదిగా కీర్తింపబడినప్పటికీ పోతన మాత్రం ఇలా అలంబన ఉద్దీపన విభావాల తోనే సంభోగాన్ని సూచించాడు. ఇందుకు కారణం దైవసురతం వర్ణనయోగ్యం కాదని భావించటమే. అందువల్లనే దానిని సూచన ప్రాయంగానే వాచ్యం చేశాడు.

సంభోగ శృంగార వర్ణనలోని ఈ అసంతృప్తి నివారకంగా, స్త్రీలకు కూడ రతిరహస్యాలు తెలిసి ఉండాలనీ సంభోగ శృంగారం ఉభయ ప్రాధాన్యం కలదిగా

---

44 శ్లో॥ వాసో ఽంగ రాగాభరణ మాలా శయ్యాసనాదిషు
యత్రయత్ర స్పృహా తత్తద్దేశ కాలానుకూలతః
అత్యాదరేణ సత్కార ఉపచార ఇతీరితః
అతో రతి వివృద్ధ్యర్థం స్త్రీమ శీలాను కూలతః
యథానుకూలం పురుషై రుపచారో విధీయతాం ॥ భావప్రకాశనము, పుట. 242

ఉండాలనీ పోతన ముందుగానే సూచించాడు. 'కింకలు ముద్దు పల్కు'ల వంటి వాటితో కూడి ఉండాలని ప్రవచించాడు. ఇలా పోతన మానానంతర శృంగారానికి ముందుగానే రంగాన్ని సిద్ధపరిచాడు. ఇది అతని శృంగార కావ్యకళా నిర్వహణ కౌశలం.

## ప్రవాసానంతర సంభోగం

ప్రవాసానంతర సంభోగం అత్యంత హృద్యం. సర్వ విస్మృతి సంపాదకం. ఆకలి గొన్నవాడికి హృద్యమైన అభ్యవహారం లాగ ప్రవాసానంతరం భోగులు అన్య విషయాలకు మనసులో తావివ్వరు. ఏకాగ్ర చిత్తంతో సంభోగ రసాన్ని ఆస్వాదిస్తారు. ప్రవాస సమయంలో భావించి భావించి పేర్చుకొన్న కూర్చుకొన్న ఇష్టభోగాలన్నింటినీ శతగుణితంగా అనుభవించాలనుకొంటారు. 'అట్లనరింతును ఇట్లనరింతును, అట్లనరించిన నిట్లన రింతును' అని భావిస్తూ హృద్యంగా సంభోగాన్ని అనుభవిస్తారు. పురుష కృత సంభోగం, స్త్రీకృత సంభోగం ఉభయ కృత సంభోగం ఇందులో సంభోగ సామ్రాజ్య స్థాపకాలు. కనుక ఇది హృద్యం. అభ్యవహారం ప్రతిక్షణంలో తుష్టిని పుష్టిని కూర్చిన విధంగా ఈ హృద్య సంభోగం కూడా అనుక్షణం పుష్టిని తుష్టిని సంతుష్టిని కూర్చుతుందని భావించవచ్చు.[45]

కామ సంపన్నులు ప్రోషితులై వచ్చి ఉపభోగరతులైనప్పుడు వారి సమ్యక్సంభోగం సంపన్నంగా ఉంటుంది. కనుక అప్పటి సంభోగం 'సంపన్న సంభోగం'.[46] ప్రవాసానంతర సంభోగ విషయంలో కూడ శారదాతనయుడు భోజదేవుణ్ణి ధ్యేయంగా భావించాడు. ఈ సంభోగం చతుర్వింశతి అవస్థా భేదాలతో[47] ప్రియుడి ప్రవాస వార్తా శ్రవణం నుండి సమాగమ పర్యంతం సందీప్తమైతుందని భోజోక్తి. వీటితో సంభోగ పుష్టి కలుగుతుంది.

ఆకస్మిక విరహానంతరం శ్రీకృష్ణుని గోపికల తోడి సాహచర్య మాధుర్యం ప్రవాసానంతర సంభోగ సూచనం. ఆ గోపాలుడు మన్మథ మన్మథుడుగా మనోజ్ఞాకారిగా వారి వద్దకు విచ్చేశాడు. అతడు గోపికలకు ఆలంబనం. అతని సౌందర్యం ఉద్దీపనం. అప్పటి వారి 'అభ్యుత్థానం'లోనే వారికి అతని పట్ల గల 'ప్రీతి' అనుభావ ముఖంగా వ్యక్త మౌతుంది.

---

45 భావప్రకాశనము. పుట. 297

46 శ్లో॥ సంపన్న కామై రాయాతైః ప్రోషితై రుపభుజ్యతే
సంపన్న మేవ యత్ర స్యాత్సంపన్న ఇతి కథ్యతే ॥ భావప్రకాశనము, పుట. 188

47 'ప్రియాగమన వార్త ప్రియసఖీ వాక్య దిష్ట్య వృద్ధి శ్రీత్యాది సంభ్రమ అభ్యుత్థాన ప్రియాభ్యాగమ సందర్శన ప్రియాభ్యుపపత్తి పరిజన ప్రమోద మంగల సంవిధాన మను ప్రహర్ష ఉత్సవ భావనా ప్రతి సంస్కార కార్యాద్యుపలంభ ప్రహర్షవచయ ప్రేమపుష్టి ప్రసాధన గ్రహణ వృత్త సుస్మరణ అవస్థానివేదన దుఃఖాది పరిప్రశ్న దేశ సంపదుపవర్ణన స్వదుఃఖ సంకీర్తన శృంగార వృద్ధి'
శృంగార ప్రకాశము, పుట. 303

కం॥ వచ్చిన వల్లభు గనుగొని
విచ్చేసె నటంచు సతులు వికసితముఖులై
యచ్చుగ నిలిచిరి ప్రాణము
వచ్చిన నిలుచుండు నవయవంబుల భంగిన్. 10 - 1058

వీరి దేహచైతన్యం వల్ల అంతస్తత్త్వంలో వారికి గల అనురాగ మాధుర్యం వ్యక్తం. మోహాయితలైన గోపికలు త్వగింద్రియ సుఖంతో వారి సుఖ సంవేదనను సువ్యక్తం చేశారు.

సీ॥ అబల యొక్కతె భక్తి నంజలి గావించి
ప్రాణేశు కెంగేలు వట్టికొనియె
నింతి యొక్కతె జీవితేశ్వరు బాహువు
మూపున నిడుకొని ముదము నొందె
వనిత యొక్కతె తనవల్లభు తాంబూల
చర్వితమాత్మ హస్తమున దాల్చె
బడతి యొక్కతె ప్రియుపదములు విరహాగ్ని
తప్త కుచంబుల దాపుకొనియె

ఆ॥ భామ యొకతె భ్రుకుటీ బంధంబు గావించి
ప్రణయ భంగ కోప భాషణమున
దష్ట దశన యగుచు దండించు కైవడి
వాడి చూడ్కిగముల వరుని జూచె. 10-1059

ఇలా వారు తమ కామోత్కంఠను వ్యక్తపరుస్తారు. శృంగార చేష్టల కుపక్రమిస్తారు. నాయక దర్శన పారవశ్యంతో జడతను వహించి ప్రీతిని ప్రదర్శిస్తారు. అందులో ఒక్క గోపిక కామవికారంతో కృష్ణాలింగన భావాన్ని పొందింది.

ఉ॥ ఒక్క లతాంగి మాధవుని యుజ్జ్వల రూపము చూడ్కి తీగెలం
జిక్కగ బట్టి హృద్గతము జేసి వెలిం జనకుండ నేత్రముల్
గ్రక్కున మూసి మేన పులకంబులు గ్రమ్మగ గౌగిలించుచున్
జొక్కములైన లోచవుల జొక్కుచు నుండెను యోగి కైవడిన్. 10 - 1061

ఆమె నిజమైన రత్యానందాన్ని పొందింది. శృంగార రసాను భూతిని మనోజ్ఞ రీతిని పొందింది. దానితో సాత్త్వికోదయమైంది. ప్రియ జనాన్ని స్మరించినా వారితో కలిసినా వారిని చూచినా ఇలా సాత్త్వికోదయం కలుగుతుంది. ఆ భావనలోనే ఆమె సంభోగ భోగ భాగ్యాన్ని అనుభవించింది. దానికి సాధనగా ఆమె 'స్తనాలింగన' భేదాన్ని పాటించినట్లు గమనించవచ్చు. తద్భావనా చర్యతో ఆమె కామ భారాన్ని దించుకొన్నది. 'యోగికైవడిన్' అని ఉపమించటం చేత భోగానందం యోగానంద తుల్యమని పోతన సూచన.

ఇలా శ్రీకృష్ణుడిని సందర్శించిన ప్రమదా సమూహం ప్రమోదాన్ని పొందింది. వారి మాటలలో చేతలలో తమ అవస్థా నివేదనం సుఖదుఃఖ సంవేదనం మొదలైన వర్ణనల్లో ఆనంద తన్మయతలూ దర్శించవచ్చు. వారి ఆనందలహరి సంభోగ శృంగార రసోదధికి ఉన్ముఖంగా సాగింది.

కం॥ హరి సురుచిర లలితాకృతి
దరుణులు గని ముక్త విరహతాప జ్వరలై
పరమోత్సవంబు సలిపిరి
పరమేశ్వరు గనిన ముక్త బంధుల బంగిన్. 10-1067

ఇలా విరహతాపం తగ్గి పరమోత్సవం జరుపుకోవటం ప్రవాస విప్రలంభానంతర సంభోగ లక్షణం. కాగా ఈ ప్రకరణ మంతా స్త్రీ కృత సంభోగానికి ఉత్తమ ఉదాహరణం.

ఉపవన సంభరితమయిందీ మందారాది కుసుమ పరాగాలతో పరిమళాలతో నిండిన శరత్కాల చంద్ర చంద్రికలతో స్వచ్ఛమయిందీ యమునా తరంగ సంగతి వల్ల కోమలమయిందీ అయిన యమునా పులిన ప్రదేశాలలో విహరించి, ఆ జ్యోత్స్నాభి సారికలు విరహపు వేసట విడిచి పెట్టారు. ఆపై పరిపూర్ణ మనోరథలైనారనటం (10-1068) సంభోగ శృంగార సంభృతం. అనంతరం వారాతనికి అనేక సపర్యలు సంవాహనాయి చేస్తూ ఆనందించారు.

మ॥ మదనోద్దీపితుడైన నాథునికి సన్మానంబు గావించుచున్
ముదితల్ హాసవిలోక విభ్రమములన్ మోదింపుచున్ జేరి త
త్పదముల్ హస్తతలంబులన్ బిసుకుచున్ బై ముట్టుచున్ దూఱుచున్
జదురు ల్వల్కుచు గూర్మి నిల్పనిరి యా పత్కాప దీపాస్య లై. ॥

పై కామ సపర్యలధికంగా సంస్కృత భాగవతగత (10-32-15) భావాలే. అవికూడ వారి సంగ సుఖానికి సంకేతాలే.

ఇందులో గోపికలాచరించిన సంవాహనక్రియ క్రియా శృంగార సంబంధమైందే. స్త్రీ పురుషుల అవయవాలన్నీ రాచుకుంటున్నప్పుడూ వాటికి సంవాహన చేస్తున్నప్పుడూ ఒక విధమైన హాయి కలుగుతుంది. అది స్పర్శ సుఖం. ఈ సంవాహనం పురుషుడు చేస్తే స్త్రీకి స్త్రీ చేస్తే పురుషుడికీ మాత్రమే సుఖం కలుగుతుంది. అందువల్లనే దీన్ని 'అసాధారణం' అన్నాడు వాత్స్యాయనుడు.[48] కనుక వనాంతంలో ప్రవేశించినపుడు గోపికల కధిక సుఖం కలిగింది. అప్పుడు మదనోద్దీపితుడైన నాథుడికి సంవాహనంతో ఆనందం కల్గించారు గోపికలు. సంభోగ మన్నది ఉభయాత్మకమయింది, కనుక తచ్చర్యతో వారూ

---

48 వాత్స్యాయన కామసూత్రాలు, సం.1, పుట. 188

కామ ప్రసంగ వ్యాపారులై తర్వాత అతడి సంగమంతో లోనిక్కిన వియోగతాపాన్ని ఒక్కసారిగా విడిచిపెట్టారు (10-1079).

ఇలాగే రాసక్రీడానంతరం వీరి సంభోగం ఉభయ కృతం. మూలంలో ధ్వన్యమానమైన భావాలకు అనుభావ పరంపరను గూర్చటంవల్ల అనురాగరంజితమై కామ సంపన్నమైంది వారి సంభోగం.

సీ॥ చెలువ యొక్కతె చెక్కు జెక్కుతో మోపిన
విభుడు తాంబూల చర్వితము వెట్టె
నాడుచు నొకలేమ యలసిన బ్రాణేశు
డున్నత దోఃస్తంభ మూతసేసె
జెమరించి యొకభామ చేరిన గడగేర
జతురుడు కుచఘర్మ జలము వాపె
నలకంబు లొకయింతి కలిక చిత్రకరేఖ
నంటిన బ్రియుడు పాయంగ దువ్వె
ఆ॥ బడతి యొకతె పాడిపాడి డస్సిన యధ
రామృతమున నాధు డాదరించె
హార మొక్క సతికి నంసావృతంబైన
గాంతు డురముజేర్చి కౌగిలించె. 10-1093

అంటూ సాగిన సన్నివేశంలో కామకళా నైపుణ్యం పరస్పర శృంగారోపచారాలు ఉభయాత్మకాలు. అదొక మనోహర ప్రణయ సామ్రాజ్య పాలనం. ఇలా రెండు సందర్భాలలోనూ బాహ్య రతిని అధికాధికంగా వర్ణించి సంభోగశృంగార రసపారమ్యాన్ని పోతనార్యుడు దర్శింపచేశాడు.

## కరుణానంతర సంభోగం

కరుణానంతర సంభోగం విస్రంభంతో కూడుకొనిన అనుభూతిని పొంది వుంటుంది. ఈ సమయంలో వారికి కాలుష్యం ఉండదు. ఆశారాహిత్యంతో వ్యథితులై నిరపేక్షా స్వభావులైనవారు ప్రత్యుజ్జీవిత ప్రియ సంబంధంతో ఆశాసహితులై సాపేక్ష భావులై ఇష్టాభీష్ట భోగాలను అనుభవిస్తారు. పూర్వాచరిత సంభోగప్రక్రియలను అన్నింటిని సానుసంధానంతో స్వానుసంధానంతో అనుభవంలో అందుకుంటారు. అనుభూతి సర్వస్వం వీరి అధీనమే.[49] మరణించిన వ్యక్తి పునర్జన్మకు సంబంధించిన శరీరాంతరంతో సంగమ ప్రత్యాశవల్ల రతి ఉదయించి వారికి సంభోగం ఘటిల్లినా అది కరుణానంతర సంభోగమే.[50]

---

49 భావ ప్రకాశనము, పుట. 297

50 కావ్యాలంకార సంగ్రహము, పుట. 410

మృతులై జీవించిన వారి సంభోగం సమృద్ధం. ప్రత్యుజ్జీవనం వలని హర్షాదుల వలన ప్రవృద్ధమై దీనాతిశయ విశేషాల చేత దీప్తమయితుంది. కనుక అప్పటి వారి శృంగారం 'సమృద్ధ సంభోగం'[51]

ఈ కరుణ విప్రలంభానంతర సంభోగంలో కలిగే అవస్థా విశేషాలు ప్రధానంగా చతుర్వింశతి అని భోజరాజు పేర్కొన్నాడు. అవి ప్రియా సందర్శన, సంభ్రమాకులత, ప్రమోదవృద్ధి, చిత్తవిస్మయ, ప్రియాభిభాషణ, జీవితే అతిలజ్జా, ప్రియోపచ్ఛందన, సుహృదపేక్ష, వృత్తాంత కథన, విస్రంభోత్పత్తి, ఇతికర్తవ్యయోగ, బాంధవాగమ, ప్రియ జనాభ్యుపపత్తి, గురుజనస్నేహ, జ్ఞాతి జనాభినందన, భాగ్యప్రశంస, నైపథ్యాది గ్రహణ, పురప్రవేశ, నాగరిక క్షోభ, గృహోపగమన, ఉత్సవానుభవ, దయితా సాహచర్య, శృంగారపుష్టి, సౌఖ్యపరంపర అనే వాటిని అనుసరించి ఇతరభేదాలను ఊహించవలెనని భోజాభిమతం.[52]

పరమశివుడి కంటి మంటకు మండిపోయిన పంచబాణుడి పునర్జన్మ కోసం వేచిన రతికి ప్రత్యాశ ఉంది. ఇలాతన పెనిమిటి శరీరధారణంచేయటంకోసం ఎదురు చూడటం వల్ల, అదీ నారదుడిచ్చిన సమాచారంతో ఆమెకు ప్రత్యాశ ఉదయించింది. అక్కడినుండి అతని కోసం చేసిన ప్రయత్నం, యౌవనుడయ్యే పర్యంతం వేచిఉండటం అంతా ఆమె అనుభవించిన కరుణ విప్రలంభం.

శంబరుడి ఇంట్లో బాలకుడిగా ఉన్నది 'కందర్పుండని తెలిసి పుత్రార్థినియైన తెఱంగున' (10-ఉ 8) స్వీకరించిన తరుణంలో ఆమెకు 'ప్రియ దర్శనం' కలిగింది. మాయావతీ పేరుతో వ్యవహారంలో ఉన్న రతిదేవి, ప్రద్యుమ్నుడి రూపంలో తన పెంపకంలోనే ప్రవృద్ధమౌతున్న పంచబాణుడిని ఆరూఢ యౌవనుడిని చేసింది. అప్పుడు అతడిని చూచి 'ప్రియాభిభాషణం' చేసి 'జీవితే అతిలజ్జా' భావంతో 'హాస గర్భితంబు లైన చూపులం జూచుచు మాయావతి సురత భ్రాంతి' (10 ఉ. 11) వహించింది.

మూలంలో ప్రద్యుమ్నుడి చరిత్ర సమస్తం అతి సంక్షిప్తంగా గోచరిస్తుంది.

శ్లో ॥ సా తం పతిం పద్మదలాయతేక్షణం
ప్రలంబబాహుం నరలోకసుందరమ్।
సవ్రీడ హాసోత్తభి తద్భ్రువేక్షతీ
ప్రీత్యోపతస్థే రతిరంగ సౌరతైః ॥ 10-55-10

మాయావతీ మన్మథ భావనకు తగిన ఉద్దీపన మూల రచనలో కన్పించదు.

51 శ్లో॥ ప్రత్యుజ్జీవన హర్షాదేః ప్రవృద్ధో మృతజీవతోః ।
దీపనాతిశయైర్దీప్తః సంభోగః స్యాత్సమృద్ధిమాన్ ॥ భావప్రకాశనము, పుట. 188

52 శృంగార ప్రకాశము, పుట. 304

ఇంతటితో పోతనకు తనివి తీరలేదు. అందువల్లనే ప్రద్యుమ్నుడి రూపంలో ఉన్న మన్మథుడి సౌందర్యాన్నే ప్రద్యుమ్నుడి సౌందర్యంగా పోతన కల్పించాడు. అతడినే 'పంచేషు పంచేషుడి' గా ప్రకటించాడు.

సీ ॥ చక్కని వారల చక్కదనంబున
కుపమింప నెవ్వడు యోగ్యుడయ్యె
మిక్కిలి తపమున మెఱయు నంబికకు నై
శంకరు నెవ్వడు సగము సేసె
బ్రహ్మత్వమును బొంది పరగు విధాతను
వాణికై యెవ్వడు వాడి చెఱిచె
వేయు డాగులతోడి విబుధ లోకేశుని
మూర్తికి నెవ్వడు మూలమయ్యె

తే ॥ మునుల తాలిమి కెవ్వడు ముల్లు సూపు
మగల మగువల నెవ్వడు మరులు కొలుపు
కుసుమ ధనువున నెవ్వడు గొను విజయము
చిగురు వాలున నెవ్వండు చిక్కుపఱుచు. 10 ఉ-10

ఇంతటి సుందరాంగుడు కనుకనే ఆమె సురత భావం వహించిందని భావం. అలా ఉద్దీపనం కల్పించాడు పోతన. ఇది ఆమె కరుణానంతర శృంగారానికి గాఢమైన హేతు కల్పనం. ఇలా ఒక జీవిత కాలంగా రతి మనోగతంగా మథనమవుతున్న మన్మథ భావానికి సజీవమూర్తి కల్పనం చేసి ఆవిష్కరించాడు పోతన. ఇంత కాలపు కరుణ విప్రలంభ ఫలితంగానూ సుందరతర రూపసందర్శనం ఫలితంగానూ భర్తృభావ పారవశ్యం వల్లా ఆమె సురత భావం వహించిందనటం సమంజసం.

తర్వాతి కథలో ప్రద్యుమ్నుడితోడి తమ 'వృత్తాంత కథనం', తమ దంపతి భావంలో ఆమె 'విస్రంభోత్పత్తి' కల్గించటం, శంబరాసుర సంహారానికి ఆమె చేసిన 'కర్తవ్యబోధ' యథామూలమే. అలాగే ఆ దంపతుల ద్వారకా 'పురప్రవేశం' అందులోని 'గృహోప గమనం' 'బాంధవాగమనం' 'జ్ఞాతి జనానందం' బంధు జనంతో 'ఉత్సవానుభవం' 'భాగ్య ప్రశంస' కూడ యథా మూలాలే.

కథాంతంలో రుక్మిణి తన 'కొడుకుం జూచి సంతోషించి కోడలి గుణంబుల కైవారంబు చేసి వినోదిం' చటంతో రతి మన్మథుల (లేదా మాయావతీ ప్రద్యుమ్నుల) 'పునస్సమాగమం' వారి 'శృంగార పుష్టి' 'సౌఖ్యసంపద' సువ్యక్తం. కనుక వారి సంభోగం 'సమృద్ధంగా' సంభావ్యం. అందువల్ల నాగరకులందరూ నందించారు. ఇలా వారి కరుణానంతర సంభోగం వారికే గాక సర్వజనానందకర మయిందనటం అది సర్వ సంభోగాలలోనూ సర్వోత్కృష్టమైందని ప్రకటించటమే.

ఆలంకారికులు పేర్కొన్న చతుర్విధ విప్రలంభానంతర సంభోగ భేదాల్ని ఆయా కథా ఘట్టాల కనుగుణంగా రసరామణీయకం చేసిన రససిద్ధుడు పోతన. ఆయా పట్టుల్లోని

మూల భావాల ననేకవిధాలుగా రంజకంగా ప్రపంచీకరించి.తనదైన బాణిలో రసపరిప్లావితం చేశాడు. అందులో ప్రత్యణువునా అలంకారిక మార్గాన్నీ దానితో పాటు కామకళా శాస్త్ర పారమ్యాన్నీ సందర్శింప చేశాడు.

# వియోగ శృంగారం

సంభోగ మప్పుడైన నాయికా నాయకులకు విప్రకర్ష కలగటం వియోగం. అది మాన వియోగం ప్రవాస వియోగం అని రెండు విధాలు.

మానవియోగం పలు విధాలు. నాయికా నాయకులిద్దరూ కోపోపహతులైతే ప్రణయ మానం. ప్రియుడన్యాసంగం కలవాడైతే ఈర్ష్యామానం. ఇది నాయకుని పట్లగల అనుమానం వల్లా ప్రత్యక్ష పరిజ్ఞానం వల్లా శ్రవణంవల్లా కలుగుతుంది. మళ్ళీ ఇది పలువిధాలు.

**అనుమానం** : గోత్ర స్ఖలనం వల్ల అన్యస్త్రీ భోగాంకం వల్ల స్వప్నాయితం వల్లా ఇది కలుగుతుంది. **ప్రత్యక్షం** : సాక్షాదింద్రియ గోచరం వల్ల కలిగేది. **శ్రవణం** : ఇతర వ్యక్తులు చెప్పటం వల్ల కలిగేది.[53]

ప్రేయసీ ప్రియులు భిన్నదేశాలలో ఉండటం వల్ల ప్రవాసవియోగం కలుగుతుంది. అది ప్రధానంగా శాప బుద్ధిపూర్వ సంభ్రమ భేదాలతో ఉంటుంది.[54] ఇవి కాక ఆకస్మిక విరహం సంభ్రమోత్థ విరహం దైవిక విరహం అనేవి చెప్పుకోదగ్గవి.[55] ఆలంకారికులు వీటిలోనే ఇంకా పలుభేదాల్ని సూచించారు. ఆయా విరహ సమయాలలో నాయికలకు విభావాదిభావాలు భేదిస్తాయి. అవి ఆయా తావుల్లో ప్రస్తావితా లవుతాయి.

## దేవయాని విరహం

నూతిలో పన్నావస్థలో ఉన్న దేవయానికి యయాతి తన ఉత్తరీయాన్ని ఇచ్చి తన చేతితో (పాణినా పాణి ముజ్జహార 9-18-19) ఆమె హస్తాన్నిబట్టి దయతో బయటకు తీశాడు. ఈ భావాన్ని పోతన చిత్రించినతీరు గమనార్హం.

శా. సప్తాంభోనిధి మేఖలావృత మహా సర్వంసహా కన్యకా
ప్రాప్తోద్యద్వర దక్ష దక్షిణకర ప్రాలంబముం జేసి ప్రో
క్షిప్తం జేసె యయాతి కట్టుకొన బై చేలంబు మున్నిచ్చి ప
ర్యాప్త స్వేదజలాంగి నాళీసముదాయ స్వర్గవిన్ భార్గవిన్. 9-527

---

53 భావప్రకాశనము. పుట. 186

54 భావప్రకాశనము. పుట. 186

55 పైదే, పుట. 307

పోతన ఇందులో ఆమె సౌందర్యాన్ని కూడ వర్ణించాడు. సర్వ సర్వంసహాకన్య వంపించిన వర దక్షిణకరమే దేవయానికి కూడ ప్రాలంబనమయింది. ఆ హస్త విధికూడ అదే. రాజు బహుపత్నీకు డవటం సహజమే కదా. అందుకే ఆమె రాజును దేవుడిచ్చిన భర్తగా పరిగణించింది; ఆపై -

మ. ................. ................ ............ ... సౌ
ఖ్యనివాసు న్నిను మాని యొండు వసునిం గాంక్షింప నే నేర్తునే?
వనజం బానెడి తేటి యన్య కుసుమావాసం బపేక్షించునే. 9-529

అని పల్కి అతని హృదయాన్ని అనురాగ రంజితం చేసింది. ఆపదలో ఆదుకున్న అనన్యసామాన్యమైన వీరుణ్ణి అందులోనూ అందగాణ్ణి అందుకోవాలను కోవటం అంగనాజన సామాన్యమే కదా ! అందులో ఆశ్చర్యం ఏముంది? ఇందులో వీరిది సాక్షాద్దర్శన సంబంధమైన ప్రత్యక్షానురాగం.[56]

ఆ తర్వాత శృంగార కథలో శర్మిష్ఠ దాసి కావటం, దేవయాని వివాహం, శుక్రుడు శర్మిష్ఠా సంగమాన్ని నిషేధిస్తూ రాజును శాసించటం అంతా యథామూలమే. దీనిని 'శాపకృత ప్రవాస విరహంగా' భావించవచ్చు. నాయికా నాయకులిద్దరూ ప్రత్యక్షంగానే ఉన్నా వారికి కారణాంతరం వల్ల సంగమ నిషేధం ఉన్నందున విరహమే సంప్రాప్తం అవుతుంది.

## శర్మిష్ఠా విరహం

యయాతీ శర్మిష్ఠా సంగమ విషయాన్ని ఎరిగిన దేవయానికి 'శ్రవణ సంబంధమైన ఈర్ష్యామానం' కలిగింది. ఇది దాసీ సఖ్యాది ముఖతః నాయకుడి అన్యకాంతా సంగమాన్ని గూర్చి వినటం వల్ల కలుగుతుంది.[57]

విషయం విన్న దేవయాని కుపిత నాయికగా అవతరించింది. పాద సంవాహనం వల్ల కూడ ఆమె శాంతించలేదని మూల భాగవతం. కానీ పోతన గారి యయాతి కాంతా కోప నివారణ కోసం ఉత్తమనాయకు డనుసరించదగిన ఉపాయషట్కాన్ని[58] ఆశ్ర యించాడు. అందులో ముందుగా సామమార్గాన్ని అవలంబించాడు.

ఆ. మామకేల జెప్ప మాను సరోజాక్షి
దనుజ తనుజ బొంది తప్పువడితి

---

56 శృంగార ప్రకాశము, పుట 283

57 భావ ప్రకాశనము. పుట. 185

58 శ్లో॥ యథోత్తరో గురుః షడ్భిరుపాయై స్తదుపాచరేత్
సామ్నాదానేన భేదేన సత్కా ... ॥ భావప్రకాశనము, పుట. 185

గామియైన నన్ను గరుణింపు పతిమాట
తండ్రి మాట కంటె దగును నీకు. 9-543

అని పల్కాడు. అయినా మాటలతో పాటుకు రానందున చివరకు పాద ప్రణామం చేసినట్లు పోతన కల్పన (9-544). పాద ప్రణామానికే 'నతి' అని నామాంతరం. ఇది కుపిత నాయికా వశీకరణకు అత్యంత శక్తిమంతమైన అంతిమ బాణం. పాద ప్రణామంతో పాటుకు రాని ప్రమద లుండరు. అయినా దేవయాని మాత్రం అందుకు అపవాదంగా నిలిచింది.

## గోపికా విరహం

తనను గోపికలు నిరంతరం ధ్యానించటానికే వారిని ఎడబాసి శ్రీకృష్ణుడు మధురానగరం చేరాడు. వియోగం శృంగారభావ సంవర్ధక దివ్యౌషధమని శ్రీకృష్ణుడి భావం (10-1471). 'శృంగార రససాధనమున భగవంతుని చేరుకొనుటకు దారితీసిన గౌరవము సృష్టిలో మొట్టమొదట గోపికలదే. లౌకికమైన దర్శన స్పర్శనముల వలన ఎట్టి అనుభూతి కలుగునో అట్టి మధుర పారవశ్యము నిత్యధ్యానములో వారికి కలుగునని కృష్ణ సందేశము[59]. ప్రియుని గూర్చిన నిత్య ధ్యానం వియోగం వల్ల కలుగుతుంది. వియోగాగ్నివల్ల వలపు బంగారం తప్తమై సింగారమై ఇను మిక్కిలిగా మెఱిసిపోతుంది.

గోపికల పునఃసందేశం 'సందేశ కావ్యం' వంటిది. ఉద్ధవుడితో గోపికలుతమ విరహవేదనను వెళ్లబోసుకోవటం గత స్మృతులను నెమరు వేసుకోవటం కృష్ణునితోడి రతిక్రీడా విశేషాలను ఉద్ధవుడితో ప్రస్తావించటం అన్నీ పోతన్న రమ్య భావనా జన్యాలే. ఇది ఔచిత్యమా? కాదా? అన్నది గోపికల మనస్థితినీ ప్రవృత్తినీ వారి అమాయికతను ఉద్ధవుడి మీద వారికున్న నమ్మకాన్నీ పరిగణించి నిర్ణయించాలి. ప్రియుడి హృదయంలో కలకాలం కాపురముండాలన్నదే వారి ఆకాంక్ష (10-1476). మగని మన్నన పొందగల మగువకే గదా మనసున మల్లెలు విరిసేది. తమ విభుని ప్రవాసాన్ని భరించ లేమని వారి సందేశ సారాంశం.

సీ ॥ తనుబాసి యొక్కింత తడవైన నిటమీద
నేలపై మేనులు నిలువ వనుము
నేలపై మేనులు నిలువక యటమున్న
ధైర్యంబు లొక్కట దలగు ననుము
ధైర్యంబు లొక్కట దలగిన పిమ్మట
జిత్తంబు లిక్కడ జిక్క వనుము
చిత్తంబు లిక్కడ జిక్కక వచ్చిన
బ్రాణంబు లుండక పాయు నసుము

59 ఆంధ్ర భాగవత విమర్శనము, పుట. 258

తే ॥ ప్రాణములు పోవ మఱివచ్చి ప్రాణవిభుడు
ప్రాణిరక్షకుడగు తన్ను బ్రాణులెల్ల
జేరి దూరంగ మఱి యేమి సేయువాడు ?
వేగ విన్నప మొనరింపవే మహాత్మ ! 10-1478

శ్రీకృష్ణుడితోడి శృంగారానుభవాన్ని పొందిన గోపకాంతల వియోగ వేదనల్ని వర్ణించిన ఘట్టం ఇదొక్కటే ! ఆ సందర్భంలో పోతన రచనలో అమూలకమైన శృంగార భావ పరమావధి పొందిన ఆ గోపికల విప్రలంభం తీవ్రతరమైంది. ఆ తీవ్రత దూత ముఖంగా సందేశాత్మకంగా ఉన్ముఖమయింది. సందేశమంటే 'సందేశః స్యాత్స్వ వార్తాభి ప్రేషణం విషయాంతరే'[60]. వియోగినీ జన సామాన్యమైన ఈ వాగారంభానుభావ పోషణంతో వారి విప్రలంభం పరిపుష్టమయింది.

శ్లో ॥ గత్యా లలితయోదార హాస లీలావలోకనైః
మాధ్వ్యా గిరా హృతధియః కథం తం విస్మరామహే 10-47-51

అనే మూల శ్లోకంలోని విరహబాధ ప్రలాప రూపం, కాగా అనువాదంలో స్మృతి పూర్వకమైన వియోగ విలాపమై వ్యాఖ్యాన సదృశమయింది.

సీ ॥ విభుడు మా వ్రేపల్లె వీథుల నేతేర
జూతుమే యొకనాడు చూడ్కులలర
ప్రభుడు మాతో నర్మ భాషలు భాషింప
విందుమే యొకనాడు వీనులలర
తనువులు పులకింప దయితుండు డాసిన
కలుగునే యొకనాడు గౌగిలింప
బ్రాణేశు మమ్మేల బాసితివని దూర
దొరకునే యొకనాడు తొట్రుపడగ

తే ॥ వచ్చునే హరి మేమున్న వనము జూడ
దలచునే భర్త మాతోడి తగులు తెఱగు
తెచ్చునే విధి మన్నాథు దిట్టువడక
యొఱుగ బలుకు మహాత్మ ! నీ కెఱుగవచ్చు. 10-1480

ప్రాణాలన్నీ వాసుదేవుని మీదనే పెట్టుకొని ఎదురు చూస్తున్న గోపికల పంచేంద్రియ పర్వం గమనార్హం. శ్రీకృష్ణుని పునర్దర్శన కాంక్షలోని వారి విరహతీవ్రతలే వియోగ శృంగారరస పరమపద సోపానాలు.

---

60 భావప్రకాశము, పుట. 26

# భ్రమర గీతలు

శ్రీకృష్ణుని మధురానగర వాసంవల్ల గోపికలకు ప్రవాస విప్రలంభం సిద్ధించింది. ఉద్ధవుని సందేశంలో అది అధికమయింది. కృష్ణుడు మధురాంగనాసక్తుడైనాడనే భావం వారిలోని మానవిప్రలంభానికి కారణమైంది. అప్పు డక్కడ పరిభ్రమిస్తున్న భ్రమరాన్ని వారు హరి పంపిన దూతగా భావించి అన్యాపదేశంగా ప్రసంగించారు. వారి సంబోధన భ్రమరాన్ని ఉద్దేశించింది. కానీ వారి ఉపాలంభం కృష్ణుణ్ణే ఉద్దేశించింది. కృష్ణుడు తమకు దక్కడేమో అన్నదే వారి ఈ ఆత్మ నిర్వేదానికి కారణం. వారి హృదయాలలో విరహతప్తమై పొగలు సెగలు గ్రక్కుతున్న శృంగారరస సాగరముంది. అది ప్రేమానురాగ సాగరం. వారి మాటల్లో ఈర్ష్యాకృత మానం (10-1456, 1463) భోగాంక జన్యమైన ఈర్ష్యాకృత మానం (10-1454) ఇంకా ఇతర మానవిప్రలంభ భేదాలనేకం ఉన్నాయి. వ్యంగ్యోక్తులు సరసోక్తులతోడి వారి సంభాషణ మూలానుసారంగానే ఉన్నా పోతన స్వతంత్ర రీతులు అతని ఆత్మీయతా ముద్రలూ అనేకం. వాటిలో 'బంధుల బిడ్డలం' (10-1462) గాదని వచ్చిన వారి వియోగ శృంగార రస సింధువు లనంతం.

సీ॥ కాంచన రత్నసంఘటిత సౌధంబులే
 మా కుటీరంబులు మాధవునకు
వివిధ నరేంద్ర సేవిత రాజధానియే
 మాపల్లె యదువంశ మండనునకు
సురభిపాదప లతాశోభి తారామమే
 మా యరణ్యము సింహ మధ్యమునకు
గమనీయ లక్షణ గజ తురంగంబులే
 మా ధేనువులు కంస మర్దనునకు

తే॥ రూప విభ్రమ నైపుణ రూఢలైన
మగువలమె మేము మన్మథ మన్మథునకు
నేల చింతించు మము గృష్ణుడేల తలచు
బృథివి నధిపులు నూతన ప్రియులు గారె ! 10-1463

ఇది వారి ఈర్ష్యామానానికి పరాకాష్ఠదశ. రాజుల నూతన ప్రియత్వం శృంగార శృంగారుని ఆకర్షణలు పల్లీపట్టణ తారతమ్యం వ్రేతల బేలతనం పురకాంతల విభ్రమాలతో గూడిన వారి విరహభావం గ్రామీణ స్త్రీ మనస్తత్వాన్ని పట్టి ఇస్తాయి

భ్రమర గీతలలో ప్రవాస విరహిణీ సహజాలైన సరస సల్లాప సందేశాది వివిధ వాగారంభాను భావాలు మనోజ్ఞ చిత్రణాలు. అందులోని గోపికలు శృంగార నాయికలుగా, ఆ భృంగం శృంగార మిత్రుడుగా దూతగా దర్శనీయం. ఇలా గీతలలోని ప్రతి పద్యం ఒక రస గుళిక కాగా ఈ ఘట్టం మొత్తం సర్వసత్త్వాత్మకమైన సరస శృంగార కావ్యంగా రూపొందింది.

గోపికా విరహంలో మూలభావ సంబంధులు మూడు కాగా సొంత భావాలు మూడు. మూల భాగవతంలో విశ్వావస్థాపితాలైన రత్యాది భావార్థాల్ని విశేషంగా భావించకుండా ముఖంగా మాత్రమే ప్రతీతి కలిగింది. అనువాదంలో రసాత్మతను పొందు గలవై విభావాదుల ద్వారా గాఢ విప్రలంభం ప్రతీయమాన మయింది. కనుక విభావాను భావాలకు సమాన ప్రతిపత్తి కలిగింది అనువాదంలో. ఆ రెండు భావాలలోనూ అనుభావాలు వ్యంజితమైనాయి.

సప్రాణేశలైన నిలింపాంగనలు మోహపారవశ్య లైనారు. అప్పుడు వారి నీవీ బంధాలు వీడిపోవటం (10-1125) కామేంగితం[61]. గో మృగ కేకి లోకం మురిసింది (10-1126,1127). ఇది అంతా శృంగారోత్కర్ష దాయకమైన లలితాది విభావజన్య ఫలితం. కంజాక్షుని సంభోగం కోరే కంజాక్షుల దినా వియోగంలోని ఔత్సుక్యం దైన్యం అనన్యం. ఇందులోని ఒక్క గోపికా భాసం గమనార్హం.

ఉ॥ ఎప్పుడు ప్రొద్దు గ్రుంకు? హరి యెప్పుడు గోవుల మేపి తెచ్చు? మా
కెప్పుడు తన్ముఖాంబుజ సమీక్షణ మబ్బు? నతండు వచ్చి న
న్నెప్పుడు గారవించు? దుది యెప్పుడు మద్విరహాగ్ని రాశికిన్?
చెప్పగదమ్మ! బోటి ! మరుసేతల నుల్లము దల్లడిల్లెడిన్. 10-1129

వారి ఉద్దీపనభావ నిరసనంలోనూ నిరంతరం కాలాన్ని నిశిగా కల్పించని ఆ విధిని దూషించటంలోనూ శృంగార రస స్ఫూర్తి ఉంది (10-1128). విరహిణీ మనోజన్యమైన మనోహర భావంతో విరహకాల గమన స్వరూప స్వభావాన్ని నిర్వచించారు (10-1130). విభ్రాంతలైన వారి వియోగాన్ని ప్రకృతి సంకేతాలతో సంభోగ సూచకంగా (1132, 1133) ఇలా పరిణమింప చేసిన శృంగార రసజ్ఞ శేఖరుడు పోతనార్యుడు.

శ్రీకృష్ణుడు అక్రూరుడితో మధురానగర యాత్రకు సిద్ధమౌతున్న విషయాన్ని ... గోపికల విరహం ప్రవాస సంబంధమైనది. దానిని వారు దైవకృతమైనదిగానూ మానవకృత మయిందిగానూ భావించారు. దైవిక విరహంలో కార్శ్య సంతాప దేవతార్చ జాగం వైవర్ణ్య అంగదాహ ప్రలాప బాష్పోదయాల వంటివి కలుగుతాయి.

గోపాలుణ్ణి తమకు దూరం చేయటం మేటి గృహస్థుడైన బ్రహ్మకు తగినపని కాదని గోపికలు వాకొన్నారు. మగువల బాధలు మగువలకే గాని మగల తలకెక్కక పోవచ్చును కదా ! అందుకే 'ఈ సుఖము లక్కట భారతికైన చెప్పరే' (10-1211) అని వశీకృత భర్తృక

---

61 ... ప్రస్ఫుర వీక్షణె విచలతః కూపోదకే మత్స్యవత్
పష్మోత్ఫుల్ల కుసుమాంచితో విగళతి ప్రాప్తే ఒపి బంధం పునః ।
ప్రచ్ఛన్నో ... ప్రకటతాం శ్రోణీతటం దృశ్యతే
నీవిచ స్ఖలితా స్థితా ... సుదృఢం కామేంగితాం యోషితామ్

అయిన భారతీ ముఖంగా కార్యసాధనకు సమకట్టారు. ఈ 'సిఫారసు' తో పోతన చూపిన శృంగార రసతంత్రం రాణించింది. ఆ గోపాలుడి అనాదరం గోపవృద్ధుల బుద్ధిలేమి వారి ముమ్మరమైన తాపానికి హేతువులైనాయి (10-1213). తర్వాత వారి దృష్టి అక్రూరుణ్ణి చేరింది. ఆ శబ్దపు విరుపు అందులోని శ్లేష చమత్కారం వారి ఎత్తిపొడుపులు విరహిణీ జనోచిత చిత్రణం. పేరు అక్రూరుడైనా చేసింది క్రూరం కనుక వారి కాతడు క్రూరుడే (10-1214).

పురసుందరులే వారి విరహ దుఃఖానికి మూలకారిణులనే అమూలక భావం స్త్రీజనోచితం.

ఉ॥ పుల్ల సరోజలోచనలు పూర్ణ సుధాంశుముఖుల్ పురాంగనల్
మెల్లనె యెల్లి పట్టణము మేడలనుండి సువర్ణలాజముల్
చల్లగ వారి జూచి హరి సంగతి సేయదలంచు గాక వ్రే
పల్లె వసించు ముద్దియలపై బడ నేల దలంచు నక్కటా ! 10-1215

వీరి ఈ మాటలలోని పురసుందరీగతమైన ఈర్ష్య వారి ప్రవాస విరహభావ భారాన్ని అధికం చేసింది. తమ ప్రియుడు తమకే సొంతం కావాలన్నది నారీజన సహజమైన తపన. అపై అది సాంఘికధర్మం కదా!

దైవచర్యకు వారు బాధ పడ్డారు. తమకూ పురాంగనలకూ గల వ్యత్యాసాన్ని తలచుకొని చింతించారు. కన్నవలనీరు వర్షించారు. సుజాతాలైన గీతాలతో విలపించారు (10-1219). అతని యాత్రానిరోధానికి అక్రూరుణ్ణే వేల్పుల్నీ ప్రార్థించాలనీ కానుకలు అర్పించాలనీ పరిపరి విధాల పరిదేవించారు. ఆ సన్నివేశంలో 'కొప్పులు జారెలున్ మరచి కందర్పజ్వరభ్రాంతలై'న (10-1218) వారి దైనం 'జ్యేష్ఠ' నాయికా సహజం.

విరహమగ్నలైన గోపికల చూపులు శ్రీహరి రథగమనాన్ని వెంబడించాయి. అప్పటి వారి చిత్తస్థితి విషయంలో మూలానువాదాల భేదాలు పోటీ పడినట్లు గోచరిస్తుంది.

శ్లో ॥ యావ దాలక్ష్యతే కేతుర్యావద్రేణు రథస్యచ
అనుప్రస్థాపి తాత్మానో లేఖ్యానీవోపలక్షితాః 10-39-36

అనే వ్యాసుని భావాన్ని పోతన గారు రమణీయం చేశారు.

చ॥ అదె చనుచున్నవాడు ప్రియు డల్లదె తేరదె వైజయంతి య
ల్లదె రథ ఘోట కాంఘ్రి రజ మాదెస మార్గము జాడు డంచు లో
నాదవెడి మక్కువన్ హరిరథోన్ముఖ లై గములై వ్రజాంగనల్
కదలక నిల్చి చూచిరట కన్నుల కల్గిన యంత దూరమున్. 10-1221

ఇది వారి చిత్త జాత స్థితికి క్రమారోహణం. కన్నుల పంటగా పద్మాక్షుని దర్శిస్తున్న వారి పారవశ్యం అది. ప్రవాస విరహంలో నాయకుని మార్గ దిశా విలోకనం సహజం. వారి వర్తమాన విరహాని కిది స్వచ్ఛదర్పణం.

గోపాలు డంతర్ధానం కావడంతో గోపికలకు కలిగింది ఆకస్మిక విరహం. సహజంగా ఈ అవస్థలో హృత్కంప మూర్ఛ సంజ్ఞ కలిగి మరల భ్రమ స్మృతులు కలుగుతాయి. ప్రియాన్వేషణచింత కలుగుతుంది. అతని మార్గ దిశావిలోకనం ఉంటుంది.[62]

ఈ సందర్భంలో శ్రీకృష్ణ గుణావేశంతో ప్రపంచాన్నే మరచి బృందావనంలో విహరించే గోపికా విరహాన్ని పోతన్న శృంగార శృంగాటకం చేశాడు. చేతనా చేతన జ్ఞానాన్ని కోల్పోయిన ఉన్మాదాత్మక మయిన శృంగారావస్థ వారిది. కృష్ణాన్వేషణంలో 'పున్నాగ కానవే పున్నాగ వందితు' (10-1008) అంటూ వృక్షాలను సైతం అర్థించారు. 'కామార్తాహిప్రకృతి కృపణాః చేతనా చేతనేషు' అని కదా కాళిదాసోక్తి. గోపికలు సంప్రశ్నించిన ఆ వృక్ష జాతులపేర్లన్నీ కృష్ణ సౌందర్య బోధకాలే. వాటిలోనే అతని సౌందర్య మూర్తి కూడ గోచరించి కావ్యం సౌందర్య సంశోభితం అయింది.

'శిఖి పింఛ జూటు తెచ్చి కరుణ జూపరమ్మ' (10-1013) అంటూ పుష్పలతా వితానాలకు కర్తవ్యబోధాత్మకమైన అభ్యర్థన చేయటం విరహ తీవ్రతా సూచకం. నిరింద్రియాలకు ఇక్కడ చేతన ధర్మాలను ఆరోపించారు. ప్రియా విప్రలంభం విభావం, అసంబద్ధ ప్రలాపం అను భావం, అయిన ఉన్మాద శృంగారావస్థ వారిది. 'రామానుజో మానినీనామితో దర్పహరస్మితః' (10-30-6) అనే వాక్యాన్నీ 'మాలత్యదర్శివః కచ్చిన్మల్లికే జాతియూథికే' (10-30-8) అనే వాక్యం లోని మల్లికా శబ్దాన్నీ స్వీకరించి చేసిన కల్పనం అనన్య సాధ్యం.

వ్యాస భాగవతంలో ఈ పట్టున విభావముఖంగా మాత్రమే విప్రలంభం ప్రతీయమానం కాగా పోతన భాగవతంలో వ్యభిచారీ భావముఖంగాకూడ రసప్రతీతి కలిగి ఉండటం పోతన శృంగార రసదృష్టి ఫలితమే. అందు కుదాహరింపదగిన ఈ క్రింది పద్యం ఆంధ్రలోకంలో ఆబాల గోపాలాన్నీ రసముగ్ధుల్ని కావించేది.

ఉ॥ నల్లని వాడు పద్మనయనంబుల వాడు కృపారసంబు పై
జల్లెడు వాడు మౌళి పరిసర్పిత పింఛము వాడు నవ్వు రా
జిల్లెడు మోము వాడొకడు చెల్వల మానధనంబు దెచ్చె నో
మల్లియలార! మీ పొదల మాటున లేడు గదమ్మ చెప్పరే ! 10-1010

ఇది వ్రజ కామినుల హృదయ రాముని బహిరంత స్సౌందర్యానికి మహాద్భుతమైన రసమయ మూర్తి చిత్రణం. గోపికల ప్రబోధ క్రమంలో ఇది పోతన కావించిన ప్రాణ భూతమైన స్వతంత్ర భావన. ఇందులో శ్రీకృష్ణుని తనూదర్శన స్పర్శనాల కోసం వారి తహ తహ విదితమే.

ఈ ఘట్టంలో మూలంలోని (10-30-30,32, 33) మూడు శ్లోకాలను మూడు సీస పద్యపాదాలలో రమ్యంగా సంక్షిప్తీకరించాడు. మిగిలిన పద్యభాగాన్ని తన కామశాస్త్ర

---

62 శ్లో॥ అకస్మికేతు హృత్కంపో మూర్ఛా సంజ్ఞా భ్రమః స్మృతిః ॥
తదన్వేషణ చింతా చ తత్పథాశావిలోకనం । భావప్రకాశనము, పుట. 307

పాండిత్యంతో రసవిలసితం చేశాడు. అందులో సతినెత్తుకోవటం ప్రియురాలి పుష్పాలు పెట్టటం ఇంతికి కెమ్మోవి నీయటం జలకేళి సల్లాపం నఖకేళి దర్పణం వంటి గోపికా ఊహలు (10-1026) పోతన హృదయగతమైన శృంగార రసాబ్ధి తరంగాలు.

శ్రీకృష్ణ చరణ సంకేతాలను ప్రణయ రహస్యాలుగా శృంగార మంత్రాల మంగళ సంకేతాలుగా సంభావించారు గోపికలు.

సీ ॥ ఒక యెలనాగ చెయ్యూది నా డిక్కడ
సరస నున్నవి నాల్గు చరణములును
నొక నీలవేణితో నొదిగి నా డిక్కడ
మగజాడలో నిదె మగువ జాడ
యొక లేమ మ్రొక్కిన నొడిసినా డిక్కడ
రమణి మ్రొక్కిన చొప్పు రమ్యమయ్యె
నొక యింతి నెదురుగా నొలసినా డిక్కడ
నన్యోన్య ముఖములై యంఘ్రులొప్పె
ఆ ॥ నొకతె వెంటదగుల నుండక యేగినా
డడుగు మీద తరుణి యడుగు లమరె
నబల లిరు కెలంకు లందు రా దిరిగినా
డాఱు పదము లున్నవమ్మ! యిచట. 10-1028

అంటూ సాగిన పదముద్రలను గూర్చిన ఊహాక్రమం దక్షిణ నాయకుడైన శ్రీకృష్ణుని చిత్రరత వైశారద్యద్యోతకం.

శ్రీకృష్ణుని కామకళా విలాసాన్ని సంస్మరిస్తూ సాగించిన గోపికా సంచారం గమనించ దగ్గది. ఇది గోపికల ప్రలాప స్వరూపానుభావ భరితమైన మన్మథావస్థ.

సీ ॥ ఈ పొదరింటిలో నిందాక గృష్ణుండు
నాతోడ మన్మథ నటనచూపె
నీ యెల్ల మగుచేట నిందాక జెలువుండు
గాఢంబుగా నన్ను గౌగిలించె
నీ మహీజము నీడ నిందాక సుభగుండు
చిట్టంటు సేతల సిగ్గు గొనియె
నీ పుష్పలత పొంత నిందాక దయితుండు
నను డాసి యధరపానంబు సేసె
ఆ ॥ నీ ప్రసూనవేది నిందాక రమణుండు
కుసుమ దామములను గొప్పుదీర్చె
ననుచు గొంద రతివ లంభోజ నయనుని
పూర్వ లీల దలచి పొగడి రధిప ! 10-1032

గోపికలకు పైన చెప్పిన శృంగార విహారప్రదేశ సందర్శనం వల్ల వారి శృంగార లీలల, చిట్టింటు చేతల, శృంగార కళల, సంబంధమైన గత స్మృతి కలిగి హర్షోదయ మయింది.

గోపికా గీతలలో కొనమెరుపులతో కామదేవుని క్రౌర్యం నిరూపితం చేశాడు పోతన. పుష్పశరుని బారినుండి రక్షించమనీ తమపట్ల ఉదాసీన వైఖరి తగదనీ గోపికలు పల్కారు. పెద్ద పెద్ద విపత్తుల నుండి రక్షించి కుసుమ శరుని బారిగూర్చదగునే ? అని ప్రశ్నించటం గోపికల విజ్ఞతకు నిదర్శనం. ఈ సందర్భంలో వారి మన్మథ బాధాతీవ్రతను సూచించటానికి పోతనగారు 'కృన్ధిహృచ్ఛయం' (10-31-7) అనే సంస్కృత మూలాన్ని 'భావజ పుష్పభల్ల భవ బాధ హరింపు వరింపు మాధవా' (10-1040) అని అనువదించారు. 'మనస్' శబ్దాన్ని 'చన్నుంగవ' అని కళాస్థానాన్ని సూచించి, ప్రవాస సమయంలోని కామబాధ మనస్సంబంధమైన దానికన్న మిన్నగా శారీరక సంబంధమైనదని సూచించాడు. 'పురుషుడు వక్షోవైశాల్యం కలవాడు సుకుమారమైన కాఠిన్యం కలవాడు కనుక ఆమేరకు తాళుకొని కండ్లతోనే కామతంత్రటీక చెబుతాడు. స్త్రీ వక్షఃస్థలం పీనోన్నతమైంది కనుకా మసృణ పేశలం గనుకా ఆ భారానికి ఆగలేదు. దాని నణచటానికి తనకు తన చేతులు చాలవు. తన చేతులు పనికిరావు.కఠిన కోమల మాత్ర వ్యపదేశాలై, తుల్యయోగిత కలవైన పుంస్కరాలు కావాలె. ఇది సకల సంసర్గం లోను నిసర్గం. కాని ఇక్కడ ఉభయథా అతీత వ్యక్తిత్వ స్థాపన కోసం హస్తాల కంటె పాదాలు కాఠిన్యం కలవి'.[63] అందువల్లనే -

మ ॥ అరవిందంబుల కంటె గోమలములై యందంబులై యున్న నీ
చరణంబుల్ కఠినంబులై మొనయు మా చన్నుంగవల్ మోవగా
నెరియం బోలు నటంచు బొక్కుదుము నీ యీ కర్కశారణ్య భూ
పరిసంచారము కృష్ణ! నీ ప్రియలకున్ బ్రాణవ్యథం జేయదే. 10-1052

అంటూ గోపికలు పదమర్దన రూపమైన కామతంత్ర విశేషాన్ని కోరుకున్నారు. ఆ గోపికల హృదయతాపం నిసర్గమనోహరం. వారు సర్వాత్మనా సర్వేంద్రియ సంతర్పణాన్ని కోరుకున్నారు సదా. అందుకనే వారి ప్రార్థనలలో అష్టవిధ రతిభేదచ్ఛాయలు గోచరిస్తాయి. ఇలా గోపికా విరహ గీతలు అపాత శృంగార మధురస పచేళిమ ఫలాలు. అవి వారి ప్రవాస వియోగ ఔత్కట్య నిరూపక నిపుణాలు.

గీతలలో నిరూపించిన భావాలు చాల వరకు వ్యాసఋషి ప్రోక్తాలే అయినా ఆస్వాదనంలో శైలీ అవరోధాలధికం. కానీ పోతనగారి తెలుగు వెలుగుల తీరుతీయాలే వేరు. అవి గోస్తనీసదృశాలు అతిమానస చేతనోద్భవాలు. కనుకనే శృంగార రసం ఇందులో రాజ్యమేలింది. రాణకెక్కింది.

---

63 శృంగారం - పోతన. పుట. 216

# త్రివిధ శృంగారం

శృంగార రసనిష్పత్తికి హేతుభూతంగాను సంభోగ శృంగార ఫలపర్యవసన్నంగాను పరిగణించి, వాచిక నైపథ్య క్రియా భేదాలతో శృంగారాన్ని త్రిధా విభజించారు ఆలంకారికులు. వీటిని ప్రాణభూతమైనవిగా భావించి వేర్వేరుగా నిరూపించి నిర్వచించాడు శారదాతనయుడు. ఈ శృంగార భేదత్రయాన్ని భాగవతంలో వ్యష్టిగాను సమష్టిగాను సందర్శించవచ్చు.

శ్రీకృష్ణుడు అరూఢయౌవను డౌతున్న కొద్దీ అతడి చేతలలో మాటలలో శృంగార చేతస్కత స్పష్టమయింది. దానికోసం గోపికల మానసాలు అఱ్ఱులు సాచాయి. వారికి మోహం పెరిగింది. శృంగార భావ సంవేదన సంచలించింది. కనుకనే అతని మాటలకు చేతలకు వారికి బులిబులి కోపమే కలిగింది. అది ప్రణయ కోపమే. కనుకనే వారి సంభాషణలోని ప్రతిమాటా ప్రణయమంత్రమయింది. ప్రతి చర్యా శృంగారతంత్రంగా రాణించింది. సహృదయులకది శృంగార చందన చర్చగా పరిణమించి గుండెలోతుల్లోని తమ శృంగారానుభూతుల్ని వెలికి లాగి తన్మయీ భావంతో తపింప చేస్తుంది.

# వాచిక శృంగారం

వాచిక శృంగారం భావగర్భ మయింది. రహః సంవిన్మధురం - ప్రేయసీ ప్రియులు రహస్యంగా హృదయాలలో దాచి ఉంచిన భావ సంవేదనాన్ని ఈ సమయంలో స్పష్టం చేస్తారు. కనుక అట్టి సంవేదనం ఇందులో మధురంగా ఉంటుంది. అది నర్మపేశలం. నర్మశృంగారాత్మకమైన కర్మ. దానిచే నిది మనోహరం. మంచి వృత్తాలతో ఉంటుంది. కావ్యంలో శృంగార సూచకాలైవ శ్లోకాలు, పద్యాలు, శృంగారోచితమైన వృత్తాలతో ఉంటుంది. ఇంకా వినటానికి ఇంపుగా ఉంటుంది. వాచిక శృంగార స్వభావం రీతి ఇది[1] అని శారదా

[1] భావగర్భం రహః సంవిన్మధురం నర్మ పేశలం
సువృత్తం శ్రవణానంది శృంగార శ్శృంగారో వాచికో మతః ॥ — భావప్రకాశనము, పుట. 143

తనయుడి నిర్వచనానికి జమ్ములమడక మాధవరామ శర్మగారు చేసిన వ్యాఖ్య. ఏవం విధ వాచిక శృంగారాన్నే కాక మరికొన్ని రీతుల్ని కూడ భాగవత గతంగా తిలకించవచ్చు.

గోపికావస్త్రాపహరణ ఘట్టంలో వాచిక శృంగారం ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. ఆరంభం నుండి గోపికల హృదయ సంవేదనంలోని ముఖ్యాంశం శ్రీకృష్ణుడు తమకు చేతోవిభుడు కావాలన్నదే. అందుకు కాత్యాయనీ దేవికి 'నేతి వసంతా' లాడటానికి వారు మ్రొక్కుకున్నదే ప్రబల నిదర్శనం. అది వారి గాఢవాంఛకు శృంగారాత్మకు సంకేతం. హృద్గత భావం ఎప్పుడూ వాచిక కాయికాల ద్వారా వెల్లడౌతుంది కదా! ఈ ఘట్టంలో ప్రథమానురాగ సమయంలో కొంటెకోణంగుల కుండే వాచిక శృంగారం అంటే శృంగారాత్మక నర్మసంభాషణంలో మాటామాటా కలిపి మనసు దోచుకొనే మర్మజ్ఞత గోచరిస్తుంది. దానికి తోడు గోపికలు కూడ అంతరాలలో ఆతడినే కామించటం దోహదమైంది, సమయమూ కలసి వచ్చింది. అందరి హృదయాంతరాళాలలోని భావనా ఒక్కటే కనుక, మనసులోని భావం మధుర మోహనంగా పరస్పరం ప్రకటించుకోవటమే తరువాయి. వస్త్ర చౌర్యం చేసిన శ్రీకృష్ణుడి తోడి గోపికల అభ్యర్థనం వారి శృంగార సంవేదనకు చక్కని మణిదర్పణం.

కం॥ మా మా వలువలు ముట్టకు
మామా! కొనిపోకు పోకు మన్నింపు తగన్
మా మానమేల కొనియెదు ?
మా మానస హరణమేల ? మానుము కృష్ణా ! 10-818

'తెలుగుదేశంలో మామా బావా వరసలు ఎంతో చొరవా తీపీ కలవిగా ఇప్పటికీ అలాగే ఉన్నై, శృంగారానికి అలంబనమైన విన్నీ'[2]. ఇందులో శృంగారపు సన్నాయి నొక్కులు లెక్కకు మిక్కుటం. మానం మానసహరణం మామా శబ్దాలు సకామ ప్రసంగద్యోతకాలు హృదయాహ్లాదకరాలు. వారి నర్మగర్భశృంగార భావానికి శబ్ద స్వరూపాలు. భావిఫలసిద్ధి సాధనకు జపించిన బీజాక్షర సదృశాలు. ఇలా ఈ కందంలో మాత్రాగణ సదృశంగా శ్రవణ సుభగంగా రచన సాగింది.

గాఢ శృంగార భావన రసోన్ముఖంగా సాగటానికి ఈ మాత్రాగణ బద్ధ సదృశమైన రచనా విధానం దోహదమయింది. శ్రవణ సుభగమయింది. గేయాత్మకమైన ఈ కంద పద్యంలో వస్త్రచౌర్యం వల్ల ఆ గోపికా మానసాల్లో కలిగిన భయాందోళనల కన్న, వారి హృదయ సరసిలోని శృంగార భావ తరంగ ధ్వానాలు మిన్నగా సుమధురంగా స్ఫురిస్తాయి. అవి పఠితల మనసులను కరిగించి మైమరపిస్తాయి. ఇది పోతన్న గారి శృంగార రస పరిపోషక శిల్ప భంగిమల్లో ఒకటి.

---

2 పోతన - శృంగారం, పుట. 200

శ్రీకృష్ణుడి చిలిపి చేతలకు ప్రతిస్పందించిన గోపికల మనోగతభావార్థ ద్యోతకాలైన మాటలు వాచికశృంగారరస సూచికలు, కామ ప్రసూన సౌరభవీచికలు.

కం॥ కొంటివి మా హృదయంబులు
కొంటివి మా మనము లజ్జ గొంటివి వలువల్
గొంటి వికనెట్లు చేసెదొ ?
కొంటెవు గద! నిన్ను వెఱిగి కొంటిమి కృష్ణా ! 10-820

పైపద్య భావంతో శ్రీకృష్ణుడు గోపికా హృదయాపహారి అని తేలింది. కనుకనే ఏ రీతిగా ఏ ఏ శృంగార లీలా విహారాల విహరింప చేస్తాడో అని వారి ఎదురుతెన్నులు. కొంటె కొంటెతనం వంటి పదాలకు శృంగార సంకేతాలుగా ప్రచారం ఉంది. ఏతదర్థంలో ఆతడు శృంగారి అనే వారి ఉద్దేశం. శృంగారికి ఈ వర్ణనం ఉచితమే అని భావం. ఆతని హృదయ మాధుర్యం తమ హృదయాలకు హత్తుకున్నదని నర్మగర్భమైన భావం. ఇది వారి భావార్థాన్ని పట్టించగల వాచిక శృంగారం. స్త్రీ జనోచితమైన లజ్జాభావం ఆవరించటం వల్ల గోపికలు వ్యంజనా పద్ధతిని ఆశ్రయించారు. వారి మాటల్లోని వ్యంజనా శక్తి వాచిక శృంగారానికి పుష్టి నిచ్చింది.

ఇలా వారి ప్రసంగంలోని వ్యంగ్య స్ఫూర్తి వ్యాజనిందా అన్నీ వారి హృదయాలలో దాగి ఉన్న శృంగార భావ సంవేదనా వ్యక్తీకరణ సాధనాలే. అలాగే వారి సంబోధనలు కూడ శృంగార సంబంధులే. వారి సంభాషణలో శ్రీకృష్ణుడితో 'నీవెఱుగని దేమున్నది' అనటం వల్ల వారిద్దరి మధ్య హృత్సంబంధమైన దాపరికం లేదని నివేదించుకున్నారు. చివరకు -

కం॥ వచ్చెదము నీవు పిల్చిన
నిచ్చెద మేమైన గాని యిటు చొరు మనినం
జొచ్చెదము నేడు వస్త్రము
లిచ్చి మముం గరుణతోడ నేలుము కృష్ణా ! 10-828

అనే వారి మాటల్లో వారి ఇంగితాకార వేదన ఉంది. అందులో శృంగారం లాస్యం చేస్తున్నది. ఇలా వారి బ్రతిమిలాటలు భంగపాటులు అన్నీ వారి వాచికశృంగార సూచికలే. ఆ సందర్భంలో పోతన శృంగారాత్మ గోపికల గుండెల్లో గుదుసుళ్ళు తిరుగుతున్న భావాలకు ప్రతిరూపం.

శ్రీకృష్ణుడి ప్రతిమాటా ఇక్కడ పరికింపదగ్గదే. 'ఏ తరుణుడు మగడొటకు / మీ తపములు చెప్పుడింక' (10-830), 'శృంగారవతులార! 'నేను జూడని మర్మమెద్ది''(10-839) 'లక్షణవతులార! లక్షించి చెప్పరు గాని మీ మర్మముల్ గానబడియె' (10-846) వంటి పలుకులన్నీ మన్మథుడి వాడి ములుకులు. ఆ మాటలు సహృదయ హృదయాకర్షక మంత్రాలు. అవి వారి అంతర శృంగార తత్త్వరత్నాల్ని వెలికి తీసే ప్రణయ పద సాధనాలు. ఆ ఉద్దీప్తులు వారికి విస్రంభణం కల్గించటానికి ప్రయోగించిన వాచిక

శృంగారాస్త్రాలు. తత్ఫలితంగానే వారి హృదయారవిందాలలో కందర్పుడు నందడించాడు. 'మర్మ' శబ్ద ప్రయోగంతో గోపికల లజ్జారజ్జువును ఛేదించటం శ్రీకృష్ణుని వాచిక శృంగారజ్ఞత. అలాగే గోపికల్ని వివస్త్రలుగా రమ్మనటానికి బదులుగా భంగ్యంతరంగా చేతులెత్తి మ్రొక్కి చేరి చీరలు తీసుకొమ్మనటం అతని వాచిక శృంగారవైభవం. కాగా వారు అతని మాటల మధురిమకు మేనులు మరచి 'ఫాలతట న్యస్తకరాబ్జ' లై సరసరీతిని నమస్కరించారు. ఆపై గోపికలు రసాభిముఖలై వర్తించారు.

ఇలా ఈ ఘట్టంలో వాచిక శృంగారం ప్రధానంగా ప్రథమానురాగ సంబంధిగా పరిఢవిల్లింది.

# ఆంగిక శృంగారం

ఆంగిక శృంగారానికే నైపథ్య శృంగారమని ఆలంకారిక వ్యవహారం. ఆంగిక శృంగారం ఈ విధంగా ఉంటుంది. మంచి వస్త్రం అంగరాగం ఆభరణాలు పుష్పమాలలు మొదలైన వాటితో అలంకృతమై యౌవన సంపదతో ఉన్న దేహం ఆంగిక శృంగార యుతమని భావించ బడింది.[3]

ప్రేమ జంటల వలపుల తొలకరిలో వారి హృదయాలు పరస్పరం లోగొనటానికీ వారికి ఉద్దీపన కల్గించటానికీ ఆకర్ష సాధకంగా ఆంగిక శృంగారం ప్రథమ స్థానం ఆక్రమిస్తుంది. అది వారి తాహతును బట్టీ అభిరుచిని బట్టీ ఆశయాన్ని బట్టీ మారుతుంది. అభూషణత్వం కూడ ఒక్కొకసారి రమ్యంగా ఉంటుంది. అదే అక్కడి ఆంగిక శృంగారం. దాన్నే ఆలంకారికులు 'రూప'మని వాకొన్నారు. కళాపూర్ణోదయంలోని సుగాత్రి నిరలంకారంగా నాయకునికి ప్రరోచన కల్గించిన సంగతి విదితమే. వేశ్యలు కార్యసాధన కోసం చేసే వారి ఆంగికం ఆహార్యం ప్రత్యేకంగా ఉంటై. ఋష్యశృంగుని కోసం వచ్చిన వేశ్యల ఆంగికాన్ని గమనించి అతడు ఆశ్చర్యంతో వారి మరుగున జేరి చివరకు వారిని మరిగాడు. కాబట్టి వేశ్యలది కార్యసాధకమైన ఆంగిక శృంగారం. గృహిణుల ఆంగిక శృంగారం మనోనాథుల్ని మంత్రముగ్ధుల్ని చేసే విధంగా ఉండాలి. ఆ విషయాన్ని పోతన భావించిన రీతి సంభావ్యం.

సీ॥ నిలయము వాటించి నిర్మల దేహయై
శృంగార మేర్పాడ్డు జేయవలయు 7-416

అని 'స్వయంచ మండితా నిత్యం' (7-11-27) అనే మూలభావాన్ని పోతన విస్తరించాడు. దీని వల్ల అతనికి వ్యాసునికన్న అధికంగా ఉన్న శృంగార ప్రీతి గోచరిస్తుంది. ఆపై

---

3 శ్లో॥ వాసోఽంగరాగ భూషాభి ర్మాల్యైర్యుక్తం ప్రసాధితం ।
ప్రాప్త యౌవనమంగం యచ్ఛృంగారః స్యాత్స ఆంగికః ॥ భావ ప్రకాశము,పుట. 143

గృహిణీ శృంగార రచనావశ్యకత తద్ధర్మం విదితమౌతుంది. శుచీ శుభ్రత కలిగి అందంగా అలంకరించుకొని భర్తను అలరించటం గృహిణీ ధర్మంగా గుర్తించాడు.

స్త్రీల అంగిక శృంగారాన్ని గూర్చి వాత్స్యాయనుడు ద్విధా భావించాడు. అందులో ఒకటి ఆగామికం రెండవది వైహారికం. రకరకాల సొమ్ములు పెట్టుకొని పరిమళ ద్రవ్యాలూ అంగరాగాలూ పూసుకొని, దేశకాలాదులను అనుసరించి చీరలు రవికలు ధరించడం. ఇది భర్తను కలియడానికై వేసుకొనే వేషం. ఇదే ఆగామికం[4]. ఇక వైహారిక మంటే ఏదైనా ప్రయాణం చేసేటప్పుడు వేసుకునే వేషం. అలాంటి సమయాల్లో ఒంటిమీద బరువు కాకుండా మరీ పెద్దది కాకుండా ఉండే చీర కట్టుకుని తెల్లటివి లేదా మరోరంగు గలవి అయిన పూలు తలలో పెట్టుకుని వెళ్లాలి[5].

యమునాతీరంలో కాత్యాయనీవ్రతానికి 'కుచద్వయీ భరములన్ మధ్యంబు లల్లాడగా /భ్రమదోద్దామ గజేంద్రయాన' (10-809) లైన నవయౌవనలూ నవవధూ లలామలూ ఇతర నాయికలూ కూడ ఆగామిక నాయికా సంబంధమైన అంగిక శృంగార స్వరూపలే. ఈ కోవలో కుబ్జ కూడ అత్యుత్తమమైనదే. ఆమె 'మాలా మృగనాభిపంక మణిమయ భూషా చేలాలంకృత' (10-1488) 'ఏలాకర్పూర మిళిత హిత మధుర మహాహాలారసపాన మదశ్రీలాలిత'( 10-1489).

శ్రీకృష్ణుడున్న పడకటిల్లు చేరిన రుక్మిణీ స్వరూపం అంగిక శృంగారం. వారి సరససల్లాపాలకు అదే నైపథ్యం.

సీ॥ కుచకుంభముల మీది కుంకుముతో రాయు
హారంబు లరుణంబు లగుచు మెఱయ
గరపల్లవము సాచి కదలింప నంగుళీ
యక కంకణ ప్రభ లావరింప
గదలిన బహురత్న కలిత నూపురముల
గంభీర నినదంబు గడలు కొనగ
గాంచన మణికర్ణికా మయూఖంబులు
గండపాలికలపై గంతు లిడగ
తే॥ గురులు నర్తింప బయ్యెద కొంగు తూల
బోటి చేనున్న చామర బుచ్చు కొనుచు
జీవితేశ్వరు రుక్మిణి చేర నరిగి
వేడ్క లిగురొత్త మెల్లన వీవ దొణగె. 10ఉ. 228

---

4 'బహుభూషణం వివిధ కుసుమానులేపనం వివిధాంగ రాగ సముజ్జ్వలం, నానావర్ణం వాస ఇత్యాభిగామికో వేషః వాత్స్యాయన కామసూత్రాలు, సం.2పుట.77

5 'ప్రతనుశ్లక్ష్ణాల్పదుకూలతా పరిమిత మాభరణం, సుగంధితా నాత్యుల్బణ మాలేపనం తథా శుక్లాన్య న్యాని పుష్పాణితి వైహారికోవేషః అందే - సం.2 - పుట. 77

ఇలాంటి నైపథ్యశృంగారం నాయికా నాయకుల సంభోగ శృంగారానికి సముద్దీప్తి నిస్తుంది. ఈ రుక్మిణీ ఆంగిక శృంగారం మూలభావ[6] విస్తరణమే. అయినా అది పోతన శృంగారరస ముద్రతో పొలుపు మారింది. మాధవ వధూసహస్ర సౌందర్య విభవం (10ఉ. 817) కూడ వారి నైపథ్య శృంగార సంభరితమే.

ఇంద్రప్రస్థ ప్రయాణ సమయంలో రసాలవనస్థలంలో విడిసి ఉన్న 'జలజ లోచను కడకు ఉత్కలికతో' (10 ఉ.671) కదలివేళ్లే శుద్ధాంత కాంతల ఆంగిక శృంగారం ఆహ్లాదకరం. అది వారి విహారానికి నైపథ్యం.

సీ॥ వికచ మరంద నవీన సౌరభ లస
న్మందార కుసుమ దామములు తుఱిమి
చారు సుగంధ కస్తూరికా ఘనసార
మిళిత చందన పంక మెలమి నలది
కనక కుండల కనత్కంకణ నూపుర
ముద్రికా భూషణములు ధరించి
యంచిత ముక్తాఫలాంచల మృదుల ది
వ్యాంబరములు చెలువార గట్టి
తే॥ యర్ధ చంద్రుని నెకసక్కె మాడునట్టి
యళిక ఫలకల దిలకము లలర దీర్చి
పెంపు దీపింప నుడురాజ బింబముఖులు
నవ చతుర్విధ శృంగార మవధరించి. 10ఉ. 670

ఇది వారి వైహారికం. ఇందులోనూ వారు వస్త్ర మాల్యాను లేపన భూషణాది చతురలంకారాలతో చతురంతయాన లవటం విశేషం. 'వరాంబ రాభరణ విలేపన స్రజః' (10-71-15) అనే ఒకే ఒక్క మూల శ్లోక పాదాన్ని ఒక్క సీస పద్యంగా పోతన ప్రపంచించి స్త్రీల శృంగార రచనా భంగిని చిత్రించాడు. తద్ద్వారా తన శృంగార రసాభిలాషను నిగదించాడు. ఇలాగే ధర్మజాడి అవభృథ స్నాన యాత్రా సమయంలోని వారాంగనా విలాసం (10ఉ. 799) విలోకనీయం.

శ్రీకృష్ణుడి ఆంగిక శృంగారాన్ని గూర్చి భాగవతంలో పలుతావులలో దర్శించవచ్చు. ఆయన దినచర్యలోని నిత్య శృంగార రచన అతడి అతివేల శృంగారితకు నిదర్శనం. తద్ద్వారా కూడ శ్రీకృష్ణుడిని పరిపూర్ణ శృంగార నాయకుడిగానే పోతన నిరూపించాడు.

---

6. శ్లో॥ పాదాచ్యుతం క్వణయతీ మణినూపురాభ్యాం
రేజే ఽ ంగులీయ వలయ వ్యజనాగ్ర హస్తా
వస్త్రాన్త గూఢ కుచకుంకుమ శోణ హార
భాసా నితమ్బ ధృతయా చ పరార్ధ్యకాంచ్యా ॥ 10-60-8

సీ॥ మలయజ కర్పూర మహిత వాసిత హేమ
కలశోదకంబుల జలకమాడి
నవ్య లసన్మృదు దివ్య వస్త్రంబులు
వలనొప్ప రింగులు వారగట్టి
మకర కుండల హార మంజీర కేయూర
వలయాది భూషణావళులు దాల్చి
ఘనసార కస్తూరికా హరిచందన
మిళిత పంకము మేన నలర నలది
తే॥ మహిత సౌరభయుత కుసుమములు దుఱిమి
పొసగ రూపైన శృంగార రస మనంగ
మూర్తి గైకొన్న కరుణా సముద్ర మనగ
రమణ నొప్పుచు లలిత దర్పణము జూచి. 10ఉ. 633

శృంగారి అయినవాడు తన ఆంగిక శృంగారాన్ని ఎలా పోషించుకోవాలో తెల్పుతూ దర్శకుడైన పోతన దిద్దిన శృంగార రూపం ఇది.

అలంకారాలవల్ల శృంగారపురుషుడు మరీ అతిశయిస్తాడు. నవ మన్మథుడౌతాడు. వీరినే లోకం సరదా పురుషుడనీ భోగపురుషుడనీ పూలరంగడనీ శృంగారపురుషుడనీ పలువిధాలుగా సదా సంభావిస్తుంది. వారికి ఉన్నత స్థానాన్ని కల్పిస్తుంది. అది ఎరిగిన పోతన తన భాగవత కథానాయకుణ్ణి తదున్నత శిఖరాలకు చేర్పదలచి మూలంలో ఉన్న శృంగార రచన[7] ను మూడింతలుగా పెంచి ఆత్మీయతను వ్యక్తీకరించాడు. ఇలా స్త్రీ పురుషులిద్దరికీ కాలోచితమైన రీతిగా నైపథ్య శృంగారాన్ని నిర్వహించి తత్పరమార్థాన్ని ప్రబోధించాడు పోతన.

అలాగే నైపథ్య శృంగారాన్ని గజేంద్రుడికి కూడ వర్తింపచేసి ఆతణ్ణి ఒప్పుల కుప్పగా శిల్పించాడు.

సీ॥ తన కుంభముల పూర్ణతకు డిగ్గి యువతుల
కుచములు పయ్యెద కొంగులీగ
దన యాన గంభీరతకు జాల కబలల
యానంబు లందెల నండగొనగ
దన కరశ్రీ గని తలగి బాలల చిఱు
దొడలు మేఖల దీప్తి దోడు పిలువ
దన దంతరుచి కోడి తరుణుల నగవులు
ముఖచంద్ర దీప్తుల మునుగు దిగువ

---

7 శ్లో॥ ఆత్మానం భూషయామాస నరలోక విభూషణం।
వాసోభిర్భూషణైః స్వైర్దివ్య స్రగను లేపనైః ॥ 10-70-11

తే॥ దనదు లావణ్య రూపంబు దలచి చూడ
నంజనాభము కపిలాది హరిదిభేంద్ర
దయిత లందఱు దనవెంట దగిలి నడువ
గుంభివిభు డొప్పె నొప్పుల కుప్ప బోలి. 8-40

ఆ గజేంద్రుడి ఆంగిక శృంగారం అతివలు అందరూ అతడిని వెంటబడి ఆరాధించేటంతగా అతిశయించింది. కనుక ఆంగిక శృంగారం ఒక్క మానవ జాతికే కాదు సర్వప్రాణికోటికీ ఉద్దీపన కలిగించగలదన్న సత్యాన్ని పోతన వెలువరించాడు. కనుకనే శృంగారం సర్వప్రాణి సహజం మాత్రమే కాదు అది సర్వ జీవకోటికీ జీవ చైతన్యం.

# క్రియా శృంగారం

క్రియాశృంగారం ఈ క్రింది విధంగా ఉంటుంది. దంతక్షతం నఖక్షతం మణితం రణితం సీత్కృతం చుంబనం భూషణం హావం భావం హేల కేలీ విలాసం మొదలైన వాటితోనూ శయనాద్యుపచారాలతోనూ సంగీత క్రియలు మొదలైన వాటితోనూ కూడి ఉంటుంది.[8]

ఇది నాయికా నాయకుల ఇష్టప్రాప్తిదశ. అరమరికలు లేని శంకా రహితమైన శృంగార కలాప విలాస దశ. మనసులు మరిచి తనువులు కలసిన దశలో ఈ క్రియాశృంగారం కామశాస్త్రానికి నూతన భాష్యాలు రచిస్తుంది.

## శ్రీహరి శృంగార హస్తం

బలిచక్రవర్తి వద్ద ప్రతిగ్రహానికై కమలాధీశ్వరు డొడ్డింది సురుచిర శృంగారకరం. అది క్రియా శృంగార నిర్వహణ చాతుర్యవేది. అది కమలాకర్షణ సుప్రశస్తం రమాకాంతా కచోపాస్తం విమల శ్రీకుచ శాత చూచుకతటీ విన్యస్తం (8-609).

కామశాస్త్రరీత్యా 'శయ్యమీద స్త్రీకి కుడి భాగంలో పురుషుడు, అతనికి ఎడమవైపు స్త్రీ ఉపవేశించాలి. పిమ్మట పురుషుడు తన ఎడమ బాహువుతో అమెను కౌగిలించుకోవాలి. అటుపైన కాంత కేశ భారాన్ని నిమరాలి'[9]. అలా కచసేవనం చేయటం అష్టవిధరతి

---

8. శ్లో॥ దంతచ్ఛేద్యం నఖచ్ఛేద్యం మణితం చ స సీత్కృతం ।
చుంబనం భూషణం భావో హేలాదిః కేలయ్యోపిచ॥

శ్లో॥ శయనాద్యుపచారశ్చ తథా సంగీతకక్రియా
ఇత్యాది భావైః కథితః శృంగారః స్యా త్క్రియాత్మకః ॥ - భావ ప్రకాశనము, పుట. 144

9. దక్షిణ తశ్చాస్యా ఉపవేశనం కేశహస్తే వస్త్రాంతే నీవ్యామిత్యవ లంబనం, రత్యర్థం సవ్యేన బాహు నారమమర్దతః పరిష్వంగః వాత్స్యాయన కామసూత్రాలు సం. 1-పుట. 309

భేదాలలో ఒకటి. ఇలా ఈ క్రియా శృంగారాన్నే అక్షరశః శ్రీమహావిష్ణువు ఆచరించినట్లు పోతన కల్పనం.

ఇలా శ్రీదేవిని లాలించిన తర్వాత శ్రీహరి సాగించిన క్రియాశృంగారం గమనార్హం. 'విమల శ్రీకుచ శాతచూచుకతటీ విన్యస్తం' (8-609) గా ఆయస హస్త చాలనం చేశాడు. తద్వారా సమతల ప్రహరణ వ్యాఘ్రనమిక[10] మయూర పదక[11] శశ ప్లుతాది[12] సఖక్షతాలు కల్పించినట్లుగా అభ్యూహించాలి. ఇలా శ్రీహరి శృంగార హస్తం బలి ఔదార్య ప్రాభవాన్ని ప్రక్కకు నెట్టి పాఠకుల్ని శృంగార భావడోలికల్లో పరవశింప చేస్తుంది. లక్ష్మీనారాయణుల సంగమ వేళా క్రియా శృంగార రహస్యాల్ని వెలువరిస్తుంది.

## శ్రీసతీలాలనం - శ్రీహరి హస్తం

రసికుడైనవాడు ప్రథమతః కచాకర్షణం చేసి నాయికను అభిముఖం చేసుకొని భ్రూనేత్రాలను చుంబిస్తాడు. అపై అంసోత్తరీయాన్ని అపనయించి కుచగ్రహణం చేస్తాడు. శ్రీహరి కూడ అలాగే ఉపక్రమించాడు. కానీ ఆమె కోపగోపన కావటంతో ఉపలాలన కుపక్రమించాడు.

శా॥ అదిన్ శ్రీసతి కొప్పుపై దనువుపై నంసోత్తరీయంబుపై
బాదాబ్జంబులపై గపోలతటిపై బాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందు కరంబు గ్రిందగుట మీదై నా కరంబుంట మే
ల్గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే ? 8-591

ఇందులో శ్రీసతి కుపిత నాయిక. శ్రీహరి తన హస్తంతో శ్రీసతీ కేశపాశాన్ని పట్టి అభిముఖం చేసుకోబోగా ఆమె తప్పించుకుంది. దాంతో శరీరాన్ని స్పృశించబోగా మళ్ళీ తప్పుకుని ముందుకుసాగింది. అప్పుడు ఆమె అంసోత్తరీయాన్ని అందుకుని బ్రతిమిలాడే ప్రయత్నం చేశాడు. అయినా ఆమె స్వాధీనం కాలేదు. కనుకనే ఆ రతిపండితుడు ఆమె కోపానికి ఉపశమన సాధనంగా 'పాదపతన' మనే పరమాస్త్రాన్ని ప్రయోగించాడు. అతిసిగ్గుతో ఉన్నా లేదా అతి క్రుద్ధ అయినా భర్త పాదపతనంతో ఉత్తమ ఇల్లాలు ఇట్టే స్వాధీన మవుతుందని వాత్స్యాయన మతం.[13] అంతే! ఆమె మంచులా కరిగి పోయింది. ఆదిలక్ష్మి పతికి స్వాధీన అయింది. దాంతో ఆయన హస్తం మళ్ళీ ఆమె చెక్కిళ్లపై చేరి సుతారంగా స్పృశించింది. అట నుండి క్రిందికి దిగి పాలిండ్లపై పచరించింది.

---

10. సైవ వక్రా వ్యాఘ్ర నమిక మాస్త్రన ముఖమ్ వాత్స్యాయన కామసూత్రాలు, సం.1 పుట. 213
11. పంచభి రభిముఖై ర్లేఖాభి శ్చూచుకాభిముఖీ మయూర పదకమ్ అందే.
12. తత్యం ప్రయోగ శ్లాఘాయాః స్తన చూచుకే సంవిక్రష్టాని పంచనఖ పదాని శశప్లుతకం.
అందే, పుట. 214

10 వ్రీడాయుక్తా ఽపి యోషి దత్యంత క్రుద్ధా ఽపి వ పాదపతన మతివర్తత ఇతి సార్వత్రికమ్
వాత్స్యాయన కామసూత్రాలు, సం.2, పుట.14

నిత్యనూతన మర్యాదతో వ్యవహరించింది. ఇలా పోతనగారు శ్రీహరి క్రియాశృంగారం విశేషాల్ని అమూలచూడంగా దర్శించటం ఆయన దర్శయిత్రీ ప్రతిభకు ప్రబల నిదర్శనం.

## ఊర్వశీ పురూరవులు

పురూరవుడు ఊర్వశిని ప్రథమ దర్శనంలోనే కామించాడు. ఆమెను తిలతండులక క్షీరజలకాది ఆలింగన[14] సహితమైన క్రియా శృంగారాన్ని అర్థించాడు. తిలతండులాల లాగ తమ శరీరాలలోని ప్రత్యణువూ గాఢాలింగితం కావాలని అతడి గాఢకామన.

ఉ॥ ఎక్కడి నుండి రాక? మన కిద్దఱికిందగు నీకు దక్కితిన్
మ్రుక్కడి వచ్చెనే? యలరు ముల్కుల వా డడిదంబు ద్రిప్పుచే
దిక్కునెఱుంగ నోయబల! దేహము దేహము గేలుగేల నీ
చెక్కున జెక్కు మోపి తగు చెయ్వుల నన్ను విపన్ను గావవే! 9-391

ఒక గాఢ కాముకుడి శృంగార భావన అతడి క్రియా శృంగారంతోనే ముడివడి ఉంటుంది. ఇది కాంక్షాగతమైన క్రియా శృంగారం.

## ఋష్యశృంగుడు - వేశ్యలు

ఋష్యశృంగుడి కోసం వచ్చిన వేశ్యలు అతణ్ణి 'చేతుల గ్రుచ్చి కర్కశ కుచంబులు మోపి కౌగిలించటం స్తనాలింగనం[15] 'మోము కంఠంబు నాభియు కలయ బుణకటం' ఒక అపూర్వమైన ఉపరతి భేదం. 'మీసుల పొంత నాలుకలు చప్పుళ్లు' చేయటం అప్పుబదరం అనే ఫూత్కృతం. ఇలా ఆ వేశ్యలు కామకళా సంబంధమైన క్రియా శృంగారం నిర్వహించారు అమూలకంగా ఆంధ్రమహాభాగవత కథలో (9-694) ఆ అమాయిక చక్రవర్తిని కామకళాకౌశలంతో కరిగించి తమ మరుగున చేర్చుకున్నారు. ఇది వేశ్యాగతమైన క్రియా శృంగారం. దీని ప్రయోజనం స్వకార్య సాధనం, లేదా రాజకార్య నిర్వహణం (9-688).

## గోపీ కృష్ణులు

శ్రీకృష్ణుని వస్త్ర చౌర్య నైపుణ్యం మూల భాగవతంలో లేదు. వాటిని దొంగిలించిన విషయం మాత్రమే ఉంది. ఆంధ్ర భాగవత కృష్ణుడు వసన గోపనం చేస్తున్న సమయంలో అతని పూర్వరాగ క్రియా శృంగారం దాగుంది. వసనగోపనం శృంగారకళ. లోకంలో

---

14 శయనగతా వేవ ఊరు వ్యత్యాసం భుజ వ్యత్యాసం సం చ స సంఘర్ష
మివ ఘనం సస్వజేతే తత్తిల తండులకమ్. రాగాంధావనపేక్షితాత్యయౌ పరస్పర మనువిశత ఇవ ఉత్సంగ గతాయా మభిముఖోప విష్టాయాం శయనేవేతి క్షీరజలకం.
వాత్స్యాయన కామసూత్రాలు, సం.1, పుట.185

15 స్తనాభ్యా మురః ప్రవిశ్య తత్రైవ భార మారోపయే దితి స్తనా లింగనమ్.
వాత్స్యాయన కామసూత్రాలు, సం.1. పుట.187

చతుష్షష్టికళలున్నాయి. ఈ అరవైనాలుగు కళలు మూలకళలు. వీటిలో కర్మాశ్రయాలైన కళలు ఇరవైనాలుగు. జూదానికి ఆశ్రయమైన కళలు ఇరవై. అలాగే శయనోపచారికాలైన కళలు పదహారు. ఉత్తర కళలు నాలుగు. అవిధంగా మొత్తం అరవై నాలుగు కళలూ కామశాస్త్రానికి అంగవిద్యలు. కాబట్టి కామసూత్రాలతో పాటు ఈ అంగ విద్యలు కూడా నేర్చుకోవాలి. అలా నేర్చుకున్న స్త్రీపురుషులు మాత్రమే సంభోగంలో సంపూర్ణమైన సంతృప్తిని పొందగలుగుతారు. ఒక్క కామసూత్రాలు మాత్రమే చాలవు.[16] ఈ నేపథ్యంలో శ్రీకృష్ణుని వసన గోపన కళాకౌశలాన్ని పరికించవచ్చు.

తరలము. కదలకుం డని తోడివారల గన్ను సన్నల నిల్చుచున్
బదము లొయ్యన నేల బెట్టుచు బద్మనేత్రుడు మౌని యై
పొదలమాటున నల్ల నల్లన పొంచి పొంచి నతాంగుడై
యదను గోరుచు డాసి వ్రేతల యంబరంబులు దొంగిలెన్. 10-814

ఇందులో అతని నర్మ శృంగారాత్మకమైన కర్మ ఉంది. దానికి తోడు ఇది ఊగూ తూగూ గల తరలంలో శ్రవణ సుభగంగా సాగింది. అది అతని హృదంతరానంద డోలికలకు అనుగుణమైన గమనంతో ప్రతీకాత్మకంగా ప్రతీయమానమైంది. నిత్య శృంగార చేతస్కులైన వారి నిత్యవర్తనం ఈ రీతిగానే ఉంటుంది. అందులోనూ కొంటె కోణంగుల చిలిపి చేతలన్నీ వింతరీతులేగదా!

ఈ సందర్భంలో వ్యాస భాగవతంలోని మూడు శ్లోకాలనూ మూడు పాదాలలో పొదివి స్వతంత్ర భావాలతో పూరించిన సీసపద్యం పరమ రమణీయ శృంగార దృశ్యం. అందులో గోపికలు భావించిన శ్రీకృష్ణుని కేళీవిలాసం వినోద విహారం క్రియాశృంగార ప్రబంధమే ! అందులోని శ్రీకృష్ణుడి 'అంగకళలు' మనోహరం.

సీ॥ కొమ్మకు ఋవ్వులు కోసినా డిక్కడ
మొనసి పాదాగ్రంబు మోపినాడు[17]
సతి నెత్తుకొని వేడ్క జరిగినా డిక్కడ
దృణములో లేదిదె తెఱవజాడ[18]

---

16 వాత్స్యాయన కామసూత్రాలు, సం.1 పుట.77

17 శ్లో॥ అత్ర ప్రసూనావచయః ప్రియార్థే ప్రేయసా కృతః ।
ప్రపదాక్రమణే ఏతే పశ్యతా ఒసకలే పదే ॥ 10-30-32

18 శ్లో॥ తస్యా అమూని నః క్షోభం కుర్వన్త్యుచ్చైః పదాని యత్
యైకాపహృత్య గోపీనాం రహో భుంక్తే ఒచ్యుతాధరమ్।
న లక్ష్యన్తే పదాన్యత్ర తస్యా నూనం తృణాంకురైః
ఖిద్యత్సుజాతాంఘ్రితలామున్నిన్యే ప్రేయసీం ప్రియః ॥ 10-30-30

ప్రియకు ధమ్మిల్లంబు పెట్టినాడిక్కడ
గూర్చున్న చొప్పిది కొమరు మిగులు[19]
నింతికి గెమ్మోవి యిచ్చినాడిక్కడ
వెలది నిక్కిన గతి విశదమయ్యె
ఆ॥ సుదతి తోడ నీరు జొచ్చినా డిక్కడ
జొచ్చి తా వెడలిన చోటు లమరె
దరుణి గామకేళి దనిపినా డిక్కడ
ననగి పెనగి యున్న యంద మొప్పె. 10-1026

ఇలా శ్రీకృష్ణుని క్రియా సంబంధ శృంగారాన్ని గోపికలు అభ్యూహించిన తీరే వేరు. అది స్త్రీజన సహజమైన అనుమాన జనితమైంది. అపై సన్నివేశ సాక్ష్యాధార సహితమైంది. ఇలాంటిదే గోపికలూహించిన గోపీకృష్ణుల పదక్రమం (1028). అదీ మూల విస్తరణమే.

సీ॥ ఒక యెలనాగ చెయ్యూదినా డిక్కడ
సరస నున్నవి నాల్గు చరణములును
నొక నీలవేణితో నొదిగినా డిక్కడ
మగజాడలో నిది మగువ జాడ
యొక లేమ మ్రొక్కిన నాడిసినా డిక్కడ
రమణి మ్రొక్కిన చొప్పు రమ్యమయ్యె
నొక యింతి నెదురుగా నొలసినా డిక్కడ
నన్యోన్య ముఖములై యంఘ్రులొప్పె
ఆ॥ నొకతె వెంట దగుల నుండక యేగినా
డడుగు మీద దరుణి యడుగు లమరె
నబల లిరుకెలంకు లందు రా దిరిగిచా
డాఖపదము లున్నవమ్మ! యిచట. 10-1028

ఇందులో కృష్ణచరిత క్రియా శృంగారం మాత్రమే కాదు గోపికాకృతమైన శృంగార ప్రేరణ క్రియలు ప్రణయాభ్యర్థనలు వినయ ప్రణయాలు కూడ అనేకం ఉన్నాయి. అవి భావనా లోచన గోచరాలు. అవి ప్రణయమున్న జీవులకు రాగవర్ధకాలు. అందుకే అవి నిత్య రమణీయాలు నిత్యస్మరణీయాలు.

గోపికల సంభోగ శృంగార స్మరణంలో గతంలో వారితో కూడిన శ్రీకృష్ణుడి క్రియా శృంగారం స్మరణీయం.

---

19 శ్లో॥ కేశప్రసాధనం త్వత్ర కామిన్యాః కామినా కృతమ్।
తాని చూడయతా కాన్తాముపవిష్ట మిహధ్రువమ్॥ 10-30-33

సీ॥ ఈ పొదరింటిలో నిందాక కృష్ణుండు
నాతోడ మన్మథ నటనమాడె
నియ్యేల మగుచోట నిందాక జెలువుండు
గాఢంబుగా నన్ను గౌగిలించె
నీ మహీజము నీడ నిందాక సుభగుండు
చిట్టంటు సేతల సిగ్గు గొనియె
నీ పుష్పలత పొంత నిందాక దయితుండు
నను డాసి యధరపానంబు సేసె

ఆ॥ నీ ప్రసూనవేది నిందాక రమణుండు
కుసుమ దామములను గొప్పుదీర్చె
ననుచు గొంద అతివ లంభోజ నయనుని
పూర్వలీల దలచి పొగడి రధిప. 10-1032

ఇలా మన్మథ నటనం గాఢాలింగనం చిట్టంటు చేతలు నఖక్షత దంతక్షతాలు విలాసం అధరపానం వంటివి వారి సంభోగంలోని క్రియా శృంగార విశేషాలు. ఆ తర్వాత కొప్పుదీర్పటం వంటి శృంగార కళలు కొనసాగినాయి. రతిపండిత చర్యాక్రమం ఇందులో తిలకించవచ్చు. ఏతత్క్రియలు జరిగిన శృంగార ప్రదేశాలను కూడ గోపికలు స్మరించారు. అంతటి గాఢ గూఢ క్రియా శృంగారానుభవాన్ని పొందటం వల్లనే గోపిక లింతగా శ్రీకృష్ణుని కోసం పరితపించారు. ఇలా వారి విరహంలో క్రియాశృంగారం సంస్మరణ సముపేతం ఊహాజనితం భావప్రేరితం.

## ఉష - అనిరుద్ధుడు

ఉషకు కలలో కన్పించిన అనిరుద్ధుడు సాగించిన కామకళా విలాసం ప్రధానంగా క్రియా శృంగార సర్వస్వం.

చం॥ సరస మృదూక్తులుం గుసుమ సాయకు కేళియు శాటికా కచా
కరషణముల్ నఖక్రియలుగ్రమ్మ గపోల లలాట మేఖలా
కర కుచ బాహు మూలములు గైకొని యుండుట లాదిగా దలో
దరి మది గాఢమై తగిలె దర్పకు డచ్చున నొత్తి నట్లయి. 10ఉ. 329.

ఆమె హృదయంలో అనిరుద్ధుడి ముద్రపడటానికి మూల కారణం ఈ క్రియా శృంగారమే. అందులోని నైకవిధ రతి భేదాలూ ఉపలాలన విధానాలూ కళాస్థాన గ్రహణ విశేషాలూ ఏతత్స్థానాలలోని రకరకాల నఖక్షత విశేషాలూ అన్నీ రతి క్రీడలో స్త్రీజన వశీకరణ తంత్రాలే! అవి పరమ రమణీయాలు. ఆ సమయంలో అనిరుద్ధుడు కల్పించిన నఖక్షత భేదాల ననేకంగా ఊహించవచ్చు. 'వాటి ప్రయోజనం అనంతం. ప్రియురాలు కన్య అయివుంటే ఆమెకు నమ్మకం కలిగించటానికి నఖక్షతాలు చెయ్యాలి. ఇంకా ప్రేయసి శరీరాన్ని ఎక్కడెక్కడ తడుముతున్నా ఎక్కడెక్కడ సంవాహనం చేస్తున్నా

అక్కడల్లా ప్రియుడు నఖక్షతాలు చేయొచ్చు'[20]. తదనుగుణంగానే ప్రథమ సంయోగవేళ అనిరుద్ధుడు ప్రవర్తించినట్లు తెలుస్తుంది. అలా చేయటం వల్ల ఆమెకు మదనోద్రేకం కలుగుతుంది.

ఉషకు అనిరుద్ధుడు దూరమైనపుడు విరహం కలిగింది. ఆమె కిక మిగిలింది నఖ క్షతాది స్మృతులు మాత్రమే. అవే ఆమె ప్రేమాభివృద్ధికి మూలకోశా లైనాయి. ఈసందర్భం లోని వాత్స్యాయనుడి వాక్కులు స్మరణీయాలు. 'ప్రేయసీ ప్రియులు కలుసుకొని ఎంతో కాలం అయిందనుకోండి. తరువాత వారు విడిపోయారు. మళ్లీ ఒకరినొకరు కలుసుకోలేదు. అంచేత వారి మధ్య ప్రేమానురాగాలు కొంత సన్నగిల్లడం సహజమే. అయినప్పటికీ మొదటిసారి కలుసుకున్నప్పుడు ప్రియుడు రసికుడై చిత్ర విచిత్ర రీతుల్లో నఖక్షతాలు చేసిఉంటే, వాటిని ఆ ప్రియుడి రూపురేఖలను యౌవనాన్ని గుణాలను ఆ స్త్రీ, నిత్యం జ్ఞాపకంచేసుకుంటూ ఉంటుంది. అంచేత కామశాస్త్రంలో ఈ నఖక్షతాలు ప్రధానపాత్ర వహిస్తున్నాయి'.[21] అనిరుద్ధుడు అర్ధచంద్రకం ఉత్పలకం స్మరణీయకం వంటి నఖక్షతాలను[22] చేసినట్లు అభ్యూహించవచ్చు. వీటి నిత్య దర్శనంవల్ల వియోగాన్నెంత కాలమైనా సహించవచ్చు. ఇలా ఈ ఘట్టంలో పురుషకృత మైన క్రియా శృంగార నైపుణి ఎంతటి సతీజన సమ్మోహనమో ఉపాపరంగా ప్రకటించాడు. వాచికం కంటె ఇక్కడ క్రియకు అధిక ప్రాధాన్యం. మొత్తం మీద కథలో త్రివిధ శృంగారాలూ రస పోషణంలో ఏకోన్ముఖంగా సాగి సంభోగంగా పరిణమించాయి. ఏతద్రహస్యాల నెఱిగిన పోతన చిత్తం నిత్యం శృంగారరసాయత్తం.

## గజరాజు

పోతన మానవేతరమైన జంతు శృంగారాన్ని వర్ణించటంలోనూ వాటి మనోగత భావాలకు దర్పణం పట్టే క్రియారూపాల్ని కల్పించటంలోనూ కుశలుడు. తుమ్మెదలు వేడ్కతో ఆలపించిన సంగీత విశేషాలు కేళీ విలాసాలు మదగజ దానామోదాలు వాటి క్రియా శృంగార విశేషాలు. అవి వాటి అవ్యక్త మధురమైన ప్రణయ భావ ప్రకటనకు ప్రతి రూపాలు. అలాగే గజరాజ క్రియా శృంగారం గమనార్హం.

20 ప్రయోజ్యాయాంచ తస్యాంగ సంవాహనే శిరః కండూయనే, పిటక భేదనే, వ్యాకులీకరణే, భీషణేచ ప్రయోగః వాత్స్యాయన కామ సూత్రాలు. సం.1. పుట.212

21 చిరోత్సృష్టేషు రాగేషు ప్రీతి ర్గచ్ఛేత్పరాభవం
రాగాయతన సంస్మారి యది నస్యాన్నఖ క్షతమ్. వాత్స్యాయన కామసూత్రాలు సం.1. పుట.219

22. గ్రీవాయాం స్తనపృష్ఠే చ వక్రో నఖ పదనివేశోఽర్ధ చంద్రకః. అందే. పుట. 213
స్తనపృష్ఠే మేఖలాపథే చోత్పలపత్రాకృతీత్యుత్పల పత్రకమ్. అందే. పుట.215
ఊర్వోఃస్తనపృష్ఠే చ ప్రవాసం గచ్ఛతః స్మరణీయకం సంహతా శ్చతస్ర స్తిస్రోవా లేఖాః, ఇతి నఖకర్మాణి. అందే. పుట. 215

తే॥ పిఱుదు చక్కట్ల డగ్గఱి ప్రేమ తోడ
డాసి మూర్కొని దివికి దొండంబు సాపు
వెద వివేకించు గ్రీడించు విశ్రమించు
మత్తమాతంగ మల్లంబు మహిమతోడ. 8-39

ఇందులోని ప్రతి చర్యా జంతు గతమైన క్రియా శృంగారమే. ఇందులోని విరామేచ్ఛవల్ల దాని సంభోగ శృంగారం విస్పష్టమయింది.

ఇలా పోతన సర్వప్రాణి సహజోత్కంఠిత క్రియా శృంగారాన్ని శాస్త్ర ప్రయోగాను సారంగా వెల్లడించాడు. ఇదంతా అప్రయత్న పూర్వక రసోద్గారం. ఇది పోతనవంటి కవితా కళాతపస్వికే సాధ్యం. పోతనభాగవతంలో క్రియా శృంగారం అధికంగా సాగింది. ఇందులో వ్యాసకృతమైన భాగాలు కొన్ని ఉన్నా ఆయనది రసదృష్టి కాదు, తత్త్వదృష్టి మాత్రమే. అందుచేత రసదృష్టితో అనుశీలించ వలసింది ఆంధ్రభాగవతమే! కానీ సంస్కృత భాగవతం కాదు.

వాచిక నైపథ్య క్రియా శృంగారాలు పరస్పర పోషకాలు. ఉత్తరోత్తరం అవి బలీయాలు. వాటి ఏకత్ర ప్రయోగ స్వరూపం సైతం సందర్శనీయం. సంభోగ శృంగారమే దాని పరమావధి. భాగవతంలో ఇకపై త్రివేణీ సంగమ సదృశ త్రివిధ శృంగార స్వభావ స్వరూప ప్రయోజనాలు సంభావ్యాలు.

## మోహినీ దానవులు

క్షీరసాగర మథన సమయంలోని మోహినీ దానవ ప్రణయం రసాభాసమే అయినా అది త్రివిధ శృంగార సంగమంగానే భాసించింది. వారి సరస సల్లాపాలు విలాస విభ్రమాలు అందచందాలు అందుకు మూలం. మోహినీ సహజ సౌందర్యం ఆభరణాల వలని విచ్ఛిత్తి దానవుల ప్రేమదైన్యానికి మూలం. ఆమె మెత్తని యడుగులు మెఱుగారు జానువులు ఆంగిక శృంగార నిధులు. పాలిండ్లపై నున్న పయ్యెద జారించి ఆమె ప్రదర్శించిన హావభావాలు క్రియా శృంగార స్వరూపాలు. అవి దానవుల చిత్తాలకు మత్తుగొలిపిన ప్రసూన శిలీముఖాలు. 'వేగిరపడకుడీ వినుడు దానవులార' (8-318) అంటూ వదినె మరదుల వావులు కల్పించటం మెల్లని నగవులతో మేనులు మరపించటం జాణ మాటలతో కాకు పరచటం నర్మ శృంగారం. అది ఆమె క్రియా వాచిక శృంగారాల ప్రదర్శన ప్రాభవ విశేషం.

ఇలా కపటానురాగ ప్రకటన ప్రకరణాన్ని సైతం త్రివిధ శృంగార సంగమంగా నవదరించిన ఘనుడు పోతన. ఈ శృంగార త్రయం ప్రధానంగా మోహినీ పరంగానే ప్రకటితమై సీసపద్యత్రయంలో ప్రతిబింబించింది. అది దానవులకు ప్రణయ భంగ భీతి కల్పించింది. ఫలితంగా వారికి అమృతం చేజారి పోయింది. ఇలా ఈ ఘట్టంలో శృంగార త్రయం వంచన ప్రయోజన సిద్ధికి సర్వథా ఉపకరించింది.

## రుక్మిణీ కృష్ణులు

పరస్పరాకర్షణకు అంగిక శృంగారం దోహద పడితే సంభోగ శృంగారంలో ఉద్దీపన కలిగించేవి అధికంగా వాచిక క్రియా శృంగారాలే. శ్రీకృష్ణుడు రుక్మిణితో చేసిన ప్రణయ ప్రసంగం ఈ విషయాన్ని విస్పష్టం చేస్తుంది.

ఉ॥ కింకలు ముద్దు పల్కులును గెంపు గనుంగవ తియ్య మోవియున్
జంకెలు తేఱి చూపు లెకసక్కెములున్ నెలవంక బొమ్మలున్
గొంకక వీడనాడుటలు గూరిమియుం గల కాంత గూడుటల్
ఇంకిలి లేక జన్మఫల మబ్బుట గాదె కురంగలోచనా ! 10ఉ.265

ఇది స్త్రీకృతమైన వాచిక క్రియాశృంగారాల సమ్యగ్వి భవ స్వరూపం. దీన్నే శృంగార శిఖులు కోరుకుంటారు. ఇదే అత్యుత్తమమైంది. ఇది స్త్రీల కలంకారం. వారి రతివిలాసాలకు గుణగణాలకు విచిత్ర విలాసాలకు నాయకులు లోబడి వెంటవెంట తిరుగుతుంటారు. అలా త్రిప్పుకొని స్వాధీన భర్తృకలై[23] రాణిస్తారు. అంటే మదన కదనంలో పడతుల పనితనాన్ని రసికులు ఆదరిస్తారు ఆహ్వానిస్తారు. మొత్తంమీద ఈ శృంగార సూక్తివల్ల ప్రణయ కలహం లేనిదే శృంగారం రాణించదని తేలింది. అలాగే దంతక్షత నఖక్షతాలు ప్రేమానురాగాల్ని వృద్ధి పొందించటంలో ఉపయోగ పడినట్లుగా మరే ఇతర చేష్టలు ఉపయోగపడవనటం నిస్సంశయం.[24] స్త్రీ పురుషులు పరస్పరం పొందిన నఖక్షతాల ఎల్ల పరస్పర పునర్దర్శన సమయంలో వారు ఏ స్థితిలో ఉన్నా సమంగా విచలిత మనస్కులౌతారు. ఇలాగే ఇతర కలాపాలవల్ల కూడ వారికి రాగవృద్ధి కలుగుతుంది. వారి కాపురాలు భూతల స్వర్గాలైతాయి. ఈ స్థితి పోతన కాలంలోని సాంఘిక శృంగార జీవనానికి ప్రతిబింబం. అంతేకాదు అతని ఆత్మీయతా ప్రాభవ ద్యోతకం కూడ.

## కుబ్జా కృష్ణులు

కుబ్జాకృష్ణుల కథ శృంగార త్రయ సమ్మిశ్రితం. ప్రథమ సందర్శన సమయంలోని వారి సంభాషణ ప్రధానంగా వాచిక శృంగార సంకలితం. అంగిక శృంగార ప్రసాధనాలైన చందన గంధాలను ఇమ్మని అర్థించాడామెను కృష్ణుడు. అలా ఇస్తే 'నివ్వటిలెదు చక్కనగుచు నీరజనేత్రి' (10-1272) అని నయగారాలు పోతూ ఆమె ముఖ సౌందర్యాన్ని అర్థించాడు. మూలంలో 'శ్రేయస్తతస్తేన చిరాద్భవిష్యతి' (10-42-2) నీకు శుభమవుతుందని మాత్రమే ఉంది. ఈ సందర్భంలో వశీకరణ మంత్రాల వంటి ఈ

---

23. శ్లో॥ యస్యా రతిగుణాకృష్టః పతిః పార్శ్వం న ముంచతి ।
విచిత్ర విభ్రమాసక్తా సా స్యాత్స్వాధీన భర్తృకా ॥

5 24 వాక్యత్పఋుతరం కించిదస్తి రాగవివర్ధనం.
నఖ దంత సముత్థానాం కర్మణామ్ గతయో యథా-వాత్స్యాయన కామసూత్రాలు,సం.1. పుట.220

మాటలకు పొంగిపోని పొలతులుండరు కదా. కనుకనే ఆమె ప్రతిస్పందించింది. నర్మగర్భంగా శృంగారాత్మకంగా సంభాషించింది. తన 'అభిలాష' ను అభివ్యక్తీకరించింది.

ఉ॥ చక్కనివాడవౌదు సరసంబుల నొంపకు మెల్ల వారికిన్
జక్కదనంబు లెక్కడివి వారు శరీర! త్రివక్రయండ్రు నే
నిక్కము కంసు దాసిని వినిర్మల లేపన విద్యదాన నన్
మిక్కిలి రాజు మెచ్చు దగ మీరు విలేపనముల్ ధరింపరే ? 10-1274

వారు శరీరుడి చక్కదనాన్ని స్మరిస్తూనే సరసాలు వద్దంటూనే తన వివరాలిచ్చింది ఆయనకు. ఇది ఆమె వాచిక శృంగారం లోని జాణతనం. మీరు విలేపనముల్ ధరింపరే అనే కాకు ధ్వనిలో అతడు విలేపనాల ముఖమెరుగని పల్లెవాడనే పరమ శృంగార పరిహాసం స్పష్టమౌతుంది. గొల్లలకు ఈ రీతి సుగంధా లెందు?కనీ అలా వాటికోసం పరితపించ రాదనీ, వారికి సుగంధాల సొరులూ వాటి సోకులూ తలకెక్కవనీ, చీరలు కంబళ్లే చాలుననీ సరస పరిహాసంగా పల్కింది (10-1275). అలా అంటూనే అంగరాగా లందించింది. ఇలా అతడితోడి సంభాషణం నర్మ శృంగారేంగిత సంవేదనం. అది పఠితల హృదయాలకు చక్కని శృంగార చందన చర్చ.

కృష్ణుడు కుబ్జకు మువ్వంపులు తీర్చిన తీరు క్రియాశృంగారం. ఇక్కడ మూలాను వాదాలకు భేదం ఉంది.

శ్లో॥ సా తదర్జుసమానాఙ్గీ బృహచ్ఛ్రోణి పయోధరా ।
ముకున్ద స్పర్శనాత్ సద్యో బభూవ ప్రమదోత్తమా॥ 10-42-8

అని మాత్రమే ఉంది. కాని దానిని పోతన అనువాదంలో రసరామణీయకం గావించాడు.

సీ ... ... ...
తత్పదంబుల మీద తన పదంబులు ద్రొక్కి
హస్తాంగుళిద్వయ ఘటల గవుద
క్రింద నిప్పాగ నిడి కృష్ణుడు మీదికి
నెత్తిన వక్రత లెల్ల మాని
ఆ॥ చక్కనైన చిత్తజన్మ బాణము క్రియ
గొమరు మిగిలి పెఱుదు గుచయుగంబు
సొంపు జేయ దరుణి మంథరమూర్తియై
....... ....... ....... 10-1277

శోభించింది. పంచాశుగబాణ జాల భగ్న హృదయుంతో పంచశరాకారుడి పైకొంగువాకర్షించి తన ఇంటికి ఆహ్వానించింది. ఇది శృంగారవతీ లక్షణం. ఇందులోని ఆమె శృంగార కామన సుస్పష్టంగా చేష్టలవల్ల తెలుస్తుంది. అలాటి వారిచేష్టలు ఇలాటివేకదా! ఏతల్లక్షణ విచయాన్ని నిత్యనూతనంగా రసప్రవణ సమర్థవంగా రసికజన మనోరంజకంగా పాత్రలలో రంగరించటానికి పోతన ఇలా వాచిక క్రియా శృంగారాల నాశ్రయించాడు. రసపోషక పరిష్కుడైనాడు. ఈ కథారంభంలో అధికంగా వాచిక శృంగారం కుబ్జా కృష్ణుల పరంగా ఉభయాత్మకంగా సాగి సరసానురాగం పలికింది

కుబ్జానివాసం లోని అలంకరణం ఆంగిక శృంగారం. అది 'రత్నస్వర్ణ మాల్యాను లే/పన భూషాంబర ధూపదీప' పరిదీప్తంబై మనోజ ప్రదీ/పనమైంది (10-1484). ఇక ఆమె దేహం ఆంగిక శృంగారమయం. ఆమె 'మాలా మృగనాభి పంక మణిమయ భూషా/ చేలాలంకృత' (10-1488), అంతేకాదు మదనోద్దీపనాన్ని కల్గించే 'ఏలా కర్పూర మిళిత హిత మధుర మహా /హాలారసపాన మద /శ్రీలాలిత'(10-1489) గా అవతరించింది. అంతటి నైపథ్య శృంగార లాలిత దేహంతో ఆమె తనను కౌగిలించి కామానలాన్ని తొలగించమని కోరింది శ్రీకృష్ణుడిని. ఆమె దేహం గేహం రెండూ ఉద్దీపనాలే కనుక రెంటికీ సమప్రాధాన్యాన్ని కల్పించాడు పోతన. ఆ రెండూ ఆంగిక శృంగార నేపథ్యాలే.

శ్రీకృష్ణు డామెతోడి రతారంభంలోని వాచిక క్రియా శృంగారాలకు శృంగాగ్ర స్థితి చేకూర్చాడు. అతడు కురిపించిన సరసాలోకనాలూ శయ్యకు దార్చిన సరళీ, పరిరంభాలతో సిగ్గును పోకార్చి వధూహృదయ సామ్రాజ్యాన్ని స్వాయత్తం చేసుకొన్న వైనం (10-1490) పరమాహ్లాదకరం. ఈ సందర్భంలోని శ్రీకృష్ణుని రతి కళా పాండిత్యం క్రియా శృంగారానికి పరమపట్టభద్ర స్థానం.

ఉ॥ జాతియు గాలమున్ గళయు సత్వము దేశము భావ చేష్టలున్
ధాతువు బ్రాయముం గుణము దద్దశయున్ హృదయంబు జాడ్యయున్
బ్రీతి విశేషముం దెలిసి పెక్కు విధంబుల దొయ్యలిన్ మనో
జాత సుఖంబులం దనిపె శౌరి వధూ హృదయాపహారియై. 10-1491

ఇదొక కామ శాస్త్ర కళాఖని. దాని లోతులు విలువలు ఎరుగని వారికి శృంగార రసానుభవం కలుగదు. వనితావిస్రంభణ సంబంధమైన ఈ శ్రీకృష్ణ క్రియాశృంగార వైభవం పోతన శృంగార రసాత్మకు నిదర్శనం. ఈ పట్టున శృంగారజీవనుడికి కామ శాస్త్ర వైదుష్యం ఎలా అవసరమో దానిద్వారా నాయికా హృదయాన్ని ఎలా చూరలు గొనవచ్చునో పోతన చక్కని తార్కాణంతో నిరూపించాడు. ఇది అతడి రతిపాండితి. ఇది అనాటి జనజీవన శృంగార జీవనాడి. ఈ కథ చివరకు ఆంగిక క్రియా శృంగార భరితంగా పరిణమించినట్లు పోతన తీర్పు.

కం॥ కారుణ్యంబున గృష్ణుడు
తారుణ్యము మెఱసి మదన తంత్రంబుల లీ
లారణ్య వీథి దేల్చెను
సైరంధ్రిన్ విభవ విజిత శక్రపురంధ్రిన్. 10-1496

మొత్తంమీద ఈ కుబ్జాకృష్ణుల కథాలత వాచిక శృంగారంగా చిగురించి ఆంగిక శృంగారంగా పల్లవించి క్రియా శృంగారంగా పుష్పించింది. ఇలా త్రివిధ శృంగారాలూ ముప్పిరిగొని మూడు శృంగారాలు అతు విహారాలుగా వర్ధిల్లాయి. ఇందులో ఇలా సమష్టిగా కథాంతం వరకు త్రివిధ శృంగారాల్ని నిర్వహించిన పోతన శృంగార రససిద్ధుడు. భాగవత పద్యాలన్నీ ఏడుముత్యాలు.

# శృంగారనాయికా నాయకులు

## వైశిక నాయకుడు శ్రీకృష్ణుడు

పోతన భాగవత కథానాయకుడు శ్రీకృష్ణుడు ఉత్తమ వైశికుడు.

శ్లో ॥ విశేషయేత్ కలాః సర్వా : యస్మాత్తస్మాత్తువైశిక : ॥ నాట్యశాస్త్రం. 23 -1

సర్వకళావిశేషాలను విశిష్టంగా ఆచరించగలవాడు వైశికుడని భరతముని నిర్వచించి కొన్ని లక్షణాలను నిర్దేశించాడు. శారదాతనయుడు కూడా వాటిని అంగీకరించాడు.

వాత్స్యాయనుడు వైశికాధికరణంలో నాయక సామాన్య సంజ్ఞతో కొన్ని నాయక లక్షణాలను పేర్కొన్నాడు. ఆ లక్షణాలుగల నాయకుడు అన్ని ప్రకరణాలలోనూ ఒక్క రీతి వాడే అయినా ప్రకరణ సందర్భాన్ని బట్టి అతనిలో గుణాంతరం సంక్రమిస్తుంది. అందువల్ల అతడు కన్యను పొందితే వరుడూ పునర్భూవిషయంలో జారుడూ పారదారికంగా సిద్ధుడూ వైశికం వల్ల గమ్యుడూ అవుతాడు అనిమాత్రం ఉంది. కానీ వేశ్యాగమనం వల్ల వైశికుడౌతాడని లేదు. అసలు వైశిక నాయక భేదాన్నే అతడు సూచించలేదు.

భరతుడు చెప్పిన వైశిక నాయక భేదాన్ని శారదాతనయుడు సమర్థించాడు. అపై కొంత సవరించాడు. ఇద్దరూ విశిష్ట కళాచరితుడిని వైశికుడనే పేర్కొన్నారు.[1] అలాగే వేశ్యాగముణ్ణి కూడా వైశికుడనవచ్చునని నిర్వచించినా[2] వేశ్యాగముడైన వ్యక్తి ఉత్తమనాయకుడు కాలేడు. కనుక అతడి విషయం అప్రస్తుతం.

---

1 నాయకో గుణాంతర యోగాత్కన్యా పునర్భూ పరదారా వేశ్యా నపేక్షవేక్షయా యథాక్రమం వరోజార సిద్ధ గమ్యశ్చేతి సంజ్ఞాంతరాణి లభతే"వాత్స్యాయన కామసూత్రాలు - జయమంగళ వ్యాఖ్య పుట - 598.

2 వేశ్యాప చరణాద్వాపివైశికః న ఉదాహృతః నాట్యశాస్త్రం. 23 - 1

ఇక వాత్స్యాయనుడు వైశిక నాయక భేదాన్ని చెప్పక పోయినా, భరతుడు చెప్పిన లక్షణాలనే శారదా తనయుడూ అంగీకరించటం వల్లా అందరు చెప్పిన నాయక లక్షణాలలోనూ శృంగార వీర లక్షణాలు రెండూ అంతర్భూతంగా ఉండటంవల్లా విశిష్ట ధీరలలిత దక్షిణ నాయకుడే వైశికుడు అనగా వైశికుడనే శృంగారనాయకుడౌతాడు.

ఇక - శృంగార నాయకుడైన వైశికుడి గుణాలు సహజమనీ ఆహార్యమనీ రెండు విధాలు. వాటిలో రూపలావణ్యాదులు సహజ లక్షణాలు. శాస్త్రజ్ఞతాదులు ఆహార్యంగా సంపాదించుకునేవి.[3] వీటిలో వీర శృంగారాలకూ కళా వైదగ్ధ్యానికీ సంబంధించిన విశేషాలు కూడ ఉండటం సంభావ్యం.

గుణ విభాగశః భరతుడు వైశికుడిలో పంచవిధ భేదాల్ని సూచించాడు. వారు చతుర ఉత్తమ మధ్యమ అధమ సంప్రవృద్ధులు. శారదాతనయుడు వీరందరినీ కలిపి ఉత్తమ మధ్యమ అధమమని త్రిధామాత్రమే విభాగించాడు. భరతోక్తమైన చతుర ఉత్తమ లక్షణాలలో [4] సారభూతమైన వాటిని ఏకం చేసి ఉత్తముడుగా పేర్కొన్నాడు. గుణవిశేషతః భాగవత శ్రీకృష్ణుడు ఉత్తమ వైశికుడు. అతనిలో సామన్య వైశిక లక్షణాలు కూడ కొన్ని అంతర్లీనంగా ఉన్నాయి. భావప్రకాశనంలో శారదాతనయుడు పేర్కొన్న ఉత్తమ వైశిక లక్షణాలివి :

శ్లో ॥ అవశోఽపిహి కామస్య వశం యాతీవ దృశ్యతే
అసంగోఽపి స్వభావేన సక్తవ చ్చేష్టతే ముహుః
త్యాగీ స్వభావమధురః సమదుఃఖ సుఖః శుచిః
కామతంత్రేషునిపుణః క్రుద్ధానునయ కోవిదః
స్ఫురితే ఽ నాదరే కించి ద్దయితా యా విరజ్యతి
ఉపచార పరోప్యేష ఉత్తమః కథ్యతే బుధైః  భావప్రకాశనము, పుట. 228

అంటే వైశికోత్తముడు అవశుడైనా కాముడికి వశుడైనట్లు కనబడతాడు. స్వభావతః సంగరహితుడైనా సక్తుని లాగా ముహుః చేష్టాయుక్తుడౌతాడు. త్యాగి స్వభావ మధురుడు సుఖదుఃఖాలలో సమానుడు శుచి కామతంత్రాలలో నిపుణుడు. కోపించిన స్త్రీలను

---

3 నాట్యశాస్త్రం 23 - 3

4 శ్లో॥ దుఃఖ క్లేశ సహిష్ణుః ప్రియవదనః ప్రసాదనే కుశలః
(సమదుఃఖక్లేశసహః ప్రణయక్రోధ ప్రసాదనే కుశలః)
రత్యుపచారే నిపుణోదక్షః చతురస్సహబోద్ధవ్యః॥
యో విప్రియం నకురుతే, ధీరోదాత్తః ప్రియంవదో మానీ ।
అజ్ఞాత హృదయ తత్త్వోక్షేయః స్మృతిమాన్ స తు జ్యేష్ఠ (ష్ఠః) ॥
మధుర స్త్యాగీ రాగం నయాతిమదనస్యనా ఽ పి వశమేతి ।
అపమానితశ్చ నార్యా విరజ్యతే స చ భవే జ్యేష్ఠః ॥  నాట్యశాస్త్రం - 23 - 50,51,52

అనునయించటంలో కోవిదుడు. ప్రియురాలి వద్ద ఏమాత్రమైన అనాదరం స్ఫురించినా విరక్తుడౌతాడు. కామోపచారపరుడైనా అనాదరాన్ని సహించడు.

**1. (అ) కాముడికి అవశుడైనా వశుడైనట్లు కన్పడటం**

**(అ) స్వభావతః సంగరహితుడైనా సక్తుని లాగా ముహుఃచేష్టాయుక్తుడు కావటం**

శ్రీకృష్ణుడు స్వభావతః స్త్రీల కవశుడు. వారిపట్ల కామావేశపరుడు కాడు. ఐనప్పటికీ ఆయన చేతలు వారికి వశుడైనట్లే భ్రమను కల్పిస్తాయి. వారు పరవశిస్తారు. అందువల్లనే ద్వారకలోని ఆయన శుద్ధాంత కాంతలు ఆయనను జూచి పొంగిపోయారు. పలు భావాలకు లోనైనారు. 'అర్థిపరమున్ బుద్ధిన్ విలోకంబులన్ / గరయుగ్మంబుల గౌగిలించి' (1-268) పలుచేతలతో సన్మానించారు. కాని వారి చేతలకు ఆయన పరవశించ లేదని పోతన ఎలుగెత్తి చాటాడు. 'కాంతల దంభచేష్టల మాధవున్ / నంచలింపగ జేయనేమియు జాలరైరి' (1-269) అనీ;' సంగరహితుండైన కంసారి సంసారి కైవడి విహరింప నజ్ఞాన విలోకులైన లోకులు లోకసామాన్య మనుష్యుండని తలంతురనీ (1-270) వివరించాడు. దీనివల్ల ఆయన కామవశుడు కాలేదన్నది స్పష్టం. స్త్రీలకు అవశుడైనప్పటికీ వారిని ఆనందింపచేయటానికి పునః ప్రయత్నించటం ఆయన నైజం.

ఆయన తన శుద్ధాంతంలోని ప్రోషిత భర్తృకల్ని సాదరంగా పరామర్శించిన వైనం దర్శనీయం.

సీ॥ తిలక మేటికి లేదు ? తిలకినీ తిలకమ !
        పువ్వులు దుఱుమవా ? పువ్వుబోణి !
    కస్తూరి యలదవా ? కస్తూరికాగంధి !
        తొడవులు తొడవవా ? తొడవు తొడవ !
    కలహంస బెంపుదే ? కలహంస గామిని !
        కీరంబు జదివింతె ? కీరవాణి !
    లతల బోషింతువా ? లతికా లలితదేహ !
        సరసి నోలాడుదె ? సరసిజాక్షి !

ఆ. మృగికి మేత లిడుదె ? మృగశాబలోచన !
    గురుల నాదరింతె ? గురువివేక !
    బంధుజనుల బ్రోతె ! బంధుచింతామణి !
    యనుచు సతుల నడిగె నచ్యుతుండు . 1-266

ఇలా వారి అరతిపై దృష్టి సారించి వారి నిరలంకరణను గూర్చి హెచ్చరించాడు. తాను ఉదాత్త భావనాభిరుచులకు ఆలవాలమైన వేషభూషాద్యలంకారాల మీద మోజున్న వాడిగా గోచరించాడు. దానితో వారి సౌందర్యానికి ఆయన ఆకృష్టుడైనట్లు వారు భావించారు. రకరకాల భావాలకు లోనైనారు. కానీ నిజానికి ఆ సతుల హావభావాలకు కృష్ణుడేమాత్రం చలింపలేదని ఆయన ప్రవర్తనే విదితం చేస్తుంది (1-269.)

రాసక్రీడానంతరం 'ఆ నిత్యశో/భను డెట్లుండిన నుండెగాక కలవే బంధంబు లుర్వీశ్వరా !' అని పల్కిన శుకునివాక్యం ఇందు కుపబలకం (10-1106).

కాంతా విస్రంభణం కోసం కామకళావిదుడైన శ్రీకృష్ణుని చర్య గోపికా వస్త్రాప హరణం. అందులో అతని ప్రయత్నం ఫలించింది. ఐనా వారిపట్ల సంగరహితుడైనాడు. మారవికారహేతువైన ఆయన వేణునాదం కేవలం శృంగారాహ్వాన సంకేతమే. దాని కాకృష్టలై వచ్చిన గోపకాంతల్ని మాత్రం కాదన్నాడు. హితబోధ చేశాడు. అలాగే రుక్మిణి తోడి విరసోక్తుల విషయంలో తాను కాంతా వ్యామోహానికి అతీతుడననీ తన శృంగార వృత్తాలేవీ మోహతత్త్వ ప్రతిపాదితాలు కావని వివరించటం (10 ఉ. 232) గమనార్హం. ఇలా ముహుః చేష్టాయుక్తుడైనా శ్రీకృష్ణుడు 'పద్మపత్రమివాంభసా' భగవద్గీత, 5-10) సంగరహితుడే. సాంఘిక పరమైన ఆయన సర్వ ధర్మకర్మలూ ఇలాంటివే.

గోపకాంతలకు ముని కాంతలకు భారతీయ గృహిణీ ధర్మాల్ని ఉపదేశించి సదాచార సంప్రవర్తకురాండ్రుగా తీర్చిదిద్దదలచిన 'స్త్రీ ప్రణేత' శ్రీకృష్ణుడు. ఇది వాత్స్యాయనోక్త నాయక లక్షణం.

### 2. శ్రీకృష్ణుడు త్యాగి

త్యాగి అనగా శూరుడు ఈవికాడు. తన కాంతల్ని శంఖచూడుడు అపహరించిన సందర్భంలోనూ సత్యా సహితంగా సాగించిన నరకాసుర యుద్ధంలోనూ, రుక్మిణీహరణ ఘట్టంలోనూ, ఇతర వివాహాల విషయాల్లోనూ పరాక్రమాన్ని ప్రదర్శించి నాటి రాజచక్రంలో అవక్ర విక్రముడుగా నిలిచిన త్యాగి, మాని. ఇలా పలుతావుల్లో తన సతీ జనాన్ని సంతోష పెట్టాడు. తన పరాక్రమాది గుణగణాలచేత అనేక శృంగారవతుల్ని ప్రజల్ని ప్రబల శత్రువుల్ని వశం చేసుకున్న విక్రాంతుడు, 'విశేషేణ క్రామతి ఇతి విక్రాంతః' ఇది అతని సామాన్య వైశికలక్షణం. ఇదే ఆయన ధీరలలిత సంప్రియతకు అంటే బాగా ఇష్టుడుగా ఉండటానికి మూలం. నన్మిత్రుడైన కుచేలుని పట్ల సర్వసంపత్ప్రదాత. ఉత్తమ ధీరలలితుడి స్థూలలక్షత [25] కూడ ఇదే.

### 3. స్వభావ మధురుడు

గోపికా వస్త్రాపహరణ గోవర్ధన పర్వతోద్ధరణ గోపికా విలాసాలలోని ఆయన చేష్టా మాధుర్యం గోపికా సందేశంలోనూ వేణుగానంలోనూగల ఆయన భావ మాధుర్యం ఆస్వాదనీయం. గోపికల వేదనలో కృపారసం పైజల్లే మధుర హృదయుడుగా దర్శించారు గోపికలు. ఈ రసికుడైన శ్రీ కృష్ణుని చరితామృతమంతా ఆయన స్వభావమాధుర్యంతో సందీప్తమౌతుంది. అది ఆయన దక్షతకు శీలసంపదకూ లాలిత్యానికీ మూలకందం. అదే ఆయావ్యక్తుల్ని ఉద్దీపించింది.

---

5 'స్థూలః వదాన్యః స్థూలలక్ష దానశౌండాః బహుప్రదే' - అమరం.

**4. సుఖ దుఃఖ సముడు**

కృష్ణుడు కాలగమనంలో కాలయవన జరాసంధాది రాక్షస బాధలకు లోనైనా దుఃఖంతో క్రుంగిపోక స్త్రాంగనాజన సౌఖ్యానికి పొంగిపోక రెంటినీ సమంగా స్వీకరించిన ఉత్తమ వైశికుడు స్థితప్రజ్ఞుడు ఉద్దాంత కాంతలతోనున్న అయన 'ఆత్మాశ్రయమైన బుద్ధి యాత్మయందున్న యానందాదుల తోడం గూడని తెఱంగున నీశ్వరుండు ప్రకృతి తోడం గూడియు నా ప్రకృతి గుణంబులైన సుఖదుఃఖంబుల జెందక యుండు' (1-270) సని పోతన వ్యాఖ్య. ఇలాంటిదే సామాన్య వైశిక 'ధృతి' లక్షణం కూడ.

**5. శుచి**

శ్రీ కృష్ణుడు నిత్యశృంగార శుచిరుజ్జ్వల మూర్తి. శృంగార ప్రియుడు. నిత్య వయో వేష భూషోల్లసితుడు. అయన దినచర్యలో ఇది విదిత విషయమే.

సీ॥ మలయజ కర్పూర మహిత వాసిత హేమ
కలశోదకంబుల జలకమాడి
నవ్య లసన్మృదు దివ్యవస్త్రంబులు
వలనొప్ప రింగులు వాఱగట్టి
మకర కుండల హార మంజీర కేయూర
వలయాది భూషణావలులు దాల్చి
ఘనసార కస్తూరికా హరిచందన
మిళిత పంకము మేన నలర నలది
తే॥ మహిత సౌరభయుత కుసుమముల దుఱిమి
పొసగ రూపైన శృంగార రస మనంగ 10. ఉ. 633

ఇలా వైశిక సామాన్యంగా సువేషుడుగా సుఖభోగిగా శోభిస్తాడు. అలాగే సుభగుడు ప్రియదర్శనుడు రూపసంపన్నుడై ఉత్తమ ధీరలలితుడుగాను నిత్య శోభనుడు (10-1106) గాను సురుచిరమూర్తిగాను గోచరిస్తాడు.

**6. కామతంత్ర నిపుణుడు**

గోపికాముఖ ముఖరిత పూర్వ లీలా సంస్మరణం శ్రీకృష్ణుని కామతంత్ర సౌభాగ్యాన్ని వెల్లడిస్తుంది.

సీ॥ ఈ పొదరింటిలో నిందాక గృష్ణుండు
నాతోడ మన్మథ సటనమాడె 10-1032

సీ॥ ఒక యిలనాగ చెయ్యూది నాడిక్కడ
నరసమున్నవి నాల్గు చరణములును 10-1028

అంటూ అయన. కామకేళీ విహరణాన్ని స్మరిస్తారు. ఇలా అయన చిట్టంటు చేతల సుభగుడు. కామకేళీ నిపుణుడైన వైశికోత్తముడు ఈ పదముద్రల గూర్చిన ఊహా క్రమంలో వైశిక నాయకుని చిత్రరత వైశారద్యం విద్యోతిత మవుతుంది. రాసలీలా

ప్రకరణమంతా అయన కామకేళీ విలాసమే. ఆత్మారాము డైనప్పటికీ గోపికలతో రమించిన రీతి రమణీయ దృశ్యం.

మ॥ కరుణాలోకములం బటాంచల కచాకర్షంబులన్ మేఖలా
కర బాహు స్తన మర్దనంబుల నఖాంక వ్యాప్తులన్ నర్మవా
క్పరిరంభంబుల మంజులాధర సుధాపానంబులన్ గాంతలన్
గరగించెన్ రతికేళి గృష్ణుడు కృపన్ గందర్పు బాలార్చుచున్. 10-1001

ఇందులోని అయన కామతంత్ర పరతంత్రత సుమనోజ్ఞం.

**7. క్రుద్ధానుశయ కోవిదుడు**

శ్రీకృష్ణుని పునరాగమనానంతరం గోపికలు ఈషత్కోప దీప్తాస్యలైనారు. పలురకాల ప్రణయకోపాలు ప్రదర్శించారు. వారిని 'నా/బాయుట తప్పుగా గొనక భామినులార కృపన్ శమింపరే' (10-1078) అని చక్కని మాటలతో వారి లోనిక్కిన వియోగ తాపాన్ని ఒక్కసారిగా పోగొట్టిన అనునయశాలి. అలాగే రుక్మిణిని విరసోక్తులతో నొప్పించి అపై అనునయించాడు. మానానంతర సంభోగం స్వర్గతుల్య మయిందిగా భావించటం చేతనే అలా చేసి ఉంటాడు. కనుకనే 'కళాచతురత' (10.ఉ.230)ను ప్రదర్శించాడు అమెతోడి సంభాషణలో.

**8 ప్రియురాలి అనాదరానికి విరక్తుడు**

'ఒక్కనాడు రుక్మిణీదేవి లోగిట పారిజాత ప్రసవామోద విమళ సదన సుందరంబు నైన లోపలి మందిరంలో' అమెతో శ్రీకృష్ణుడు ఉన్న తరుణంలో అయన కొంత అనాదరానికి లోనై ఉండవచ్చు. సత్య కోసం తెచ్చిన పారిజాత విషయంలో అసంతృప్తి చెంది అమె కొంత అహంకృతిలో ప్రవర్తించి ఉంటుం'దనే శ్రీధరాం వారి ఊహ రసనమంచితం.[6] కనుకనే శ్రీకృష్ణుడు కొంతగా విరక్తుడై విరసోక్తుల నాడి ఉండవచ్చు. గోపికల తోడి అంతర్ధానం కూడ అలాంటిదిగానే భావించవచ్చు.

**9. కామోపచారపరుడయినా అనాదర అసహిష్ణువు**

కామోపచారాలు శృంగార నాయకులకు సర్వ సహజాలు. తనతోడి సాంగత్య సౌభాగ్యానికి గర్వించిన గోపికలకు 'మక్కువ' లెక్కువ కావటం సహింపలేక పోయాడు శ్రీకృష్ణుడు. కనుకనే వారినుండి అదృశ్యుడై అనాదర అసహిష్ణువుగా గోచరిస్తాడు.

ఉ॥ చిక్కక యాశుడై యెదిరి జిక్కుల బెట్టెడి మాయలానికిన్
జిక్కి కృతార్థులై మరుని చిక్కుల జిక్కి లతాంగు లుండగా
మక్కువ శాంతి సేయుటకు మన్నన సేసి ప్రసన్ను డౌటకున్
జక్కన నా విభుండు గుణశాలి తిరోహితు డయ్యె నయ్యెడన్. 10-1005

అయన కామోపచారకుశలత రుక్మిణీ రమణీమణీ పరంగా రమణీయంగా సాగింది

---

6 అంధ్ర వాఙ్మయము. కృష్ణకథ. 1. పుట. 163

సీ॥ కని సంభ్రమంబున దనువున దనువుగా
  నమువున జందనం బల్ల నలది
కన్నీరు పన్నీట గడిగి కర్పూరంపు
  బలుకులు చెవులలో బాఱనూది
కరమొప్ప ముత్యాల సరులు చిక్కడలించి
  యురమున బొందుగా నిరవు కొలిపి
తిలకంబు నునుఫాల ఫలకంబుపై దీర్చి
  వదలిన భూషణావళుల దొడిగి

తే॥ కమలదళ చారు తాళ వృంతమున విసరి
పొలుచు పయ్యెద గుచముల బొందు పఱచి
చిత్త మిగురొత్త నొయ్యన సేదదేర్చి
బిగియ గౌగిట జేర్చి నెమ్మొగము నిమిరి. 10-ఉ 241

ఇలా కామోపచారాలు నిర్వహించటంలోను స్వీకరించటంలోను కుశలుడు. ఐనా స్త్రీల అనాదరాన్ని సహింపని అసహిష్ణువు.

ఉత్తమ వైశిక లక్షణాలలో అంతర్గత మైనవే కాక మరికొన్ని సామాన్య లక్షణాలు సైతం భాగవత కృష్ణునిలో దృగ్గోచరమౌతాయి. భరతుని నాట్యశాస్త్రం లోని సామాన్య వైశిక లక్షణాలివి :

శ్లో ॥ శాస్త్రవచ్ఛీల సంపన్నో రూపవా న్ప్రియదర్శనః
విక్రాంతో ధృతి మాంశ్చైవ వయోరూప కులాన్వితః
సురభి ర్మధుర స్త్యాగీ సహిష్ణు రవికత్థనః
అశంకితః ప్రియభాషీ చతుర స్సుభగః శుచిః
కామోపచారకుశలో దక్షిణో దేశకాలవిత్
అదీన వాక్యః ప్రియ వాగ్మాగ్మీ దక్షః ప్రియంవదః
అలుబ్ధః సుఖభోగీ చ శ్రద్ధధానో దృఢవ్రతః
గమ్యాను ష్వ ప్యవిస్రంభీ మానీ చేతి స వైశికః నాట్యశాస్త్రం-23-7

శాస్త్రవిదుడు నానాశాస్త్ర విదుడు విశిష్టంగా కలాశాస్త్రం కామశాస్త్రం తెలిసినవాడు శీల సంపన్నుడు రూప సంపన్నుడు చూడదగినవాడు విక్రముడు ధృతిగలవాడు వయస్సు తదుచిత వేషం కలవాడు కులంగలవాడు సురభి మధుర స్వభావుడు త్యాగి సహిష్ణువు అవికత్థనుడు శంకారహితుడు ప్రియభాషి చతురుడు సుభగుడు శుచి కామోపచార కుశలుడు దక్షిణుడు దేశకాలవిశదుడు దీన వచన రహితుడు ప్రియవచనుడు అలుబ్ధుడు సుఖభోగి శ్రద్ధాళువు దృఢవ్రతుడు గమ్యవనిత లందును విస్రంభ రహితుడు మాని అయినవాడు వైశికుడు.

సాందీపని ముఖతః శ్రీకృష్ణుడు 'వేదశ్రేణియు నంగకంబులు ధనుర్వేదంబు దంత్రంబు మ/న్వాది వ్యాహృత ధర్మశాస్త్రములు నుదన్వ్యాయముం దర్కవి/ద్యా దక్షత్వము రాజనీతియును '(10.1408) చతుష్షష్టికళలను అభ్యసించాడు. గోపికా విహారం కుబ్జాశృంగారం రాసలీలావిలాసం వంటివి ఆయన శృంగారకళకు దాని అంగ విద్యలకు నెలవులు. గీత వాద్యనృత్య భూషణ యోజన వస్త్రగోపనాలన్నీ చతుష్షష్టి అంగవిద్యలలో కొన్ని [7] కామ సూత్రాలతో పాటే ఈ అంగవిద్యలను కూడా అభ్యసించిన స్త్రీ పురుషులే సంభోగంలో సంపూర్ణమైన సంతృప్తిని పొందగలుగుతారన్నది నిస్సంశయం. కాగా ఆయన సర్వవిద్యాపారంగతుడు వస్త్రచౌర్య నిపుణుడు. ఆ నైపుణ్య గమనాన్ని తన ఛందోనైపుణ్యంతో మేళగించాడు పోతనార్యుడు.

తరలం : కదలకుండని తోడివారల గన్నుసన్నల నిల్పుచున్
బదము లొయ్యన నేల బెట్టుచు బద్మనేత్రుడు మౌనియై
పాదలపాటున నల్లనల్లన పొంచిపొంచి నతాంగుడై
యదను గోరుచు డాసి వ్రేతల యంబరంబులు దొంగిలెన్. 10-814

ఇలాంటి అమూలకల్పనలతో ఆంధ్ర భాగవత శ్రీకృష్ణుడు వైశిక నాయక శిఖామణిగా కనిష్ఠికాధిష్ఠితు డైనాడు.

సర్వసన్నివేశాలలో గుణపరిమళంతో కీర్తి సంపదలతో కూడిన సురభి ఆయన. ఆయనను అన్యాపదేశంగా 'పృథివి నధిపులు నూతన ప్రియులు గారె' (10-1463) అంటూ గోపిక లాడిన నిందావాక్యాల్ని భరించి ఆదరించిన సహిష్ణువు.

శా ॥ రమ్మా యుద్ధవ ! గోపకామినులు నా రాకన్ నిరీక్షింపుచున్
సమ్మోహంబున నమ్మియున్ మఱచి యే చందంబునన్ గుందిరో
తమ్మున్ నమ్మినవారి డిగ్గవిడువన్ ధర్మంబుగా దండ్రు వే
పొమ్మా ! ప్రాణము లే క్రియన్ నిలిపిరో ప్రోద్యద్వియోగాగ్నులన్. 10.1433

అంటూ గోపికా రక్షణ విషయంలో కడు శ్రద్ధాళు వైనాడు. స్వధర్మ నిర్వహణ దక్షుడు. భార్యా సంబంధమైన స్వగృహప్రవేశంలోనూ మునిపత్నీ గోపికాది ఇతర కాంతల నాకర్షించటంలోనూ అశంకితుడు అంటే నిర్భయుడు. శుద్ధాంత కాంతల నాదరించిన వైనం గోపికాలాలనం రుక్మిణీ సాంత్వనం సత్యతోడి సంభాషణం కుచేలుని ఆదరించిన రీతి అన్నీ ఆయన ప్రియభాషణకు ప్రబల నిదర్శనాలు. ఆయా పట్టులలో శ్రీకృష్ణుడు ప్రియవాగ్మి ప్రియంవదుడు. సర్వ విషయాలలోనూ అలుబ్ధుడు. దీనవాక్య రహితుడు. మధురానగర ప్రవేశానికి పూర్వం నందగోకులమే తన శృంగార క్రీడల కనువైన దేశంగానూ తరువాత రాసలీలకు శరద్రాత్రినీ ఎంచుకున్న దేశ కాలవిదుడు. ఉచితజ్ఞుడు ఉదాత్త చిత్తుడు.

---

7 వాత్స్యాయన కామసూత్రాలు. సం. 1. పు. 78

దక్షినాయక లక్షణం వైశిక సామాన్య అంతర్గతమైనదే. 'తుల్యోనేకత్ర దక్షిణః' నాయికలందరి యందు ప్రణయాను వర్తనంలో లవలేశమైన తేడా కూడా లేకుండా ప్రవర్తించే సమశీలుడు దక్షిణ నాయకుడు అని విశ్వనాదుని మతం.[8] అట్టి సమానురాగ వర్తనుడే శ్రీకృష్ణుడు. ఏ ముద్దరాలి వద్దకు ముందు వెళ్లాలో తేల్చుకోలేని మనస్థితిలో ఆయన అందరితో సమంగా విహరించటం అద్భుతావహం.

సీ ॥ సకలార్థ సంవేది యొక యింటి లోపల
 జెలువతో ముచ్చటల్ సెప్పుచుండు
 విపుల యశోనిధి వేఱొక్క యింటిలో
 సరసిజానన గూడి సరసమాడు
 బుండరీకాక్షుం డొండొక యింటిలో
 దరుణికి హారవల్లరులు గ్రుచ్చు
 గరుణా పయోనిధి మఱియొక్క యింటిలో
 జెలి గూడి విడియము సేయుచుండు
ఆ ॥ వికచ కమల నయను డొక యింటిలో నవ్వ్
 ప్రవిమలాత్ము డొకట బాడుచుండు
 యోగిజన విధేయు డొకయింట సుఖగోష్ఠి
 నలుపు ననఘు డొకట జెలగుచుండు. 10 ఉ. 617

'ఒక భామా భవనంబు మున్ను సొర' (1-260) అనే పద్యంలోనూ దక్షిణ నాయికా సమానానువర్తనంలోని చిక్కులు అతడి తంటాలు మనకు తలకెక్కుతాయి. అదేవిధంగా ఏకకాలంలో అనేక నాయికలతోడి కామకలాపం కూడ దక్షిణ నాయక లక్షణమే.

సీ ॥ చెలువ యొక్కతె చెక్కు జెక్కుతో మోపిన
 విభుడు తాంబూల చర్వితము వెట్టి
 నాడుచు నొకలేమ యలసిన బ్రాణేశు
 డున్నత దోఃస్తంభ మూతసేసె
 జెమరించి యొక భామ చేరిన గడగేర
 జతురుడు కుచ ఘర్మ జలమువాపె
 నలకంబు లొకయింతి కలిక చిత్రకరేఖ
 నంటిన బ్రియుడు పాయంగ దువ్వె
ఆ ॥ బడతి యొకతె పాడిపాడి డస్సిన యధ
 రామృతమున నాథు డాదరించె

---

8. ఆంధ్ర ప్రతాపరుద్రీయం, పుట.44

హార మొక్కసతికి నంసావృతంబైన
గాంతు డురము జేర్చి కౌగిలించె. 10-1093

ఇందులోని ప్రతిపాదం రమణీయామృత దృశ్యం. మనోహర ప్రణయ భావం. ఇది కామశాస్త్రపారంగతుడైన దక్షిణ నాయకుడి అనంత శృంగార క్రీడావిలాసం. అందులోని శయనోపచార కళాకౌశలం అనన్యసాధ్యం.

సమానానువర్తనపేకాః సమానానురాగత్వం కూడా దక్షిణ నాయక లక్షణ మని కొందరి భావం[9] అంటే నాయికలందరూ నాయకుడు తననే గాఢంగా ప్రేమిస్తున్నాడని భావించ గలగటం. శ్రీకృష్ణుని అంతఃపుర కాంతల మనః ప్రవృత్తి అలాంటిదే.

మ. పతి నా యింటికి మున్నువచ్చె నిదె నా ప్రాణేశు డన్మద్గృహా
గతుడయ్యెన్ మునుసేరబో దొలుత మత్కాంతుండు నా శాల కే
నితరాలభ్య శుభంబు గంటినని తా రింటింట నర్పించి ర
య్యతివల్ నూఱు పదాఱువేలు నెనమం డ్రవ్వేళ నాత్మేశ్వరున్. 1-263

ఇలా వారందరూ దక్షిణ నాయికారాధ్యలైనారు. గోపికీ గోపికీ మధ్య గోపాలుడై వెలసి మహారాసాన్ని నిర్వహించి సమానానురాగాన్ని ఏక కాలంలో పంచిపెట్టాడు.

దక్షిణ నాయకుడికి ఒక్క నాయిక యందే గాఢానురాగం ఉండి ఇతరుల యందు తరతమ భేదం కూడ ఉండవచ్చునని కొందరి భావం. కనుక రుక్మిణి యందే శ్రీకృష్ణునికి గాఢానురాగం ఉందనవచ్చు. అందుకు 'రాఘవత్వే భవేత్ సీతా రుక్మిణీ కృష్ణ జన్మని' (విష్ణుపురాణం. 1-9-144) అనే శ్లోకం కూడ బలమిస్తుంది. ఏవం విధంగా భాగవతగత శ్రీకృష్ణుడు సర్వ లక్షణ లక్షితుడైన దక్షిణుడు.

శ్రీకృష్ణుడు నాయికలందరిలో సమత సాధించిన దక్షుడుగా పోతన ప్రశంసల నందుకొన్నాడు.

కం ॥ తరుణులు పెక్కండ్రయినను
బురుషుడు మనలేడు సవతి పోరాటమునన్
హరి యా బదాఱు వేవురు
తరుణులతో సమత మనియె దక్షత్వమునన్. 10 ఉ.221

ప్రభాస తీర్థంలో మరణించిన సాందీపని పుత్రుడిని అయన కోరికమేరకు పరలోకాలకు వెళ్లి వెదకి తెచ్చి గురుదక్షిణగా సమర్పించిన దృఢవ్రతుడు దృఢ భక్తుడు దక్షుడు శ్రీకృష్ణుడు. భీష్మస్తుతిలోని శ్రీకృష్ణుని స్వరూపం లోనూ శిశుపాల నరకాసురాది వివిధ రాక్షస సంహార సమయాల్లోనూ మహాభిమానిగా మానిగా మాననీయుడు.

---

9 ఆంధ్రప్రతాప రుద్రీయం. పుట - 45

వైశికునిలో సామాన్యమైన ధీరలలిత లక్షణాలేకాక భోజదేవోక్తమైన ఉత్తమ ధీరలలితుని విశేష లక్షణాలైన సువేషత సంప్రియత యౌవన స్థూలలక్షత ప్రియంవదత్వ మాధుర్య లాలిత్య దృఢభక్తితలు[10] కూడ చాల వరకు గతార్థాలే. కనుకనే అవి ఆయా తావుల్లో ప్రదర్శితాలు.

ఇవి కాక ఆంధ్ర మహాభాగవత ఆరంభ పద్యంలో మహానాయక లక్షణాలు పోతన నిక్షేపించాడు శ్రీకృష్ణునిలో. మహానందాంగనా డింభకుడు 'పృశ్నిగర్భుండైన అర్భకుండు'(10-130) మహాకులీనుడు. దానవోద్రేక స్తంభకుడైన తేజస్వి, భక్తపాలన కళాసంరంభకుడైన విదగ్ధుడు, కేళిలోల విలసద్దృగ్జాల సంభూత నా/నాకంజాత భవాండకుంభకుడైన మహామహిముడు, లోకరక్షైకారంభకుడైన ధురంధరుడు. ఇవన్నీ వైశికుని వీర లక్షణాలే.

వాత్స్యాయనోక్తమైన నాయక లక్షణాలు శ్రీ కృష్ణునిలో మరికొన్ని దర్శించవచ్చు. అవి ఆయన సంపూర్ణ శృంగారజ్ఞతను మరింతగా వెలువరిస్తాయి. భాగవత కథలో బలరాముడే మద్యప్రియుడుగాని శ్రీకృష్ణు డమద్యపుడే. అర్జున ఉద్ధవాది మిత్రవత్సలుడు. వారాతనియం దనురక్తులైన వైశికదూతలు. నందగోకులం లోను కంసాది రాక్షస సంహార విషయికంగాను సమాజశీలుడు. రైవతక ఉత్సవ నిర్వహణాదులవల్ల ఘటాశీలుడు. శుద్ధాంత కాంతల విషయంలో గోష్ఠీశీలుడు. కుబ్జకు మువ్వంపులు దీర్చి శోభింప జేసిన స్త్రీలాలయితుడు[11]. అది ఆయన మహామహిమత్వం.

లాక్షణికులనేకు లీవైశిక నాయక లక్షణాన్ని బహులక్షణ సమీక్షా దక్షతతో క్రోడీకరించారు. లాక్షణికుల కిప్పట్ల ప్రధానాధారం వ్యాస భాగవతమే. అయితే పోతనగారు లక్ష్య గ్రంథమైన భాగవతాన్నే గాక బహులక్షణ గ్రంథాల్ని క్షోదక్షమంగా సమీక్షించిన సూక్ష్మేక్షణుడు. తత్ఫలితంగా శృంగార రసోజ్జ్వలంగా రూపొందింది ఆంధ్ర మహాభాగవతం. ఏవం విధంగా శ్రీకృష్ణుడు సమగ్ర వైశికనాయక శిఖామణిగా పోతన మహాశిల్పిచే మూర్తిమంతుడైనాడు.

# శృంగార నాయికలు - గోపికలు

భాగవతం నైకవిధ నాయికా సంభరితం. అందులో కృష్ణ పత్నులైన అష్టమహిషులు పౌరకాంతలు గోపకాంతలు షోడశ సహస్రవనితలు ఉన్నా అందులో అగ్రస్థానం వ్రేపల్లె గోపకామినులకే! కనుక గోపికా కృష్ణులే భాగవత నాయికా నాయకులు.

---

10 శృంగార ప్రకాశ, పుట. 284

11 'లాలనం తాపాం శరీరస్థితివైకల్య సంవరణం నఖాపామితి'

వాత్స్యాయన కామ సూత్రాలు, జయ మంగళ వ్యాఖ్య

భాగవత హృదయ స్థానీయమైన దశమస్కంధంలో శృంగార శృంగాగ్రాన నిలిచింది గోపికలే. వారి ప్రేమైక చిత్తవృత్తులే లోకంలో సరస హృదయులకు సంపూజ్యాలైనాయి. అందుకు కారణం వారు శ్రీకృష్ణుణ్ణి భగవంతుడిగా కాక శృంగార రస శేఖరుడిగా సంభావించి ఏతద్రస తరంగిణిలో అతడితో ఓలలాడి తరించిన తలోదరులు కావటమే. కనుకనే గోపికాకృష్ణులు ఆలంబనగా వెలసింది భాగవతం. కామభావ పరితృప్తికై వెలసిన మునులే గోపిక లవటం ఇందులోని మరొక విశేషం[12]. శృంగార సంవేదనే వారు లోకాని కందించిన సందేశం. అందుచేత రసదృష్టితో తిలకించినా భాగవతం లౌకిక శృంగార లీలా మాధుర్య నిధానం. కొన్ని తావుల్లో మోక్ష సంబంధరతి గోపికా వచనాల్లో గోచరించినా అందులోని దైహిక కామ ప్రసంగాలు రసప్రవణాలు. సర్వప్రాణి సహజమైన 'కామోత్కంఠత' గోపికలలో ప్రేమ యోగంగా పచేళిమ మయింది. అనగా కృష్ణుడి పట్ల వారి రతి రసపరిణతి చెందింది. వారి శృంగారోత్కర్షవల్ల భాగవతంలోని శ్రీకృష్ణుడు భగవంతుడనే భావం మరుగున పడింది. తత్ఫలితంగా భాగవతంలో ఈశ్వర వాల్లభ్యాన్ని మానవ మండలానికి దింపి[13] శృంగార వైజయంతికను ఎగురవేశాడు పోతన.

గోపికలు విరహవేదనా స్వరూపిణులు. సకల లౌకిక బంధనాలకూ వెలివడక నాయకునికై ఉఱికలు వేసే కామోత్కంఠలు. శృంగార సాగర సంగమానికి పరుగులు తీసే ప్రణయవాహినులు. వారు కామభావ సంజీవనలు. కృష్ణభావలాలసలు. మధుర భావావేశలు.

గోపికలు శ్రీకృష్ణుని పరమ ప్రియునిగా భావించారే గాని బ్రహ్మస్వరూపునిగా మాత్రం కాదు. వారి చిత్తం గుణమయమైన దేహ విషయాసక్తం మాత్రమే. ఈ భావాన్నే పరీక్షిత్తు -

శ్లో ॥ కృష్ణం విదుః పరం కాన్తం న తు బ్రహ్మతయా మునే
గుణ ప్రవాహో పరమస్తా సాం గుణధియాం కథమ్ ॥ 10-29-12

కం. జారుడని కాని కృష్ణుడు
భూరి పరబ్రహ్మ మనుచు బుద్ధి దలంపన్
నేరరు ...................... 10-968

అని ప్రశ్నించాడు. ఐనా 'గోవిందుమూర్తి పరశ్రేణికి ముక్తి దాయిని' (10-970) కనుక గుణమయ దేహాలను విడువ గలిగారని శుకుని సమాధానం. కృష్ణుని సువేషత సుందర గుణోజ్జ్వలత వారికి ఉద్దీపనాలైనాయి. కథకులూ శ్రోతలూ మాత్రమే శ్రీకృష్ణుడిని భగవంతుడిగా భావించారు. గోపికలు మాత్రం కాదు. ఐతే వారు కొన్ని పట్ల భావించిన

---

12 శ్లో ॥ పురా మహర్షయః సర్వే దండకారణ్యవాసిన ః ।
దృష్ట్వా రామం హరిం తత్ర భోక్తుమైచ్ఛన్ సువిగ్రహమ్ ॥
తే సర్వే స్త్రీత్వమాపన్నాః సముద్భూతా శ్చ గోకులే ।
హరిం సంప్రాప్యకామేన తతో ముక్తా భవార్ణవాత్ ॥ భక్తి రసామృత సింధుః, పుట. 113.

13 ఆరాధనా భాగవతం, పీఠిక పుట. 72

దైవాంశ సంబంధమైన భావాలూ వాడిన పదాలూ తమ ప్రియుణ్ణి ఉన్నతోన్నతుడిగా భావించి నారీజనం చేసే ప్రయోగాలే. లేకుంటే మరికొంత. అవి ఆయన చేసిన వీరోచిత సన్నివేశాల పట్ల అద్భుతాసక్తి విచిత్రభావన కలగటానికి దారితీశాయి.

శృంగార రసరంగంలో శైలూష ప్రదర్శించే అనేక భూమికల్ని భాగవత గోపికా విషయికంగా దర్శించవచ్చు. పరీక్షిత్తుకు కలిగిన సందేహాన్ని నివృత్తి చేసే శుకుని సమాధానం (10-1103, 1104) వల్ల కావ్యదృష్టికి కూడ గోపికలు పరకీయలనే విదితమవుతుంది. వారితో శ్రీకృష్ణు డనేక శృంగార క్రీడల్ని సలిపాడు మహారాసంలో.

కనుకనే పరకీయలైన గోపికల శృంగార జీవనం సందర్శనీయం. అన్యనాయికకు అష్టవిధ శృంగారావస్థలు కాక క్రమంగా విరహోత్కంఠిత అభిసారిక విప్రలబ్ధ అనే అవస్థాత్రయిమే సంభవిస్తుంది. అన్యవనిత మొదటి అవస్థలో విరహంతో ఉన్నదన్న అయి విరహోత్కంఠిత, ఆ పిమ్మట అభిసరించి సంకేతంలో ప్రియుణ్ణి దర్శించి అభిసారిక, సంకేతంలో పరిభ్రష్ట ఐతే విప్రలబ్ధ అవుతుంది. ఆమె పరాధీన కనుక ఆమెకు ఇతరావస్థలు సంభవించవని భావప్రకాశనమతం.[14]

కానీ భాగవత గోపికలు పరాధీనలైనా ఎవ్వరినీ సరకుగొనని సర్వతంత్ర స్వతంత్రలు. సముద్ర సంగమం కోసం అడ్డంకులెన్ని ఉన్నా ఉఱకలు వేసే వరద గోదావరి వంటిది వారి భావతీవ్రత.

ఆ గోప జనములందు గోపిక లందును
సకల జంతులందు సంచరించు
నా మహాత్మునకు బరాంగన లెవ్వరు ?
సర్వమయుడు లీల సలిపెగాక. 10-1107

అని పల్కిన శుకవచనాల్లో లోకదృష్టి ఖండింపబడింది. శుకుడిది పారలౌకిక దృష్టి. కాని రసానికి లౌకిక దృష్టే ప్రాణం. లౌకిక కవిగా రసపరిపోషణ లక్ష్యంతో భాగవతం రచించి సహృదయుల నాకర్షించి భాగవతం పట్ల తనజాతి ప్రజలకు మక్కువ నెక్కువ చేశాడు పోతన. కాబట్టి లౌకిక భావనకు గోపికలు పరాంగనలే ! వీరిలో ముగ్ధాది భేదాలు గూడ ద్యోతక మౌతాయి. అలాగే శ్రీకృష్ణునితోనే కలకాలం కాపురముండాలనే భావనలో పునర్భూ భావం కన్పిస్తుంది. ఇలా ప్రధానంగా వారు పరకీయలయినా ఆయన స్ఫూర్తితో ముగ్ధ ప్రౌఢ ధీరా ధీరాధీరాది పలుభూమికలు ధరించారు.

---

14 శ్లో॥ అన్యా త్ర్యవస్థా వేశ్యేకే కథయంతి మనీషిణః ।
ప్రథమాయా మవస్థాయా మన్యాస్యా ద్విరహోన్మనాః ॥
తతో ఽభిసారికా భూత్వా సంకేతే పశ్యతి ప్రియం ।
సంకేతాచ్చేత్పరి భ్రష్టా విప్రలబ్ధా భవే త్పునః ॥
పరాధీనతయా తస్యా నాన్యా ఽవస్థా విలోక్యతే । భావప్రకాశనము . పుట. 205

పరకీయలలో కన్యా ఊఢ భేదాలున్నాయి. భాగవత కన్యానాయిక భేదం ప్రథమతః సందర్శనీయం. గోపికా వస్త్రాపహరణ ఘట్టంలో శ్రీకృష్ణుడు తమకు పతివిభుడు కావాలని కాత్యాయనీ వ్రతాన్ని 'నందుని మందలోగల గోప కుమారికల' (10-805) అనగా పెండ్లి కాని ఆడపడుచుల కన్యాత్వాన్ని ఇలా ధ్రువీకరించాడు పోతన.

మ॥ రమణుల్ ప్రొద్దున మేలుకాంచి సఖులన్ రండంచు నాత్మీయ నా
మములం జీరి కుచద్వయీ భరములన్ మధ్యంబు లల్లాడగా
బ్రమదోద్దామ గజేంద్రయాన లగుచున్ బద్ధాక్షునిం బాడుచున్
యమునాతీరము జేర బోయిరి గృహీ తాన్యోన్య హస్తాబ్జ లై. 10-809

కన్యాసౌందర్యానికి అనన్య సదృశమైన ఈ వర్ణనం అతివ్యాసమే. వీరు తమ కోరిక తీరితే నేతిపసంతా లాడుతూ జాతర చేస్తామంటూ కోరి మ్రొక్కుకుంటారు (10-807). అమూలకమైన ఈ మ్రొక్కుబడి ఆంధ్రకన్యామణులకు సహజమే ! ఇక్కడ వీరిభక్తి శృంగార ఫల సాధనార్థమయిందే.

'హేమంతంబున మొదలినెల తొలిదినంబునందు' (10-805) అంటే మార్గశిర శుద్ధ ప్రతిపత్తిథిని కాత్యాయనీ పూజకు అర్హమైనదిగా ఆ కన్యలు భావించారు. ఈ మార్గశిర మాసాన్నే గీతలో శ్రీకృష్ణుడు 'మాసానాం మార్గ శీర్షోహం' (10-35) అని ప్రశంసించాడు. అటువంటి పవిత్ర మాసాన్నీ పవిత్ర కాళిందీ తీరాన్నీ వ్రతసిద్ధికి అనువైనవిగా [15] ఎన్నుకోవటం ఆ కన్యల వ్రతాసక్తికీ ప్రత్యయానికీ నిదర్శనం. ఇది సనాతన ధర్మ సంప్రదాయం.

కం॥ మా మా వలువలు ముట్టకు
మామా కొనిపోకు పోకు మన్నింపు తగన్
మా మానమేల కొనియెదు
మా మానసహరణమేల ? మానుము కృష్ణా ! 10-818

అంటూ మామ వరుసతో యమకాలంకార సంభరితంగా తమ శృంగారాత్మను నివేదించారు. కొంటెతనాన్ని శృంగార సూచకంగా సంభావించారు. పిలిస్తే వస్తామనీ ఏమైనా ఇస్తామనీ (10-828) ఇక ఏం చేస్తావో ఎలా చేస్తావోఅని కదిలించి కవ్వించే కామభాషల నెఱజాణలు వారు. కనుకనే శ్రీకృష్ణుడు వారిని శృంగారవతులుగా లక్షణవతులుగా గుర్తించి సంబోధించాడు.

జలమధ్యంనుండి కదలివచ్చే వారి అంగికం వారి తనూ సౌందర్యాన్ని ఇనుమిక్కిలి చేసింది.

---

15 శ్లో॥ గృహే గోష్ఠ వనారామ నదీ నగ సురాలయే ।
అనుగ్రహో ధ్రువోసిద్ధిః శీఘ్రం స్యా దుత్తరోత్తరం ।

కం॥ చంచ త్పల్లవ కోమల
కాంచన నవరత్న ఘటిత కంకణ రుచిరో
దంచిత కర సంఘాదిత
పంచాయుధ గేహలగుచు బడతులు వరుసన్. 10-837

వీరు కన్య లవటం చేతనే ప్రౌఢ సుందరీ పురస్సరంగా జలనిర్గమనం చేశారు.

## వేణునాదం

శృంగారసంకేతమైన వేణునాదాన్ని విని వచ్చిన గోపకాంతలు పరాంగనలు. కనుక వారు అభిసారికలు. ఆ నాదానికి వారి చిత్తం గొబ్బున తలకింది. అతణ్ణి హృదయంలోనే సర్వాంగీణ పరిష్వంగం చేసుకున్నారు అగాధానురాగలు. తమ లోచనాల కలిమికి అతడి దివ్య సుందర విగ్రహ వీక్షణ సంతర్పణం చాలుననుకున్నారు.

వంశనాళం లాగ మాధవాధర సుధాపానం చేయాలంటే ఏ నోములు పట్టాలో అని ఉపాయాంతరా లాలోచించిన ప్రేమైక మూర్తులు. వేణునాద పరాయత్త చిత్తలు, ససంభ్రమలు. ఆ చిత్రణంలో తమ హృదయకుహరంలో దాగివున్న మనోహరుని హఠాదాహ్వానం వల్ల ఉవ్వెత్తున వారి హృదయాలు పొంగాయి. తత్రాపి చేతలు సంభ్రమించాయి (10-965). ఇలా వేణునాద సంకేతంతో బయల్వెడలిన గోపాంగన లంతా పరకీయలు అభిసారికలు.

శ్రీకృష్ణుడు వారిని జార వాంఛలతో వలసరివచ్చిన వారిగా భావించాడు. వారిని 'నిజేశ్వరుల ముద్దియలు' (10-979) అని ఉద్దేశించాడు. వారిలో కొందరు గృహాంతరాలలో ఉద్దండింపబడ్డా జారుడని భావిస్తూనే మనోవీథిలో శ్రీకృష్ణుని పరిరంభించి చొక్కిన భావతీవ్రలు (10-966). పరవ్యసనలైన స్త్రీలు గృహకార్యవ్యగ్రలైనా తమ భర్తలకు ముద్దియలై తోచినా వారి ధ్యానంతా పరనాయకాయత్తమై ఉంటుందని సారాంశం. ఇదే పంచదశీయ భావంకూడ.[16]

శ్రీకృష్ణుని హితోక్తులు రుచింపక అతనిలో సౌరుసాగ్నిని జ్వలింపయత్నించి 'మగ పంతంబు దలంప' వలసిందని పల్కిన వాల్నిపుణలు. విరహాగ్నికి వెలువి తమను గౌగిలింపమని ప్రార్థించిన అధీరలు. తమ గాఢవాంఛారతి ఒప్పిదమని పల్కిన చతురలు. శ్రీకృష్ణసాన్నిహిత్యం లేనిదే జీవితం లేదని పల్కిన పరితప్తహృదయలు.

సీ॥ నీ యధరామృత నిర్ఝరంబులు నేడు
చేరి వాతెఱలపై జిలుకకున్న
నీ విశాలాంచిత నిర్మల పక్షంబు
గుచకుట్మలంబుల గూర్చకున్న

16 "పర వ్యసనినీ నారీ వ్యగ్రాదపి గృహకర్మణి" - పంచదశి - అధ్యా. 9 శ్లో 84

నీ రమ్యతర హస్త నీరజాతంబులు
చికుర బంధంబుల జేర్చుకున్న
నీ కృపాలోకన నివహంబు మెల్లన
నెమ్మొగంబుల మీద నెఱపకున్న
ఆ॥ నీ నవీన మాననీయ సల్లాపంబు
కర్ణరంధ్ర దిశల గప్పకున్న
నెట్లు బ్రతుకువార మెందు జేరెడు వార
మధిప ! వినగ దగదె యాడు కుయులు. 10-994

అంటూ మొర పెట్టుకున్నారు. కాదంటే మరణానికి సైతం వెనుదీయని సాహసలు వారు. ఈ కల్పనలోని వారి కామభావనలన్నీ పోతన స్వకపోల కల్పితాలే. అవే ఆయన శృంగారాత్మకు ప్రతిరూపాలు. కృష్ణుని కామవ్యగ్ర ప్రసంగంతో చుట్టూ చేరిన ఆ చక్కని చుక్కలు చంద్రుని చుట్టూ చుక్కల్లా చూడ ముచ్చటైనారు.

శ్రీకృష్ణుని అంతర్ధానంతో గోపికలలో విరహవాహిని వరవళ్లు త్రొక్కింది. ఆ శృంగారోన్మాదంతో ఆయన గుణానుకరణం చేశారు. చేతనా చేతన పరిజ్ఞానం కోల్పోయి ప్రకృతిలో ఆ పరమపురుషుని కోసం వెతికారు.

ఉ ॥ నల్లనివాడు పద్మ నయనంబులవాడు కృపారసంబు పై
జల్లెడువాడు మౌళి పరిసర్పిత పింఛము వాడు నవ్వు రా
జిల్లెడు మోమువా డొకడు చెల్వల మానధనంబు దెచ్చె నో
మల్లియలార ! మీ పొదలమాటున లేడు గదమ్మ ! చెప్పరే. 10-1010

అని అంటూ పరిభ్రమించారు ఆ కామార్తలు. 'కృపారసం' అంటే శృంగార పరమయిన కృపారసమనే వారి భావం. అదే వారి ప్రేమ భావామృతం. అందుకోసమే వారి పరితాపం.

శ్రీహరి పాద ముద్రలలో ఆయన ప్రణయ విహరణాన్ని విశ్లేషించిన శృంగార విదుషీమణులు.

సీ॥ ఒక యెలనాగ చెయ్యూదినాడిక్కడ
సరస మున్నేవి నాల్గు చరణములును
నొక నీలవేణితో నొదిగినా డిక్కడ
మగజాడలో నిదె మగువ జాడ
యొక లేమమ్రొక్కిన నొడిసి నాడిక్కడ
రమణి మ్రొక్కిన చొప్పు రమ్యమయ్యె
నొక యింతి నెదురుగా నొలసి నాడిక్కడ
నన్యోన్య ముఖములై యంఘ్రులొప్పె
ఆ॥ వొకతె వెంట దగుల నుండక యేగినా
డడుగు మీద దరుణి యడుగు లమరె

నబల లిరు కెలంకు లందు రా దిరిగినా
డాఱు పదము లున్నవమ్మ ! యిచట. 10-1028

ఇలా పలువిధాలుగా శ్రీకృష్ణునితోడి శృంగార క్రీడా సంస్మరణం చేసుకుంటూ పరవశించా రచటి అంభోజనయనలు.

## గోపికా గీతలు

గోపికా గీతలలోని ప్రతి భావం ఒక వియోగ శృంగారరస ఖండమే. జీవితంలో తమను సర్వత్రా రక్షించిన శ్రీకృష్ణుణ్ణి-

ఆ॥ విషజలంబు వలన విషధర దానవు
వలన గాలివాన వలన వహ్ని
వలన మిగులు వానివలనను రక్షించి
కుసుమ శరుని బారి గూర్ప దగునె? 10-1037

అని ఎత్తిపొడిచిన మధ్యాధీరలు. అనుక్షణం కృష్ణ దర్శనంకోసం ఎదురు తెన్నులు చూచే విరహోత్కంఠలు. పోతన వారిని ప్రౌఢలుగా భావించినా వారు మాత్రం తమను తాము ముగ్ధలను గానే భావించుకున్నారు. ప్రియుని గానక వారు చేసే పరిదేవనంలో (10-1050) విప్రలబ్ధలుగా గోచరిస్తారు. రాత్రులందు కూడా అయనను దర్శించే భాగ్యం లేకుండా భగవంతుడు తమ నేత్రాలకు రెప్ప లడ్డం చేశాడని వియోగ తాపాన్ని భరింపజాలక దైవోపాలంభన చేసిన దీనలు (10-1049). వారు పరాంగనలే ఐనా 'రహిత నాథలు' గానే భావించుకున్నారు. అపై భోగీ గుణవంతుడూ అయిన శ్రీకృష్ణుణ్ణే తమ నాథుడిగా ధ్రువీకరించుకొని మన్మథబాధ తీర్చమని వేడుకున్నారు (10-1055). ఇలా ఎప్పుడూ శృంగారి అయిన పరపురుషుడితో కాపురం ఉండాలని కోరటం అలంకార శాస్త్రరీత్యా కామశాస్త్ర రీత్యా పునర్భూనాయికా లక్షణం.[17]

శ్రీకృష్ణ సాక్షాత్కారం తర్వాత వారిలో నాయికా భేదా లనేకం ప్రస్ఫుట మైనాయి. వాటిలో కొన్ని వ్యాస నిర్మితాలే అయినా పోతన సాంద్ర భావముద్ర పొందిన శృంగార మూర్తులు. ఏతదుచిత రీతిని వారు వ్యవహరించారు (10-1059). ఒక్క లతాంగి యోగిలా మాధవుడి ఉజ్జ్వల రూపాన్ని చూపుతీవలతో బంధించి హృద్గతం చేసి లోచవులు చొక్కింది. (10-1061) ఇలా లోచవులు చొక్కటం పరాంగనాధర్మమే. అలాగే ఒక కుపిత నాయికా చర్య మనోహరం.

ఆ॥ భామ యొకతె భ్రుకుటి బంధంబు గావించి
ప్రణయ భంగ కోప భాషణమున
దష్టదశన యగుచు దండించు కైవడి
వాడి చూడ్కిగముల వరుని జూచె. 10-1059

---

17 వాత్స్యాయన కామసూత్రాలు, పం.2. పుట.97

ఇలా మరికొందరు నాయికల స్వభావాల్ని వారి హృదయమాధుర్యాన్ని చిత్రించడంలోని పోతనగారి రస నిర్వహణచాతురి అనితర సాధ్యం.

సీ॥ ఎలయించి ప్రాణేశ ! యెందుబోయితి ? వని
తేరంపు బలుకతో దూఱెనొకతె
జలజాక్ష ! నను బాసి చనగ నీ పాదంబు
లెట్లాడె?నని వగ నెయిదె నొకతె
నాథ ! నీ వరిగిన నా ప్రాణమున్నది
కూర్మియే యిదియని కుందెనొకతె
యాశ్వర! నను నిన్ను నిందాక బాపె నీ
పాపపు విధియని పలికె నొకతె

ఆ॥ తలగి పోవునట్టి తప్పేమి చేసితి
నధిప! పలుకు ధర్మ మనియె నొకతె
యేమి నోముఫలమొ హృదయేశ ! నీ మోము
మరల గంటి ననుచు మసలె నొకతె. 10-1062

ఇంకా విభుపల్కరింపులోగాని పల్కనంటూ వాక్సుధా ధారల నొలికే కలకంఠులూ (10-1063) అతని అదరింపుతోనేగాని దరిచేరనంటూనే ధైర్యం కోల్పోయి చెలికత్తెను పట్టుకొన్న బాలికలూ (10-1064) చెలువుని చూడనంటూ తలవంచినా లోన మరుడు తలెత్తగానే తామే ముందుగా చెలువునికై తలలెత్తిన ముగ్ధలూ (10-1065) అనేకలు. వీరు పోతన కల్పిత శృంగార నాయికలు. ఈ గోపికలు శ్రీకృష్ణ నిషక్తలు. అయనను 'సంవాహన' 'వచన కౌశలాది' కామాశ్రయ కళా నైపుణ్యంతో సన్మానం చేస్తూ -

కం॥ కొలిచిన గొలుతురు కొందఱు
గొలుతురు దము గొలువకున్న గొందఱు వరులం,
గొలిచినను గొలువకున్నను
గొలువరు మఱికొంద ఱెలమి గోపకుమారా ! 10-1072

అంటూ రహస్యంగా పల్కటం గమనార్హం. ఇదివారి నర్మసంభాషణా వైచిత్రినీ తన్మూలకంగా వారి రతి క్రీడాసక్తినీ వివరిస్తుంది.

అనేకానేక రాసబంధాలతో శ్రీకృష్ణుని సరసన వారు సల్పిన విహరణం వక్ష్యమాణం. అప్పటి వారి కామ చేష్టలూ మనోభావాలూ నాయికా స్వరూపాన్ని వివరిస్తాయి.

సీ॥ చెలువ యొక్కతె చెక్కు జెక్కుతో మోపిన
విభుడు తాంబూల చర్వితము వెట్టె
నాడుచు నొకలేమ యలసిన బ్రాణేశు
డున్నత దోః స్తంభ మూతసేసె

జెమరించి యొక భామ చేరివ గడగేర
జతురుడు కుచ ఘర్మజలము వాపె
నలకంబు లొకయింతి కలిక చిత్రకరేఖ
నంటిన బ్రియుడు పాయంగ దువ్వె
ఆ॥ బడతి యొకతె పాడి పాడి డస్సిన యధ
రామృతమున నాథు డాదరించె
హార మొక్క సతికి నంసావృతం బైన
కాంతు డురము జేర్చి కౌగిలించె. 10-1093

ఇట వారు నాయకసమ్మాన మొందిన రీతి విశదం. వారి శృంగార కళా విలాసం వివృత మయిందిక్కడ. ఆటలతో పాటలతో మంజీర మంజు శింజితాలతో మనసు రంజించి ఆయన కరతలాన్ని తమ కుచవేదికపై కూర్చుకొని స్వాభిలాషా ప్రకటనం చేసిన మోహయితలు కొందరు. శ్రీకృష్ణుడు సుగంధ సురభిళమైన తన భుజాన్ని మూపున పొందించటంతో సాత్త్వికోదయమైన వ్యాసచిత్రిత తరుణులు (10-33-11) అనేకలున్నారు. హరి తనుసంగ సుఖంతో పయ్యెదల జారుపాటులు కూడ పరికించని పరవశలు జాణలు ఈ వ్రేతలు.

దిన వియోగంలో వివిధభావ పరిభ్రాంతలుగా వారిని దర్శించవచ్చు. కంజాక్షునితోటి మాపటి సుఖాల కోసం రేపంతా ఎదురు తెన్నులు చూచిన ఎలనాగలు.

మ॥ లలనా! యేటికి తెల్లవాఱె రవి యేలా తోచె బూర్వాద్రిపై
గలకాలంబు నహంబు గాక నిశిగా గల్పింప డా బ్రహ్మ దా
వల తేడున్ గృప లేడు కీరములు దుర్వారంబు లెట్లో కదే
కలవే మాపటి కాలమందు మనకున్ గంజాక్షు సంభోగముల్. 10-1128

వారి ఈ కష్టాలకు కారణంగా బ్రహ్మను తప్పు పట్టారు. క్షణ మొక యుగంగా పరిగణించి ప్రతీక్షించారు.

మ॥ చెలియా ! కృష్ణుడు నన్ను బాసి వనముం జేరంగ నయ్యాక్షణం
బులు నా కన్నియు నుండనుండగ దగన్ బూర్ణంబులై సాగి లో
పల దోచుం బ్రహరంబులై దినములై పక్షస్వరూపంబులై
నెలలై యబ్దములై మహాయుగములై నిండారు కల్పంబులై. 10-1130

ఇది ప్రోషితభర్తృకా భావం. ఈ కాలగణన విధానం విరహిణీ ధర్మమని ఆలంకారికోక్తి.[18] ప్రతిక్షణం వారు ఉద్విగ్నహృదయలే.

---

18 శ్లో ॥ దేవతా పూజనం కుర్యాద్దద్యాద్బలిభుజే బలిం
లిఖే త్కాంతప్రతికృతిం పాఠయే చ్ఛుక శారికాః
గణయేచ్చావధి దినం గీతం గాయే త్తదంకితం
ఏవంవిధ వినోదేన నయే త్కాలం వియోగినీ ॥ నాట్యశాస్త్రం

కాలదూరాలు దగ్గరైన కొద్దీ ఉద్విగ్నత హెచ్చినట్లే దూరంతగ్గిన కొద్దీ వారు పరిభ్రాంతలైనారు. దినాంత సమయంలోని వారి పరిభ్రాంతి పరికింప దగ్గది.

మ॥ అదె భానుం డపరాద్రి జేరె నిదె సాయంకాల మేతెంచె న
ల్లదె గోపాదపరాగ మొప్పెసగె బృందారణ్య మార్గంబునం
దిదె వీతెంచి వృషేంద్ర ఘోషము ప్రియుం డేతెంచె రండంచు దా
మెదు రేతెంతురు మాపు కృష్ణునికి నయ్యింతుల్ పరిభ్రాంతలై. 10-1132

ఇలా మాపటి సుఖాల కోసం రేపంతా ఎదురు చూడటం ఆ గోపికలకు నిత్యకృత్యం.

"కొడుకుల మగల మామల మఱదుల వంచించి పంచాయుధ భల్లభగ్న హృదయలయి గృహకృత్యంబులు మఱచి శంకిలక సంకేత స్థలంబుల కృష్ణాగమన తత్పరలైయున్న గోపకామినులు' (10-1195) ముమ్మూర్తులా శ్రీకృష్ణాభిసారికలే. ఇలా గోపికలు కావించింది ఎంతో సాహసం సాంఘిక ధర్మవిరుద్ధం. వారి కామోత్కంఠత ఆ విధంగా వారిచేత ధర్మోల్లంఘనం కావింపచేసింది. ఎంతో త్యాగానికి ఒడి కట్టించింది. అన్ని ధర్మాలూ సామాన్యులకే అసాధారణ మనః ప్రవృత్తి గలవారికివి అనువర్తించవు.[19] కనుకనే వారిని అనింద్యలుగా లోకం గుర్తించింది. ఆరాధించింది.

శ్రీకృష్ణుణ్ణి అక్రూరుడు మధురానగరానికి తోడ్కొని వెళ్లే సమయంలోని వారి మనోవేదన గమనార్హం. మేటి గృహస్థు అయిన బ్రహ్మ తమ ఈ విరహానికి మూల కారణమని చింతించారు. సాటి ఆడదానిగా భారతికి తమ గోడు చెప్పుకొని ఆమెచేత అబ్జగర్భుడికి చెప్పించాలని యోచించారు (10-1211).

'ఆ / యమ్మలు గోపవృద్ధులు ప్రయాణము వల్లనరైరి చెల్లరే' (10-1213) అని పెద్దలను తెలివితక్కువ వారిగా ఎంచుతూనే వారి సహాయ సానుభూతుల కోసం అఱ్ఱులుసాచిన అధీరలు. తమ హావభావ లీలా విలాసాలతో నిత్య సంభావనలతో పురసతులు శ్రీకృష్ణుణ్ణి తమకు దూరం చేస్తారేమో అని వీరికి బెంగ అనుమానం. కృష్ణుడు వారివైపు మొగ్గుతాడేమోఅనే భయం వీరికి మెండు. అందుకే దైవోపాలంభన కూడా చేశారు. హరిమార్గానికి అడ్డుపడాలనీ దైవాన్ని ప్రార్థించాలనీ భావించి కందర్ప జ్వర భ్రాంతలైనారు. ఆ పరిభ్రాంతిలో కొప్పులూ చీరలూ మరచిన వివశలైనారు. కార్యవైఫల్యంతో చింతా క్రాంతలై సుజాతాలైన గీతాలతో విలపించారు. ఇది ముగ్ధ భావం. స్త్రీలు రోదించటం ఆరంభించగానే పురుషులు వశ్యులైపోతారు. 'రుదిత ముదిత మాత్రం యోషితాం విగ్రహేషు' అని ఆర్యోక్తి. కానీ అమంత్రం కూడ ఫలించలేదు. అక్రూరుడు నిజంగా క్రూరుడే అనీ కాకుంటే ఇలా చేయడనీ వారు నిందించారు.

మధురకు వెళ్లే కృష్ణుని వైపే కన్నార్పకుండా లోనొదవే మక్కువతో కన్నుల కబ్బినంత దూరం తిలకించారు ముగ్ధ భావంతో.

---

19 ఆధునికాంధ్ర కవిత్రయ శారదా సమారాధనం. పుట : 104

చం॥ అదె చనుచున్నవాడు ప్రియుడల్లదె తేరదె వైజయంతి య
ల్లదె రథ ఘోటకాంఘ్రి రజ మాదెస మార్గము చూడు డంచు లో
నొదవెడి మక్కువన్ హరిరథోన్ముఖలై గములై వ్రజాంగనల్
కదలక నిల్చి చూచిరట కన్నుల కబ్బినయంత దూరమున్. 10-1221

రథం దూరమయిన కొద్దీ వీరికి మక్కువ ఎక్కువయింది. వీరిక్కడ 'మనుష్యకృత విప్రలంభాన్ని' అనుభవించారు. అందుకే అక్రూరుణ్ణి నిందించారు. దినవియోగంలో కృష్ణుడు దగ్గరౌతున్న కొద్దీ ఉద్విగ్నత అధికమైతే, మధురా యాత్ర సమయంలో రథం దూరమౌతున్న కొద్దీ వీరిలో మక్కువ ఎక్కువయింది.

వారు తమ విరహానికి మొత్తం మీద మానవ దైవ కల్పనలు రెంటినీ కారణాలుగానే భావించారు. ఈ ఘట్టంలో గోపికలు తమలోతాము ఎన్ని మాటలనుకున్నా ఎన్ని ఆలోచనలు చేసినా బయటపడి ఎవరికీ చెప్పలేని ఏమీ చేయలేని ముగ్ధలు గానే మిగిలారు. ఈ సమయంలో వీరి కెదురుపడి నచ్చచెప్పి ఓదార్చటం సాధ్యం కాదనే కాబోలు దూతికా ముఖంగానే కబురంపి కృష్ణుడు మధురాయాత్ర సాగించాడు.

గోపికా విరహతప్త హృదయ భావాల ప్రతిబింబాలే భ్రమర గీతలు. ఉద్ధవుడి సందేశం గోపికలలో అసహనాన్ని పెంచింది. దానితో అప్పటి వరకు వారిలో ఉన్న శ్రీకృష్ణ సంబంధ నిర్వేదం శ్రీకృష్ణ ఉపాలంభనకు ఉద్యమించింది. వారిలో మానవిప్రలంభం విజృంభించింది. సందేశం తెచ్చిన ఉద్ధవుణ్ణి కృష్ణుణ్ణి కలిపి మరీ మరీ ఉపాలంభించారు. అయితే ఉద్ధవుణ్ణి భ్రమరంగా వ్యపదేశించారు. ఆ సందర్భంలో వారు అనేక శృంగార భూమికల్ని ధరించారు.

గోపికలు శ్రీకృష్ణుణ్ణి ప్రమదాళి కుచకుంకు మాంకితుడిగా స్మరించి 'భోగాంక జన్యమైన ఈర్ష్యాకృతమానం' వహించారు (10-1454). అలాంటివాడి నుండి సందేశం తెచ్చినందుకు ఉద్ధవుణ్ణి ఉపాలంభించారు. శృంగారాపరాధం చేసిన ఆ శ్రీకృష్ణుణ్ణి కీర్తించగా సహించలేని స్వాభిమానలు గోపికలు. కనుకనే అతడిని గూర్చిన ఆ గుణగానం ఏదో ఆ పురస్త్రీల ముందే ఆలపించమని దూతతో నిష్ఠురాలాడారు (10-1456). అందుకుగల కారణం వారిపట్ల గల ఈర్ష్య మాత్రమే. ఇట వారి మాటల్లో 'సల్లాప' లక్షణం ఉంది.

శ్రీకృష్ణుని శృంగార లోలత్వం వల్ల తమకు కలిగిన వెతలు క్రొత్తలేమీ కాదని తచ్చారిత్రాన్ని గూర్చి పల్కిన ఈర్ష్యామానలు వ్రేపల్లె గోపికలు (10-1456). పౌరకాంతల వలె శృంగార దూతలకు లంచాలిచ్చి మంచి చేసుకోలేమనీ తమ నాథుడికి హృదయాన్ని మాత్రమే ఇచ్చుకోగలమనీ దెప్పి పొడిచిన దిట్టలు. కృష్ణుణ్ణి నమ్మి మోసపోయామని దూతతో మొరపెట్టుకొన్న విరహ విషాద హృదయలు (10-1461). బంధు జనాన్ని వదలి భావజుడని భావిస్తూ వస్తే తమను వియోగ దుర్దశా సింధువులో త్రోసి, తాను ఇటు రాకపోవటం పాడిగాదని పునస్సందేశ మంపిన ధీరలు (10-1462). నిత్య నూతన

ప్రియుడైన తమ అధిపుడు పురకాంతలను విడిచి గోపకాంతలను గూర్చి ఎలా చింతిస్తాడని నిర్ణయించుకొన్న మనో విశ్లేషణ చతురలు.

సీ॥ కాంచన రత్న సంఘటిత సౌధంబులే
మా కుటీరంబులు మాధవునకు
వివిధ నరేంద్ర సేవిత రాజధానియే
మా పల్లె యదువంశ మండనునకు
సురభి పాదపలతా శోభితారామమే
మా యరణ్యము సింహ మధ్యమునకు
గమనీయ లక్షణ గజ తురంగంబులే
మా ధేనువులు కంస మర్దనునకు

తే॥ రూప విభ్రమ నైపుణ రూఢలైన
మగువలమె మేము మన్మథ మన్మథునకు
నేల చింతించు ? మము గృష్ణుడేల తలచు ?
బృథివి నధిపులు నూతన ప్రియులు గారె ! 10-1463

అంటూ చేసిన ఈ తారతమ్య విశ్లేషణ వారి ప్రేమాధిక్య పరాకాష్ఠకు పట్టుగొమ్మ.

తమకు సందేశం తెచ్చిన శృంగారదూత ఉద్ధవుణ్ణి పూజించి గౌరవించిన (10-1481) ఉచితజ్ఞలు. వారట్టివారు కావటం వల్లనే కృష్ణునిపై వారికున్న అజస్ర పటుధ్యానం వారి భవ్య చరితకు తార్కాణంగా చివరకు ఉద్ధవుడు కీర్తించాడు. ఇది వారి శృంగార శేఖరీయతకు నిదర్శనం.

ఇంతటి శృంగార విభ్రాంత చైతన్యలు కనుకనే వారి నానావిధ మానసిక స్థితులను ఊహించాడు శ్రీకృష్ణుడు. వారిని ప్రోషితభర్తృకా భావబంధురలుగా అయనే పరిగణించాడు. ఉద్ధవుణ్ణి గోపికల చెంతకు పంపే సందర్భంలోని శ్రీకృష్ణుని మాటలు గోపికా విరహిణీ మనోధర్మ వ్యంజితాలు.

శా॥ నాపై చిత్తము లెప్పుడున్ నిలుపుచున్ నారాక గాంక్షింపుచున్
నా పేరాత్మల నావహించుచు వగన్ నానాప్రకారంబులన్
గోపాలాంగన లెంత జాలిపడిరో కోపించిరో దూఱిరో
వ్రేపల్లెన్ నిజ ధర్మగేహములలో విభ్రాంత చైతన్యలై. 10-1430

ఈ ఒక్క వాక్యమే వారి శృంగార స్వరూప స్వభావానికి శ్రీకృష్ణు డెత్తిన పతాకగా పరిగణించవచ్చు. కనుకనే శ్రీకృష్ణుడు ప్రోద్యద్వియోగాగ్నితో ప్రాణాల్ని ఏ విధంగా గోపికలు నిలుపుకున్నారో పోయి చూచిరమ్మన్నాడు ఉద్ధవుణ్ణి.

ఉద్ధవుడు తెచ్చిన సందేశంతో సంతోషించిన గోపికలలో స్మరణపూర్వక అనురాగం గోచరిస్తుంది. వారు అమాయక హృదయలు. నిర్మల ప్రేమ స్వరూపిణులు.

శా॥ నీతో నర్మగృహంబులం బలుకునే నే మెల్ల వంశోల్లస
ద్గీత భ్రాంతలమై కళిందతనయా తీరంబునం జేరినన్
జేతోజాత సుఖంబులం దనిపి మా చిత్తస్థితుల్ సూడ లీ
లా తంత్రజ్ఞత డాగి మెల్లన మదాలాపంబు లాలించుటల్. 10-1475

అని శ్రీకృష్ణుడితోడి తమ శృంగార క్రీడా కౌశలాన్నీ బంధనియతినీ ఉద్ధవునితో ముచ్చటించటం వారి నిర్మల శృంగారభావ హృదయానికి స్వచ్ఛ దర్పణం. పై వాక్యాలవల్ల ప్రేమ అనేది ఉభయ నిష్ఠంగా సమంగా ఉండాలని వారి ఆరాటం. అదే ఉత్తమ ప్రేమిక లక్షణం కూడా. కనుకనే వారి హృదయ మాధుర్యం రసోచిత మయింది (10-1477).

శృంగార మిత్రుల పట్ల వారికి మిక్కిలి విశ్వాసం. అది పల్లీయమైన వారి హృదయ మధురిమకు సంకేతం. కృష్ణ హృదయ మందిరంలో సదా స్థిరనివాసం ఉండాలన్నదే వారి చిరకాలకాంక్ష. అది తీరని నాడు తమ ప్రాణాలు పోవటం తథ్యమని విజ్ఞాపన రూపమైన పునస్సందేశం పంపిన అపార వేదనాసంతప్త హృదయలు.

సీ॥ తను బాసి యొక్కింత తడవైన నిట మీద
నేలపై మేనులు నిలువ వనుము
నేలపై మేనులు నిలువక యటమున్న
ధైర్యంబు లొక్కట దలగు ననుము
ధైర్యంబు లొక్కట దలగిన పిమ్మట
జిత్తంబు లిక్కడ జిక్కవనుము
చిత్తంబు లిక్కడ జిక్కక వచ్చిన
బ్రాణంబు లుండక పాయు ననుము
తే॥ ప్రాణములు పోవ మఱి వచ్చి ప్రాణవిభుడు
ప్రాణి రక్షకుడగు తన్ను బ్రాణు లెల్ల
జేరి దూఱంగ మఱి యేమి సేయువాడు
వేగ విన్నప మొనరింపవే మహాత్మ! 10-1478

వారి ఈ విరహవేదనలో హృదయ చేదకమైన శృంగారనాదం ధ్వనిస్తుంది. ఎప్పటికైనా శ్రీకృష్ణుడిని తిరిగి చూడగలమో లేదో అనే నిర్వేదంతో సందేశం పంపిన కార్యచతురలు వారు. చివరకు వారు విరహిణులు గానే మిగిలి పోయారు. శ్రీకృష్ణుడి పునర్దర్శనం ప్రభాస తీర్థంలో గాని తిరిగి కలుగలేదు.

కనుక ప్రధానంగా గోపికలు విరహిణీ స్వరూపంలోనే వివిధ రూపాలలో గోచరిస్తారు. క్రమేపీ వారిలో శృంగార భావన ప్రేమరూపంగా పరిణమించి శ్రీకృష్ణప్రియలుగా శ్రీకృష్ణశృంగార నాయికలుగా లోకంలో నిలిచి పోయారు. వారిది ప్రతిక్షణ ప్రవర్ధమాన మయిన అవిచ్ఛిన్నమైన సూక్ష్మతరమయిన అనుభవరూపమైన అనిర్వచనీయమైన ప్రేమ

స్వరూపం. ఆ శృంగారోపాసకులకు శ్రీకృష్ణుని పట్ల తీవ్రాకర్షణ. కనుకనే వారిని ఏపేరుతో పిలిచినా వారికి పట్టదు. అందుచేతనే వారు భాగవత హృదయమైన దశమస్కంధంలో కేంద్ర స్థాన మాక్రమించిన రాసక్రీడలో శ్రీకృష్ణుని సరసన నిల్చి రస నిర్భరలైనారు.

పోతన ఇలా గోపికా ముఖంగా అనంతమైన శృంగారాన్ని త్రవ్వి తలకెత్తాడు ఆంధ్రులకు. అందులో కామశృంగార స్ఫోరకమైన భావ సౌరభాల్ని పరివ్యాప్తం కావించాడు. ఏవం విధంగా గోపవనితలు అలుకతో చెలిమితో కామోత్కంఠతో వగతో ప్రీతితో హరికి పరతంత్రలై ప్రవర్తించారు. రసప్రకాశమూర్తులై లోకాన్ని ఆకర్షించారు. ఉద్ధవ మునిముఖ్య గౌరవభాజన లైనారు.

# శృంగార దూతలు

శృంగార జీవులకు దూత ప్రేషణ మవసరం. దౌత్యం ప్రధానంగా పూర్వరాగ విప్రలంభానికి సంబంధించినదైనా, కొన్ని సందర్భాల్లో వియోగ మానవిప్రలంభంలోనూ ప్రవాస విప్రలంభంలోనూ కూడా ప్రవర్తిల్లుతుంది. దూతలు ప్రేమ సందేశ హారకులు. వీరికే 'సహాయకు'ల నికూడ వ్యవహారం. స్వరూప స్వభావాది భేదాలవల్ల వీరిని అనేక విధాలుగా భోజుడు వింగడించాడు.

శ్లో॥ జాతిః గుణః క్రియా ద్రవ్యం సంబంధోఽర్థః ప్రయోజన
ప్రయోగో యోగ్యతా స్త్రీత్వం దూతభేదేషు హేతవః

ఇలా వారిలో దశవిధ భేదాల్ని సూచించాడు. శృంగార ప్రకాశము, పుట. 286

పై విభాగాల్లోని కొన్ని అంతర్భేదాల్ని పోతన భాగవతంలో దర్శించవచ్చు. వాటిలో -

జాతితః - మనుష్య, భ్రమర దౌత్యం

క్రియతః - సమానశీల వ్యసన భ్రమరదౌత్యం

సంబంధతః - సఖీ ఆత్మ జ్ఞాతి దౌత్యం

ప్రయోజనతః - స్నేహపూర్వ ప్రార్థన దౌత్యం

ప్రయోగతః - ప్రచ్ఛన్న దౌత్యం

స్త్రీత్వతః - సఖీరూప దౌత్యం ముఖ్యమైనవి.

దూతల స్వరూప స్వభావాల్ని గూర్చి శారదాతనయుడు :

శ్లో॥ దేశకాలజ్ఞతా భాషామధురత్వం విదగ్ధతా
ప్రోత్సాహనేషు ప్రౌఢత్వం తథా సంవృత మంత్రతా
యథోక్త కథనం చేతి గుణా దౌత్యం ప్రపత్స్యతామ్. భావప్రకాశనము, పుట. 202

దేశకాలాల్ని గుర్తించి ప్రవర్తించటం భాషామధురత వైదగ్ధ్యం ఆయాకర్మలలో ప్రోత్సాహం కల్గించటంలో ప్రౌఢత రహస్యాలోచన చేయటం యథోక్త కథనం వంటివి ఉత్తమ దూతలక్షణాలని వివరించాడు.

భోజుడు పేర్కొన్న దూతకర్మ లిరవై నాల్గింటిలోను[20] భాగవతంలోని దూతలలో ప్రధానమైన వాటిని కొన్నింటిని ప్రస్ఫుటంగా దర్శించవచ్చు. వాటిలో ప్రవేశ విశ్వాసన కార్యోపన్యాస అవస్థా నివేదన ఇంగితాకారజ్ఞాన ఉపాయ జ్ఞాన ప్రకరణ జ్ఞాన సమాశ్వాసన మిత్రోపగ్రహాలు కొన్ని. ఇందులోని విశ్వాసాదులు యోగ్యతకూ వాగ్మిత భావనకూ సంబంధించిన దూతగుణాలు. ఇవికాక మరి ఎనిమిదింటిని గూడ భోజుడు సూచించాడు.[21]

దూత సంప్రేషణంలో దూత పురస్కారం, అవస్థాజ్ఞానంలోని కొన్ని భేదాలూ సమాగమోపాయంలో మాయా లేఖ, కార్యోపదేశం వంటి భేదాలూ భాగవత దూతల విషయంలో గమనించవచ్చు.

శృంగార దూతలనే శారదాతనయుడు శృంగార మిత్రులు సచివులు దూతలుగా త్రిధా వింగడించాడు.

## శృంగార మిత్రుడు - అర్జునుడు

పార్థుడు శ్రీకృష్ణుడికి 'మిత్రోపగ్రహార్థ'మైన శృంగార దౌత్యకర్మను నిర్వహించాడు. ధౌత్యం అధికంగా పూర్వరాగానికి సంబంధించిందే అయినా పడతుల ప్రణయ కలహాల పరిష్కారానికి కూడ ఎంతో అవసరం. కనుకనే శ్రీకృష్ణుడు తనను వారిండ్లకు పంపేవాడని కృష్ణనిర్యాణ సందర్భంలో పార్థుడు ధర్మరాజుతో పేర్కొంటూ విలపిస్తాడు.

కం॥ వారిజగంధులు తమలో
వారింపగరాని ప్రేమవాదము సేయన్
వారిజనేత్రుడు నను దగ
వారిండ్లకు బనుపు నలుక వారింప నృపా ! 1-369

శృంగారప్రకాశలో చెప్పిన లక్షణాన్నిబట్టి ఇతడిని ప్రణయ కలహ నివారణ 'ప్రయోజన' సంబంధమైన 'స్నేహ' స్వరూపుడుగా నిర్ణయించవచ్చు. కాగా ఇటువంటి వారిని శృంగార మిత్రులుగా కూడ పేర్కొనవచ్చు.

ఈ శృంగార మిత్రుల పట్ల నాయకులకు నమ్మకం ప్రేమ గౌరవం అధికం. వారు తమ అంతఃపుర శృంగార లీలా రహస్యాల్ని సైతం వీరితో ముచ్చటించటం కద్దు. శ్రీకృష్ణుడు తనతో ముచ్చటించిన తీరును పార్థుడు ధర్మజునితో చెప్పిన మాటల్నిబట్టి గ్రహించుకోవాలి.

---

20 శృంగార ప్రకాశ. పుట. 287

21 అందే, పుట. 288

కం॥ నిచ్చలు లోపలి కాంతలు
మచ్చిక తనతోడ నాడు మాటలు నాకున్
ముచ్చటలు సెప్పు మెల్లన
విచ్చలవిడి తొడల మీద విచ్చేసి నృపా ! 1-370

ఈ మాటలలో శృంగార మిత్రులతోడి వ్యవహార సాన్నిహిత్యం సరసహృదయ సంవేద్యం.

అలాగే కాళిందీ ప్రణయ వ్యవహారంలోని పూర్వరాగ సందర్భంగా కూడ శ్రీకృష్ణుడికి అర్జునుడు దౌత్యం నిర్వహించాడు. ఆ సందర్భంలోని పార్థుడి వాక్చమత్కృతి సందర్భోచితం.

మ॥ సుదతీ ! యెవ్వరి దాన వేమి కొఱ కిచ్చేటన్ ప్రవర్తించె దె
య్యది నీ నామము కోర్కె యెట్టిది వివాహాకాంక్షతో గూడి యా
నదికిన్ వచ్చిన జాడ గానబడె ధన్యంబయ్యె నీరాక నీ
యుదయాది స్థితి నెల్ల జెప్పు మబలా ! యుద్య త్కురంగేక్షణా! 10 ఉ. 117

ఆ 'మదన దర్పణతుల్య కపోలపాలిక' తోడి సంభాషణలో పార్థుడి 'పరేంగితజ్ఞత' కార్యసాధన నైపుణి తిలకించవచ్చు. తరువాత కాళింది నుండి పునస్సందేశాన్ని కూడ కొనివచ్చాడు.

## శృంగార దూతలు - ఉద్ధవుడు

శృంగార దూతలకు కొన్ని ప్రత్యేక లక్షణా లుండాలని ఆలంకారిక నిర్ణయం. అందుకే ఉద్ధవ గుణగణాల్ని పోతన శబ్దాలంకార సముద్ధతితో ఉల్లేఖించాడు.

కం॥ సిద్ధవిచారు గభీరున్
వృద్ధ వచో వర్తనీయ వృష్ణి ప్రవరున్
బుద్ధినిధి నమర గురుసము
నుద్ధవునిం జూచి కృష్ణు డొయ్యన పలికెన్. 10-1432

వృష్ణిప్రవరుడు కనుక ఉద్ధవుడు యదుప్రవరుడైన శ్రీకృష్ణునికి 'ఆత్మజ్ఞాతి' సంబంధిత దూత. కృష్ణకృత 'పూర్వ ప్రార్థన' ప్రయోజనమైనవాడు. ఇతడిలో పోతన వాగ్మితాది విశ్వాసాల్ని నిక్షేపించాడు. గోపికలను ప్రోద్యద్విరహాగ్ని నుండి రక్షించడానికి పంపనున్న శృంగారమిత్రుడు కనుక మిత్రవర్తనం ఆయన చేతలలో కనిపిస్తుంది. ఉద్ధవుడికి ప్రత్యేక పురస్కారం లభించింది. శ్రీకృష్ణుడు 'మందహాస సుందర వదనార విందుడై కరంబు కరంబు నవలంబించి పరస వచనంబు లాడుచు 'వీడు కొల్పొ'డు (10-1436). శ్రీకృష్ణుడి వల్ల ఉద్ధవుడు పొందిన ఈ గౌరవం శృంగార వరప్రసాదమే.

ఉన్నతస్థాయి శృంగార దూతలు అంబ. హ మాలాలంకృతు' (10-1448) లై ఉండటం కూడ ఉంది. దీనివి బట్టి వారికి సౌందర్యస్పృహ అధికమని తెలుస్తుంది.

గోపికలను 'మధురాలాపంబుల నూరార్చటం' (10-1464) ఆ శృంగార దూతకున్న సమాశ్వాసనశక్తి. 'భవచ్చారిత్రముల్ చిత్రముల్' (10-1465) అంటూ వారి వ్యక్తిత్వాన్ని కీర్తిస్తూ మిత్రునిపై సద్భావాన్ని వృద్ధిచేయటం 'మిత్రోపగ్రహార్థమైన' వాగ్మిత. ఇలా శృంగార మిత్రులకు వేష భాషాలంకారాలలో ఆలోచనారీతిలో ప్రత్యేక ధోరణి గోచరిస్తుంది.

నాయికలు సైతం తమ ప్రియులు పంపిన శృంగార మిత్రులతో అరవిడిచి తమ శృంగార రహస్యాల్ని ప్రస్తావిస్తారు. గోపికలు స్మరణాలంకార పూర్వకంగా దూతను ప్రశ్నించటం వల్ల ఇది నిరూపితం.

చం॥ మఱచునొకో ! మదిం దలచి మాధవు డా యమునా తటంబునన్
దఱచుగ దివ్యసౌరభ లతాగృహసీమల నేము డాగ నా
మఱువుల నుండి నీడలకు మ మ్మెలయించి కలంచి దేహముల్
మఱచిల దేర్చి నూల్కొలిపి మన్మథ లీలల దేల్చు చందముల్. 10-1474

ఈ రతి వ్యతిరేకార్థక ప్రశ్నోపేత సంస్మరణం గోపికలకు ప్రమోదకరమైన విషయం. అది వారి గౌరవానికి ఆదరానికీ నిదర్శనం. దూత ఆగమనాభిభాషణాల వల్ల చిత్తం పల్లవించిన నాయికలు దూతను పూజించటం ఆచారం. ఇట ఉద్ధవుడు గోపికల సన్మానాన్ని పొందిన భాగ్యశాలి.

నాయకులు శృంగార మిత్రుల్ని తమ వెంట నాయికా గృహాలకు సైతం తీసుకొని పోవటం కద్దు. ఉద్ధవుణ్ణి శ్రీకృష్ణుడు కుబ్జాగృహానికి తీసుకవెళ్ళటం ఇందుకు ఉదాహార్యం. నాయకుడితోపాటు వచ్చిన శృంగార మిత్రుడికి అర్ఘ్యపీఠాన్ని ఇచ్చి ఆదరించటం నాయికా మర్యాదగా గోచరిస్తుంది. కుబ్జ శ్రీకృష్ణుడితో తన ఇంటికి వచ్చిన 'ఉద్ధవుని నుద్యత్ప్రీతి బూజించి భా/సుర పీఠంబున నుండు మంచు' (10-1487) సమాదరించింది.

ఇలా ప్రేయసీ ప్రియులిద్దరికీ ప్రీతిపాత్రులై వారిచేత సత్కారాలందటం శృంగార దూతల లక్షణం. మొత్తం మీద ఆత్మజ్ఞాతి సంబంధం వల్ల స్నేహప్రయోజనమైన విశ్వాసపాత్రుడైన శృంగారదూత ఉద్ధవుడు.

## భ్రమరం

గోపికలు అన్యాపదేశంగా కల్పించుకున్న భ్రమరం కూడ శృంగారదూత భేదమే. భ్రమరం భోజదేవోక్తమైన అష్టవిధ జాతులలో ఒకటి కాకపోయినా 'భ్రమర జాతి' దూతగా పరిగణించవచ్చు. నాయకుడైన శ్రీకృష్ణుడూ అతని దూత ఐన భ్రమరం ఇద్దరూ 'సమాన వ్యసన క్రియారూప' శీలురే.

మ॥ ఒక పువ్వందలి తేనెద్రావి మధుపా ! యుత్సాహివై నీవు వే
తొకటిం బొందెడి భంగి మ మ్మధర పీయూషంబునం దేల్చి మా
యకలంకోజ్జ్వల యౌవనంబు గొని యన్యాసక్తుడయ్యెన్ విభుం
డకటా ! యాతని కెట్లు దక్కె సిరి మిథ్యా కీర్తి నమ్మెన్ జుమీ. 10-1455

'సమాన శీలవ్యసనేషు సఖ్యం' అని కదా ఆర్యోక్తి. కనుకనే శ్రీకృష్ణు డా భ్రమరాన్ని ఆదరించినట్లుగా భావించారు. ఇట శ్రీకృష్ణునిదీ భ్రమరానిదీ 'సనిమిత్తసఖ్యం'[22] గా భావించారు గోపికలు. 'భృంగా ! కృష్ణుడు మంచివాడనుచు' అని ప్రారంభించి ప్రసంగించటంలో భ్రమర ' కార్యోపన్యాస' దూతకర్మం ద్యోతక మౌతుంది.

ఈ దూత భేదంలో కార్యసాధకాలైన మరికొన్ని దూత కర్మలు గోచరిస్తాయి. అవి నాయిక పాదాల్ని ముట్టి ప్రార్థించటం ప్రసంగాన్ని సంగీతంలాగా సుమధురంగా సంప్రీతిగా సాగించటం నేర్పరితనం ముఖ్యమైనవి. పునస్సందేశాన్ని అందించే సమయంలో పాదాల మీద పడి ఒత్తి చెప్పటం వంటివి మరికొన్ని.

అనేక విధాలుగా గోపకాంతల తిట్లకూ తిరస్కారాలకూ గురి అయినా స్నేహార్ద్ర హృదయంతో శృంగార దౌత్యాన్ని నిర్వహించింది భ్రమరం. ఇలాంటి శృంగార ప్రవర్తకులు పాదాలబడి ప్రాధేయ పడటం కుపిత నాయికా సాంత్వనం వంటిది. ఇది మాన విప్రలంభ సమయంలోనే సంభవం. అనితర సాధ్యమైన ఇటువంటి శృంగార దౌత్య వ్యవహర్తలకు ఇష్టార్థాలు సంప్రాప్తిస్తాయని గోపికలవాక్కు (10-1456).

తమ అంతఃపురశృంగార లీలా విశేష రహస్యాల్ని గోపికలు భ్రమరంతో చెప్పటం, అందులోనూ అన్యాపదేశంగా చెప్పటం వల్ల ఈ ఘట్టం రసాస్వాదనానికి 'రసప'ట్టయింది. శృంగారతత్త్వం భ్రమరంలో ప్రస్ఫుటంగా గోచరించటం అందుకు మరొక కారణం. ఈ భ్రమర గీతలే కాలాంతరంలో వచ్చిన అన్యాపదేశ శృంగార సందేశ కావ్యరచనకు మార్గదర్శకం.

## అగ్నిద్యోతనుడు

రుక్మిణీ కల్యాణ కథలో దౌత్యం పూర్వరాగ సంబంధి. అందులోని దూత అగ్నిద్యోతనుడు 'జాతితః' మనుష్యజాతికి చెందినవాడు. అప్తుడైన బ్రాహ్మణుడు. 'ప్రయోజనతః' రుక్మిణి చేత పూర్వ ప్రార్థితుడైనాడు. 'అర్థతః' రుక్మిణికి శిశుపాలుడి తోడి వివాహమనే 'అర్థాంతరార్థ ప్రతీఘాతార్థ' మైన దూత. అనగా ఇష్టార్థ సాధనలో అర్థాంతరంగా ఏర్పడ్డ అవరోధాల్ని ప్రతిరోధించగల దూత. 'ప్రయోగతః' ఉదాత్తుడు. జ్ఞాతు లెరుగకుండా 'ప్రచ్ఛన్న' దౌత్యం నెరపిన నేర్పరి.

శ్రీకృష్ణ మందిర 'ప్రవేశ' విషయంలోనూ కార్యసాధన పరంగానూ రుక్మిణికి 'విశ్వాసనం' ఉన్నవ్యక్తి అగ్నిద్యోతనుడు. శ్రీకృష్ణుడు కనకాసనాసీనుడై ఉన్న సమయంలో 'పెండ్లి కొడుకవు కమ్మని దీవించిన' (10-1697) 'ఉపాయ జ్ఞాన శీలి'. ఆ దీవనకు

---

22 కం॥ మునివరు లైనను బంధుల
ఘనసఖ్యము విడువలేరు గాక విడువరే
సనిమిత్త సఖ్య మాకటి
పని దీరిన నరులు విరుల బాయుచు లేదే ! 10-1451

'ముసిముసి నగవుల నగుచు'న్న (10-1697) శ్రీ కృష్ణుణ్ణి చూచి రుక్మిణీ 'అవస్థా నివేదనం' చేసిన 'ఇంగితాకార జ్ఞాన శీలి'. అందువల్లనే అదను కనిపెట్టి ఆమె పంపిన సందేశంతోపాటు అమూలకంగా 'సవరణగా' (10-1709) రుక్మిణీ సౌందర్యాతిశయాన్ని హరికి వర్ణించి విన్నవించిన 'ప్రకరణ జ్ఞాన' శీలి అగ్నిద్యోతనుడు.

సీ॥ పల్లవ వైభవాస్పదములు పదములు
కనకరంభా తిరస్కారు లూరు
లరుణ ప్రభా మనోహరములు కరములు
కంబు సౌందర్య మంగళము గళము
మహిత భావా భావ మధ్యంబు మధ్యంబు
చక్షురుత్పవదాయి చన్నుదోయి
పరిహాసి తార్ధేందు పటలంబు నిటలంబు
జితమత్త మధుకర శ్రేణి వేణి
ఆ॥ భావజాశుగముల ప్రాపులు చూపులు
కుసుమ శరుని వింటి కొమలు బొమలు
చిత్త తోషణములు చెలువ భాషణములు
జలజనయన ముఖము చంద్రసఖము. 10-1710

వివిధ కళాస్థాన విశేష వర్ణనలతో కూడిన రుక్మిణీ వాక్చిత్రం వల్ల శ్రీకృష్ణునిలో శృంగారోద్దీపనం అతిశయించినది. రుక్మిణిని చేపట్టే విషయంలో అతణ్ణి దృఢ సంకల్పుణ్ణి చేసింది.

అగ్నిద్యోతనుడు 'కర్తవ్యం బెద్ది సేయ నవధరింపు' (10-1709) మని శ్రీకృష్ణుడికి కర్తవ్యసూచనం చేశాడు. అంతేకాక -

ఉ॥ ఆ యెలనాగ నీకుదగు నంగనకుం దగు దీవు మా యుపా
ధ్యాయుల యాన పెండ్లి యగు దప్పదు జాడ్యము లేల నీవు నీ
తోయమువారి గూడుకొని తోయరుహానన దెత్తుగాని వి
చ్ఛేయుము శత్రులన్ నుఱుము సేయుము సేయుము శోభనం బిలన్. 10-1711

అంటూ ఆహ్వాన పూర్వకంగా ఆదేశించి కార్యోపదేశం చేసిన వాగ్మిగానూ సమాగమోపాయ సంబంధమైన 'కార్యోపదేశం' సూచించిన 'ఉపాయ జ్ఞానశీలి' గాను కన్పిస్తాడు అగ్నిద్యోతనుడు.

దౌత్యం ఫలిస్తే ఆ దూతల ' ముఖలక్షణం' ప్రత్యేకంగా ప్రదీప్త మైతుందని రుక్మిణీ నిర్ణయం (10-1732) వల్ల విదితమైతుంది. అగ్నిద్యోతనుడు వస్తూనే శుభ సూచకంగా రుక్మిణితో 'మెచ్చె భవద్గుణోన్నతి' అంటూ ఇష్టార్థప్రతిపాదక మయిన క్రియా వాక్యాన్ని ముందుగా ఉద్ఘాటించాడు. ఆపై తనకు జరిగిన సన్మానాన్నీ తాను పొందిన పారితోషికాన్నీ సంతోషం అపుకోలేక ఆమెతో చెప్పుకున్నాడు.

సందేశంతో సంతోష తరంగితులైన వ్యక్తులు అందునా స్త్రీలు, అందులోనూ అత్యుత్తమ వనితలు శృంగార దూతలను ఎలా సన్మానించాలో నిర్ణయంచుకోలేక పోవడం సహజం. తనకు పునస్సందేశం తెచ్చిన అగ్నిద్యోతనుడి విషయంలో రుక్మిణి కృతజ్ఞతా పూర్వకంగా చేసిన ప్రశంస ప్రస్తుతింపదగ్గది.

మ॥ జలజాతేక్షణు దోడితెచ్చితివి నా సందేశముం జెప్పి నన్
నిలువం బెట్టితి నీ కృపం బ్రతికితిన్ నీయట్టి పుణ్యాత్మకుల్
గలరే ! దీనికి నీకు ప్రత్యుపకృతిన్ గావింపగానేర నం
జలి గావించెద భూసురాన్వయమణీ ! సద్బంధు చింతామణీ! 10-1735

అంటూ ఒక్క నమస్కారం తప్ప మరో పురస్కారాన్ని అందించటానికి యత్నించటం ఆ మహానుభావుని అనర్ఘోపకారానికి అర్ఘం చెల్లించట మౌతుందని రుక్మిణి భావించిందనవచ్చు.

అగ్నిద్యోతనుడంటే నాయికా నాయకులలోని కామాగ్నిని ఉద్ద్యోతింప జేసేవాడని అర్థం. ఈ దూతకిది సార్థకనామం. బ్రాహ్మణుడు కాబట్టి మూర్తీభవించిన వేదాగ్ని. అట్టి దేవుడికి నమస్కారాన్ని మించిన మరో పురస్కారం ఉండదని యెఱిగిన విజ్ఞురాలు రుక్మిణి.

## చిత్రరేఖ

భాగవతంలోని ప్రధాన శృంగారదూతి ' చిత్రరేఖ' ఒక్కతె మాత్రమే. మూల భాగవతంలో ఈమె నామధేయం చిత్రలేఖ. 'ర లయోరభేదః' అయినా చిత్రరేఖ అనటంలో ఆమె రూపరేఖా విలాస దృష్టి గోచరిస్తుంది. ఆ దృష్టితోనే పోతన ఈ చిఱుమార్పు చేశాడేమో.

తే॥ కామినీమణి ముఖపద్మ కాంతి విజిత
శిశిరకర చారు రుచిరేఖ చిత్రరేఖ. 10 ఉ.336

అని ఆమెను గురించి పోతనగారి ఉల్లేఖనం.

ఈమె ఉషకు చెలికత్తె. ఈమె జాణతనం ఉషాసుందరీ అయోగ వియోగ శృంగారాన్ని సురుచిరం చేసింది. ఉషకు ఈమె 'సంబంధతః' సఖి. ఈమె నిర్వర్తించింది 'ప్రయోజనతః' 'స్నేహ' ధర్మం. దూతీకర్మలో 'ప్రకరణ జ్ఞాన' గ్రహణ నిపుణ చిత్రరేఖ.

ఉష నిద్ర నుండి మేల్కాంచినప్పుడు, కలలో ఆమె అనిరుద్ధ సంబంధంగా భ్రాంతి భావాన్ని పొందింది. అప్పుడు ఆమె ఇంగితాన్ని గుర్తించి ప్రవర్తించిన పరేంగితజ్ఞ చిత్రరేఖ. అంతటి ఉత్తమ 'ఊహాశాలిని' ఆమె. ఇది ఆమె కున్న 'దృష్టరూప అవస్థాజ్ఞానం'.

తే॥ పడతి! నీవిప్డు సొబగుని బయల వెదకు
విధమునను నాత్మవిభుడని వేడ్క బిలిచి
పూని చేతికి లోనైన వాని బాసి
భ్రాంతి బొందిన భావంబు ప్రకట మయ్యె. 10 ఉ. 338

ఉష మనోదైన్యాన్ని చూచి ఆమె వలచిన వ్యక్తి యక్ష కిన్నెర గరుడ గంధర్వుడే కాదు. అతడు ఎవరైనాసరే ముల్లోకాల్లో ఎక్కడ ఉన్నా వెదకి తెస్తానని ధైర్యం చెప్పిన 'ఆశ్వాసన' శీల. తదనుగుణంగా అప్పటి కప్పుడు యువ రాజకుమారుల రూపాల్ని రేఖాప్రాయంగా చిత్రించిన చిత్రలేఖన ప్రవీణ ఆ చిత్రరేఖ. చిత్రపటంలోని అనిరుద్ధుణ్ణి ఉష గుర్తించగానే అతని కులగోత్రాల్ని వివరించి ఆమె మన్ననలను పొందింది (10-ఉ-361). అప్పటి ఆమె వాగ్మిత వర్ణనాతీతం. ఆ తర్వాత ఆమెను ఆశ్వాసించి అనిరుద్ధుణ్ణి కొనిరావటానికి ఆకాశమార్గాన వెళ్లిన కార్యశూర. ఆతడి శృంగార నగరంలోకి 'ప్రయోగతః' నిశాసమయంలో 'ప్రచ్ఛన్న' వేషంలో ప్రవేశించింది. ఆపై తన యోగవిద్యా (మాయ) మాహాత్మ్యంతో అతణ్ణి ఎత్తుకొని వచ్చి ఉషాసుందరి దరిచేర్చిన సిద్ధ. ఇది ఆమె 'సమాగమోపాయ' కార్యదక్షత.

ఉషానిరుద్ధుల కథలో నాయిక ఉష ముగ్ధ. చెలికత్తె చిత్రరేఖ జాణ. కనుక తానే చొరవ తీసికొని 'ఉపాయ జ్ఞానం'తో 'ప్రకరణ' శుద్ధిగా ప్రవర్తించి వారికి 'గృహాభ్యంతర సంభోగ' శృంగారాన్ని సమకూర్చింది.

ఈ సందర్భంలో ఉష నుండి అందుకున్న ప్రశంసల వల్ల చిత్రరేఖ శృంగార దూతీ లోకానికే తలమానికంగా నిలిచింది. దూతజన ఆవశ్యకం పూర్వరాగాని కెంతగా ఉందో దీనివల్ల తేటతెల్లమైతుంది. ఉషాకృత కృతజ్ఞతా వాక్యా లాలింపదగినవి.

సీ॥ అతివ! నీ సాంగత్య మను భానురుచి నాకు
        గలుగుట గామాంధకార మడగె
    దరళాక్షి! నీ సఖిత్వంబను నావచే
        గడిచి వియోగాబ్ధి గడవ గంటి
    నబల! నీ యనుబంధ మను సుధావృష్టిచే
        నంగజ సంతాప మార్ప గంటి
    వనిత! నీ చెలితనంబను రసాంజనముచే
        నా మనోహర నిధానంబు గంటి

తే॥ గలల దోచిన రూపు గ్రక్కన లిఖించు
    వారు నెనన్న దోడ్తెచ్చువారు గలరె?
    నీటిలో జాడ బుట్టించు నేర్పు నీక
    కాక గల్గునె మూడు లోకముల యందు. 10ఉ. 369

ఈ ప్రశంస శృంగార దూతీ నిపుణతా నిరూపణానికి పోతన ఎత్తిన కవితాపతాక. ఈ సందర్భంలోని చిత్రరేఖా సంభాషణంతో ఉషకు రాగం ప్రవృద్ధమయింది. ఇలా నీటిలో జాడ పుట్టించే నేర్పున్న ఆమె జాణతనం ఉషా నాయికా పూర్వరాగానికి ప్రాణం.

ఏతద్విధంగా శృంగార దూతల దౌత్యకళాభివర్ణనంలో పోతన్నగారి కవితాకళా వైదుష్యం సహజోపపన్నం.

# శృంగార క్రీడాప్రదేశాలు

## క్రీడా శృంగారం

### ఉపరూపకాలు - రాసకం

రాసం ఉపరూపక ప్రక్రియలలో ఒకటి. దీనిని ప్రప్రథమంగా నిర్వచించింది కోహలుడని అభినవభారతి వలన తెలుస్తుంది. వాత్స్యాయనుడు తన కామశాస్త్రంలో హల్లీస నాట్యరాసాలను రెంటినీ పేర్కొన్నాడు. అవి నాయికా నాయకులకు పరస్పర ఉద్దీపకాలని జయమంగళుని వ్యాఖ్య. శ్రీహర్షుడు కోహలుడు భామహుడు వాత్స్యాయనుడు కుమారిలుడు మొదలైన వారి పూర్వ రచన లాధారంగా అభినవగుప్తుడు ఉపరూపక దశకాన్ని స్థిరీకరించాడు. అవి డోంబిక ప్రస్థాన శిల్పక భాణక రాగకావ్య భాణిక ప్రేరణ రామాక్రీడక రాసక హల్లీసకాలు. వాగ్భటుడు శ్రీగదిత గోష్ఠుల్ని పేర్కొన్నాడు. ఆపైన భోజుడు ద్వాదశ భేదాల్ని నిర్వచించాడు. అవి శ్రీగదిత దుర్మిలిక ప్రస్థాన కావ్య భాణ భాణిక గోష్ఠి హల్లీసక నర్తనక ప్రేక్షణక రాసక నాట్యరాసకాలు. నృత్య భేదమైన వీటిని వింశతి భేదాలతో శారదాతనయుడు నిరూపించాడు.

భోజ ధనంజయు లిద్దరూ రూపక ఉపరూపక భేదాల్ని చక్కగా నిర్వచించారు. రూపకాలు అంగాంగీ రసపోషణంలో సాగే బృహద్విషయికాలైతే ఉపరూపకాలు భావ ఖండికలు. భారతీయ సనాతన సంస్కృత నాటకాలు అభినయాత్మకమైన సంగీత నృత్య నాటకాలే. సంగీత నృత్యాలకు అధిక ప్రాధాన్యం ఉన్నందున ఉపరూపక నిర్వహణం అత్యుత్తమగుణ శోభితమవుతుంది. అది గీతికలోని భావాత్మక విషయాల్ని వెల్లడించే అభినయాత్మక నృత్యమే! రూపక భేదమైన భాణం మాదిరిగా ఉపరూపకాలు అధికంగా ఏక పాత్రాహార్యాలే. దశరూపకావలోకంలో పేర్కొన్న డోంబికవంటి ఉపరూపక సప్తకం మొత్తం ఏకాహార్యమే. అభినయ భారతిలో విరళంగా దొరికిన కొన్ని ఉదాహరణలు చర్చలు తప్ప

కోహలుడి వంటి ఆద్యుల నిర్వచనాలు మనకు నేడు అలభ్యాలు. ఉపరూపకాల సంపూర్ణ వర్ణనలతో మన కిపుడు ఉపలభ్యమయ్యే సనాతన గ్రంథం ఒక్క శృంగారప్రకాశ మాత్రమే.

ఉపరూపకాలలోని హల్లీసక రాసక గోష్ఠులు శ్రీకృష్ణ సంబంధులుగా లోక ప్రసిద్ధాలు. విష్ణుపురాణ హరివంశ భాగవతాలలో శ్రీకృష్ణ గోపికా విషయంలో హల్లీస రాస భేదాలు ప్రయుక్తమైనాయి. కనుక ఆ రెండింటి నిర్వచనాలను సిగ్గుదేల్చి పోతన భాగవతం లోని రాస నిర్వహణాన్ని పరిశీలిద్దాం.

## హల్లీస(క)ం

గోపస్త్రీలకు శ్రీకృష్ణు డొక్కడే నాయకుడైనట్లు స్త్రీల మండల నృత్యమైన హల్లీసంలో వారి మధ్యలో ఒక్కడే నాయకు డుంటాడు.

శ్లో ॥ యన్మండలేన నృత్యం స్త్రీణాం హల్లీసకం తు తత్ప్రాహుః ।
తత్రైకో నేతా స్యాత్ గోప స్త్రీణామివ మురారిః ॥

వి. రాఘవన్ శృంగార ప్రకాశ, పుట.537

అని భోజుని నిర్వచనం. ఇంచుమించు అభినవగుప్తుడిభావం కూడ ఇదే.[1] దీన్నే 'స్త్రీణాం మండలీకాకారనృత్యే'అనివాచస్పత్యంకూడ నిర్వచించింది.పై నిర్వచనాల్ని బట్టి హల్లీసంలో నృత్యానికున్న ప్రాధాన్యం సాహిత్యానికి లేదు.అయినా అక్కడక్కడ గీతలు కూడ ఉన్నాయి.

త్రిభంగిలో కమల కర్ణికాకారంగా సర్వ గోపికా మధ్యంలో శ్రీకృష్ణుడున్న స్థితి లీలారంభదశ. అదే హల్లీసక స్వరూపం అనవచ్చు. ఇలా మండల నృత్యం మధ్యభాగంలో అతని కిరువైపులా ఉన్న ఇంపు సొంపులు మెఱసే ఇద్దరు ముద్దియల వీణానిక్వాణం వారి ఆనందలహరీ నిధానమైన గానాలాపనం అతని మధుర వేణుపూరణం అన్నీ హల్లీసంలోని సంగీత నృత్య గాన ప్రాధాన్య సూచకాలే. అందులో 'కామినీ జన కబరికాసౌగంధిక గంధబంధుర కరాంగుళీ కిసలయంబుల యతిలయంబులం గూడి వివరంబుగ మురళీ వివరంబుల సారించి పూరించటం' (10-1081) శ్రీకృష్ణుడి శృంగార మధురోహ పర్యవసానమే. అదీ శృంగార క్రీడా విన్యాసమే.

ఇలా శ్రీకృష్ణుడు బహుగతు లందక ముందు నృత్యమండల మధ్యంలో ఏకైక నాయకుడుగా ఉన్న స్థితి హల్లీసం. ఇది అమ్మూలక కల్పనం. విభిన్న తాళ బంధ విశేషాలతో నృత్యం చేస్తే హల్లీసమే రాసంగా మారుతుందన్న[2] భోజుని భావానికి ఇది అనుగుణంగా ఉంది.

---

1. శ్లో॥ మండలేన తు యన్నృత్యం హల్లీసక మితి స్మృతం ।
ఏకస్తత్రతు నేతా స్యాత్ గోప స్త్రీణాం యథా హరిః ॥

వి.రాఘవన్ శృంగార ప్రకాశ నుండి ఉద్ధృతం.పుట.537

2. శ్లో॥ తదితం హల్లీసక మేవ తాల బన్ధ విశేషయుక్తం రాస ఏవేత్యుచ్యతే

వి. రాఘవన్ శృంగార ప్రకాశ, పు. 544

కనుక ఏక నాయకమైన హల్లీసాన్ని బహునాయక భూయిష్ఠంగా మార్చి కొన్ని తాళ భేదాలు కల్పిస్తే రాసంగా పరిణమిస్తుంది. అందువల్లనే తరువాత ప్రతి గోపికతోనూ జత కలిసి శ్రీకృష్ణుడు చేసిన మండల నృత్యం మహారాస మయింది.

## రాస(క)ం

హరివంశంలో రాసశబ్దమే లేదు. దానికి బదులు హల్లీస శబ్దం ప్రయుక్త మయింది. 'ఇతి శ్రీమహాభారతే ఖిలేషు హరివంశే విష్ణుపర్వణి హల్లీస క్రీడనే వింశోధ్యాయః' అని మాత్రమే ఉంది.

హరివంశంలో గోపీకృష్ణుల క్రీడ సంగ్రహంగా ఉంది. అయినా అది చాల విలాస విషయాన్వితం[3]గా ఉంటుంది. అందులోని హల్లీసక్రీడ విష్ణుపురాణం లోని రాసక్రీడను కొన్నిచోట్ల అనుగమించింది.కొన్ని శ్లోకాలు ఉభయత్ర ఒకే రీతిగా ఉండటం గమనించగలం.

శ్లో॥ తావార్యమాణాః పతిభిః పితృభి ర్భ్రాతృభి స్తథా

కృష్ణం గోపాంగనా రాత్రౌ రమయంతి రతి ప్రియాః॥ విష్ణుపురాణం - 5-13-59

శ్లో॥ తావార్య మాణాః పితృభి ర్భ్రాతృభి ర్మాతృభి స్తథా

కృష్ణం గోపాంగనా రాత్రౌ రమయంతి రతిప్రియాః॥ హరివంశం. అ.20

మొత్తం మీద విష్ణుపురాణ హరివంశాలు ఈ హల్లీస రాస శబ్దాలను నృత్య విశేష పర్యాయ పదాలుగా భావించాయి. విష్ణుపురాణంలో రాసగోష్ఠి రాసమండలబంధం రాసమండలం వంటి పదాలు పంచమాంశ త్రయోదశాధ్యాయంలోని 48,49,50 శ్లోకాలలో తిలకించవచ్చు.

అభినవగుప్తుడు రాసకం అనేక తాళ భేదాలతో కూడిందనీ స్త్రీలు నిర్వహించే సుకుమారమైన శక్తిమంతమైన నృత్యమనీ పేర్కొన్నాడు.[4] భోజుడు కూడ రాసకాన్ని స్త్రీ సంబంధిగానే భావించాడు. అందులో షోడశ ద్వాదశ అష్టవనితలు పాల్గొని పిండీ భేదాల్ని గుల్మ శృంఖల లత వంటి భేదాల్ని పాటిస్తారు[5]. భామహుడు కూడ దీన్ని నిర్వచించాడు. కోహలుడి నిర్వచనంగా 'అభినవభారతి' లో ఇది ఉదాహృతం. స్త్రీ పురుషులు కలిసిగాని లేదా కేవలం స్త్రీలు మాత్రమే గాని కలిసిచేసే మండలాకార

---

3. శ్లో॥ కృష్ణస్తు యౌవనం దృష్ట్వా .....
శారదీషు స చంద్రాసు నిశాసు ..... హరివంశం - అధ్యా. 20

4. శ్లో॥ అనేక నర్తకీయోజ్యం చిత్రతాల లయాన్వితం
ఆచతుష్షష్టి యుగలాత్ రాసకం మసృణో ద్ధతం వి.రాఘవన్ శృంగార ప్రకాశ, పుట.544

5. అందే, పుట - 544

నృత్యమిది. ఇది దీని కనీస లక్షణం[6]. పూర్వ లాక్షణికులందరి నిర్వచనాలకిది సంగ్రహస్వరూపం.

## వ్యాస నిరూపిత రాసం

శ్లో॥ తత్రారభత గోవిందో రాసక్రీడా మనువ్రతైః ।
స్త్రీరత్నైరన్వితః ప్రీతై రన్యోఽన్యా బద్ధబాహుభిః ॥ 10-33-2

శ్లో॥ రాసోత్సవ సంప్రవృత్తే గోపీమండల మండితః ।
యోగీశ్వరేణ కృష్ణేన తాసాం మధ్యేద్వయోర్ద్వయోః ॥
ప్రవిష్టేన గృహీతానాం కంఠేస్వనికటం స్త్రియః ।
యం మన్యేరన్ నభస్తావ ద్విమాన శత సంకులమ్ ।
దివౌకసాం సదారాణా మౌత్సుక్యాప హృతాత్మనామ్ ॥ 10-33-3

ఇది వ్యాస భాగవతంలోని రాసదృశ్యచిత్రణం. దీన్నిబట్టి రాసక్రీడ అంటే స్త్రీ పురుషులు జతలు జతలుగా కలిసి చేసే మండల నృత్యమని తెలుస్తుంది. దీనిలోని రాసక్రీడ రాసోత్సవ పదాలను శ్రీధరుడు వ్యాఖ్యానించాడు[7]. ఆ వ్యాఖ్యకు శ్రీకృష్ణ చరిత్రలోని సారసంగ్రహం గమనార్హం. 'అన్యోన్య వ్యతిషక్త హస్తానాం స్త్రీ పుంసాం గాయతాం మండలీ రూపేణా భ్రమతాం నృత్య వినోదో రాసోనామ'. స్త్రీ పురుషులొకరి చేతులొకరు పట్టుకొని పాడుతూ మండలాకారరగా తిరుగుతూ చేసే నృత్యం రాసమని దీని భావం[8].

సంస్కృత భాగవతంలోని రాసవర్ణనం విష్ణుపురాణంలోనూ హరివంశంలోనూ ఉన్న రాస వర్ణనం లాగ కేవలం నృత్య గీత వర్ణనం కాదు. కైలాస శిఖరంమీద తపస్వి అయిన ఈశ్వరుడి రోషానలంలో భస్మీభూతుడైన మన్మథుడు బృందావనంలో రాసవిహార లోలుడైన

---

6. **'The Rasaka is seen in Bhamaha and, as defined by Kohala, it is mentioned in the Abhinavabharati. The minimum feature of Rasa seems to be dancing in a circle, by men and women or by women only'.**
**– Bhoja's Sringara Prakasa.**
**P.544**

7. రాసక్రీడా - రాసోనామ బహునర్తకీయుక్తో నృత్త విశేషః. తాం క్రీడాం. అన్యోన్యం ఆబద్ధాః సంగ్రథితాః బాహవఃయైః తైస్సహ-తత్సాహిత్యమభినయేన దర్శయత్యక్షర చతుష్టయాధికేన, సార్థేన,. రాసోత్సవ ఇత్యాదినా. తాసాం మండల రూపేణావస్థితానాం. ద్వయోర్ద్వయోర్మధ్యే ప్రతిష్ఠేనేతి ప్రతిష్ఠేన తేనైవకంఠే గృహీతానాం ఉభయతః ఆలింగితానాం. కథం భూతేన, యం సర్వాః స్త్రియః స్వస్య నికటం మామేవాశ్లిష్టవానితి మన్యేరన్. తేన ఏతదర్థం ద్వయోర్ద్వయోర్మధ్యే ప్రవిష్టేనేత్యర్థః నన్వే కస్య కథం తథా ప్రవేశః సర్వ సన్నిహితత్వేవా తస్మిన్కుతః స్వనికటవర్తి త్వాభి మానాత్తా సామిత్యత ఉక్తం,యోగేశ్వరేణేతి. అచింత్యశక్తి నేత్యర్థః శ్రీమద్భాగవతమ్:(శ్రీధరీయవ్యాఖ్య)పుట.323

8. శ్రీకృష్ణచరిత్రము, పుట.144

ఆ శ్రీకృష్ణుడి పద్యాశయంలో ప్రసక్తిపడుచు[9] పోతన భాగవత శృంగార ప్రాంగణంలో మరీ విజృంభించి పరమ శృంగారమూర్తిగా భావుకలోకాన్ని సమ్మోహింపచేశాడు.

## పోతన నిరూపిత రాసం

పోతన వర్ణించిన రాసక్రీడ నిర్వచనం శృంగారభావ సముపచితం సంభావనీయం సంపూర్ణ భావార్థ సమన్వితం.

ఉ॥ ఆ సమయంబునన్ విభు డనంతుడు కృష్ణుడు చిత్రమూర్తియై
చేసెను మండల భ్రమణశీల పరస్పర బద్ధ హస్త కాం
తా సువిలాసమున్ బహువిధ స్ఫురితానన హస్తపాద వి
న్యాసము రాసమున్ కృత వియచ్చర నేత్ర మనో వికాసమున్. 10-1080

స్త్రీ పురుషులు కలిసి చేసే శృంగారాత్మక మైన మండల నృత్యమే రాసమని పోతన తీర్పుగా పరిగణించవచ్చు. పూర్వాలంకారికులు తెల్పని శృంగారతత్త్వం పోతన నిర్వచనంలో స్ఫురిస్తుంది.

'స్ఫురిత' శబ్దానికి చుంబన క్రియా విశేషమనీ రతిబంధ విశేషమనీ, 'విలాస' శబ్దానికి శృంగార చేష్టలు స్త్రీల అంగవిక్షేపాలు వగలాడితనం సౌందర్యం అనీ సూర్యరాయాంధ్ర నిఘంటువు. ఈ శబ్దార్థాల ఆధారంగానూ రాసబంధాలలో రతి బంధాలు స్ఫురించటం చేతనూ రాసం శృంగారరస సంబంధమేనని విస్పష్టమౌతున్నది.

'గోపసతు లెందరందరకు నందరై' శ్రీకృష్ణుడు కన్పించటంతో ఆ రాసమండలం నృత్య విద్యామహార్ణవ వేలావలయిత మయింది. గగనమండలం నుండి వేల్పులగమి పుష్పవృష్టి సృష్టించింది. హల్లీసం రాసంగా మారిన సుందరతర సన్నివేశంలో కలిగిన ఆనంద సంకేతమది.

ఆ సందర్భంలో పోతన చూపిన ఉపమలలో గోపికా పరివృతుడైన శ్రీకృష్ణుడు పరమ శృంగార చక్రవర్తిగా దర్శన మిస్తాడు. అతడు -

ప్రసూన మంజరీ సహచరమైన చంచరీకం
సువర్ణమణి మధ్యగమైన మహేంద్రనీలం
కరిణీ విహార బంధురమైన సింధురం
పల్లవిత కుసుమిత లతానుకూలమైన తమాలం
మెఱుపు తీగల నెడనెడ బెడగడరు నల్లమొయిలు
తరంగిణీ సంగతమైన రోహణాచల శృంగం

ఈ కవిసమయాలన్నీ జగన్మోహనుడైన ఆ శ్రీకృష్ణుడి శృంగారరస స్వరూప నిదర్శితోపమలు. పోతన ఈరీతిగా భావించటం ఆయన శృంగార సుమనస్కతకు

---

9. శ్రీకృష్ణ చరిత్రము, పుట. 181

రాసమండలాంతర శృంగార ధోరణికీ నిరుపమ నిదర్శనం. భాగవతాన్ని శృంగార రసబంధుర దృష్టితో తిలకించటానికి ఇది పోతన చూపిన నూతన రసమార్గం.

ఇలాగా రాసం అంటే శృంగారమేఅని పోతనలో నిగ్గు దేలింది. ఆ రాసక్రీడ రసబంధురాలైన వివిధ రాస బంధాలకు నిలయం. అందుకనే అది -

సుందరీ రత్నం లాగ అంగహార మనోహరమై
రామరాజ్యంలాగ రాగపరిపూర్ణమై
సకల జన మనోల్లాసమై
నందనవనం లాగ భ్రమరీ విరాజమానమై
ఉజ్జ్వల రసాభి రామమై

అనువాదంలో విలసిల్లింది. 'ఉజ్జ్వల రస' మంటే శృంగారరసమనే కదా! రాస క్రీడలోని సుదీర్ఘ వచనం పోతన భావనా కల్పిత శృంగార రాస నాట్య విలాసం. ఆయన తెల్పిన నృత్యవిద్యా మహార్ణవం అదే. అదే శృంగార రసార్ణవం కూడ. నాట్యానికి శృంగారానికి రాసంలో దగ్గర సంబంధం నిరూపిత మయింది. ఇతర రసాలకన్న శృంగారాన్ని నృత్య భంగిమలలో సులభగ్రాహ్యంగా హృద్యంగా ప్రదర్శించవచ్చు. అసలు రాసం రసభావ వ్యంజన సమర్థమైన ఒకానొక నృత్య భేద విలాస విశేషం[10] విలాస భావ రస విశేష సూచకం. ఈ రసాను భూతి బ్రహ్మానంద సదృశమైన ఆనందాన్ని ఇస్తుంది. అందుకే దేవతా వనితాలోకమంతా తన్మయత్వంతో నాథులపై వాలింది. వారికి రేయి తడవుగ గడచింది. పుష్పవృష్టి కురిసింది. ఈ రాస మండలం ఇంత మహత్తరమైంది కనుకనే కృష్ణుడి ప్రత్యంగ చాలనంతో గోపికా సౌందర్యం హృద్యమై శృంగారోజ్జ్వల మయింది.

రాసక్రీడా వర్ణనాత్మకమై రసికజనమనోహరమై విరాజిల్లు తున్న వచనం (10 - 1081) శ్రీకృష్ణ శృంగార స్వరూపం. అతని రాస నృత్య పాండిత్యంలో అతని శృంగార స్వభావం నిరూపితం. వచనానంతరం ఉన్న విషయాలన్నీ మూలంలోవలెనే గోపీకృష్ణుల గూర్చిన ఉభయాత్మకాలు. అందులోని గోపికానృత్త గీతచాతురి పరమ రమణీయం. అది వారి కృష్ణానురక్తికీ ఉద్దీపనకూ చక్కని ఉదాహృతి.

చం॥ నడుములు వీగియాడ చిఱునవ్వులు నివ్వటిలంగ హారముల్
సుడివడ మేఖలల్ వదల జూడ్కి మెఱుంగులు పర్వ ఘర్మముల్
పొడమ గురుల్ చలింప శ్రుతి భూషణముల్ మెఱవన్ సకృష్ణ లై
పడతుక లాడుచుం జెలగి పాడిరి మేఘ తటిల్లతాప్రభన్. 10 - 1082

ఇందులో పోతన క్రియా పదాలతో గోపికా నృత్య దృశ్య సాక్షాత్కారం చేసి మనః ఫలకం మీద శృంగార ముద్రలు వెలయించాడు. మూలంలో విశేషణాలతో భావ వల్లరిని

10. [illegible] వ్యంజనాది యుక్తం నృత్య మితీర్యతే. అభినయ దర్పణం. పుట. 18

వెలార్చాడు.[11] తెలుగులో ఈ విధంగానూ సంస్కృతంలో ఆవిధంగానూ తెల్పటం సుందర తర చలచ్చిత్ర సదృశ రచనా శిల్పం. రాసంలో తర్వాత అనేక హావభావాలు వారు ప్రదర్శించారు.

మూలంలో రాసారంభంలోనే పూలవాన కురిసింది. అనువాదంలో ఆద్యంతాలలోను వేల్పు లానందంతో సుమవర్షం కురిపించారు. ఆ పూలవానల పునరావృత్తి వారి శృంగార మనోవృత్తికి ఆమ్రేడితం, అది తదాద్యంత మాధుర్యానికి సంకేతం.

శృంగార శేఖరుడైన శ్రీకృష్ణుడు గోపికలతో సలిపిన రాసక్రీడ భావుకలోక లోచన గోచరం కావటానికి భాగవత సాహిత్యమే ప్రధాన ఆధారం. అది రాస పంచాధ్యాయి. అందులోనూ ముప్పై మూడవ అధ్యాయం ముఖ్యం. శ్రీకృష్ణుడిని భగవన్మూర్తిగా భావించినా తాత్త్వికమూర్తిగా దర్శించినా కవి వర్ణనలోని నామరూపాలవల్ల అతని జీవతత్త్వమైన శృంగారం మనకు ఉద్ద్యోతితం అవుతూనే ఉంటుంది. ఆ తావుల్లో పోతనగారి శృంగార ప్రియంభావుకతా లహరి పరవళ్లు త్రొక్కుతుంది. భాగవతం అంతటా శ్రీకృష్ణుని లౌకిక జీవన శోభనం దర్శనమిస్తుంది. రాసక్రీడ అందుకు భిన్నమేమీ కాదు. అందులోని శ్రీకృష్ణ శృంగార స్వరూప సాక్షాత్కారం సరస హృదయైక సంప్రాప్తం.

శ్రీకృష్ణుడి తోడి శృంగార జీవనాన్ని అభిలషించిన గోపికలు రామావతారంలో తపస్సంపన్నులైన మహర్షులే! ఆ ఋషులు ఆయన తత్త్వాన్ని బాగా అర్థం చేసుకున్నవారే. అతనితోడి రతినే వారు కాంక్షించారు. అంటే ఆతణ్ణి సర్వాంతర్యామిగా గుర్తించినా అతడి తోడి ఆనందాను భూతిని స్వాయత్తం చేసుకోవాలని ఉత్కంఠించారు. అతడితోటి రతినే కాంక్షించారు. అందుకు అతడంగీకరించాడు[12]. కనుకే తదనుగుణంగానే మానవ ధర్మకర్మాచరిష్ణుడైన శ్రీకృష్ణుడు గోపసతులతో నడిపింది కామశృంగారమే ! ఏతత్తత్త్వాన్ని సమగ్రంగా సందర్శించి తదనుగుణ రచనాభిశోభిత సత్ప్రతిభాభియోగ్యు డైనాడు పోతన.

---

11 శ్లో ॥ పాదన్యాసై ర్భుజ విధుతిభిః సస్మితై ర్భ్రూ విలాసై
ర్భజ్యన్మధ్యైశ్చల కుచపటైః కుండలై ర్గండలోలైః
స్విద్యన్ముఖ్యః కబర రశనా గ్రన్థయః కృష్ణవధ్వో
గాయన్త్యస్తం తడిత ఇవ తా మేఘ చక్రే విరేజుః ॥ 10 - 33 - 7

12 ఓం. శ్రీ మహావిష్ణు సచ్చిదానంద లక్షణగ్ రామచంద్రం దృష్ట్వా.. సర్వాంగ సుందరం మునయో వనవాసినో విస్మితా బభూవుస్తగ్ హోచుర్నో ఽవద్య మవతారా న్వైగణ్యంతే ఆలింగామో భవంత మితి భవాంతరే కృష్ణావతారే యూయం గోపికా భూత్వా మామాలింగథ, సన్యేయేఽవతారాస్తేహి గోపానస్త్రీ శ్చనో కురు, అన్యోన్య విగ్రహం ధార్యం తవాంగ స్పర్శనాదిహ శశ్వత్స్పర్శయిత్వాఽస్మాకం గృహ్ణీమో ఽవతారావయమ్, రుద్రాదీనాం వచ శ్రుత్వా ప్రోవాచ భగవాన్స్వయం, అంగసంగం కరిష్యామి భవద్వాక్యం కరోమ్యహం, మోదితాః తే సురాస్సర్వే కృతకృత్యాధునావయమ్.

అధర్వణీయ కృష్ణోపనిషదః

ఈ రాసక్రీడలో అనేక శృంగార శృంగాటకా లున్నాయి. అందులో 'పోతన అంతః కరణమున ప్రత్యక్షమైన రాసక్రీడా వైభవమే తెనుగున కలకండలచ్చులు పోసినట్లు వెలసినది. అపరోక్షమైన వారి యనుభవము సర్వేంద్రియ సంతర్పణము గావించినది.[13] కనుక కామదేవుని మీద విజయం సాధించటమే రాసక్రీడకు ప్రధాన ధ్యేయమైనా అందులో మన్మథ విజృంభణం గోచరిస్తూనే ఉంటుంది. అతడు ఆత్మారాముడై ఇంద్రియ స్థలనం చేయకున్నా గోపికలకు సర్వేంద్రియ సంతర్పణం జరిగింది. భాగవతం లోని గోపికలకు శ్రీకృష్ణుని భావం తెలియదు. పైగా గోపీకృష్ణుల సరసప్రవర్తనం వల్ల సహృదయ హృదయాలు వారితో తాదాత్మ్యంచెంది రసానుభూతిని పొందుతాయి. శ్రీకృష్ణుని ఆకస్మిక ప్రవాసానంతరం ' ఉభయకృతమైన' వారి సంభోగం ఇందుకు నిదర్శనం.

సీ॥ చెలువ యొక్కతె చెక్కు జెక్కుతో మోపిన
విభుడు తాంబూల చర్వితము వెట్టె
నాడుచు నొకలేమ యలసిన బ్రాణేశు
డున్నత దోః స్తంభ మూతసేసె
జెమరించి యొక భామ చేరిన గడగేర
జతురుడు కుచఘర్మ జలము వాపె
నలకంబు లొక యింతి కలిక చిత్రకరేఖ
నంటిన బ్రియుడు పాయంగ దువ్వె

ఆ॥ బడతి యొకతె పాడిపాడి డస్సిన యధ
రామృతమున నాథు డాదరించె
హార మొక్క సతికి నంసావృతం బైన
గాంతు డురము జేర్చి కౌగిలించె. 10 - 1093

ధ్వన్య మానమైన మూల భావాలకు (10-33-12,10) అమూలక అనుభావ పరంపరను కూర్చటం చేత ఇక్కడ వీరిది ' సంపన్న శృంగారం' గా పరిణమించింది.

ఇందులోని ప్రతి భావం రమణీయ దృశ్యం. ప్రతిపదం మనోహర ప్రణయ రహస్యం. అందులో గోపికల 'భావప్రాప్తి'[14] గోచరిస్తుంది అప్పటి వారి స్థితి స్ఫురిస్తుంది. ఇందులో ఒకరిమీద ఒకరికి విశేషమైన అభిమానం నమ్మకం అధిక ప్రేమ స్నేహం కలిగిన అంగానామణు లనేకులతో ఒకే పురుషుడు ఒకే మాటు సురతక్రీడ సాగించటం వంటి

---

13 పోతన భాగవత నీరాజనం, పుట. 153

14 గాత్రాణాం స్రంసనం, నేత్ర నిమీలనం, వ్రీడానాశః సమధికాచ,
రతియోజనేతి స్త్రీణాం భావలక్షణం. - వాత్స్యాయన కామసూత్రాలు, నం. 1 పుట, 285

గౌయూధిక బంధం[15] స్ఫురిస్తుంది. కృష్ణుని ' కామాశ్రయ కళలు' గోచరిస్తాయి. ఇలా రాసక్రీడలో అనేక కామకళా ధర్మాలు ముమ్మరంగా ముసురుకొంటాయి.

రాసలీలలో శ్రీకృష్ణునిది అనంత సౌందర్యవికాసం. కాగా గోపికలకు దానిని ఆస్వాదిండటమే ధ్యేయం. అతని సౌందర్యం వల్ల గోపికలకు కలిగిన మోహం బలవత్తరమైన అనురాగంగా పరిణమించి పరిఢవిల్లింది. 'కనుక అనంత సౌందర్య వికాసము నారాధించుటయే స్త్రీజాతి జీవన సార్థకమునకు ముఖ్యోపాయము. రాసలీల యం దీతత్త్వమే రూపకముగా వర్ణింపబడియున్నది.'[16] అనే శ్రీ బకించంద్ర ఛట్టోపాధ్యాయుల అభిప్రాయం సమర్థనీయం. శరద్రాత్రులలో యమునాతీరంలోని సర్వ లతాతరులలో సర్వ జీవరాశిలో శ్రీకృష్ణుని వేణునాదం శృంగార భావోల్బణం గావించింది. అంటే సర్వజీవచైతన్యం శృంగార భావంలో నిండిపోయింది. ఈ భావాన్ని పరిపుష్టం చేయటానికే పోతన్న గోపికాకృష్ణ సంభోగానికి ముందు ఉద్దీపనంగా వాయు వర్ణనం కల్పించాడు.

మ॥ యమునా కంకణ చారియై వనజ పుష్పామోద సంచారియై
రమణీ ఘర్మ నివారియై మదవతీ రాస శ్రమోత్తారి యై
ప్రమదామానస నవ్య భవ్య సుఖ సంపత్కారియై చేరి యా
కమలాక్షుం డలరంగ గాలి విసరెన్ గల్యాణ భావంబునన్. 10 - 1088

ఈ కల్పనంలో వారు కల్యాణ భావంతో శృంగార లహరీ విహారులైనారు. శైత్య మాంద్య మాధుర్యాలతో కూడిన ఆవాయు ప్రసారం వల్ల వారి చిత్తవృత్తులన్నీ శృంగార రసోదంచితాలై పరస్పరం అనుగమించాయి.

శ్లో ॥ యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్ । భగవద్గీత 4 - 11

అనే గీతలోని వక్కణ కనుగుణంగానే కృష్ణుడు తనను పతి భావంతో బడయగోరిన గోపికలను[17] పతి భావంతోనే అనుగ్రహించాడు. ఈ భావంలోనే ఇంద్రియ సంబంధం ఉంది. అందువల్లనే తదనుగుణమైన వర్ణనలే మూలానువాదాల రెండింటా విస్పష్టంగా ఉన్నాయి.

శ్లో॥ బాహుప్రసార పరిరంభ కరాలకోరు
నీవీ స్తనాలభన నర్మ నఖాగ్రపాతైః॥

---

15 వాత్స్యాయన కామ సూత్రాలు, సం. 1 పుట 259

16 శ్రీకృష్ణ చరిత్రము, పుట. 146

17 కం॥ ఓ కాత్యాయని ! భగవతి !
నీకును మ్రొక్కెదము మేము నే డనుకంపన్
మా కిందఱకును నైళము
శ్రీ కృష్ణుడు మగడు గాగ జేయుము తల్లీ ! 10 - 806

క్ష్వేల్యావలోక హసితై ర్వ్రజ సున్దరీణా
ముత్తం భయన్ రతిపతిం రమయాం చకార ॥ 10 - 29 - 46

మ॥ కరుణాలోకములం బటాంచల కచాకర్షంబులన్ మేఖలా
కర బాహు స్తన మర్శనంబుల నఖాంక వ్యాప్తులన్ నర్మ వా
క్పరిరంభంబుల మంజులాధర సుధాపానంబులన్ గాంతలన్
గరగించెన్ రతికేళి గృష్ణుడు కృపన్ గందర్పు బాలార్చుచున్. 10 - 1001

శ్లో ॥ కాచిదంజలినాగృష్ణాత్ తన్వీ తాంబూల చర్వితమ్।
ఏకా తదంఘ్రికమలం సన్తప్తా స్తనయోరధాత్ ॥ 10 - 32 - 5
ఏకా భ్రుకుటి మాబధ్య ప్రేమ సంరంభ విహ్వలా ।
ఘ్నన్తీవైక్షత్ కటాక్షే పైః సన్దష్ట దశనచ్ఛదా ॥ 10 -32 -6

సీ ॥ అబల యొక్కతె భక్తి నంజలి గావించి
ప్రాణేశు కెంగేలు వట్టి కొనియె
నింతి యొక్కతె జీవితేశ్వరు బాహువు
మూపున నిడుకొని ముదము నొందె
వనిత యొక్కతె తన వల్లభు తాంబూల
చర్విత మాత్మ హస్తమున దాల్చె
బడతి యొక్కతె ప్రియు పదములు విరహాగ్ని
తప్త కుచంబుల దాపుకొనియె

ఆ ॥ భామ యొకతె భ్రుకుటి బంధంబు గావించి
ప్రణయ భంగ రోష భాషణమున
దష్టదశన యగుచు దండించు కైవడి
వాడి చూడ్కిగముల వరుని జూచె. 10 - 1059

సీ॥ చెలువ యొక్కతె చెక్కు జెక్కుతో మోపిన
విభుడు తాంబూల చర్వితము వెట్టె 10 - 1093

వంటివి ఎన్నో ఉదాహరణీయాలు. అసలు శృంగారం అంటే సంభోగమొక్కటే కాదు కదా ! అందులో ఆశ్లేష చుంబనాది భేదా లెన్నో ఉన్నాయి. ఆ రీతులన్నీ వారి మోహాతిశయంలో గమనించవచ్చు.

వీణా వేణు మృదంగ సంగీత విశేషాలతో రాసమండలం రసరమ్యం అవుతుంది. కనుక అపుడు స్త్రీ పురుషులు పరస్పరం ప్రీతిని వృద్ధి చేసుకొన వచ్చునని జయ మంగళుని వ్యాఖ్య[18]. ఇక్కడ గోపీ కృష్ణుల విషయంలో అదే జరిగింది.వారి కది 'రతా

---

18 వాత్స్యాయన కామ సూత్రాలు. (పంచాగ్నుల) పుట. 384

రంభ ప్రరోచకం. దానితో రాసమండలంతో పాటే దేవతామండలం కూడ శృంగార మహామండపంలో పరవశించింది.

కం॥ హరి తను సంగ సుఖంబున
బరవశలై ప్రేతలెల్ల బయ్యెదలు నిజాం
బరములు నెఱుగమి చోద్యమె ?
సురసతు లీక్షించి కరగి చొక్కిరి మింటన్. 10 - 1095

ఇలా కామోత్కంఠతో గోపికలు వగతో ప్రీతితో రాసక్రీడలో శ్రీకృష్ణునితో పలువిధాల సర్వాతిశయ సౌఖ్యానందాన్ని అనుభవించారు. అందులో వారు కామ శృంగార భావాల్ని పొందినట్లుగా కవి వాచ్యం చేశాడు. ఈ భావాన్నే రాధాకృష్ణుల భక్తి భావాన్ని ప్రచారం చేస్తున్న గౌడీయ మఠం వారు ప్రకటించిన భాగవత పీఠిక కూడా అంగీకరిస్తున్నది. అది పరిశీలనార్హం. 'రాస మంచము నుండి అంతర్ధాన విరహభావము ద్వారా గోపికల ప్రేమాత్మకమైన కామమును పెంపొందించి పరమకృప గలవాడగు భగవానుడు రాస చక్రమున నృత్యము చేయసాగెను'.[19]

ఈ విధంగా సంస్కృత భాగవతంలో వ్యక్తంగాను పోతన రచనలో సువ్యక్తంగానూ శృంగారం కన్పిస్తున్నప్పటికీ భాగవతాన్ని భక్తి కోణం నుంచి మాత్రమే పరిశీలించే భాగవతులు, శ్రీకృష్ణుడికి దీనివల్ల నైచ్యం కలుగుతుందనే భీతితో భాగవతంలోని శృంగారపు టునికిని అంగీకరించలేక పోతున్నారు. మరి కొందరు నిరీశ్వర వాదులు సాహితీ సంప్రదాయానభిజ్ఞులు మానవస్థాయిలో ఇది అవాస్తవిక మైనదని ఒకవైపూ ఇంతటి జారుడు మన కారాధ్యుడా? అని వేరొకవైపూ ప్రశ్నిస్తున్నారు. వీరందరూ భాగవతదర్పణంలో తమ ప్రతిబింబాల్ని చూచుకోవడమే కాని, తదన్యం కాదు. భాగవతాన్ని రాగద్వేషాతీతంగా పరిశీలిస్తే రాసక్రీడ శృంగారరస పిచ్ఛలమే. భాగవత కల్పవృక్షానికి మూలమైన శ్రీకృష్ణుడు నిఖిల రసామృతమూర్తి. ఆయన రసరాజమైన శృంగార రత్నాకరుడు (1-199).

రాసపంచాధ్యాయి ఏర్పడింది కామవిజయంకోసం. అంటే అది కాముణ్ణి రాసమార్గంలో మథించి శ్రీకృష్ణుడు జయించిన ఘట్టం. ఇతఃపూర్వం కాముడే శివుణ్ణి జయించాడు. తొలుత భస్మం చేయబడ్డ కాముణ్ణి గత్యంతరంలేక పరమశివుడు బ్రతికించాడు. ఇది 'కామునియొక్క విజయం'. కాముణ్ణి మథించి పూర్తిగా అనుభవించి జయించటం అంటే శృంగార రసం విజయపతాకాన్ని ఎగురవేయటమే. ఇది భాగవత పురాణ నిరూపణ విషయం, నాన్యతస్సందర్శనీయం.

---

19 శ్రీమద్భాగవతము; స్కం.10. సం.1 పుట. 15, గౌడీయ మఠం ప్రచురణం, పీఠిక : శ్రీజన్నాభట్ల వాసుదేవ శాస్త్రి.

# ఇతర శృంగార క్రీడలు

నాయికా నాయకులు తాము శృంగార జీవిత రంగంలోకి ప్రవేశించిన తొలిదినాల్లో లౌకిక సాంసారిక బాధ్యతలకు దూరంగా గడపటానికీ శారీరక సౌఖ్యాల్ని పరోక్షంగా అనుభవించటానికీ శృంగార క్రీడ ల్నాశ్రయిస్తారు. ఆ సమయంలో వారికి తామూ తమ శృంగార ప్రపంచం తప్ప మరొక లోకం కనపడదు. అదే శృంగార రసానుభవానికి పరాకాష్ఠ.

నాగర లోకంలోని స్త్రీ పురుషులకు కామోద్దీపనం కలిగి ఉల్లాసకేళికి ఉత్సాహం కలగటానికీ సమాజాన్ని నిత్య చైతన్యోపేతంగా రూపొందించటానికీ వారిని నిత్యవినోద విలాసాలతో ముంచెత్తటానికీ వాత్స్యాయనుడు కొన్ని శృంగార క్రీడల్ని సూచించాడు. అవిగాక కొన్ని గ్రామీణ క్రీడలు కూడ ఉన్నాయి. అవి ఒకరిద్దరి కూడికతో జరిగేవి కావు. అన్నీ సామాజిక క్రీడలే.

శృంగారోద్దీపన కోసం వాత్స్యాయనుడు అనేక ఉత్సవాల్ని పేర్కొన్నాడు. సంస్కృత నాటకాలలో కావ్యాలలో పురాణాలలో మరికొన్ని ఉత్సవాలు క్రీడలు కనిపిస్తాయి. భోజుడు శారదాతనయుడు వీటి ప్రాశస్త్యాన్నీ వినియోగాన్నీ వింగడించి వివరించారు. శారదాతనయుడు ఋతువిభాగం ద్వారా క్రీడా విశేషాల్ని వింగడించాడు. అంటే ఋతువుల కనుకూలమైన క్రీడావిశేషాల్ని వివరించాడు. సముద్రతీరం ఉద్యానం నదీభాగం శైలపరిసరం పురప్రదేశం రాష్ట్రభవనం అంబురాశి కాంతారం ఆశ్రమం హర్మ్యం అనే దశకం[20] నాయికా నాయకుల శృంగార విహారోచితం. వారి మనోహర రాగదీపన విశేషాలు ప్రత్యేకంగా ఋతువుల్ని బట్టి మారుతాయి. అవి మళ్లీ దివా నిశా భేదాల్ని బట్టి గూడ ఉంటాయి. వారి శృంగార చేష్టలు కాల ద్రవ్యక్రియా విశేషత్రయంతో సూచితమైనాయి.[21] వారి విహారోచిత బాహ్యచేష్టలు ఉద్యానయాత్ర మదిరాపానం జలక్రీడ రతోత్సవం విప్రలంభం వివాహం మొదలైనవి.[22]

వాత్స్యాయనుడు సూచించిన శృంగార క్రీడల్ని అటు భోజుడు ఇటు శారదా తనయుడు కూడ అనుసరించే ప్రవచించారు. కనుక వాత్స్యాయనోక్తమైన క్రీడా విశేషాలు పరిశీలనార్హాలు :

'యక్షరాత్రిః, కౌముదీ జాగరః, సువసంతకః, సహకార భంజికా, అభ్యూషఖాదికా, బిసఖాదికా, నవపత్రికా, ఉదక క్ష్వేడికా, పాంచాలానుయానం, ఏకశాల్మలీ, యవచతుర్థీ, ఆలోలచతుర్థీ, మదనోత్సవః, దమన భంజికా, హోలాకా, అశోకోత్తంసికా, పుష్పాపచాయికా,

---

20 భావప్రకాశనము : పుట. 178

21 అందే, పుట. 180

22 అందే, పుట. 178

చూతలతికా, ఇక్షు భంజికా, కదంబ యుద్ధాని తాస్తాశ్చ మాహిమాన్యాః దేశ్యాశ్చ క్రీడాజనేభ్యో విశిష్ట మాచరేయురితి సంభూయ క్రీడాః.

వాత్స్యాయన కామ సూత్రాలు. సం.1 పుట. 106

భోజుడు ప్రథమాను రాగానంతర సంభోగ నిరూఢికి కొన్ని శృంగార క్రీడల్ని పేర్కొన్నాడు. వాటిలో ముఖ్యమైనవి కందుక క్రీడ కేలీద్యూత జ్యోత్స్నావిహార రాత్రి పరావృత్తి వనవిహార పుష్పాపచయ జలక్రీడ క్రీడాపర్వత విహార ఏకశాల్మలి నవలతిక నవపత్రిక కదంబయుద్ధ బిసఖాదిక ఇంద్రోత్సవ కౌముదీప్రచార యక్షరాత్రి అష్టమిచంద్రిక సువసంత సహకార భంజిక డోలావిలాస ఉదకక్ష్వేడిక మదనోత్సవ గోష్ఠి విహారాల వంటివి కొన్ని ప్రధానంగా గోచరిస్తాయి.

ఇలా మొత్తం మీద ఈ శృంగార క్రీడలు ప్రధానంగా వాత్స్యాయనుడి ముఖతః వెలువడి భోజదేవ ప్రవర్ధితాలై, అనంతరం ఇతర అలంకారికుల చేత ప్రసిద్ధకవి చంద్రులచేత ప్రచారం పొందాయి. భాగవతంలో మూల సన్నివేశాలలో ఉన్న క్రీడా విశేషాల్ని పోతన్న కొన్నింటిని విశదీకరించి ప్రబంధచ్ఛాయల్ని కూర్చాడు. వాటిని పరికించటం ప్రస్తుత వక్తవ్యాంశం.

## కందుక క్రీడ

కందుకక్రీడ శరత్కాలోచిత దివావిహార క్రీడ. వాత్స్యాయనుడు దీన్ని శృంగార కళగా పరిగణించాడు. భోజుడు ప్రథమానురాగానంతరం నిరూఢమయ్యే సంభోగానికి దోహదకారిగా ప్రకటించాడు. అలంకారికులు లలితకళగా పరిగణించారు. సంస్కృతాంధ్ర సాహిత్యాలలో దీనికి సముచిత స్థానం ఉంది. దశకుమార చరిత్రలో కందుకవతి కందుక నృత్యాన్ని ప్రదర్శించింది. అలాగే శ్రీనాథుడు హరవిలాసంలోను పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నంలోను కందుక క్రీడను చిత్ర విచిత్రరీతులలో చిత్రించారు.

మూల భాగవతంలోని మూడు శ్లోకాలను విస్తరించి మోహినీ కందుక క్రీడా చాతుర్యాన్ని ప్రదర్శించాడు పోతన. మోహినీ హృదయ కందమైన కందుకంతో క్రీడిస్తూ తనకు తానే పన్నిదాలను వేసుకొంది. విన్యాసగతి విశేషాల్ని ప్రదర్శించింది. ప్రతి కదలికలో ఆమె ఆభరణ కాంతులు ప్రత్యవయవాన్నీ మనోమోహనంగా దీపింపచేశాయి. కందుక క్రీడ నాయికా విలాస ప్రదర్శనకే అయినా మోహినికి ప్రత్యేక ప్రయోజన సిద్ధి కుపకరించింది. శివుణ్ణి మరింత విభ్రాంతుణ్ణి చేయటంలో సఫలమయింది. కందుక క్రీడావిన్యాసంతో మోహిని ఉద్యాన విహారం ముడిపడింది. వనవిహారంలో మాధవీ మంటపాలు తీగ ఉయ్యాలలు కుసుమరేణు పటలాలు కృతకశైలాలు మనోమోహనాలైనాయి. అప్పటి ఆమెలోని ప్రతికదలిక ప్రకృతికే పాఠాలు ప్రవచించింది. పరమేశ్వరుడినే పరవశింపచేసింది. ఇలా వనవిహారంలోని కందుక క్రీడ భాగవతంలో పరమేశ్వరుడి మీద మన్మథ విజయానికి దోహదపడింది.

## జలక్రీడ

రాసకేళిలో సంభోగానంతరం గోపికల వివశత శ్రీకృష్ణ శృంగారలీలా తరంగిణిలో మనోహరమైన అభంగ తరంగం. ఏతద్దృశ్యాన్ని సందర్శించిన సురసతులు సైతం కరిగి పరవశించారు. రాసకేళిశ్రమ నివారణ కోసం వారు యమునానదిలో జలక్రీడల కుపక్రమించారు. రతిశ్రమ నివారణ కోసం జలక్రీడ లాడటం కామశాస్త్ర సమ్మతమైన విషయం. అది పునః సంభోగశక్తి నిస్తుంది. భాగవతంలోని గోపికాకృష్ణుల విషయంలో అదే తటస్థించింది రాసక్రీడానంతరం. 'కృష్ణ కరద్వయ తోయంబునం బెక్కుతోయంబులం దడియుచు ..... నీల శైలంబు క్రియనమరె' (10-1098) అంటూ సాగిన గోపికా కృష్ణుల జలక్రీడ గజేంద్రుని జలక్రీడకు ప్రతిరూపమే! నీటిలో అనేక ఆడ ఏనుగులతో కలిసి ఒక మగ ఏనుగు క్రీడించటం గజమైథునం. అలాగే ఒకపురుషుడు పలువురు పడతులతో నీళ్లలో ఉల్లాసంగా రమించటం'వారీ క్రీడితకం'[23]. పూర్వ కాలంలో రాజులు రాణులతో కలిసి జలక్రీడ లాడటం, ఆ జలక్రీడలలోనే రతిక్రీడలు సాగించటం పరిపాటి. అలాటిదే భాగవతంలోని ఈ జలక్రీడావిశేషం కూడ. 'ఇక్కడ గోపికా సౌందర్యం యమునానదీ సౌందర్యం ఒకటిగా కలిపిన మహాకవి సౌందర్యభావన అపురూపం. యమున తరంగ హస్తాలు సాచి వీరిని కౌగిలించుకో రావటం వీరు బాహువులు చాపి ఆమెను కౌగిలించుకోబోవటం, ఆ ఆనందజలంలో మునగటం-తేలటం, కృష్ణుడూ వీరూ ఒకరిమీద ఒకరు నీళ్లు చల్లుకోటం, సరసాలాడుకోటం. అబ్బ! ఆటమీద ఆట ఐనా అలసట లేదు[24]

ఇలా దృశ్య చిత్రణ విన్యాసంతో పోతన రసప్లావితం చేసిన పరమ అద్భుత శృంగార సుందర సన్నివేశం ఈ జలక్రీడాభివర్ణనం (10-1098). జలక్రీడ శరత్కాలోచితం కాకున్నా గోపీ కృష్ణులకు రాసశ్రమ నివారకంగా నూతనోత్తేజ కారకంగా సంభావిచటం వల్లనే మూల భావ విస్తరణం సముచితంగా సాగింది.

## వనవిహారం

జలక్రీడానంతరం గోపీకృష్ణులు విహరించిన ప్రదేశాలు శరత్కాలోచితాలు[25] సూచించిన ప్రదేశాలు అమూలకమైన సంభోగ శృంగార భేదాలకు చిహ్నాలు. అలాగే శ్రీకృష్ణుణ్ణి శరత్కాలోచిత శృంగార వేషంతో[26] ప్రత్యక్షీకరించాడు పోతన.

---

23 వాత్స్యాయన కామసూత్రాలు, సం.1 పుట. 259

24 శృంగారం, పోతన - పుట.219

25 భావ ప్రకాశనము, పుట. 182

26 అందే, పుట. 178

మ॥ సతులుం దాను నీటిలో వెడలి భూషాగంధ చేలాద్యలం
కృతుడై కుంభి కరేణు యూథములతో గ్రీడించు చందంబునన్
లతలందుం దరులందు బుష్పమయ లీలాశయ్యలందున్ సుఖో
న్నతుడై కృష్ణుడు క్రీడలం దనిపె నా నారీలలామంబులన్. 10-1099

ఇలా అమూలక భావాల్ని పోషించి శృంగార భేదాల్ని ప్రదర్శించటం వల్ల ఈ భాగంలో పోతన శృంగార హృదయాంతరాళం ఆవిష్కృతమైందా! అనిపిస్తుంది. అసలు రాస పంచాధ్యాయి సర్వం శృంగారరసోచితమైన 'బాహ్య చేష్టా[27] సర్వస్వమే. కోరుకొన్న వరుడితో ఇచ్ఛాక్రీడలు సాగించటం 'హస్తగామలక క్రీడ' వంటిదిగా గోపికలు భావించారు.

మ॥ చెలియా! గోపిక లీకుమార తిలకున్ జింతింపుచున్ బాడుచున్
గలయం బల్కుచు నంటుచున్ నగుచు నాకర్షింపుచున్ హస్తగా
మలక క్రీడకు దెచ్చి యిచ్చలును సమ్మానంబులన్ బొందగా
దొలి జన్మంబుల నేమి నోచిరొ గదే దుర్గ ప్రదేశంబులన్. 10-1249

ఇందులో కామచేష్టితాలు సునిష్ఠితాలై గోచరిస్తాయి. అలా విలాసంగా కాలం గడిపే వారి పట్ల వారి సవతుల కెంత ఈసుగా ఉంటుందో పై భావనలో ఊహించుకోవచ్చు. ఇది అమూలక భావం.

పట్టణ సుందరులు సువర్ణలాజలు చల్లటం శృంగార క్రీడే. ఇది ఇతర కావ్యాలలో కూడ ఉంది. సువర్ణలాజలు సుందరాంగుల చేతిలోని సుమనసమాస్త్రాలు. మగువలు తాము మనసు పడ్డ మగలను తమవైపు మరల్చుకొనే మరో శృంగార క్రీడా విశేషం ఇది. అంతే కాని వట్టి రాజలాంఛనం మాత్రమే కాదు. అలాంటిదే మందార ప్రసూనాలు చల్లటం కూడ.

మ॥ అని యుబ్బంగి సరోజలోచనలు సౌధాగ్రంబు లందుండి య
వ్వనజాతాక్షుని దివ్యమూర్తి దమ భావం బందు గీలించి సం
జని తానంద రసాబ్ధి మగ్నలగుచున్ సంప్రీతి దద్భవ్య కీ
ర్తనలై చల్లిరి నవ్యలాజములు మందార ప్రసూనావళుల్. 10ఉ.689

తమ హృదయరాముల పట్ల రసాబ్ధి మగ్నలైన వారి అనురాగ-ప్రకటన ద్యోతక క్రీడలివి. భాగవతంలో భక్తితో చేసే నేతి వసంతాలు బాల్య క్రీడలైన సౌజన్యక్రీడ నిలాయన క్రీడాదికాల్ని కూడ తిలకించవచ్చు.

## బాల్యక్రీడలు - శృంగారలీలలు

బాల్య క్రీడలు మూల భాగవతంలో ముక్తసరిగా మూడు శ్లోకాలలో (10-8-29, 30, 31) వర్ణిత మయినాయి. మూలంలో గానీ తెనుగులో పోతనకు మార్గదర్శకుడైన ఎఱ్ఱన

---

[27] భావప్రకాశనము, పుట. 179

హరివంశం లోని శైశవ క్రీడలలో గానీ శృంగారస్పర్శ లేనే లేదు. ఎఱ్ఱన ప్రౌఢ రచనలో శ్రీకృష్ణుని చిలిపి చేష్టలు మాత్రమే ఉన్నాయి. కానీ పోతన వాటిని శృంగార రసమయం చేశాడు. దానికితోడు కొంత హాస్యాన్ని జత చేశాడు. పోతనలోని అంతర్నిహితమైన శృంగార హాస్యరసాభిమానం ఇలా అభివ్యక్త మయింది. కృష్ణుడు బాలుడే కనుక ఆ దుడుకు చేతలన్నీ అతని ఉడుకు మించిననిగా భావించవచ్చు. లేదా అకాలావిర్భావ శృంగార భావతరంగాలుగా ఎంచవచ్చు.

బలరామకృష్ణులు పారాడే సమయంలో వారి సౌందర్యాన్ని చూచి రంభాదులు ఆనందంతో లాస్యం చేశారంటూ వారి శృంగారానికి శుభారంభం చేశాడు పోతన. ఇక బాల్యంలో వారి మీద వచ్చిన ఆరోపణలన్నీ ఆ అనుభవించిన గోపిక కాక మరో గోపిక చెప్పటం రసవంతం. ఈ బాల్య చేష్టితాల్ని వాచిక శృంగారం క్రియా శృంగారం అని వింగడించవచ్చు.

## వాచిక శృంగారం

కం॥ ఇచ్చెలువ జూచి ముచ్చిలి
యచ్చుగ నుతికించు కొనుచు నరిగెద నాతో
వచ్చెదవా యని యన్నా
డి చ్చిఱుతడు సుదతి! చిత్ర మిట్టిది గలదే ! 10-316

'నీ తలగిన చోటెయ్యదియని' ఒక మృగాక్షినీ, 'చూలగుటకు నే మూలంబు' చెప్పుమని మరోసుదతినీ అడగటం అతని సరస శృంగార సంభాషణా నైపుణి కెత్తిన పతాక. మరొక ఇంటిలోని 'మగవా రటు వోవ జూచి మంతనమునకున్, దగజేరి పొందు' నడగటం మేరమీరని సుకుమార సుందరమైన అతని కొంటెతనం. అందులో అనాటి పల్లియ సరసుల శృంగార సంభాషణ రీతి, పోతన శృంగార చేతస్కత ప్రతిధ్వనిస్తుంది. అంతేకాదు 'నాతో వచ్చెదవా ? అని అనటంలోని గూఢ శృంగారార్థం తెలుగు పలుకుబడిలోని ఒక తియ్యదనపు కాముక'[28] ఇది తెలుగు వాడి నాడి తెలిసిన వాడి వాడి రచన. తెలుగునాటి గ్రామీణ వాతావరణ ప్రభావం దీనికి దోహదం చేసింది.

## క్రియాశృంగారం

క్రియాత్మకమైన శృంగారంగా బాలగోపాలుని క్రియా శృంగార విశేషాలు భావింపదగ్గవి. వెన్న దొంగను పట్టబోగా ఒక గోపిక స్తనాన్ని ఒడిసి పట్టాడట. అలా ఆ కళాస్థాన గ్రహణంతో ఆమెకు ఉలికిపాటూ ఆశ్చర్యం ఆగ్రహం ముప్పిరిగొని ఉంటాయి. ఇక మరొక వనిత పసివాడని పేరడిగితే పెదవి కఱచి పాఱి పోయాడట (10-314). ఇది చుంబన క్రియా విశేషం. సంతానం లేని సతిని చేరి 'తమ్ము మగనిగా గైకొనినన్/

---

28 ఆంధ్రభాగవత విమర్శనము. పుట. 140

గొడుకులు గలిగెదరని పైబడటం' (10-317) వాచిక క్రియా శృంగారాల కలయిక. ఇట సంతాన గోపాల స్ఫురణ కలిగించాడు పోతన. ఇంకా -

ఆ॥ తరుణి యొకతె పెఱుగు దఱచుచు దుది వంగి
వెన్న దియ్య నొదిగి వెనుక గదిసి
మగువ! నీ సుతుండు మగపోడుములు సేయ
సాగినాడు తగదె చక్క జేయ. 10-325

అంటూ ఒక గోపవనిత కోపంతో వాపోతుంది. అతడి ఆ మగపోడుము లెట్టివో వివరింప కుండటం ఔచిత్యం. 'ఎంత సున్నితము? అశ్లీలద్యోతకము గూడ లేదు. అనుభవించిన గోపికాక మరియొక గోపి చెప్పుట రసవంతము'[29] అని పుట్టపర్తి వారు శ్లాఘించారు. క్రియా శృంగారానికి ఈ ఘట్టంలో ఇది పరాకాష్ఠ. కొన్ని సన్నివేశాలు గాఢగ్రామ్య భావాలుగా తోచినా బాల్యక్రీడలు కావటంతో హాస్యం ఉదయించి అంతరంగానికి హాయి కలుగుతుంది. ఇలా ఆంధ్రుల హృదయసీమలో శ్రీ కృష్ణుణ్ణి సరస శృంగారమూర్తిగా ఆవిష్కరించటం పోతన శృంగార నిర్వహణ శిల్పం. జలకాలాడే జలజాక్షుల వలువల్ని అపహరించటం పవళించిన పడతులకు తేళ్లను కరిపించటం వంటివి కొన్ని మొరటుగా కన్పించినా పోతన రచనా శృంగారంతో హాస్యం ఉత్పన్నమవుతుంది. ఇంతకూ తే లెక్కడ కుట్టిందో చెప్పక పోవటమే పరమ శృంగారం. ఇట్టివి అనేకం.

భక్తు డిట్టి గాఢ గూఢ శృంగారాన్ని పోషిస్తాడా ? అని ఆశంకించి శృంగార సన్నివేశాలను ప్రక్షిప్తమంటూ కొందరు దాటవేయటం పోతన కపచారం చేయటమే. మూల భాగవతాన్ని రసమయం చేయటమే పోతన ప్రధాన ధ్యేయం. 'రసికులైన వారు రమణుల కొకవేళ/వంగుటెల్ల ధర్మవర్తనంబు'[30] అని భావించిన పోతన ఇట్టి 'రసపట్టుల' లో ఎలా ఊరుకుంటాడు ? కాకుంటే ఒక్కింత మోతాదు పెరిగిందనవచ్చునేమో ! కాని గ్రామ్యమని త్రోసిపుచ్చ వీలులేదు. కనుకనే నాటినుండి నేటిదాక అబాల గోపాల జిహ్వాగ్రాలమీద ఆ పద్యాలు చిరంజీవులై నర్తిస్తున్నాయి. వాటిలోని శృంగార హాస్య సౌకుమార్య సమ్మేళనమే అందుకు మూలకారణం. భక్తకవు లైన లీలాశుక జయదేవుల కృష్ణకర్ణామృత గీతగోవిందాది శృంగార రచనల్ని లోకం ఔదల దాలుస్తున్నది కదా! అదే స్థితి పోతన్నది కూడ.

భవిష్యత్కథా 'శృంగారీ నాయకత్వాన్ని'[31] బాల్య క్రీడల్లోనే బీజ ప్రాయంగా దర్శింప జేయటమే ఈ శృంగార వర్ణనా స్వారస్యం.

---

29 భాగవతోపన్యాసములు, పుట. 61

30 భోగినీ దండకము, భూమిక, పుట. 4

31 శృంగారీ నాయక స్త్వస్య పంచమః కథ్యతే యథా
విలాస వాక్యాయశీలః సుభగః స్థిర వాగ్మివా
గతిప్రధైర్యా దృష్టిశ్చ సలీలా సస్మితం వచః ॥ రసరత్నకోశం

# ప్రాదేశిక శృంగారం

రసాలు తదుద్భవాలైన భావాలు తత్తద్విభవానుసారంగా సమాఖ్యాతాలైతాయి. వీటికి సంబంధించిన శృంగార ప్రదేశాదులు ఇక్కడ నిరూపణార్హాలు. వీటి దర్శన శ్రవణాదుల వల్ల స్వసంవేద్యాలైన అనుభవా లనేకం. వాటిని దర్శన శ్రవణాదులచేత చక్కగా తెలియవచ్చు. శృంగార ప్రదేశాలైన విభావాలు, ఆలంబన విభావాల్లో హర్షాది వ్యభిచారీ భావాల్ని తమ తమ బలానుసారంగా కలుగచేస్తాయి. అలా ఉత్పన్నాలైన హర్షాది వ్యభిచారీభావాలు తత్తచ్చేష్టలను ఉత్పాదిస్తాయి. ఆ చేష్టలు హర్షాదులందు అనుభావాల్ని గోచరింప చేస్తాయి. చేష్టల చేత అనుభావాలు అనుమీయమానాలైతాయి. ఇలా పరస్పరం వీటి సంబంధం అభ్యూహించాలి. భావాలు చేష్టారహితాలుగా ఉండవు. చేష్టలచేత భావాలు భావాలచేత చేష్టలు అభ్యూహ్యా లవుతాయని గుర్తించాలి. కనుకనే చేష్టా విశేషజ్ఞుడైన భావుకుడే రసికుడు కాగలడు.[32]

ఇలా రసోత్పత్తిలో ప్రధాన దోహదాలైన శృంగార ప్రదేశాల్ని ద్విధా విభాగించవచ్చు. అవి కృత్రిమ ప్రదేశాలు అకృత్రిమ ప్రదేశాలు. నగరం గ్రామం పల్లీజనపదాలు కృత్రిమ ప్రదేశాలు. నదీ పర్వత సముద్రవేలారణ్యాదులు అకృత్రిమ ప్రదేశాలు. శిల్పజ్ఞులు అకృత్రిమాలను కృత్రిమాలనుగా, కృత్రిమాలను అకృత్రిమాలుగా చేయగలరు. ఈ రచనా విధానం రసోచితంగా ఉండటానికి శిల్పవిదులు యత్నిస్తారు.[33]

ప్రేయసీ ప్రియులకు నదీ పరిసరాలు పులిన ప్రదేశాలు సాగరతీరం కాంతారం ఆరామం భూధరం చిత్రవిచిత్ర లతాగృహాలు కిసలయాంచిత శయ్యలు దివావిహారానికి అనుకూలాలు. అలాగే హర్మ్య ప్రాసాద భూములు మంటపం భవనం గర్భగృహం వాసగృహం సంగీతశాల వేశ్యాంతఃపురం భవనం వంటివి వారి నిశావిహార యోగ్య ప్రదేశాలు. ఇలా శృంగార విహారాలకు శృంగార ప్రదేశాలు కాలానుగుణ్యంగా నిర్ణీతాలు.

భాగవతంలో శృంగార విహార సన్నివేశాల్లో ఈ ప్రాదేశిక శృంగార ద్వితయం గోచరిస్తుంది. విశేషంగా శృంగార ప్రదేశాలేకాక అకాల వసంత ఋతుకల్పనం వంటి కృత్రిమ కాలాన్నీ తద్రచనా విభవాన్నీ కూడా చూడవచ్చు. ఈ కల్పిత కాలం కూడ ప్రదేశ రామణీయక ప్రరోచకమే, తద్వారా సిద్ధించేది రసికజన ఉద్దీపనమే, శృంగార క్రీడా

---

32 భావప్రకాశనము, పుట. 292

33 శ్లో॥ 'కృత్రిమో ఽ కృత్రిమశ్చేతి ద్విధా దేశో విభావ్యతే ॥
కృత్రిమా నగర గ్రామ పల్లి జనపదాదయః ।
అకృత్రిమాః సరిచ్ఛైల వేలాఽ రణ్యాదయ స్తథా ॥
అకృత్రిమాస్తు శిల్పజ్ఞైః క్రియంతే కృత్రిమాః క్వచిత్ ।
కృత్రిమా అపి తద్వజ్ఞైర్విరచ్యం తేఽ ప్యకృత్రిమాః ॥ భావప్రకాశనము, పుట. 293

ప్రేరకమే. భాగవతంలోని ప్రతిజంటా కృత్రిమాకృత్రిమ విహార ప్రదేశాల్లో విహరించిన వారే! కనుక ఆ రెండూ శృంగారరస ప్రవర్ధకాలే.

కర్దమ దేవహూతుల విహార ప్రదేశాలు విశేషతరాలు. అందుకు కారణం ఆమె అభ్యర్థనం. 'భవదీయ సంయోగ వాంఛాపరతం గృశీభూతంబైన యాదేహం బేవిధంబున మజ్జన భోజన పాన సుఖంబుల బరితుష్టిం బొందు నట్టి మన్మనోరథంబు దీర్ప, రతి తంత్రంబగు కామశాస్త్ర ప్రకారం బుపశిక్షించి యందులకు నుచితంబు లైన వివిధాంబ రాభరణ మాల్యాను లేపన మందిరారామ ప్రముఖ నిఖిల వస్తు విస్తారంబు గావించి నన్ను గరుణింపుమని' (3-800) కర్దముణ్ణి దేవహూతి వేడింది. తదనుగుణంగానే అతడు తన యోగమాయతో సమస్తాన్నీ సృష్టించాడు. కృత్రిమ అకృత్రిమ శృంగార ప్రదేశాలతో దేశకాలోచిత శృంగారానురాగ క్రియా విశేషాలతో ఆ సమయం అనురాగ మధురంగా మన్మథ మన్మథంగా మారింది. ఆపైన కృత్రిమ గృహాలతో కూడిన దివ్య విమానం (3-801) కల్పించాడు. అది 'కామగ'. దాన్ని అధిరోహించిన వారి మనోభీష్టానుసారంగా తనంతట తానుగా గమిస్తుంది. అంతేకాదు పురుషార్థమైన కామ భావాని కనుకూలంగా గమిస్తుంది. అందు కనుకూలంగా అది సర్వ సంపూర్ణ శృంగార ప్రసాధన సామగ్రీ నిర్భరంగా ఒప్పింది.

కం॥ ఘన సౌధాంతర శయ్యా
సన కేళిగేహ కృతక జగతీధర శో
భన చంద్రకాంత చారు భ
వన ఫలభరి తావనీజవంతము లగుచున్. 3-805

కం॥ సకలర్తు శోభితంబును
సకల శుభావహము సకల సంపత్కరమున్
సకలోప భోగయోగ్యము
సకలేప్సిత కామదంబు సదలంకృతమున్. 3-808

ఈ సకలర్తు సంశోభిత విమానంతో సర్వ అకృత్రిమ శృంగార ప్రదేశాలూ కర్దముడు తన భార్యకు చూపించాడు (3-815). తత్ఫలితంగా వారు బహువత్సరాలు ఒక్క ముహూర్తంగా శతవత్సరాలు గడప గలిగారు. ఈ సందర్భంలో కల్పిత సర్వర్తు శోభల్ని ఒక్కసారే దర్శించి శృంగారానుభవ సస్యాల్ని పండించుకోవటం విశేషం.

సౌభరి ప్రథమానురాగానంతరం తన కాంతలతో విహరించిన తావులు శృంగారో ద్దీపకాలు. పూట కొక పాలుపు దాల్చటానికి అనువైన కల్పిత వసంతం అది. అక్కడే వారిని రతుల దేల్చాడు.

సీ॥ గృహరాజముల యందు గుసుమ వల్లుల యందు
గేలాహలంబైన గొలకు లందు
గలకంఠ శుక మధుకర నినాదములచే
వర్ణనీయములైన వనము లందు
మణివేదికల యందు మహనీయ పర్యంక
పీఠ లీలా శైల బిలములందు

శృంగారవతులగు చెలువలు పలువురు
తన పంపుసేయ సుస్థలము లందు
తే॥ వస్త్ర మాల్యానులేప సువర్ణహార
భూరి సంపద నిష్టాన్న భోజి యగుచు
బూట పూటకు నొక వింత పొలుపు దాల్చి
రాజకన్యల నందఱ రతుల దేల్చె. 9-178

ఇంకా అనేక లీలావినోదాలు కల్పించుకున్నాడా ముసలితపసి. అలా కల్పించుకొని వినోదించిన తావులన్నీ వసంత ఋతు రాగ దీపనలే. పెక్కుమంది శృంగారవతులను రతుల దేల్చటం ఇక్కడ సిద్ధించిన ప్రయోజనం. క్రమంగా గానీ అతనికి ఆ కామదాహం తీరలేదు.

రుక్మిణీ కృష్ణుల విహారం మానానంతర విషయం. అది వారి 'గృహ ప్రత్యాగమన' సంభోగానికి దారితీసింది. అందుకు తగిన సుమసౌరభ సమన్విత మయిన వసంత ఋతుధర్మం నెలకొన్నది. దానితో వారిలో క్రొత్త కోరికలు మొసులెత్తాయి.

చ॥ ఎలమి ఘటింపగా గలసి యీడెల నీడెల మల్లికాలతా
వలి కరవీర జాతి విరవాదుల వీథుల గమ్మ తెమ్మెరల్
పొలయు నవీన వాసముల బొన్నల దిన్నెల బచ్చరచ్చలన్
గొలకుల లే గెలంకులను గేరిక లీరిక లొత్త గ్రొత్తలై. 10ఉ. 273

ఈ ప్రకృతి సౌందర్యం కందర్పలోలాత్ములను గావించింది రుక్మిణీ కృష్ణులను. కనుక వనవిహారం ప్రేమభావాల్ని ఇతోధికంగా పెంచి పోషిస్తుంది. ఇలా అనురాగ పరిపోషక కుసుమజాతుల పరిమళాల గుబాళింపు వారి భావ వైమనస్యాన్ని నశింపచేసి నవ మన్మథ భావప్రేరితుల్ని చేసింది. వారి మానానంతర సంభోగ వైమనస్య నివారణకు ఈ వనవిహారం దోహదపడుతుందని కవిభావం.

బలరాముడి వనవిహారం వసంత సంబంధ మైంది. ఇది కథాగత విషయం. సుందరీ జన సముదంచితాలైన వనవిహారాలు ఉద్దీపకాలైన హృదయానంద కందాలు.

గోపికలకు శ్రీకృష్ణ సంబంధమైన సమాచారం అందించి విగత దుఃఖల్ని చేశాడు బలరాముడు. ప్రియ సమాచార సంజనిత సంతోషంతో ఉన్న సమయంలో వచ్చింది ఈ వసంతం. సమాచారం తెచ్చిన దూతను సత్కరించాలి కదా ! అందులోనూ అతడు సాక్షాత్తూ బలరాముడు కావటం చేత అతణ్ణి సేవించారు. ఆపై అందరూ కలసి యథేచ్ఛగా వనవిహారం చేశారు.

సీ॥ మాకంద జంబీర మందార ఖర్జూర
ఘనసార శోభిత వనములందు
నేలా లతాలోల మాలతీ మల్లికా
వల్లీ మతల్లికా వాటికలను
దరళ తరంగ శీకర సాధుశీతల
సైకత వేదికా స్థలములందు

మకరంద రసపాన మదవ దిందిందిర
　　పుంజ రంజిత మంజు కుంజములను
తే॥ విమలరుచి గల్గు సాను దేశముల యందు
లలిత శశికాంత ఘన శిలాతలము లందు
లీల నిచ్ఛావిహార విలోలు డగుచు
సుందరీ జనములు గొల్వ జాడ నొప్పె. 10ఉ.491

యమునా తీరంలోని వసంతకాల దివావిహారం వారి ఈ వనవిహారం. ఆయన కిది 'ఇచ్ఛా విహారం'. అది ఆయనకు కేవలం స్వానందానికే అయినా గోపికా మానసిక ప్రశాంతిని కూడ ప్రసాదించిం దనవచ్చు. ఇందులోని వృక్ష జాతులన్నీ పోతన్నను ప్రకృతి కవిగా గుర్తింప చేస్తాయి. అవి అన్నీ ప్రణయ భావ ప్రవర్ధక ఉద్దీపకాలే. ఇందులోని అంతర్యం ప్రకృతి జీవ చైతన్యం సమస్తం కామభావ పరిపోషితం అని పోతన భావం.

ప్రేమికుల బాహ్యచేష్టలలో 'మధుపానం' ఒకటి. పానగోష్ఠులు గృహాభ్యంతరాల లోనే కాక వనవిహార సమయంలో కూడ సాగించవచ్చు. మధువు మైరేయం వంటి పానీయాలు ఉత్సాహాన్నీ ఉత్తేజాన్నీ తేజస్సునీ కామోద్రేకాన్నీ ఉల్లాసాన్నీ కల్గిస్తాయి. భార్యతోనూ స్నేహితులతోనూ కలసి మధువును సేవించి వారితోడి ఉద్యాన వనవిహారం మాసాని కొకసారైనా కావించటం గృహస్థుడి విధి.[34] బలరాముడు గోపికలతో సేవించిన మద్యం 'నిఖిల తరు కోటరములందు నిర్గమించి/మించు వాసవచేత'(10ఉ.492) వనమంతా వాసించింది. దానిని సేవించిన గోపాంగనలు హేమ మణి కంకణ ఝణత్కారానుగుణంగా కరతాళ ధ్వనులు చేస్తూ వేడ్కతో ఆడుతూ పాడుతూ సుక్కుతూ సోలుతూ (10 ఉ. 494) తిరిగారు. ఆయన మీద బిరుదాంకితాలైన గీతాలు ఆలపించారు. ఇలా మద్యపాన విశేషం అతడిని తుదకు జలక్రీడకు ప్రేరేపించింది. ఉత్తమ మధువు మధుపాయిని 'ఖుసి' మీరి వర్తించేలా చేస్తుంది. కనుకనే దీన్ని శారదాతనయుడు 'నిశాచేష్ట'గా పేర్కొన్నాడు.

షోడశ సహస్ర వనితలతో శ్రీకృష్ణుడు రాజ్య సుఖాల్ని అనుభవించే సమయంలో వారు వివిధ శృంగారోచిత ప్రదేశాల్లో కేళించారు. వాటిలో వివిధ భవన సముదాయాలూ ఉద్యానవనా లున్నాయి. అక్కడ నిరంతర వసంత సమయ సముచిత వాతావరణం నెలకొన్నది. గుణత్రయ విశేషంతో మందానిలుడు అమందానందాన్ని కలిగించాడు. ప్రకృతిలోని వసంత లక్షణ సర్వస్వాన్నీ సొంతం చేసుకున్న రీతిగా శీతలవాతపోతం ప్రసరించింది. ఆ నేపథ్యంలో వేదికాస్థలాలు కృతక మహీధరాలు పులినతలాలు కప్పురపు తిప్పలు కురువేరు చప్పరాలు వాటివాటి సహజ సౌందర్య సౌరభ విశేషాలతో శృంగార క్రీడా విహారపు నెలవు లైనాయి. అక్కడే సంపాదిత నిరంతర హేమంత సమయ ప్రదేశాలూ జలక్రీడాశయాలూ ఉన్నాయి. ఇందులోని వారి విహారానికి ప్రత్యేక ప్రయోజనం నిత్య సుఖానుభవమే. శృంగార రసైక లోలత్వమే! శృంగార రసరాజ్య స్థాపనమే !

---

34 వాత్స్యాయన కామ సూత్రాలు, సం.1 పుట. 105

పోతనగారు అల్లంత దూరంలో చూపిన వైకుంఠపురంలోని అంతఃపురంలో ఉన్న ప్రధాన సౌధం దాని సమీపానగల మందారవనం దానిచెంతన ఉన్న అమృత సరస్సూ అన్నీ శృంగార విహార ప్రదేశాలే. అమృత సరస్సు చంద్రకాంతోపల మృదుల శిలాతలం దానిమీది ఉత్పలాల పాన్పూ మందారాల ఉత్పలాల పరిమళాలూ అన్నీ శరత్కాలోచితాలు. అవి తత్కాల ద్రవ్య విశేష సూచికలు. ఆ రమావినోది సలిపింది దివావిహారం. వారిది ఏతత్కాలోచితమైన క్రీడ. ఇలా అన్నీ శరత్కాల శృంగారోచిత విశేషాలే![35]

మ॥ అల వైకుంఠ పురంబులో నగరిలో నామూలసౌధంబు దా
ఫల మందార వనాంత రామృత సరఃప్రాం తేందుకాంతోప లో
త్పల పర్యంక రమావినోది యగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము "పాహి పాహి" యన గుయ్యాలించి సంరంభి యై. 8-95

ఈ సందర్భంలో ఏ ఒక్కటో కాక అన్నీ శృంగార సన్నివేశాలే. అన్నీ తత్తదుచిత వస్తు సంచయాలే. అంతా వారి శృంగార కేళీ వినోద విశేష సన్నివేశ విశదీకరణమే. ఈ రమణీయ ప్రకృతి ప్రభావం వారి విహారాన్నీ వినోదాన్నీ ప్రదీప్తం చేసి, వారి ప్రథమానురాగానంతర ప్రణయాన్ని ప్రవృద్ధంచేస్తుంది. ఇదంతా పోతన భావనామయ శృంగార వీధీ విహారమే. అతనికి గల ప్రకృతి సౌందర్య ఆస్వాదనా పారవశ్య పర్యవసానమే.

పోతన తన భాగవతంలో శరదృతు సంబంధ క్రీడలనే విహారానికి అధికంగా వర్ణించాడు. తరువాతనే వసంతఋతు ప్రాధాన్యాన్ని గుర్తించాడు. అక్కడక్కడ మాత్రమే ఇతర ఋతువుల్ని సూచించాడు. వసంత శరత్తులే శృంగారానికీ దాని విహారానికీ సుఖావహమైనవిగా భావించటమే అందుకు మూల కారణం కావచ్చు. శారదాతనయుడు సూచించిన ఇతర ఋతు విశేషాల్ని కూడ పోతన ఈ రెండు ఋతువుల్లోనే చొప్పించి విశేషంగా వర్ణించిన వైనం గమనించవచ్చు. జలక్రీడ వనవిహారం గ్రీష్మఋతు సంబంధమైన క్రీడలైనా వసంతంలోనో శరత్తులోనో పోతన వర్ణించాడు. ఇవన్నీ పోతనకు ఆయా ఋతువులపట్ల ఆయా క్రీడలపట్ల ఉన్న మమకారాభిమానాల్ని సూచిస్తాయి.

అన్ని ఋతువుల్లోని క్రీడాస్థలాలూ ఒకే విధంగా కాకున్నా కొద్దిపాటి విశేషణ వ్యత్యాసంతో గానీ ఫలసిద్ధి భేదక సూచవంతో గానీ దర్శనమిస్తాయి. ఈ శృంగార విహార స్థలాలు రమణీయాలై ముగ్ధ మనోమోహనాలై సమగ్ర సుందరమైనాయి. మొత్తం మీద శృంగార క్రీడలకు శృంగార విహార ప్రదేశాలకు అవినాభావ సంబంధం ఉంది. స్థలాన్ని బట్టి క్రీడ, క్రీడను బట్టి స్థలం ఎంపిక ఉంటుంది. నాయికా నాయకుల మానసిక శృంగార భావనను బట్టి ఈ రెండింటి ఎంపికా వ్యక్తినిష్ఠంగా ఉంటుంది. అలాగే వారి ఉద్దీపనకు వీటి ఆవశ్యం ఎంతగానో ఉంది.

---

35 భావ ప్రకాశనము, పుట. 178

# రసరీతులు

## రస మేళనం - శృంగారం

### అవిరోధి రసమేళనం

కావ్య రామణీయక సాధకంగా కవులు రసమేలనం చేస్తారు. రసపుష్టిని కల్గిస్తారు. రెండు రసాలకు పరస్పరం పౌర్వాపర్యంలో భావాలు సమానంగా ఉంటే అది రసమేలనం అవుతుంది. ఆ రెండు రసాలకు పరస్పరమైత్రి గానీ అవిరోధం గానీ ఉండాలి. ఆయా రసాలకు సంబంధించిన భావాలు పరస్పర బాధ్యబాధక భావాలు కావు. పైగా సర్వరసాలూ సందర్భానుసారంగా పరస్పరం మిళితమౌతాయి. శృంగార వీరాలకు రౌద్రబీభత్సాలకు అద్భుత హాస్యాలకు కరుణ భయానకాలకు అన్యోన్యమేలనం అనుకూలంగా ఉంటుందని భావప్రకాశకారుడి అభిప్రాయం.[1] కాగా రసగంగాధర కర్త వీరశృంగారాలకు శృంగార హాస్యాలకు వీరాద్భుతాలకు వీర రౌద్రాలకు శృంగారాద్భుతాలకు పరస్పర విరోధం లేదని వెల్లడించాడు.[2] కనుక కావ్యంలో రస పరిపాకం కోసం కవి పరస్పర మైత్రిగల రసాలను మాత్రమే మేలవించాలి. అందులో కథలో ఆద్యంతం ప్రధానంగా ఉన్నది అంగిరసం కాగా తర్వాత ప్రవేశించిన రెండవరసం అంగరసం. ఇలా రెండు రసాలకు ప్రవేశం ఉండి వాటి

---

1 శ్లో॥ పౌర్వాపర్యేణ భావాః స్యుః సమా యది మిథో ద్వయోః ।
తదేవ రసవిద్వద్భిః రసమేలన ముచ్యతే. ॥
శృంగార వీరయోః సమ్యగ్భవే దన్యో న్యమేలనం ।
రౌద్ర బీభత్సయోః తద్వత్త ద్వివాద్భుత హాస్యయోః ॥
భయానకస్య కరుణస్య స్యాదన్యోన్య మేలనం ।
రసాః కార్యవశాత్సర్వే మిలం త్యేవ పరస్పరమ్ ॥ భావప్రకాశనము. పుట. 286.

2 నవరస గంగాధరం, పుట.132.

భావాలకు సమత్వం ఉంటే అది 'సంసర్గం'. అదే రసద్వయ సమ్మేళనం. వీటి సంబంధం మాలాగ్రథనంలో పుష్పానికి పుష్పసంసర్గంలాగా ఉంటుంది. ఇదే రసద్వయ సమ్మేళనం. ఇలా నిరూపితాలైన రెండు రసాలు ఒక వేళ తుల్య భావాలుగా అవభాసిస్తే కాకువు చేతగాని విశేషణం వల్లగానీ విభావాదుల బలంవల్ల గాని ఏ రసానికి ప్రాధాన్యం ఉందో విచక్షించి దానిని ప్రధాన రసంగా పేర్కొనటం శాస్త్ర సమ్మతం.[3]

## వీర శృంగారాలు

సత్యా సంగ్రామం వీర శృంగార రసద్వయ సమ్మేళనానికి చక్కని నిదర్శనం. అటు సంస్కృత భాగవతంలోగాని ఇటు విష్ణుపురాణంలోగాని సత్యభామా సంగ్రామ ప్రసక్తిలేదు. ఇది హరివంశంలో వచ్చిన మార్పు. ఇది నవీన గుణసనాథుడు ప్రదర్శించిన నవ్యప్రతిభ. సహజపండితుని ప్రతిభ దీనిని వీర శృంగారాల సమున్మీలనంగా ప్రకాశింపచేసింది. సోముడు నిక్షేపించిన శృంగార బీజాల్ని పోతన పెంచి పోషించి తీర్చి దిద్దిన శృంగార వనం ఈ సత్యా సంగ్రామం. కనుక ఇది సోమనకు సృజనాత్మక అనుసరణం.

కదనరంగానికి కదలి వస్తానన్న ఆ సత్యతో కదనరంగం శృంగార రసరంగం కాదని శ్రీకృష్ణుడు చతురంగా నిరూపించిన ఈ క్రింది పద్యం వీరశృంగార రసభేదాలకు ఆలవాలం.

సీ॥ సమద పుష్పంధయ ఝుంకారములు గావు
        భీషణ కుంభీంద్ర బృంహితములు
    వాయు నిర్గత పద్మవన రేణువులు గావు
        తురగ రింఖా ముఖోద్ధూత రజము
    లాకీర్ణ జలతరం గాసారములు గావు
        శత్రు ధనుర్ముక్త సాయకములు
    కలహంస సారస కాసారములు గావు
        దనుజేంద్ర సైన్య కదంబకములు

తే. కమల కల్హార కుసుమ సంఘములు గావు
    చటుల రిపుశూల ఖడ్గాది సాధనములు
    కన్య! నీవేడ? రణరంగ గమనమేడ ?
    వత్స వేగమ నిలువుము వలదు వలదు. 10 ఉ. 153

---

3. శ్లో॥ ద్వయోస్తుల్య వదుత్పత్తౌ సంసర్గాలంకృతిస్తు సా ॥
కాక్వా విశేషణేనాథ విభావాది బలేనవా ।
ప్రాబల్యం యస్య దృశ్యేత తస్య ప్రాధాన్య మిష్యతే ॥ భావప్రకాశనము. పుట. 310

ఇందులో ప్రధాన రసం వీరం అంగరసం శృంగారం. పాద పూర్వార్థంలో శృంగార స్ఫూరక భావాల్ని విస్ఫారితం చేసి ఉత్తరార్థంలో వాటినే వీరరస ఉద్దీపనాలుగా పేర్కొనటం రసద్వయ సమ్మేళన స్వారస్యం. కడకు శృంగారరసమే ఉత్కర్షితం. శ్రీకృష్ణుని ఆకర్షిస్తున్న సత్యాశృంగారం దానికి కారణం. ఈ సందర్భంలో సత్య శృంగార వీరాంగనగా భర్తకు ఐదు పది సేయటంతో బహుమాన పురస్సర దృష్టితో భర్త గౌరవించటం (10 ఉ.155) నరకాసుర వధానంతరం ఆమె కాభరణా లందించి కామోపచారాలు చేసి అభినందించటం అన్నీ కావ్య సౌందర్య దృష్టితో చేసిన శృంగార కల్పనలే. అవి సత్యభామా శృంగార విలాస సముల్లసనాసక్తితో చేసిన సేతలే. అన్నీ రమణీయతా నిధానాలే.

ఇందులోని సత్యాప్రసంగ ప్రవర్తనలన్నీ ప్రౌఢ కాంతా సహజ సమున్మీలితాలు. యుద్ధరంగంలో సత్య పోషించిన వీర శృంగారాల ద్విపాత్రాభినయం అద్వితీయం. అమోఘం అమూలం.

మ॥ పరుజాచున్ వరుజాచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరత భ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్
జరగన్ గన్నుల కెంపు సొంపు బరగన్ జండాస్త్ర సందోహమున్
సరసాలోక సమూహమున్ నెఱపుచున్ జంద్రాస్య హేలాగతిన్ . 10 ఉ.178

నాయిక సత్య ఒకరికి చండాస్య వేరొకరికి చంద్రాస్య. నాయక ప్రతి నాయకులు శ్రీకృష్ణ నరకాసురులు. సత్య అనుభావాలతో వీర శృంగారాలను ప్రదర్శించింది. ఏకకాలంలో శృంగార నాయికగా వీర నారిగా, శృంగార నాయిక సోయగాలనూ వీరనారి విన్యాసాలనూ ఆమె ప్రదర్శించింది. ఇందులో ఆమె అనుభావాలను సమంగా వర్ణించటం వల్ల వీర శృంగారాలకు సమప్రాబల్యం గోచరిస్తుంది.

హాస్యాస్పదం కాదగిన సత్యభామా యుద్ధం వీర శృంగార భయ రౌద్ర విస్మయావహంగా పరిణమించింది. యుద్ధరంగంలోని సత్యా స్వరూపం శృంగార వీర నాయికా లక్షణోపేతంగా పోతన్న ఏకత్ర చిత్రించిన శిల్పం.

సీ॥ రాకేందు బింబమై రవి బింబమై యొప్పు
నీరజాతేక్షణ నెమ్మొగంబు
కందర్ప కేతువై ఘనధూమ కేతువై
యలరు బూబోణి చేలాంచలంబు
భావజు పరిధియై ప్రళయార్కు పరిధియై
మెఱయు నాకృష్టమై మెలత చాప
మమృత ప్రవాహమై యనల సందోహమై
తనరారు నింతి సందర్శనంబు

ఆ ॥ హర్షదాయియై మహారోష దాయియై
పరగు ముద్దరాలి బాణవృష్టి
హరికి నరికిజాడ నందంద శృంగార
వీర రసములోలి విస్తరిల్ల. 10 ఉ. 183

ఇట సత్య ఆంగిక వాచిక ఆహార్యాలతో నాయక ప్రతినాయకులలో ఒకేసారి శృంగార వీర రసాలపరిపుష్టికి తగిన రస సామగ్రిగా పరిణమించింది. ఆశ్రయ భేదంతో వారికి హర్ష రోషాలు కలిగించి శృంగార వీరరసమూర్తిగా అవతరించింది. ఇందులోని అంగిరసం వీరమే అయినా దానికి భంజకంగాని రీతిలో శృంగారం శోభించింది. ఇలా 'ఏక సమయమున ఏక పాత్రయందలి ఆంగిక వాచిక వైఖరులలో రసద్వయానుభవమును గలిగించుట అత్యద్భుత పాత్ర చిత్రణము. అందు సిద్ధహస్తుడైన పోతన సమగ్రమగు శృంగార వీర మూర్తిని తెనుగు సాహిత్యమున నిల్పినాడు'.[4]

ఏకపాత్ర నిష్ఠమైన అవిరుద్ధ రసద్వయ సమ్మేళనంలో సత్యభామ వీర శృంగార పాత్ర పోషణం ఒక విచిత్ర చిత్రణం. అతిలోక సౌందర్యవతి అయిన సత్య అరిలోకానికి అశనిపాతం అయింది పోతన చేతిలో. ఈఘట్టంలో విభావాశ్రయంగా రతిభావం వ్యక్తమయింది, కానీ దానికి పరిపోషణ లేదు. పరిపుష్టం కాని రతిభావ మాత్రమై వీరరసానికి అంగమయింది, దీనికి సంరంభం అనుభావం. అంగ భూతమైన రతి భావం సౌందర్యానికి ఉత్కర్షహేతువు కలిగిస్తుంది. ఇది పోతన భావనాశక్తికి పాత్ర చిత్రణకు రసపోషణకు సముచిత స్వరూపం. ఇందులోని వివిధాలంకార వినియోగ విధానం సత్యభామా సౌందర్యాన్ని ఉద్దీపింపచేస్తున్నది.

అసలు ఆంధ్ర సాహిత్యంలో కృష్ణ శృంగారంలో సత్యభామ విశిష్ట కేంద్రమనీ అందులో కల్యాణకథ కన్న శృంగార మాధుర్య మెక్కువ ప్రతీయ మానమైందనీ ధారావారి భావన.[5] అందు కాద్యులైన వారిలో పోతన ప్రథమగణ్యు డనవచ్చును.

శ్రీకృష్ణుణ్ణి అపహాస్యం చేస్తూ పల్కిన జరాసంధుడి మాటలలోని శృంగార యుద్ధ వీరాల మేళనం అమూలం. శృంగారలోలుడు యుద్ధవీరుడు కాబోడని జరాసంధుడి ఎత్తిపొడుపు.

సీ ॥ గోపికా వల్లకీ ఘోషణంబులు గావు
శింజినీ రవములు చెవుడు పఱుచు
వల్లీవీ కరముక్త వారి ధారలు గావు
శరవృష్టి ధారలు చక్కు సేయు

---

4 ఆంధ్రభాగవత విమర్శనము. పుట. 260

5 ఆంధ్ర వాఙ్మయము - కృష్ణకథ. పుట . 219

ఘోషాంగనాపాంగ కుటిలాహతులు గావు
నిశితాసి నిహతులు నిగ్రహించు
నాభీర కామినీ హస్తాబ్జములు గావు
ముష్టిఘాతంబులు మురువు డించు
తే ॥ నల్ల వ్రేపల్లె గాదు ఘోరావనీశ
మకర సంఘాత సంపూర్ణ మగధరాజ
వాహినీ సాగరం బిది వనజనేత్ర !
నెఱసి నిను దీవి క్రైవడి నేడు ముంచు. 10 - 1543

శృంగారరస అపహాస్యంలోనే వీర రసాధిక్యం నిరూపించా లనుకున్నాడు జరాసంధుడు.కాని పోతన దృగ్గోచరమైన కృష్ణ శృంగార లీలాతరంగిణి దానిని ప్రతిరోధించింది. ఆ రెండూ రెండు ఆధారాలలో నిక్షిప్తమైనాయి.జరాసంధుడు శృంగార యుద్ధ వీరాలను విరోధిరసాలుగా భావించినా శృంగారం అంగరసంగా ప్రతీయమానమయింది.

## హాస్య శృంగారాలు

మూలంలోని ఋష్యశృంగ శృంగార కథకూ అనువాదంలోని కథకూ పొంతన లేనే లేదు. మూలంలోనిది అతి సంక్షిప్తం.

శ్లో ॥ దేవ్యేవర్షతి యం రామా అనిన్యుర్హరిణీసుతం ॥
నాట్య సంగీతవాది త్రైర్విభ్రమాలిఙ్గనార్హణైః । 9-23-8/9

మూలంలోని ఈ లేశమాత్ర శృంగార భావాన్ని కామకళారంగంగా సవదరించాడు పోతన. ఋష్యశృంగుడి వద్దకు వచ్చిన వేశ్యలు 'ఉదార స్తన భార భీరుతర మధ్యగలు' (9 - 686). వారు ఆటపాటలతో చూపుతూపులతో వచ్చారు. వారి శృంగార వేష భాషణాలన్నింటినీ ముని సహజాలుగా భావించి వారిని మునులుగా ఎంచి దరిచేరి నమస్కరించాడు.

సీ॥ మిళితాళినీల ధమ్మిల్ల భారంబులు
చారు జటా విశేషంబు లనియు
ఘర్మాంచలోజ్జ్వల ప్రభ దుకూలంబులు
తత చర్మ వస్త్ర భేదంబు లనియు
బహురత్న కీలిత భాసుర దామంబు
లధిక రుద్రాక్ష మాలాదు లనియు
మలయజ మృగనాభి మహిత లేపంబులు
బహువిధ భూతి లేపంబులనియు

తే ॥ మధుర గానంబు శ్రుతియుక్త మంత్ర జాతు
లనియు వీణెలు దండంబు లనియు సతుల
మూర్తు లెన్నడు నెఱుగని ముగుదతపసి
వారి దాపసులని డాయ వచ్చి మ్రొక్కె. 9 - 692

ఇట ఋష్యశృంగుడి భ్రాంతి మూలంగా శృంగారాంగాలన్నీ శాంతాంగాలైనాయి. అయినా హాస్యాస్పదమైన అతని ప్రవర్తనకు కారణం అతడెప్పుడూ అంతకు ముందు స్త్రీలోకాన్నే కాదు ఇతర ప్రపంచాన్నే చూచివుండక పోవటమే. ఇక్కడ శృంగారం పరగత హాస్యంతో అభిభూతమయి శృంగార రసాభాసకు దారి తీసింది. ఇలా వారి శృంగార రచన హాస్య పర్యవసాయి అయింది.

వారు ఋష్యశృంగుడిని కామోద్దీపితుడిగా మార్చటానికి చేసిన యత్నం అంతా వేశ్యాకులోచితం.

సీ॥ సేమమే ? యని సతుల్ చేతుల గ్రుచ్చిక
ర్కశ కుచంబులు మోపి కౌగిలించి
చిరతపోనియతి డస్సితి గదా!యని మోము
గంఠంబు నాభియు గలయ బుణికి
క్రొత్త దీవనలివి కొనుమని వీనుల
పొంత నాలుకల జప్పుళ్ళుచేసి
మా వనంబుల పండ్లు మంచివి తిమమని
పెక్కు లడ్వంబులు ప్రీతి నొసగి

తే ॥ చర్మవస్త్రము వదలించి భర్మకాంతి
మించి చెలగు పీతాంబర మిచ్చి వెసను
మనము సొక్కంగ నతని జేకొనగ వారి
మఱుగునకు జేరె నతడు వే మరగి వారి. 9-694

ఇందులో 'స్తనాలింగనం' అనే ఆలింగనభేదమూ, ఇంకా ఇతర బాహ్యరతి భేదాలున్నాయి. అంతేకాదు నీళ్లలో రేగుపండును పడవేస్తే 'బుడుంగు, బుడుంగు'మనే శబ్దం వచ్చిన విధంగా దవడల పైభాగాన్ని నాలుకతోకలిపి ఉచ్చరిస్తే వచ్చే 'ఫూత్కృతం'[6] వంటి అనేక శబ్దాలు 'రతావసాన' మధురభక్షణ విధాలు ఉన్నాయి. ఇలావారి ప్రయత్నాలన్నీ క్రమ ప్రణాళికలో సాగగా ఋష్యశృంగుడి మనసు రంజిల్లింది. తర్వాత వారిని మరిగి వారి మరుగున చేరాడు. ఇలా అమాయకుడైన ముని శృంగార స్ఫోటంతో మాయికుడై కాంతాకటాక్ష బద్ధు డవటం పరగత హాస్యానికి మూలం.

---

6 అప్సుబదర స్యేవని పతతః ఫూత్కృతమ్. వాత్స్యాయన కామసూత్రాలు. సం. । . పుట.269

ఈ కథ ఏకనాయక బహు వేశ్యానాయికా బంధురం, కపట రాగమూలం. వారి ప్రయత్న ప్రయోజనమే వేరు. కనుక రసాభాసం స్పష్టం. ఋష్యశృంగుడి రక్తాపరక్త చేష్టల[7] వల్ల ఇందులో హాస్యం జనించింది. కనుక శృంగారం హాస్యోల్లసితమై శృంగారాభాసంగా పరిణమించింది.

## భక్తి శృంగారాలు

భక్తిని శృంగారరస పరిపోషక భావంగా పరిగణించారు పూర్వాలంకారికులు. అనంతరాలంకారికులు భక్తికి స్వతంత్రరస ప్రతిపత్తిని కల్పించారు. అదృష్టితో తిలకిస్తే పోతన్నగారి భక్తిరసంలో కూడా శృంగార రసచ్ఛాయలే ప్రస్ఫుటమౌతాయి. అందుకు ఒక ఉదాహరణం -

శృంగార రసాధిదేవత అయిన శ్రీమహావిష్ణు సాక్షాత్కారం కోసం వెళ్ళే ధ్రువుడికి తల్లిచేసే ఉపదేశంలోనూ శృంగార స్ఫూర్తి ఉంది.

శ్లో॥ యోమృగ్యతే హస్తగృహీత పద్మయా
శ్రియేతరైరంగ విమృగ్యమానయా ॥ 4-8-23

పై శ్లోకం భావచిత్ర కందంగా అందగించింది పోతన కందపద్యంలో -

కం॥ కరతల గృహీత లీలాం
బురుహాయగుచు, బద్మగర్భముఖ గీర్వాణుల్
పరికింపం గల లక్ష్మీ
తరుణీమణి చేత వెదకదగు పరమేశున్. 4-235

వ॥ 'నిజ ధర్మపరిసేవితం బైన ఏకాగ్ర చిత్తంబున సేవింపు' (4-236) మని తల్లిచేసిన బోధ. 'లక్ష్మి మంగళ దేవత. లేదా శృంగారదేవత. పరమ శృంగారుడైన ప్రభువును పట్టుకోవాలంటే శృంగార మార్గంలోనే పయనించాలి అని అర్థం.[8] అదే భక్తి గమ్యానికి శృంగార మార్గం. ఏతన్మార్గంలోనే పోతన జీవనయానం సాగింది. లక్ష్మి తరుణీ విలాస సౌందర్యాలు భక్తి కుహర విద్యుద్దీపాలు.

దుర్వాసుడు శరణార్థిగా వైకుంఠానికి వెళ్ళినప్పుడు శ్రీనివాసుడు లక్ష్మి దేవితో ఉన్నట్లు మాత్రమే మూలం (9-4-60). కానీ పోతన దాని రూపరేఖలే మార్చి వారిపట్ల శృంగారాన్ని ఒలక పోశాడు.

శా॥ ఆ వైకుంఠము లోని భర్మ మణి సౌధాగ్రంబుపై లక్ష్మి దా
గ్రేవన్ మెల్లన నర్మభాషణములన్ గ్రీడింప బుణ్యున్ హరిన్

---

7 శ్లో॥ రక్తాపరక్త యో శ్చేష్టా యత్ హాసకరీ నృణాం ।
దృష్టా శ్రుతా సూచితాఽపి శృంగారా భాసకారికా ॥ భావప్రకాశనము, పుట. 284

8 శృంగారం - పోతన. పుట. 87

దేవాధీశ్వరు గాంచి యోవరద! యో దేవేశ ! యోభక్తర
క్షా విద్యా పరతంత్ర! మానుప గదే చక్రానల జ్వాలలన్. 9-114

దివ్యశృంగార సందర్భంగా శ్రీహరి స్మరణం కలిగినపుడెల్లా పోతన దర్శించిన స్వరూపం ఇదే. కనుకనే అమూలకంగా ఈ శరణాగత సన్నివేశంలో సైతం వారికి శృంగార ప్రదేశాలూ నర్మ భాషలూ కల్పించాడు. అందుకు కారణం 'స్వభావము చేత పోతన భావకవి. అందును భక్తి శృంగార భావములు వర్ణించుపట్టున అతి మాత్రమునకు పాల్పడు భావలోలుడు. అఘట్టములలో ప్రత్యక్షరమునను అయన ఆత్మభావమే ప్రతిఫలించు చుండును. తెలుగులో నిట్టివాడు పాల్కురికి సోమనాథుడొక్కడే. పురాణ కర్తలలో నింత శృంగార ప్రియుడైన కవి ఇంకొకడు లేడు. [9] ఇట్టిదే మరో ఉదాహరణం.

కం॥ ప్రియురాలి వలని వార్తలు
ప్రియ జనులకు నెల్ల ప్రొద్దు ప్రియమగు భంగిన్
ప్రియుడగు హరి చరితంబులు
ప్రియ భక్తుల కెల్లయెడల ప్రియములు గావే. 10-487

దీన్నిబట్టి ప్రేయసీ ప్రియుల బంధం లాగానే భగవంతుడికీ భక్తుడికీ బంధం ఉంటుందని చెప్పి భక్తి శృంగారాలను ఏకత్ర పోహళించాడీ పోతనార్యుడు. 'స్త్రియా విటానా మివ సాధువార్తా' (10-13-2) అనే ఏకపాదమాత్ర భావం శృంగారానికి మూల కందంగా అందగించింది ఇలా.

కుబ్జాకృష్ణుల మధ్య వాచికశృంగారం అదిలో అనంతంగా ఉంది. అ సన్నివేశంలో ఆమెను 'చక్కనైన చిత్తజన్ము బాణము క్రియ' తీర్చిదిద్దటంలోని అద్భుతరసం తదుపరి వారి సంభోగ శృంగారానికి దోహదపడింది. అలాగే మోహినీ పరమేశుల ఘట్టంకూడ. రుక్మిణీ కృష్ణుల ప్రణయ సన్నివేశాన్ని శ్రీకృష్ణుడి విరసపు మాటలతో శోకభాజనం చేశాడు పోతన స్వయంకృతంగా (10 ఉ.237). అ కల్పిత విరస భావం వారికి మానానంతర సంభోగానికి కారణమై సరస మయింది.

శ్రీకృష్ణుడి చిలిపి చేతలతో వాచిక క్రియా శృంగారాలు హాస్యంతో కలిసి పాఠకుల హృదయాల మీద చెరగని సరస శృంగార భావ ముద్రలతో లాస్యం చేశాయి.

ఇలా సర్వరసాలూ శృంగార పోషకాలుగా మనోరంజకాలుగా భాగవతంలో సరస రుచిర దరహాసాంచితాలుగా గోచరిస్తాయి.

---

9 భాగవత వైజయంతిక. పుట. 92

# విరోధి రసమేళనం

కొన్ని సందర్భాలలో విరోధి రసమేళనకు కవి సంకల్పించవచ్చు. సహజంగా శృంగార బీభత్సాలకు శృంగార కరుణాలకు వీర భయానకాలకు శాంతరౌద్రాలకు రౌద్ర శృంగారాలకు పరస్పర విరోధం. ముందుగా వాటి విరోధాన్ని తొలగించిగాని వాటి మేళనానికి పూనుకొనరాదు. విరోధి రసాల విరోధం రెండు రకాలు. 'ఒకటి స్థితి విరోధము రెండవది జ్ఞాన విరోధము. స్థితి విరోధమనగా ఒక్క అధారమందు రెండూ ఉండక పోవుట. జ్ఞాన విరోధమనగా ఒక జ్ఞానము వలన రెండవ జ్ఞానము బాధింపబడుట, అంటే ఏ రెండు రసముల జ్ఞానములో ఒకటి రెండవ దానికి ప్రతిద్వంద్విగా ఉంటుందో దానిలో జ్ఞాన విరోధమున్నదని భావము'.[10]

విరోధి రసాన్ని రెండవ అధారంలో స్థాపించితే స్థితి విరోధం పోతుంది. అంటే నాయక గతంగా వీరరసాన్నీ, ప్రతినాయక గతంగా విరోధిరసమైన భయానకరసాన్ని వర్ణించితే స్థితి విరోధం తొలగిపోతుంది అలాగే సంధి సంధాత విరోధుల మధ్య ఉంటే వారి విరోధం తొలగిపోవునట్లుగా రెండు విరోధి రసాలకు మధ్య ఆ రెంటికీ అవిరోధమైన రసాంతరాన్ని వర్ణిస్తే జ్ఞానవిరోధం నివృత్తమవుతుందని జగన్నాథ పండితరాయల అభిప్రాయం.[11] శాంతశృంగారాల మధ్యఅద్భుత రసాన్ని శృంగార బీభత్సాల మధ్య వీరరసాన్ని రసాంతరంగా వర్ణిస్తారు. అద్భుత రసంతో దేనికి విరోధం లేదు కాబట్టి సామాన్యంగా అన్నిటా కవులు దాన్ని అధికంగా వర్ణిస్తుంటారు. అలా చేయటం వల్ల విరోధి రసాల మధ్య ఏర్పడిన ఆభాసం తొలగిపోతుంది. ఇవికాక విరోధి రస పోషణంలో విరోధ పరిహార మార్గాలుగా తిప్పాభట్ల వారు కొన్ని సూత్రాలను క్రోడీకరించారు. వాటిలో సామ్యవివక్ష అంగాంగి భావం బాధ్యబాధక మార్గం ఒక్క అంగిలో రెండంగాలు స్మర్యమాణం సాధారణ విశేషభావాలు[12] ముఖ్యమైనవి.

## కరుణశృంగారాలు

శృంగారాన్ని అంగరసంగా కరుణ రసాన్ని అంగిరసంగా భాగవతంలోని పెక్కు తావుల్లో పోతన పోషించారు. ఈ విషయంలో అంటే రసమేళన సందర్భంలో అందులోనూ విరోధిరసమేళన విషయంలో కరుణానికే శృంగారం తోడి ప్రాధాన్యం దక్కింది. కరుణ రసంలో సాత్త్వికభావా లెనిమిదింటితోపాటు, జాడ్యం నిర్వేదం గ్లాని దీనత అలస్యం

---

10 పవరప గంగాధరం. పుట. 133

11 అందే, పుట. 134.

12 రససిద్ధాంతము - ఆంధ్రుల పరివస్య. పుట. 285

అపస్మృతి వ్యాధి మొదలైన వ్యభిచారీ భావాలుంటాయి.[13] అవి విభావానుభావాల మూలకంగా సహృదయులకు రసత్వ సిద్ధిని కూర్చుతాయి.కరుణరస పూర్వ చరిత్రను పరికిస్తే భవభూతి కరుణ రసం వాచ్యప్రధానం. కాళిదాసుని కరుణరసం వ్యంగ్య ప్రధానం. మరి పోతనార్యుని కరుణరసం శృంగార భావ ప్రధానం.

భాగవతంలోని కరుణ శృంగారాల మేళనం ప్రధానంగా భర్తృవిపత్తు భర్తృమరణం భార్యావియోగం బంధు మరణాలకు సంబంధించినవిగా నాలుగు విధాలుగా విభజించవచ్చు.

భర్తృవిపత్తును భావించుకొని 'శ్రీదయితా చిత్తచోరుడి' వద్దకు కరుణరస హృదయంతో కరకమలాలను ముకుళిస్తూ కదలి వచ్చిన వింధ్యావళి స్వరూపంలోని శృంగారం సుమనో మనోహరం.

మ॥ తత మత్తద్విపయానయై కుచ విరుంధ చ్చేళ సంవ్యాన యై
ధృత బాష్పాంబు వితానయై కరయుగాధీ నాలిక స్థాన యై
'పతి భిక్షాం మమ దేహి కోమలమతే ! పద్మావతే' యంచు ద
త్పతి వింధ్యావళి సేరవచ్చె త్రిజగద్రక్షామనున్ వామనున్. 8 –652

భర్తృ విపద్దర్శనం వల్ల శోకం ఉద్దీపితమై ఆమె ధృతబాష్పాంబు వితాన అయింది. విష్ణువునందలి భక్తిభావంతో కరయుగాధీనాలికస్థాన అయింది. ఈ సందర్భంలో ఆమె నడకలోని అందచందాలను ఆమెలోని సౌందర్యాన్ని సందర్శింప చేశాడు పోతన. ఆమె అలా వస్తుంటే ఆమె శృంగార స్వరూపం ముందు వెనుకల సందర్శన మందించే విధంగా తీసిన మహాద్భుత శబ్దచిత్రం ఆ సన్నివేశం. ఆమె కరుణంలో కరిగి పోయినా పాఠక హృదయాలు మాత్రం శృంగార భావ తన్మయాలు కావలసిందే. ఇది పోతన గారి శృంగార రసపోషణంలోని పోహళింపు.

స్థితి యేదైనా పోతనకు ఏదో ఒక మధుర శృంగార భావన స్ఫురిస్తుంది. అదే అతనికి శృంగార కవులలో అగ్రాసనాన్ని అందించింది. ఇక్కడ వింధ్యావళి కళాస్థానాలైన స్తనాల ప్రస్తావన పోతన స్త్రీమూర్తి సౌందర్యారాధనమే. స్త్రీ విషయం ప్రసక్తమైనపుడెల్లా వక్షోజ సౌందర్య ప్రస్తావన గుర్తరించక మాన డాయన. ఇది అర్ధ స్త్రీ యౌవన మాతృత్వా వస్థల్లోని సహజ సంపద.

పతి భిక్షకోసం వచ్చిన కాళీయుని కాంతలను గూర్చి మూలంలో ఉన్న వర్ణన సూక్ష్మం. అది'అర్తాః శ్లథద్వసన భూషణ కేశబన్ధాః '(10-16-31) అని మాత్రమే. ఆ సన్నివేశాన్ని అందగత్తెల జారుపాటుల సన్నివేశంగా చిత్రీకరించటం పోతన్నగారి ప్రత్యేకత.

---

13 అత్రాశ్రు సాత్త్వికా జాడ్య నిర్వేద, గ్లాని, దీనతా ।
ఆలస్య, పస్మృతి, వ్యాధి మోహాద్యా వ్యభిచారిణః — రసార్ణవసుధాకరం. పుట . 616.

మ॥ కచబంధంబులు వీడ భూషణము లాకంపింప గొదీవియల్
కుచయుగ్మంబుల వ్రేగునం గదల బై కొంగుల్ వడిం జాఱగా
భ్రమర భ్రాంతి గలంగి ముందట రుద ద్వాలావలిం గొంచు స్రు
క్కుచు భక్తిం జని కాంచి రా గుణమణిన్ గోపాల చూడామణిన్. 10-669

'దురంతం బయిన చింతా భరంబున నివ్వటిల్లెడు నెవ్వగల నొల్లంబోయి, పల్లటిల్లిన యుల్లంబుల' (10 - 668) తో ఉన్న నాగకాంతల స్వరూపం ఇది. ఈ స్థితి భేదం సంభోగ శృంగార సంరంభ సంకేత సంభరితం. ఈ కరుణరస సన్నివేశంలో కమనీయ శృంగార స్ఫురణ కల్గించటం పోతనగారి సహజ శృంగారరస సంభరిత హృదయావిష్కారమే ! వారు అలా పురోభాగానికి జరిగి శ్రీకృష్ణుణ్ణి పతిభిక్షను అర్థించిన విధం శృంగార భావ స్ఫోరకం.

ఆ॥ నీవు సేయు పెండ్లి నిత్యంబు భద్రంబు
పిన్ననాటి పెండ్లి పెండ్లిగాదు 10 - 686

అని పల్కిన ఆ ముద్దుగుమ్మల ముద్దుముద్దు మాటల్లో కుటుంబ శృంగారం తొంగి చూస్తుంది.

గుంపునుండి తప్పిపోయిన లేడిలాగ భర్త మరణానికి విలపిస్తున్న వైదర్భి విషయంలోని మూల భావం శృంగార భావ విజృంభణకు ఆధారం.

శ్లో ॥ ఆత్మానం శోచతీ దీన మబన్ధుం విక్లవాశ్రుభిః ।
స్తనావాసిచ్య విపినే సుస్వరం ప్రరురోద సా ॥ 4 - 28 - 47

ఇచ్చట స్త్రీల విలాప విలాసాలు రెంటినీ సమానంగా భావించి పోతన చిత్రించిన నాయిక వైదర్భి.

చం॥ అనయము నిట్లు శోక విపులాశ్రు పయః కణసిక్త మానిత
స్తనయుగయై వియోగ పరితాపమునన్ హృదయంబు మాడ శో
భన లలితాధరోష్ఠ నవపద్మము గందగ సుస్వరంబుగా
వనజదళాక్షి యేడ్చె ననివారణ దద్విపి నాంతరంబునన్. 4 - 842

భర్త మరణం ఆమెకు ఉద్దీపనం. దానితో శోకం పరాకాష్ఠకు చేరింది. ఆ దశలో ఆమె సౌందర్యం ఉద్దీపనగా శృంగారం తొంగిచూస్తుంది. సౌందర్యం ఆధారంగా కరుణం మరింత ఆర్ద్రంగా పరిపోషితమయింది. ఇలా శృంగార రసానికి ప్రధానోద్దీపకాలయిన కచ కుచాదుల్ని కరుణ రసానికి కూడా ఆధారం చేసి శృంగారాన్నే భంగ్యంతరంగా పోషిస్తున్నాడా ! అనేభావం సహృదయులకు పోతన్నగారి శిల్పంలో స్ఫురిస్తుంది.

ఉశీనర మహారాజ మరణానికి రోదిస్తున్న రాజకాంతల స్థితి హృదయ విదారకం, అది కరుణ రస నిర్భరం. దానికి మూలం:

శ్లో ॥ రుదత్య ఉచ్చై ర్దయితాంఘ్రి పంకజం
సించన్త్య అస్రైః కుచకుంకుమారుణైః
విస్రస్త కేశాభరణాః శుచం నృణాం
సృజన్త్య ఆక్రన్దనయా విలేపిరే ॥ 7-2-32

పై శ్లోకగత భావాలనే తీవ్రతరం చేసి మార్పు కూర్పులతో రసరంజితం కావించిన పోతన గారి పద్యమిది.

శా ॥ స్రస్తాకంపిత కేశబంధములతో సంఛిన్న హారాళితో
హస్తా బ్జంబులు సాచి మోదుకొనుచున్ హా ! నాథ ! యంచున్ బహు
ప్రస్తావోక్తుల లేడ నేడ్చిరి వగన్ బ్రాణేశు పాదంబుపై
నస్తోక స్తన కుంకుమారుణ వికీర్ణాస్రంబు వర్షింపుచున్. 7-42

ఇందులో కరుణ రస విభావానుభావాలే శృంగారరస వ్యంజితాలైనాయి. అంటే ప్రణయోద్బుద్ధమైన దుఃఖంనుండి శృంగారం వెల్వడింది. 'అనురాగ స్థానం వక్షోజాలనండి, వక్షమనండి, కనుకా, అనురాగం అరుణ రంజితం గనుకా, కండ్ల నించీ జారిన నీరు చెంపల మీదిగా జరిగి ఎత్తుగా ముందుకు వున్న వారి చన్నుల మీద బడి అక్కడి కాశ్మీరలేపాన్ని కడుగుకుంటూ చింది భర్త పాదాల మీద వడ్డదని చెప్పటం అదీ ఒకరకమైన సొగసే. భావనే.'[14] అనే శ్రీ చంద్రమౌళి శాస్త్రిగారి భావన పోతన శృంగార రసాభిరుచిని శతధా వ్యక్తీకరిస్తుంది.

శ్రీరామ చరిత్రలో రావణ వధానంతరం వచ్చే రామల ప్రసంగంలో సౌందర్యార్పనం చేశాడు పోతన. నెత్తి మోదుకుంటూ వచ్చే అంగనాజన సౌందర్యం దర్శింపదగ్గది. చెదరిపోయిన హారాలతో అది మరీ మరీ ఇనుమడించింది. ఈ ఘట్టంలో అనురాంగనల దుఃఖంలో అంటే వారి కరుణంలోనే సురాంగనల శృంగారం కూడా ఎలా రంగరింప బడిందో చూడండి -

సీ ॥ కొప్పులు బిగివీడి కుసుమ మాలికలతో
నంస భాగంబుల నావరింప
సేస ముత్యంబులు చెదర గర్ణికలూడ
కంఠహారంబులు గ్రందుకొనగ
వదన పంకజములు వాడి వాతెఱ లెండ
గన్నీళ్ల వరద లంగములు దడుప
సన్నపు నడుములు జవ్వాడ బాలిండ్ల
బరువులు నడుముల బ్రబ్బికొనగ

14 శృంగారం - పోతన. పుట. 104

అ ॥ నెత్తి మోదికొనుచు నెఱి బయ్యెదలు జాఱ
నట్టు నిట్టు తప్పటడుగు లిడుచు
నసుర సతులు వచ్చి రట భూత భేతాళ
సదనమునకు ఘోర కదనమునకు. 9 - 305

కరుణరస విభావాను భావాలలోనే శృంగారం ధ్వనించింది. 'అదీ సంభోగ విప్రలంభ శృంగార సమ్మేళనాకృతిగా చెయ్యటం అనేది మహోదాత్త ప్రతిభ అనా'లె'.[15]

భూజాతను సజీవంగా తనలోనికి భూమాత స్వీకరించినప్పటి రాముని ఆక్రందనం రాళ్లను సైతం కరిగించే విప్రలంభ శృంగార భరితమైన కరుణం. ఇది ప్రణయోద్బుద్ధమైన కరుణం.

మ॥ ముదితా ! యేటికి గ్రుంకి తీవు మనలో మోహంబు చింతింపవే
వదనాంభోజము సూపవే మృదువు నీ వాక్యంబు విన్పింపవే
తుది సేయందగదంచు నీశ్వరుడునై దుఃఖించె భూపాలు డా
పదగాదే ప్రియురాలి బాసిన యెడన్ భావింప నెవ్వారికిన్. 9-356

ఇట సీతా మరణం స్పష్టం కానందున ఆమెది సజీవ పరలోక యాత్ర కనుక రామునికి ఆమెపట్ల కరుణరసం కలుగదు. ఆమెపై రతి భావాన్నే స్మరించటం వల్ల తొలిరెండు పాదాలలో విప్రలంభ శృంగారం తుది వాక్యంలో కరుణం గోచరిస్తుంది. ఇందులో కరుణానికి శృంగారం అంగభావం వహించింది. కనుక వాటి పరస్పర వైరుధ్యం సమసిపోయింది. అంటే వాటికి పోష్య పోషక భావం వచ్చి సన్నివేశం రమణీయం అయింది, రాముని శోకంలో సీత పట్ల గల రతి అంగమయింది.

కృష్ణ నిర్యాణ సమయంలోని అర్జునుడి దుఃఖం స్నేహోద్బుద్ధ మైంది. అర్జునుడు అప్పుడు ధర్మజుడితో చేసిన శృంగార ప్రస్తావోక్తులు గమనింపదగ్గవి.

కం ॥ నిచ్చలు లోపలి కాంతలు
మచ్చిక దనతోడ నాడు మాటలు నాకున్
ముచ్చటలు సెప్పు మెల్లన
విచ్చలవిడి దొడలమీద విచ్చేసి నృపా ! 1 - 370

శ్రీకృష్ణుని ఆదరాభిమానాలు శృంగార ప్రస్తావోక్తులు అర్జునుడి కరుణ రసోత్పత్తికి ఆలంబనం. ఈ అమూలకమైన ఒక్కింత శృంగారభావ సంస్మరణంతో శోకసముద్రంలో ఉళ్లేల కల్లోలమైన పార్థుడికి మరికాస్త మానసికవ్యథా, సహృదయుడికి కాస్తంత మానసిక పరిశ్రాంతీ ప్రవృద్ధ మైతాయి.

---

15. శృంగారం - పోతన . పుట. 155

## భయానక శృంగారాలు

తనకు పూజ సేయనందుకు ఆగ్రహించిన ఇంద్రుడు సృష్టించిన శిలావృష్టి గోపజనానికి భయానక కారణమైంది. అపుడు కకావికలైన వారిస్థితి గమనార్హం. వారిలో 'దట్టంబయిన వానకొట్టునం బెట్టువడి, బడుగు నడుములు నులుసువడ వడంకుచు, గోవిందునిం జీరు గోపికలును, గోపికాజన కఠిన కుచకలశ యుగళంబుల మఱుంగునం దలలు పెట్టుకొని, పరవశులైన శిశువులుం గలిగిన' (10 - 902) వారు ఎందరో ఉన్నారు. వారికి స్థాయిభావం భయం. గమనంలో అలా భయ భ్రాంతితో కదలుతున్న వారి ప్రతిచలనంలో శృంగారాన్ని దర్శించింది పోతన్న అంతర శృంగార దృష్టి.

బలరామ కృష్ణులతోడి జరాసంధుడి యుద్ధంలో భీతులైన సైనికులను వర్ణిస్తూ 'సుందర స్యందన నేమి నిర్ఘోషభీతులై కుంభి కుంభములపై వ్రాలు వీరులు మత్తమయూర కేకారవ చకితులై యువతి కుచకుంభంబుల మీద వ్రాలెడి కాముకులు'గా (10 - 1558) భావించాడు పోతన అమూలంగా. ఇట భయానకం సంభోగ శృంగారంతో సంపన్నమైంది.

## శాంత శృంగారాలు

శృంగారానికి శాంత భావాన్ని అంగంగా చేర్చి చెప్పిన సన్నివేశం సహృదయావర్జకం. శ్రీకృష్ణుడిని భావించి మురిసిపోయిన ఒక గోపిక వృత్తాంతం అందుకు నిదర్శనం.

ఉ॥ ఒక్క లతాంగి మాధవుని యుజ్జ్వల రూపము చూడ్కి తీగెలం
జిక్కగ బట్టి హృద్గతము జేసి వెలిం జనకుండ నేత్రముల్
గ్రక్కున మూసి మేన పులకమ్ములు గ్రమ్మగ గౌగిలించుచున్
జొక్కము లైన లోచవుల జొక్కుచు నుండెను యోగి కైవడిన్. 10-1061

యోగిలాగా బ్రహ్మానందానుభవాన్ని పొందిన ఆమె పారవశ్యం గమనార్హం.ఇందులో శ్రీకృష్ణుడిమూర్తిని హృద్గతం చేయటం మేన పులకలు కలగడం లోచవులు చొక్కటం అన్నీ యోషలికూ యోగులకూ సమానధర్మాలు. దానితో ఆమెకు యోగివద్భావం కలిగింది. శాస్త్రరీత్యా శాంత రసానికి ఆనందబాష్పం రోమాంచం స్వేదం స్తంభం అనేవి ఒకప్పుడుండ వచ్చు, కానీ రోమాంచం ఒక్కటి మాత్రమే శాంతానుభావం అని కొందరి భావం.[16] ఈ గోపిక పొందిన శృంగారానుభూతి బ్రహ్మానంద సదృశమైందని తెల్పటానికే ఈ నిదర్శనం. కనుక శృంగారానికి శాంతం పోషకం అయింది. ఇక్కడ నాయిక వియోగంలో ఉన్నా సంభోగ సుఖాన్ని పొందింది.

---

16 శ్లో॥ ఆనంద బాష్ప రోమాంచ స్వేద స్తంభాః స్యురేకదా॥
శాంతానుభావో రోమాంచ ఏక ఏవేతి కేచన ।
నో పకుర్వంతి శాంతస్వభావాః సంచారిణో యతః ॥ భావప్రకాశనము, పుట. 291

# రససంకరం

రెండు రసాల మేళనాన్ని సంసర్గమనినట్లే అంతకంటే అధికమైన రసాలకు సంసర్గం సమానంగా ఉంటే రస సంకరమని పేరు. వర్తమాన రసం ప్రధానంగా ఉండి ఇతర రసాలకు బాహాళ్యం సంకర రూపంలో ఉంటే అది ఉచితంగానే ఉంటుంది. కాబట్టి రసాల సాంకర్యం ప్రకృత రసప్రాధాన్యాన్ని ఏవిధంగానూ హరించదు బాధించదు[17]. కవి సామర్థ్యాన్ని బట్టీ కథా సందర్భాన్ని బట్టీ రససంకరం రమణీయ మణిదీపంగా ప్రకాశిస్తుంది. కనుకనే కవులు తమ కావ్యాలలో నవరసాలకు ఏకత్ర సంకరం చేసిన సన్నివేశాలు కూడా ఉన్నాయి. భాగవతంలోనూ అంతే.

ఉగ్రనరసింహాణ్ణి శాంతింప చేయమని లక్ష్మీదేవిని దేవతలు ముందుకు పంపటం అమూలం. కార్యాన్ని కాంతాసమ్మితంగా సాధించ దలచటమే అందుకు మూలం. లక్ష్మీ దేవిని వారు స్తుతిస్తూ ఆమెకున్న అర్హతల నన్నింటినీ ఏకరువు పెట్టారు (7-340), ఆమెచేత కార్యభారాన్ని స్వీకరింపచేశారు. ఆ సందర్భంలో మహోత్కంఠతో ముందుకు సాగి ఆమె దర్శించిన నృసింహాని స్వరూపం సందర్శనీయం. అది పలురసాల సంకర స్వరూపం.

సీ॥ ప్రళయార్క బింబంబు పగిది నున్నది గాని
　　　నెమ్మోము పూర్ణేందు నిభము గాదు
　శిఖిశిఖా సంఘంబు చెలువు చూపెడు గాని
　　　చూడ్కి ప్రసాద భాసురము గాదు
　వీర రౌద్రాద్భుతావేశ మొప్పెడు గాని
　　　భూరి కృపారస స్ఫూర్తిగాదు
　భయద దంష్ట్రాంకుర ప్రభలు గప్పెడు గాని
　　　దరహాస శాంబుజాతంబు గాదు

తే॥ కఠిన నఖర నృసింహ విగ్రహము గాని
　కామినీజన సులభ విగ్రహము గాదు
　విన్నదియుగాదు తొల్లి నే విష్ణువలన
　గన్నదియు గాదు భీషణాకార మనుచు. 7-342

ఈ ఘట్టంలోని ప్రధానరసం రౌద్రం. అంగంగా వీరాద్భుతాది రసాలున్నాయి. ఈ వీర రౌద్రాద్భుతాల నృసింహాని స్వరూపం ఆమె విన్నది కాదు కన్నదీకాదు కోరుకున్నది అసలేకాదు. ఆమె కోరుకున్నది కృపారస స్ఫూర్తిగల మూర్తిని. కృపారసాన్నిపైన జల్లగలవాడే

---

17 శ్లో॥ ద్విత్రాణామపి సంసర్గసామ్యే సంకర ఉచ్యతే ।
తేషా మేకత్ర బాహుల్యం ప్రధానే యత్ర దృశ్యతే ॥ భావప్రకాశనము, పుట [illegible]

సంపూర్ణ శృంగారిఅనే భావన భాగవతంలోని గోపికా గీతల ఘట్టంలోని 'నల్లనివాడు'అనే పద్యంలో కూడ గోచరిస్తుంది. ఏమైనా ఇక్కడి నృసింహుడు రస చతుష్టయమూర్తి.

రచనలో ప్రత్యక్షంగా ప్రధానంగా ప్రతిపాద్యం చేయదలచిన రౌద్రరసాన్నీ, లక్ష్మీరమణీ మనోగత హృద్య శృంగార భావపరమార్థాన్నీ, ఇటు చూస్తే రౌద్రం- అటు చూస్తే శృంగారంగా చిత్రించాడు. 'శృంగారపు వికృతి రూపం రౌద్రాదులైతే, రౌద్రాదుల లింగ శరీరం శృంగారం అవుతుంది'[18] కనుక ఇందులోని శృంగారం ఇలా గోచరిస్తుంది. ఇక్కడ రౌద్రం వెంట సాగిన శృంగారం తీరు ఉగ్రుడైన భర్తతో 'శశిముఖి' ఐన భార్య ఎలా మసలు కోవాలో సూచిస్తుంది. కనుకనే కథ చివరకు 'శ్రీరమణీయమైన నరసింహవిహారం'గా పరిణమించింది. అంటే లక్ష్మీదేవి ఆకాంక్షించిందీ పోతన లక్షించిందీ శ్రీనృసింహుని రమణీయ శృంగార స్వరూపాన్నే.

చాణూర ముష్టికులతో మల్లయుద్ధం చేయటానికి సిద్ధంగా ఉన్న శ్రీకృష్ణుణ్ణి అక్కడ ఉన్న ప్రేక్షకులు భిన్న రసదృష్టులతో సందర్శించి ఆనందించారు. 'రసోవైసః' అనేది ఒక్క శ్రీకృష్ణుడికే గదా చెల్లేది. రసనిర్వహణంలో అందునా ఈ రససాంకర్య విషయంలో వ్యాసపోతనలకు భేదం ఉంది. అది గమనింపదగ్గది.

శ్లో॥ మల్లానా మశని ర్నృణాం నరవరః స్త్రీణాం స్మరో మూర్తిమాన్
గోపానాం స్వజనోఽ సతాంక్షితిభుజాం శాస్తా స్వపిత్రోః శిశుః ।
మృత్యుర్భోజ పతేర్విరాడ విదుషాం తత్త్వం పరం యోగినామ్
వృష్ణీనాం పరదేవతేతి విదితో రఙ్గం గతః సాగ్రజః ॥ 10-43-16

ఇంతకంటే ఒక్క అడుగు ముందుకు వేసి పోతన రస నిరూపణం చేశాడు. అది అతని రససంవిధాన చాతురికి అతులిత నిదర్శనం.

సీ॥ మహిత రౌద్రంబున మల్లుల కశనియై
నరుల కద్భుతముగ నాథు డగుచు
శృంగారముగ బురస్త్రీలకు గాముడై
నిజమృత్యువై కంసునికి భయముగ
మూఢులు బీభత్సమును బొంద వికటుడై
తండ్రికి దయరాగ దనయు డగుచు
ఖలులకు వీరనంబుగా దండియై గోప
కులకు హాస్యంబుగ గులజు డగుచు

ఆ॥ బంధువులకు బ్రేమ భాసిల్ల వేలుపై
శాంత మొనర యోగి జనుల కెల్ల

---

18. శృంగారం - పోతన. పుట. 98

బరమ తత్త్వ మగుచు భాసిల్లె బలునితో
మాధవుండు రంగమధ్యమందు. 10-1322

మాధవుడిని దశరసాశ్రయుడిగా చిత్రించిన ఈ పద్యభావం మూలానికి సన్నిహితమే అయినా ఆ నిఖిల రసామృతమూర్తిని శ్రీకృష్ణమూర్తిని ఈ అవస్థలో సందర్శింప చేయటం పోతనకవి విశేషచిత్రణం. ఇక ఈ కథలో కవి పోతన రామకృష్ణులను మానినీ మనోహరు లనటంలో వారి శృంగార స్వరూప స్వభావం సువ్యక్తమౌతుంది.

మూలంకంటె భిన్నంగా ఇందులో రసాది నామధేయ స్వీకరణం ఎంతమాత్రం దోషం కాదని, అందువల్ల 'వమన దోషం' ఇక్కడ పొనగదనీ పోతనాదులు స్వపద వాచ్యం చేశారు. అదే దోషమైతే కాళిదాసు తిక్కన మొదలైన వారి రచనలు అనుభవ విరుద్ధంగా దుష్టమైతాయి.[19] ఇట పరబ్రహ్మ స్వరూప మైన ఆనందాంశను నుడువ ధగిన శృంగారాది పదాలు కూడ మాంగళిక శబ్దాలుగానే పరిగణించాలి గాని నింద్యంగా దోషంగా పరిగణించరాదని శంభురహస్యం అనే గ్రంథం పేర్కొన్నది.

శ్లో॥ దేవతా వాచకాశ్శబ్దాః యేచ భద్రాది వాచకాః
తే సర్వే నైవ నింద్యాస్స్యుః లిపితో గణతోపివా ॥[20]

ఇలా పోతన భాగవత గతంగా శృంగార రస నిర్వహణంలో పలురసాల పోహళింపుతో కృతకృత్యుడైనాడు. పలురుచిభేదాలతో ఆ మాధుర్యాన్ని పాఠకుల కందించి ఆనంద కందళిత చేతస్కులను చేయటంలో సిద్ధహస్తు డైనాడు పోతనార్యుడు.

# రసాభాసం - శృంగారం

ఏ రసమైనా అనుచిత విభావాలంబన మైతే అది రసాభాస మవుతుందని కొందరు భావిస్తే, కొందరు అనుచిత రతిమత్త్వం వల్ల రసాభానం సిద్ధిస్తుందని నవరించారు. అనుచిత మంటే సహృదయ ఆస్వాదయోగ్యం కానిది. కనుక సహృదయ సమ్మతం కాని రతి రసాభాసం అవుతుంది. అదే విధంగా భావాభాసం కూడా. అయితే రసాభాసం కూడ రసమేఅనీ దుష్టత్వ నిమిత్తంగా రసం రసత్వాన్ని కోల్పోదనీ అది కూడ ఆస్వాద యోగ్యమే అని కొందరి భావం. దాని కాశక్తి ఉంది. కనుకనే మహాకవులు తమ కావ్యాలలో రసాభాసాన్ని తుష్టిగా పుష్టిగా వర్ణించారు.

సర్వాలంకార గ్రంథసారంగా 'శృంగార రసాభాస' భేదాలీ క్రింది విధంగా నిరూపితాలు.[21]

---

19 ఆంధ్రధ్వన్యాలోకం, పుట. 557

20 ఆంధ్ర ధ్వన్యాలోకం నుండి ఉద్ధృతం పుట. 55

21 తెలుగు సాహిత్యంలో రసాభాసము. పుట. 74

| | | |
|---|---|---|
| 1 అరాగం | | 1. ప్రాగ భావం |
| | | 2. ప్రధ్వంసా భావం |
| | | 3. అత్యంతా భావం |
| 2. అనేక రాగం | : | 1. బహునాయక రతి |
| | | 2. బహునాయికా రతి |
| | | 3. పలువురుస్త్రీల కొక నాయకుని యందు రతి |
| | | 4. పలువురు పురుషులకు ఒకే స్త్రీ యందు రతి |
| 3. నిషిద్ధ రాగం | : | 1. ఉపనాయక రతి |
| | | 2. ప్రతినాయక రతి |
| | | 3. మునిపత్నీగత రతి |
| | | 4. గురుపత్నీగత రతి |
| 4. అపరిపుష్ట రాగం | : | 1. తిర్యగ్రతి |
| | | 2. మ్లేచ్ఛరతి , |

వీటి భేదాలకు గల లక్ష్య లక్షణాలు ఆయా తావుల్లో నిరూపితం.

## దితి

దితి కామమోహిత అయిన ఘట్టం ఏకనాయక గతమైన బహునాయికారతి. అపై అది అనుభయనిష్ఠం. మూలంలో దక్షుడు తన తనయల నందరితో విడివిడిగా వర నిర్ణయ ప్రస్తావన చేశాడు. కానీ అందరినీ ఒక్కసారే అడిగినట్లు పోతన కల్పన. అప్పుడు కూడ వారందరూ పరస్పర సమక్షంలో కశ్యపుడినే కోరుకున్నారు. అది అతని 'పురుష వరేణ్యతా' నిదర్శనం. ఇదే ఒక నాయకునిపట్ల బహునాయికలకున్నరతి. ఇదొక లౌకిక శృంగార శకలం.

మూలంలో 'కమలానన' అనే సంబోధనం కశ్యపుని కుండగా, అనువాదంలో కమలాననలార' అని నాయికా పరంగా మార్చాడు పోతన. ఇది సంబోధనౌచిత్యమేకాదు, నాయికా లావణ్య సూచకం కూడ. వారిలో దితి కామమోహిత అయిన సన్నివేశంలోని మార్పులు కొన్ని రసాభాస కుదాహరించ దగినవి.

చం॥ గజవిభు డుద్ధతిన్ ననటికంబముల న్విదళించు లీల జి
త్తజుడు ప్రసూన సాయక వితానము చేత మదీయ చిత్తమున్
గజిబిజి చేసి పెన్వగల గాతియ పెట్టగ నాథ! నీ పదాం
బుజములు గాన వచ్చితి బ్రభుత్వ మెలర్పగ నన్ను గావవే ! 3-451

దితి మనస్సును మదన బాణాలు గజిబిజి చేయటం వల్లనే 'ఉగ్రవేళ రమించటం' అనే నిషిద్ధ కర్మను కోరుకొంది. ప్రభుత్వ మెలర్ప రక్షించమని కామాతురతను వ్యక్తం చేసింది. ఇవి అమూలక వచనాలు. అసుర సమయంలో 'వృషలీవ గతత్రప' (3-14-30) అయిన దితి కశ్యపుని కొంగులాగినట్లు మూలం. పోతన దానిని పొడిగించాడు.

కం॥ మునుకొని లజ్జావనత వ
దనయై ప్రాణేశు కొంగు దాలిమి దూలం
బెనగొనియె వారకామిని
యనువున వినిషిద్ధ కర్మమం దభిముఖియై. 3-469

ఇందులోని మార్పు రసాభాసానికి ఔచితీ పరిష్కారం. తన చర్యకు తానే సంగమానంతరం సిగ్గిల్లింది దితి. అదే ఆమె వారకామిని అయితే మరో విధంగా ఉండేది. ఇది రసానుకూలమైన పాత్రౌచితీ దృష్టితో చేసినమార్పు. కశ్యపుడి చేత ఆమెలోని దోషోద్ఘాటనం చేయించటం కూడ అట్టిదే. ఇలాంటివి పోతన కల్పిత పరిపోషక భాగా లనేకం.

ఇక కథమొత్తం రసాభాసం కావటానికి చెప్పకోదగిన ఆలంకారిక కారణాలు రెండు మూడు. మొదటిది, నాయిక స్వయంగా సంభోగాభిలాషను వ్యక్తం చేయటం. ఇలా గోప్యమైన సంభోగాది క్రియలను స్పష్టంగా కోరటం ధృష్టత.[22] ఇది 'వృత్త్యనౌచిత్యం' అనే దోషం కూడ. రెండవది 'భార్యా నిర్బంధంబునకుం దొరంగ నేరక' రతి కుపక్ర మించటం వల్ల అధికంగా ఏకపక్ష లేదా అనుభయ నిష్ఠమైన రతి ఇది. మూడవది కశ్యపుడు 'ఏకాంతంబున నిజ కాంతాసంగంబు దీర్చటం' 'వాచ్యతా దోషం'. ఇది మూలసమ్మతమైన సంగమ విధానమే. విద్య నుండి అవిద్యకు నడిపే సంధ్యాసమయంలో జరిగిన సంగమ విషయం కనుక సమర్థనీయమే. కనుకనే దీన్ని కథా బలానికి ఉపబలకంగా సంభావించాలి.

ఇందులోని వృత్త్యనౌచిత్య వాచ్యతా దోషాలు రసభంగ హేతువులని ధ్వనికారుని మతం.[23] ఈ దోషాలవలన ఈ సన్నివేశాలు సహృదయామోదాలు కావు. కనుకనే ఇవి శృంగారరసాభాస పోషక విషయికంగా రమణీయాలు. మొత్తం మీద పోతన చేసినవి చిఱుమార్పులే అయినా శృంగార రసాభాస పుష్టికి తోడ్పడేవే.

---

22 శ్లో॥ ప్రకట ప్రార్థనాది ప్స్యాత్సంభోగాదే స్తు ధృష్టతా । -భక్తి రసామృత సింధు. పుట. 651

23 శ్లో॥ వృత్తేర్వ్యవహారస్య యదనౌచిత్యం
తదపి రసభంగ హేతురేవ
యథా నాయకం ప్రతి నాయకాయాః
కస్యాంచి దుచితాం భంగి
మంతరేణ స్వయం సంభోగాభిలాష కథనే ॥ -ధ్వని సిద్ధాంతము. పుట. 364.

## మోహినీ దానవులు

క్షీరసాగర మథన సమయంలోని మోహినీ దానవుల ప్రణయం పలువురు పురుషులకొక స్త్రీపైగల రాగభేదం. ఇదే సన్నివేశం తిరిగి ఒకే స్త్రీకి అనేక నాయక గతమైన రతికి కూడ ఉదాహార్యం. అయితే ఆమెది కపటానురాగం. అందువల్ల ఇది శృంగార రసాభాసం.

ఇందులో నాయిక మోహిని సామాన్య. నాయకులు దానవులు. వీరి సరస సల్లాపాలు విలాస విభ్రమాలు మూలభావాలకు ప్రపంచీకరణాలు, వ్యాఖ్యాన సదృశాలు. తద్రామణీయకంతో కథలో రసాభానకు పుష్టికలిగింది. మోహినీ సహజ సౌందర్యాన్నీ అభరణాల వల్ల కలిగే శోభనూ విడివిడిగా వర్ణించి ఆమె సహజ సౌందర్యాన్ని మూర్తి కల్పించాడు పోతన.

సీ॥ మెత్తని యడుగుల మెఱుగారు జానువు
        లరటి కంబముల దోయైన తొడలు
    ఘనమగు జఘనంబు కడు లేత నడుమును
        బల్లవారుణ కాంతి పాణియుగము
    గడు దొడ్డ పాలిండ్లు కంబు కంఠంబును
        బింబాధరము జంద్రబింబ ముఖము
    దెలి గన్నుగవయును నళి కుంతలంబును
        బాలేందు సన్నిభ ఫాలతలము

తే॥ నమర గుండల కేయూర హార కంక
    ణాదు లేపార మంజీర నాద మొప్ప
    నల్ల నవ్వుల బద్మ దళాక్షు డసుర
    పతుల నణగింప నాడు రూపంబు దాల్చి. 8-301

మోహినీ మోహనరూపం దానవులకు ఉద్దీపన విభావం. సాక్షాత్తు శ్రీదేవి నఖి అయిన ఆమె వర్ణనం విలోమ విధానంలో సాగింది. అది సంప్రదాయ ఫణితి. కామ మోహితు లైనవారు ఉచ్చనీచా లెరుగరనీ దేవతల్ని కూడ గమనించలేరనీ అందులోని అంతరార్థం.

జగత్పంచలనాత్మకాలైన మోహినీ శృంగార చేష్టితాలు విద్యుల్లతల లాగా క్షణ క్షణ భ్రాంతికరాలై దానవ హృదయాల్లో సంచలనం సృష్టించి మోహవశం చేశాయి.

సీ॥ పాలిండ్లపై నున్న పయ్యెద జాఱించు
        జాఱించి మెల్లన జక్కనొత్తు

దళ్కు తళ్కను గండఫలకంబు లొలయించు
నొలయించి కెంగేల నుజ్జగించు
గడు మెఱుంగులువారు కడకన్ను లల్లార్చు
నల్లార్చి ఱెప్పల నండ గొలుపు
సవరని దరహాస చంద్రిక జిలికించు
జిలికించి కెమ్మోవి చిక్కుపఱచు

తే॥ దళిత ధమ్మిల్ల కుసుమ గంధమ్ము నెఱపు
గంకణాది ఝణంకృతుల్ గడలు కొలుపు
నొడలి కాంతులు పట్టులే కులుకు బాఱు
సన్న వలిపంపు బయ్యెద చౌకళింప. 8-303

ఇది కామినీ విలాస విభ్రమ రూప సాక్షాత్కారం. దానవుల చిత్తాలకు మత్తు గొలిపిన ఈ కామబాణం కథకు ప్రాణం. అదిపోతన కల్పనం. అమెలోని ఆ లావణ్య మాధుర్యాలను వారు గుర్తించారు. మంత్ర ముగ్ధులైనారు. ఆమె మధుర భాషణాలు పాశాలై వారి నోళ్ళు బంధించాయి (8-311).

దేవదానవులకు అమృతాన్ని పంచిఇవ్వటానికి వచ్చిన అమె దానవుల్ని మోసగించటానికి ప్రదర్శించిన 'వాగంగాభినయాలు' సంపూర్ణంగా వారకామినీ జనోచిత భంగిమలు.

సీ ॥ వేగిర పడకుడీ వినుడు దానవులార!
తడవు సేయక వత్తు దైత్యులార !
యటు చక్క గూర్చుండుడని కన్నులల్లార్చి
జనుగవ పయ్యెద జాఱ దిగిచి
వదినె మఱందుల వావులు గల్పించి
మర్మంబు లెడలించి మఱుగు సేసి
మెల్లని నగవుల మేనులు మఱపించి
కడు జాణమాటల గాకుపఱచి

తే॥ యసుర వరుల నెల్ల నణకించి సురలను
దడవు సేయవలదు ద్రావుడనుచు
వచ్చుకొలది నమృతవారి విభాగించె
దరుణి దివిజులెల్ల దనిసి పొగడ. 8-318

'వంచయన్' (8-9-21) అనే సూక్ష్మ మూలభావానికి ఇవి విపుల వ్యాఖ్యలు. ఇక్కడ ఒక్క నాయికకు బహునాయక గతంగా కపటానుభావ హావ చేష్టలు వర్ణితమైనాయి.

తద్వారా అనేక విషయమైన ప్రేమను వర్ణించటం అనుచితం. దానివల్ల రసం రసాభాసగా పరిణమిస్తుంది.[24]

ఆమె హావభావాలను వారు గమనించినా 'నెలత చూడ్కిగముల నీరై కలంగుచు ప్రణయ భంగభీతి బద్ధు' (8-320) లైనారు. తేతెమ్మనీ అమృతాన్ని ఇమ్మనీ అడుగలేకపోయారు అంటే దానవులు కపట ప్రేమతో వంచితు లైనారు. ఫలితార్థంగా ఒక్క బొట్టుకూడా చిక్కకుండా వారికి దక్కకుండా సకల సుధారసం అమర సంఘానికి ధారవోసి అసురులకు వట్టి చేతులు చూపింది. కామినుల కపటానురాగానికి ధ్యేయం కార్యసిద్ధి మాత్రమే. కనుకనే దానవ నాయకుల ప్రేమ ఏకపక్ష ప్రణయంగా మిగిలిపోయింది.

ఈ రసవద్భూమికలో శృంగారాన్ని పండించటానికే పోతన కృషి సాగించాడు. అందుకే మూలంలోని సూక్ష్మ సూక్ష్మభావాల్ని ప్రపంచీకరించి మోహినీ కపట ప్రణయాన్ని సమగ్ర సుందరంగా తీర్చి రసమయ జగత్తును సృజించాడు. ఇలాటి కల్పనల్ని పురస్కరించుకొనే కొంద రాలంకారికులు రసాభాసను కూడ రసంగానే పరిగణించారు.

## మోహినీ పరమేశ్వరులు

మోహినీ పరమేశ్వరుల ప్రణయం కపటానురాగ ప్రకటితమైన అనుభయనిష్ఠరతి. ఇందులోని శృంగారం హాస్యం చేత అభిభూతం కావటం వల్ల శృంగారాభాస అయింది.

ముకుందుని ముగ్ధ వేషాన్ని చూచి తనను తాను మరచి మోహావేశుడైనాడు పరమశివుడు. హృదయాకర్షకమైన కందుక క్రీడతో ముందుకు సాగిందామె. అప్పుడు "మున్ను మగువ మరగి నగమైన మగవాడ మ్మగువ వయో రూప గుణ విలాసంబులు తన్ను నూరింపం గనుతెప్ప వెట్టక తప్పక చూచి మెత్తనైన చిత్తం' తో (8-394) 'క్రీడలను నా కీయింతి సిద్ధించునే' (8-395) అని తమక పడటం వంటి అతడి శృంగార చేష్టలు అమూలం. పరమశివుడు మదన బాధతో గతవిజ్ఞానుడై వెంబడించాడు. ఈ సన్నివేశంలో 'తెలుగు పలుకులతోనే శ్లేష సాధిస్తూ చమత్కార భాజనమైన హాస్యకుశలత ప్రదర్శించాడు'[25] పోతన కవి.

ఆమె కందుక క్రీడాచాతుర్యంలోని ప్రతి కదలికా శివుడి హృదయ కుహరాన్ని ఛేదించింది. కనుకనే తన అలినీ విజగణాలినీ మరచి వ్యవహరించాడు. అదే సమయానికి మారుతాహతిచేత ఆమె వలువ వీడిపోయింది. అతడి మనను సంచలించింది. ఇది అద్భుతరసస్పర్శ. శృంగారాద్భుతాలు పరస్పర విరోధిరసాలు కాదు. కనుకనే మోహావేశానికి దోహదపడింది. మోహిని వెంట బడ్డాడు.

---

24. 'ఏకస్యా నాయికాయాః అనేక నాయక విషయా ఽ వలోకనాది వర్ణనయాఽనేక విషయప్రేమ కథన మనౌచితీ, తయా రసోఽపి రసాభాసో భవతి' చంద్రాలోకము, తారకాగమ వ్యాఖ్య, పుట.125

25. పోతన భాగవత నీరాజనం. పుట. 180

మ॥ ప్రబలోద్యత్ కరిణిం గజేంద్రుడు రమింపన్ వచ్చు లీలన్ శివుం
డబలా పోకుము పోకువే యనుచు డాయం బాఱి కెంగేల దా
గబరీ బంధము వట్టి సంభ్రమముతో గౌగిళ్ల నూరార్చి నం
త బహిఃప్రక్రియ నెట్టకేని గదియం దద్భావ నిర్ముక్తయై. 8-402

ఇలా అతడు ప్రవర్తించటం హాసోదంచితం. ఇందులో కబరీ బంధాన్ని బట్టి కౌగిళ్ల నూరార్చటం బహిః ప్రక్రియ నెట్టకేని గదియటం వంటివి బాహ్యరతి భేదాలు.[26]

స్ఖలిత్యానంతరం శివుడు జడతను వీడి నిజం తెలుసుకోవటం అపై విష్ణువు మోహినీ రూపాన్నివీడి ఎదుట పడటం అద్భుతరస స్పర్శ. అయినా ఆ సన్నివేశంలో ప్రేమ ఏకపక్షమై విఫలం అయింది. పతితకు హాస్యం జనించి శృంగారం అభిభూతం అయింది. ఇందులో మోహినీ కపటానురాగం కూడ శివుని మోహానికి మూలకారణమే. కనుకనే ఈ సందర్భంలో పోతన స్త్రీల చూపులను గూర్చి పల్కిన మాటలు గమనార్హాలు.

ఆ॥ కాము గెలువవచ్చు గాలారి గావచ్చు
మృత్యుజయము గలిగి మెఱయ వచ్చు
నాడు వారి చూపుటంపర గెలువంగ
వశము గాదు త్రిపుర వైరికైన. 8-405

ఈ కథలో శివుడికి మోహిని అలంబనం. ఆమె సౌందర్యం హావభావాలు కందుక క్రీడ వనలతలు ఉద్దీపనలు. శివుడంతటివాడు మోహావేశంతో వర్తించటం హాస్యజనకమైన శృంగారాభాసం. ఈ ఘట్టంలో అలంబనమైన శివునకు నవ్వురాదు. దర్శించే వారికి మాత్రమే నవ్వు వస్తుంది. ఈ కారణం వల్లనే ఇది ఆత్మగతమైన హాస్యానికి ఉదాహార్యం[27].

ఇందులో అద్భుతరసంతో పుష్టిమంతమైన శృంగారరసం, హాస్యంతో అవహాస్యమై శృంగారాభాసగా పరిణమించింది. దీనికి మూలకారణం కథారంభంలో 'శ్రీకంఠా ! విను నీవ నేమరకుమీ చిత్తంబు రంజించెదన్' (8-391) అనిపల్కిన ముకుందుని వాక్కును శివుడు విస్మరించటమే.

---

26 శ్లో॥ ఆశ్లేష చుంబన నఖక్షత తాడనాని
సంమర్దనం ప్రసరణం ఖలు శిక్షితాని ।
జిహ్వా ప్రవేశ రసనాగ్రహణం తు నాభిః
క్షోభం రతం వదతి బాహ్యరతాని తజ్ఞః ।।

27 పోతన భాగవత విరాజనం, పుట. 160

## సంధ్యాదేవి

సంధ్యా వర్ణనంలోని శృంగారం అపురూపం. మూలానికి మెఱుగులు పెట్టిన సన్నివేశ మిది. ఇందులో బహుదానవ నాయకత్వం ఏకపక్ష ప్రణయం, అనురాగ నాయిక సంధ్య ప్రముఖ విషయాలు.

బ్రహ్మ విడిచిన శరీరం సంధ్యాదేవి రూపంగా పరిణమించింది. అది సంధ్యా కాలం. కామోద్రేక సమయం. మూలభిన్నరీతిగా ఆమెను గూర్చి పోతన వర్ణించిన వైనం శృంగార భావోత్పత్తికి మూలం. అందులో 'మొదటి పద్యంలో కేవలం శృంగారవతియైన అంగనాకృతి, రెండవ దానిలో సాక్షాత్తుగా సంధ్యా వధూటి. తమాషా ఏమిటంటే ఈ రెంటిలోను ఉన్నది సంధ్యాదేవే! ఎలా పోల్చుకుంటే ఆ పూర్ణ చిత్రం వస్తుందంటే మొదటి దానిలో సంధ్యను రెండోదానిలో అంగననూ రెండూ కలిపి సంధ్యాంగనను చూడాలి! ఇదీ ఇక్కడ శృంగారపు తీర్పు పోతనది. ఇక్కడి కథాగమనానికిన్నీ ఇదే ఉచితమైన వర్ణనా రూపమున్నూ'[28] ఈ అభేద్యవసాయమూర్తమైన భావశృంగార కల్పనం పోతన చిత్తానికే సాధ్యం. అది సహృదయ పరిగ్రాహ్యం.

సీ॥ నవ్య కాంచన రణన్మణి నూపురారావ
            విలసిత పాదారవింద యుగళ
    కాంచీకలాప సంకలిత దుకూలవ
            త్ప్రస్ఫార పులిన నితంబబింబ
    రాజితాన్యోన్య కర్కశ పీన కరికుంభ
            పృథు కుచభార కంపిత వలగ్న
    మదిరా రసాస్వాద మదవిఘూర్ణిత చారు
            సిత నవవికచ రాజీవ నయన

తే॥ యపర పక్షాష్టమీ శశాంకాభ నిటల
    మదవదళికుల రుచిరోపమాన చికుర
    లలిత చంపక కుసుమ విలాస నాస
    హాస లీలావలోకన యబ్జపాణి. 3-720

ఆ శృంగారవతిని చూచిన దానవులు ఆమె చుట్టూ మూగి ఉపగూహనం కావించారు. ఆమె అందచందాలను అందరూ ఏకరువు పెట్టి విస్మయంతో పరస్పరం ప్రస్తావించు కొన్నారు. ఆ సందర్భంలో వారు తాము 'గాముక వృత్తి చరింపు చుండగా/ మనయెడ దీని చిత్తమున మక్కువ లేమికి నేమి హేతువో' (3-723) అని బహుభంగుల

---

[28] శృంగారం - పోతన, పుట. 81

ప్రశ్నించుకోవటంవల్ల వారిది ఏకపక్ష ప్రణయమేననీ ఆమెకు మన్మధభావం లేదనీ విదితమవుతుంది. అప్పటి ఆ సంధ్యావధూటీ స్వరూపం ఇది.

సీ॥ గురు కుచభార సంకుచి తావలగ్నంబు
దనరారు నాకాశ తలముగాగ
లలిత పల్లవపాణి తలమున జెన్నొందు
చెండు పతత్పతంగుండు గాగ
సలలిత నీల పేశల పృథు ధమ్మిల్ల
బంధంబు ఘనతమః పటలిగాగ
ప్రవిమలతర కాంత భావ విలోకన
జాలంబు తారకానమితి గాగ

తే॥ గడగి మైపూత సాంధ్యరాగంబు గాగ
నంగనాకృతి నొప్పు సంధ్యా వధూటి
గదిసి మనముల మోహంబు గడలు కొనగ
నసుర లందఱు గూడి యిట్లనిరి మఱియు. 3-727

ఆమె కవి భావనలో ఉత్తమ దేవతామూర్తి. కాగా దానవులు ఆ వధూటితో సంభాషించే సమయంలో ఉత్తమ జాతిస్త్రీ మూర్తిగా భావించుకొని -

కం॥ వెలయగ పద్మం బేక
స్థలముననే యొప్పుగాని త్వత్పద పద్మం
బిల బహుగతుల ననేక
స్థలముల దనరారు గాదె! తరుణాబ్జముఖీ. 3-728

అని పల్కరించి పద్మినీ జాతి[29] నాయికగా నిశ్చయించుకొన్నారు. మరి ఆమెను చూచి మోహించిన వారు దుర్గుణులైన దనుజాలు. కనుక నాయికా నాయకులకు విభావ వైరూప్యం ఉంది. జాతి భేదం ఉంది.[30] అందుచేత ఇది రసాభాసాంచితం. అంతేకాదు వారు ఏకనాయిక బహునాయకులు. ఆమెకు కామం కానీ మోహం కానీ లేదు. కపటాను రాగం కూడలేదు. ఆ అంగనాకృతి పొందిన సంధ్యా వధూటిని గదిసిన వారికి మాత్రమే మోహం గడలుకొంది. 'మోహపడిన దృష్టికి ప్రకృతి ద్రవ్యము యొక్క కూర్పు స్త్రీ

---

[29] శ్లో॥ భవతి కమల నేత్రా నాసికాక్షుద్ర రంధ్రా,
అవిరళ కుచయుగ్మా, చారుకేశీ కృశాంగీ।
మృదు వచన సుశీలా గీతవాద్యాను రక్తా,
సకలతను సువేశా పద్మినీ పద్మగంధా॥ రతిమంజరి, శ్లో-4

[30] భక్తి రసామృత సింధు 1, పుట. 647.

దేహముగను, కాలమే ఆమె వయసుగను గమనికకు వచ్చును'.[31] ఇలాటి భ్రాంతి వలన శృంగారం నుండి హాస్యం ఉదయిస్తుంది. అది రసాభాస లక్షణం. ఇలా వారి పల్కులూ చేతలూ నిరర్థకమే అయినాయి. అయినా ఆ సంధ్యావధూటిని బట్టి వారు ఆఘ్రాణించబోగా బ్రహ్మగా పరిణమించి హాస్యోదయమయింది.

మొత్తం మీద ఈ కథలో జాతిభేద 'ఏకపక్ష విప్రలంభ శృంగారాభాస' గోచరిస్తుంది. సర్వరసాలూ విభావానుభావాలతో పరిపుష్టి చెందనప్పుడు ఆభాసాలే అవుతాయి. ఈ సంధ్యా రూప వర్ణన నైపుణ్యం, నాయికా నాయక జాతిభేద నిరూపణ ప్రథిమ రసాభాసకు పుష్టి నిచ్చాయి. వారి పూర్వరాగ విప్రలంభం ఆమెచేత తిరస్కృతమై రసాభాస మయింది.

# అపరిపుష్ట శృంగారం

పశుపక్షి మృగాదుల కామ ప్రవృత్తి రసాభాసమని ప్రసిద్ధ అలంకారికోక్తి. దానికి కారణం వాటిలో వైదగ్ధ్య ముండదని వారి భావం. కానీ విద్యాధరుడు జగన్నాథుడు ఇద్దరూ తిర్యక్కుల ప్రణయాన్ని రసంగానే పరిగణించారు. తిర్యగ్గతిలో వాటికి కూడ విభావాదులున్నాయి. అవి భావుక చిత్తోల్లాస హేతువులై చమత్కార సారమైన రసనిష్పాదక మవుతాయి. ఇందులో సహృదయులకు స్థాయి కాలుష్యం కాని పక్షంలో అది శృంగారమే[32]అని వేదాల తిరువేంగళాచార్యులవారు తీర్మానించారు. కనుక తిర్యగ్గతి కావటంచేతనే అది రసాభాసం అయితే, రసాభాసం కూడ కొందరి దృష్టిలో రసమే కనుక అది ఆస్వాదయోగ్యమైనదే. జంతుగతమైన శృంగారాన్ని భోజుడు 'సామాన్యం'[33] అని పేర్కొన్నాడు. నిరింద్రియ గతంగా శృంగారారోపం చేసినా శృంగారాభాసమే అవుతుందని హేమచంద్రుని వక్కణం.

## భృంగరాజు

వనవిహారం చేసే గజేంద్రుని సమీపంలో సంచరించే భృంగరాజ శృంగార విహార విశేషం గమనార్హం. మృగసంతతి కంతటికీ వెఱపు గొలిపే మదకరీంద్రుడి మీద చేరి చేసే వాటి వివిధ కామ శృంగార వినోద క్రీడలు అమూలక కల్పనలు.

కం॥ తేటి యొకటి యొరు ప్రియకును
మాటికి మాటికిని నాగ మదజల గంధం
బేటికని తన్ను బొందెడి
బోటికి నందిచ్చు నిండు బోటు దనమునన్. 8-31

31 భాగవత రహస్యము, పుట. 3-720.

32 ఆంధ్ర ధ్వన్యాలోకం. పుట. 138

33 శృంగార ప్రకాశము. పుట. 305.

తనపై వలపు కురిపించే తేటిబోటికి పోటుతనంతో మదగజ మదజలాన్ని అందించే ఈ తేటి శృంగార భావ మాధుర్యం ప్రకృతి గత ప్రణయ తత్త్వ సంకేతం.

కం॥ అంగీకృత రంగన్మా
తంగీ మదగంధ మగుచు దర్పయు వేడ్కన్
సంగీత విశేషంబుల
భృంగీగణ మొప్పె బ్రాను పెట్టిడి వేడ్కన్. 8-32

ఇలా ఆశ్చర్య చకచ్చకితంగా మదజల గంధాన్ని ఆస్వాదిస్తూ తేటిబోటుల గుంపు లానందంతో ఆలపించే సంగీత విశేషం ప్రకృతి ప్రణయ మంత్రం. వలచి వలపిస్తూ చిక్కక దక్కక తిరిగే వలపుకత్తెలను వలచి వలగొని వశపరుచుకోవటం వలపు గాండ్రకు నైజం. అది ఒక శృంగార కళ (8-33). ఈ ఉల్లాసకేళి ఆ గండుతుమ్మెదలకు వారణ దానామోదం కన్న మిన్న. వాటి ఆట పాటలు సరస సల్లాపాలు సుకుమార ప్రణయ గీతాలు సుఖ మయ శృంగార జీవితానికి ప్రకృతి నేర్పిన ప్రణయ పాఠాలు. ఇవి పఠితను శృంగార మధుమయ భావతరంగిణిలో మజ్జనా లాడిస్తాయి. ప్రకృతి ప్రణయ రహస్యవేదిగా రతికళా వినోదిగా రమ్య భావనాలోకంలో పరవశింప చేస్తాయి.

ఈ సుమనోజ్ఞమైన భృంగీ శృంగార భంగిమలు రానున్న గజరాజ పటుతర శృంగారానికి నాందీ ప్రస్తావనలుగా భావించవచ్చు. సహృదయుల్ని గజరాజ శృంగార రస ప్రాభవానుభూతికి ఆయత్తం చేస్తాయి. పోతన్నగారి శృంగార రసోద్యమ నిర్వహణ నైపుణ్యంలోని ఈ ఘట్టం కవికుల గురువు కాళిదాస కుమారసంభవ కావ్యంలోని మధుద్విరేఫ ప్రణయోదంతాన్ని (3-36) స్మరింప చేస్తుంది.

## గజరాజు

గజేంద్రుని శృంగారం జంతు శృంగారానికి పరమోదాహరణం. గజరాజు తన భార్యలకు పచ్చిక లందించడం పూగొమ్మలలో పాలుపెట్టటం వంటి రమణీయ మాధుర్య లక్షణాలూ గళాలు నిమరటం 'పిరుదుచక్కట్ల' చేరి ప్రేమతో మూర్కొనటం తొండాన్ని పైకి సాచటం వంటి లలితాది శృంగార చేష్టలూ అన్నీ 'పౌరుష గాత్రారంభాను భావాలు'. వాటి ద్వారా గజరాజు కామవికారాన్ని పొందింది. వాటి వెదవివేకించి (ఋుతు సమయాన్ని

సమీక్షించి) క్రీడించింది. భార్యా సమ్మోహనమైన కామోపచారాలను ఉపక్రమించింది. ఇట దేశ కాలానుకూలమైన చేష్టలతో శృంగారో త్కర్ష[34] కలిగింది.

గజరాజు వాటితో క్రీడించిన రీతి దాని దక్షిణ నాయకతా ద్యోతకం.[35] వాటితో అది క్రీడించి విశ్రమించటం సురతావసాన సూచకం.[36] సురత క్రీడానంతరం గజరాజు జ్ఞానేంద్రియ పంచకానికి విందుచేసే కాసారాన్ని సమీపించి ఆనందించింది.

సీ॥ తోయజ గంధంబు దోగిన చల్లని
మెల్లని గాడ్పుల మేను లలర
గమల నాళాహార విమల వాక్కలహంస
రవములు సెవుల పండువులు సేయ
పుల్ల దిందీవరాంభోరు హామోదంబు
ఘ్రాణ రంధ్రంబుల గారవింప
నిర్మల కల్లోల నిర్గతాసారంబు
వదన గహ్వరముల వాడు దీర్ప
తే॥ త్రిజగ దభినవ సౌభాగ్య దీప్తమైన
విభవ మీక్షణములకును విందు సేయ
నరిగి పంచేంద్రియ వ్యవహారములను
మఱచి మత్తేభ యూథంబు మడుగు జొచ్చె. 8-44

గజేంద్రానికి కాసారం కల్పించిన పంచభక్ష్య సమ లక్షణాలన్నీ రతానంతర మధుభక్షణ సమానాలు. అప్పై మైమరచి కరేణు సంఘంతో కలిసి జలక్రీడ సాగించటం కామశాస్త్ర విధి. ఇది 'గజమైథున క్రీడ'.[37] ఇలాగే ఒక పురుషుడు పలువురు స్త్రీలతో నీళ్లలో రమించటాన్ని వారిక్రీడితకం అంటారు. ఇది రతి శ్రమను తగ్గించి ఇంద్రియ స్ఖలన శక్తిని వృద్ధి చేస్తుంది.

---

34 శృంగారోత్కర్ష కారణాలు:

శ్లో॥ సమగ్ర వస్త్వాధారః శృంగారో వృద్ధి మశ్నుతే ।
ఉత్కర్షః పుష్టి సంపత్త్యా తేషాం క్వాపి సంభవః ॥
పాత్రాదీనాం గుణైః పూర్ణైః రసవృద్ధి ర్విభావ్యతే ।
రసోత్కర్షో భవేద్భిః త్రైర్గుణై స్సర్వత్ర పుష్కలైః ॥
పరిపూర్ణ గుణా త్కాలా ద్రస సంపద్విభావ్యతే ।
దేశకాలాను కూలాభి శ్చేష్టాభిః పుష్టి మశ్నుతే ॥
దేశకాల గుణాపేక్ష చేష్టాః కాశ్చిచ్చ దర్శితాః । - భావప్రకాశనము. పుట. 196

35 నాయికా స్వనేకాసు తుల్యోదక్షిణ ఉచ్యతే. - రసార్ణవ సుధాకరం పుట. 58

36 వాత్స్యాయన కామసూత్రాలు. సం1.పుట. 311

37 వాత్స్యాయన కామసూత్రాలు. సం.1. పుట.259

సీ॥ కరిణీ కరోజ్ఘిత కంకణచ్ఛట దోగి
సెలయేటి నీలాద్రి చెలువు దెగడు
హస్తినీ హస్త విన్యస్త పద్మంబుల
వేయు గన్నుల వాని వెరవు సూపు
కలభ సముత్కీర్ణ కల్హార రజమున
గనకాచలేంద్రంబు ఘనత దాల్చు
గుంజరీ పరిచిత కుముద కాండంబుల
ఫణిరాజ మండన ప్రభ వహించు

ఆ॥ మద కరేణుముక్త మౌక్తిక శుక్తుల
మెఱుగు మొగిలు తోడ మేలమాడు
నెదురులేని గరిమ నిభరాజ మల్లంబు
వనజ గేహకేళి వ్రాలునపుడు. 8-49

జలక్రీడలో నాయక విభవంతో పాటు, ఆ గజరాజు నలంకరించి ఆనందించే కరిణీ సంఘం తమ శృంగార చేష్టలతో అతడికి కూర్చిన అంగిక శృంగారం సహృదయ చేతోమోదం. మంచి వస్త్రాలు అంగరాగాలు ఆభరణాలు పుష్పమాలలు మొదలైన వాటితో అలంకృతమై యౌవన సంపదతో ఉండే దేహం అంగిక శృంగార యుతం.[38] ఈ శృంగారం ఇక్కడ నాయకోద్దీపనమై వాటికి ఇష్టసిద్ధిని కలిగిస్తుంది.

గజేంద్రుడి ప్రవేశంతో కల్లోలమైన సరోవర వర్ణనంతో గజేంద్రుడి సంభోగం ధ్వన్యమాన మయింది.

వ॥ 'ఆ సరోవరలక్ష్మి మదగజేంద్ర వివిధ విహార వ్యాకులిత నూతన లక్ష్మీవిభవయై యనంగ విద్యానిరూఢ పల్లవ ప్రబంధ పరికంపిత శరీరాలంకారయగు కుసుమ కోమలి యునుంబోలె వ్యాకీర్ణ చికుర మత్త మధుకర నికరయు, విగతరస వదన కమలయు, నిజస్థాన చలిత కుచరథాంగ యుగళ లంపటిత జఘన పులినతలయు నైయుండె"(8-50).

కామశాస్త్రవిదుడైన పల్లవుడు తలపెట్టిన కామకదనంలో కదలిపోయిన కుసుమ కోమలి అంగాంగ సౌందర్యం భంగ్యంతరంగా రూపు కట్టిన సన్నివేశమిది. ఇది సంభోగానంతర దశ. ఇందలి రతిక్రమ విధానం కామశాస్త్ర ప్రసిద్ధమైన క్రమంలోనే సాగింది. ఐతే ఇక్కడ వీరు పరనారీ పరపురుషులు. అందువల్ల వారు భయాకులురై ఉంటారు. కనుక వీరిలో సంక్షిప్త సంభోగ క్రమం వ్యక్తమయింది. అందులోనూ నాయికా సురతావసానం సూచితమయింది. తద్వారా గజరాజ రతికేళీ విహరణ విన్యాసం ధ్వనితమయి పోతన రతి పాండిత్య ప్రకర్ష విదిత మవుతుంది.

---

38 భావ ప్రకాశము, పుట. 143

కరికరేణు శృంగారంలోనూ పల్లవ కుసుమ కోమలీ విహారంలోనూ వారికి కలిగిన భావుక చిత్తోల్లాసం వల్ల చమత్కారం రస సముల్లసితమైంది. జంతు శృంగారం కాబట్టి ఇది రసాభాసమే అయినా అనుచితం కాదు గనుక సహృదయామోదమే ఔతున్నది.

# నిరింద్రియ శృంగారం

రసాభాసంలో తిర్యక్కుల విషయమే కాక నిరింద్రియాలను కూడ హేమచంద్రుడు పేర్కొన్నాడు.

'నిరింద్రియేషు తిర్యగాదిషు
చా రోపాత్ రసభావాభాసౌ' కావ్యానుశాసనం - పుట. 254

నిరింద్రియాలైన లతాతరు గుల్మాలలోనూ తిర్యగాదుల్లోనూ శృంగారారోపం చేస్తే రసభావాభాసం అవుతుంది.

మాధవుడి తోడి శృంగార లీలలను గూర్చి ధర్మదేవుడికి వివరిస్తూ భూదేవత మురిసి పోయిన తీరు గమనార్హం.

కం॥ మెల్లన నాపై యాదవ
వల్లభు డడుగిడగ మోహవశనై నే రం
జిల్లగ రోమాంచము క్రియ
మొల్లములై మొలచు సస్యములు మార్గములన్. 1-407

ఆమె స్మృతి పూర్వక రతి భావంతో పాటు మాధవుడి కాంతామోహనశక్తి ఇట మనో గోచరమౌతుంది. అడుగిడటం విభావం, రోమాంచం సాత్త్వికం. ఇవి మూల భావాలకు కొనసాగింపై ఇంపును పెంపొందింప చేశాయి. భూమి పరంగా శృంగారారోపం చేయటం వల్ల ఇది నిరింద్రియ సంబంధమైన రసాభాసం.

అలాగే బలరామకృష్ణుల సంచారంతో రంజిల్లిన గిరి పురోవీథీ శృంగార భావం సురుచిరం.

మ॥ బలకృష్ణాంఘ్రి సరోజ సంగమముచే భాసిల్లుచున్ ధన్యమై
ఫల పుష్పంబుల గానుకల్ గురిసి సంభావించి మిన్నందుచున్
జలఘూసంబుల గోవులం దనిపి చంచద్ భూజ రోమాంచమై
వెలసెన్ జూడగదమ్మ! ఈ గిరిపురోవీథిన్ సరోజాననా ! 10 - 794

నాయక సంగమంతో సంతసించిన నాయికా భావం నిరింద్రియమైన గిరిపరంగా ఆరోపితమై రసాభాస హేతువయింది. విభావాలలో వైరూప్యం ఉన్నందువల్ల కూడ దీనిని రసాభాసగా పేర్కొనవచ్చునని భక్తి రసామృత సింధువు [39] వివరిస్తుంది.

ఇలాగే నదీ గతరతిని గూడ పేర్కొనవచ్చు.

మ॥ క్రమమొప్పన్ నదులెల్ల వంశరవ మాకర్ణించి సంజాత మో
హములన్ మన్మథ సాయక క్షత విశాలావర్తలై హంస వా
క్యములం జీరి తరంగ హస్తముల నాకర్షించి పద్మోపహా
రములన్ గృష్ణు పదార్పనంబు సలిపెన్ రామా ! విలోకించితే. 10-789

ఇందులోని మన్మథాయత్తలైన నాయికా చర్య నదీపరంగా ఆరోపితమయింది. ఇది కూడ హేమచంద్రుడు పేర్కొనిన ఒకానొక శృంగారాభాస భేదమే. ఇటువంటి వర్ణనలు భావనా ప్రతిభకు అక్కరమణి దర్పణాలు.

# అనుచిత శృంగారం

మురళీనాదం చేసే గోవిందుని చూచి మోహపరవశలైన భిల్లాంగన ఉల్లాసం ఉగ్గడింపదగ్గది.

కం॥ ఉల్లసిత కుచభరంబుల
నల్లాడెడి నడుముతోడ నలరుల దండల్
భిల్లి యొకతె హరి కిచ్చెను
హల్లోహల కలిత యగుచు నంగన గంటే ! 10-792

ప్రేమ కానుకలుగా పూలమాలికలను అందించిన భిల్లాంగనలకు కృష్ణుడు విభావం కాగా మోహంవల్ల పాలిండ్లు నిక్కి నడుములు కదిలాయి. అవి వారి కామేంగితాలు. వారి హావ భావాలకు తగిన చిహ్నాలు. ఇలా వారిస్థితి కామినీ జనోచితం ప్రేమ నిర్భరం. ఐనా వారు భిల్లాంగనలు కనుక శ్రీకృష్ణుని కోరటం అనుచితం. అందువల్ల కూడ ఇది శృంగార రసాభాసమే.

ఏవం విధంగా శృంగారకవి పోతన భాగవతంలోని అనేక రసాభాసఘట్టాలు రసోచిత ఘట్టాల కన్న మిన్నగా రసోద్గారాలై సహృదయ హృదయ రంజకాలైనాయి. శృంగారరస శాస్త్ర పారంగతు డీమహాకవి అనటానికి ఇవి చక్కని నిదర్శనాలు. ఇలా తన అపార ప్రతిభా ప్రాభవాలకు వ్యుత్పత్తి చేత దాస్యం చేయించి కాళిదాసాది మహాకవుల కోవలో పరిగణింప దగిన వాడైనాడు మన పోతన కవిరాజు.

---

[39] శ్లో॥ వైదగ్ధ్యోజ్జ్వల్య విరహో విభావస్య విరూపతా।
లతా పశుపులిన్దేషు వృద్ధా స్వపి సవర్తతే॥ భక్తి రసామృత సింధు : పుట. 647

# ప్రకీర్ణకం

## ప్రకృతి వర్ణనలు - శృంగారం

ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించి పరవశిస్తాడు సహృదయుడు. కానీ దాన్ని వర్ణించి అనుభవించి రసీకరిస్తాడు కవివతంసుడు. ప్రకృతిగత రహస్యోన్మీలనం అతని కవితాధర్మం. అందుకే కవులు ప్రకృతి భాష్యప్రణీత లైనారు. పోతనకవి అట్టి భాష్యప్రణీత. పోతనకృత ప్రకృతి వర్ణనలు ఆంధ్రమహాభాగవత ప్రాంగణ రంగవల్లికలు. అవి అతని రసమయ భావనా జగత్తును సందర్శింప చేసే శృంగార విద్యుద్దీప తోరణాలు. అవి భాగవత రసికజన హృదయా హ్లాదకర 'రసగుళికలు'.

తిక్కన తన ఇతిహాసాన్ని తత్తత్పాత్రల అవస్థా నేపథ్యంగా అందులోని ప్రకృతివర్ణనల్ని రసాభ్యుచితం కానించాడు. శ్రీనాథుడు వాటిని శృంగారరస సామగ్రిగా స్వీకరించి రసబంధురం చేశాడు. పోతన ప్రకృతిని మానవీకరించి శృంగార రసరంజకం కావించాడు. ఇందులో లోకధర్మాన్నీ నాట్యధర్మినీ ఏకోన్ముఖం చేశాడు. వాటిలో కతిపయ వర్ణనలు భావి కథాసూచికలుగా కూడ తీర్చిదిద్దాడు. వీటిలో అతివ్యాసధర్మ మధికంగా వుంటుంది.

కైలాస పర్వతగత గంగాతరంగిణీ ప్రస్తావనం రసరాగ శోభితం. 'పర్యస్త నన్దయా సత్యాః స్నాన పుణ్యతరోదయా' (4-6-22) అని మాత్రమే మూలభావం. కానీ అనువాదంలో దాని రూపమే మారింది. వ॥ 'రమణీయ కుచమండల విలిప్తమృగమద మిళిత హరిచందనగంధ సుగంధిత జలపూరిత గంగాతరంగిణి' (4-136) అని పోతన 'అనుసృజన'.

అది ఆ సతీరమణీ భోగభాగ్య సూచకం. కైలాసం లోని జగన్మాత విలాస జీవనంపట్ల అయనకున్న అనురాగభావనం అది. అది ఆనాటి విలాసజీవనల పరిమళ

ద్రవ్య వినియోగ సూచనకు ప్రమాణం. ఈ సందర్భంలో వనగత తరులతా పశు పక్ష్యాదులన్నింటినీ వ్యాసప్రోక్తంగానే ప్రవచించినా అందులో కవితా సౌందర్యం సముద్దీప్త మైంది. అందులోని నందాలకా నదీజలాలు అవగాహనీయాలు. వ ॥ 'రతికేళీ వ్యాసంగ పరిశ్రమ నివారక సలిలకేళీ విలోల దేవ కామినీ పీనవక్షోజ విలిప్త కుంకుమ పంక సంగత పిశంగవర్ణ వారిపూర విలసితంబును నగు నందాలక నందాభిధానంబులంగల.............' (4-136) అని అమూలక భావాలతో విశేషింపజేసాడు. ఈ 'రతి కర్శిత జలం' మూలంలో లాగా దేవతా స్త్రీల శరీర కుంకుమ పంకంతో కూడిందికాదు, వారి కళాస్థానాలైన వక్షోజాల కుంకుమ పంకంతో కూడింది. రతికేళి తరువాతి జలకేళి జంటలకు పునరుత్తేజాన్ని ఇస్తుందన్నది వాత్స్యాయనమతం. ఆ సంప్రదాయాన్నీ పోతన తననాటి భోగి జన శృంగార పరిమళ ద్రవ్య వినియోగాన్నీ తద్వారా వారి భోగదృష్టినీ తలపింప చేశాడు.

స్త్రీ ప్రసక్తితో పులకించే శ్రీనాథుడి లాగానే పోతన కూడా వారి వక్షోజ ప్రస్తావనతో పరవశిస్తాడు. దానికి తోడు వారి శృంగారోద్దీపక ఉపభోగాల్ని జోడించటం ఆయన రసికతకు ప్రాణం. ఆనాటి స్త్రీలను విలాస జీవనలుగానే కాక శృంగార మంగళ దేవతలుగా సంభావించాడు.

## దక్షిణానిలం

సౌగంధికవనంలోని దక్షిణానిలం మానినీ మానసాల్ని కలవరపెట్టేదిగా కనిపిస్తుంది.

వ॥ 'తత్పురో భాగంబున వనగజ సంఘృష్ట మలయజ పరిమిళిత పవనాస్వాదన ముహుర్ముహురున్మదిత మానస పుణ్యజన కామినీ కదంబంబును' (4-136) ఇందులోని శృంగారోచిత వాయువర్ణనం యథామూలంగా (4-6-28,29) ఉండటమే ఔచిత్యం. ప్రకృతి వర్ణనలను సంక్షిప్తీకరించి పుణ్యజనకామినీ సౌందర్యానికే ప్రాధాన్యమిచ్చి పోతన తన శృంగార మానసోల్లాసాన్ని ప్రకటించటం కథా సందర్భ సముచితం. ఇట స్త్రీలు సుఖైక భాగులని పోతన భావన. దక్షిణానిలం ఉల్లాసజనకమనీ శృంగారోద్దీపన హేతువనీ అది వారి శృంగార ప్రాణానిలమనీ సూచన.

## సరోవరం

తే ॥ ఘనుని సిరిభంగి నర్థ జీవనము నగుచు
మానవతి వృత్తిగతిని నిమ్నంబు నగుచు 4-691

విలసిల్లిన పృథు చక్రవర్తి కథలోని ఈ సరోవర వర్ణనం సురుచిరం. ప్రకృతిలో స్త్రీ హృదయ సౌందర్యాన్ని సందర్శించిన భావుకలోక శిఖామణి పోతన. ఉదాత్త వనితకు హృదయ శృంగారమే అనంత సౌందర్యం. కనుక పోతన శృంగారదృష్టి బాహిర సంబంధ మైనది మాత్రమేకాదు, సంస్కార సంబంధ మైనదీ అంతర ప్రధానమైనదీ కూడ. ఇలా ప్రకృతిని మానవీకరించటం వల్ల మానవుడు ప్రకృతిలోని లోతుపాతులను దర్శించాలనీ

ప్రకృతి సమస్తం సౌందర్య సముజ్జ్వల సముపేతమనీ దానిని దర్శించి తరించాలని ఆయన భావం. మానవతీ గమనం లోని విస్తృత సౌందర్య సూచకం. ఆమె సుగుణ సముదాయాన్ని అలంకార విశేషాల్ని వివరించాడు శారదా తనయుడు.[1] వాటితో ఆమెకు సంఘంలో కలిగే గౌరవాదరాల్ని ప్రకటించాడు. ఇలా ఉదాత్త భారతనారీ భావన చేశాడు పోతన.

## గంగా తరంగిణి

గంగా ప్రవాహ వర్ణనగత శృంగారవర్ణనం కృత్స్నంగా అమూలకం. అది మన్మథ సంబంధోచి తోపమలతోనూ వివిధ నాయికా లక్షణాలతోనూ గంగాయురీ వేగంతోనూ సాగింది. ఆ శృంగారాంగనల అంతరంగాలు కూడ ఆ గంగా తరంగాలలో రంగులు వారి పొంగులెత్తాయి. గంగానదీ తరంగ ధ్యానం ముక్తపదగ్రస్తాల మధ్య ఆంగిక వాచిక శృంగారాల సూచనమైంది. గంగానదీ పావిత్ర్యాన్ని ఉత్తమ స్త్రీలకూ అలాగే పుణ్యస్త్రీల శారీరక మానసిక సచ్చరిత్రాన్ని గంగానదికీ ఆపాదించటం అనితర సాధ్యశిల్పం. ఈ సందర్భంలోని శ్లేషమూలోపమల, శబ్దాలంకారాల సంతర్పణ లనేకం. గంగానదీ స్త్రీ పరిణామ రూప విలాస విభ్రమాలూ అందచందాలూ సర్వనుమనో మనోజ్ఞాలు. ఈ భంగ్యంతరాలైన వివిధ స్త్రీ భూమికా నిర్వచనాలు అలంకారిక సమ్మతాలు. అవి పోతన అంతర శృంగారభావనా పథంలోని స్త్రీలోక సంబంధ భావచిత్రాలు. స్త్రీమూర్తి శృంగారానికి పర్యాయంగా పరిణమించిన తా విది. ఆ శృంగారం అనంత ముఖాలుగా విస్తరించింది గంగానదీ తరంగధ్యాన మధ్యంలో.

గంగా ప్రవాహంలోని వివిధ స్త్రీ వర్ణనం ప్రధానంగా త్రివేణీ సంగమంగా గోచరిస్తుంది.

### 1. అవయవ వర్ణనం

1. సుందరీ ముఖంబు పోడిమి నిర్మల చంద్రకాంత తుల్యం
2. కాంతాధరంబు రుచి శోణచ్ఛాయా విలసనం
3. విలాసవతి కొప్పు కృష్ణాలకాధికం
4. విభ్రమవతి చనుదోయి నిరంతర పయోవ్యాప్తాఖిల జీవనప్రద తుంగభద్రావతీ రేఖా సలలితం.

---

1 శ్లో॥ ఉదాత్త కేశ వాసోఽంగ మాల్యభూషాసు సాదరా ॥
శయ్యాభరణ సంస్కార పరిబర్హ సమేధినీ ।
స్థిరస్నేహా కృతజ్ఞా చ దదాత్యాశ్రిత వత్సలా ॥
మానయంతీ చ మానార్హా నిత్యోత్సవంతాఽపిచ ।
బంధు సంబాధ ముచితా కృతజ్ఞా ప్రియవాదినీ ॥
ఏవ మాది గుణైర్యుక్తా ముదాత్తాం పరచక్షతే । భావప్రకాశనము, పుట 210

5. తామర కెంగేలి యొడికం ఆక్రాంత సూర్యతనయం
6. రంభ నెమ్మోముడాలు సురసాతిశయ దళం
7. నవసూతికా కుచంబులపేర్మి నిరంతర పయోవర్షనం

## 2. మన్మథోద్దీపనలు

8. వారకన్య ముంజేతి గతి ముహుర్ముహు రుచ్చలిత కంకణాలంకృతం
9. లలిత[2] పతిగతిని నగవుమించు అపహసిత చంద్రభాగధేయం

## 3. వివిధ భూమికా నిర్వచనం

వివిధ భూమికలలో స్త్రీ మనస్తత్వం వర్తనం నిశితంగా పరిశీలించి నిర్వచించి ఆ గంగకు అపాదించడం ఔచితీ మంతం.

10. మానినియన లోతు నూపక (ఆత్మాభిమానం గల స్త్రీ, లేదా ఈర్ష్యాజనితమైన కోపం గల స్త్రీ)
11. గరితయన నడినప్పుడు సేయక
12. ముగుదయన బయలుపడక
13. ప్రమదయన గ్రయ్యంబారుచు
14. పతివ్రతయవ నిట్టట్టు ననక
15. తల్లియన నెవ్విఁయైన లోగొనుచు

శృంగార గంగా ప్రవాహాన్ని పరవళ్ళు త్రొక్కించింది పోతన శృంగారలేఖిని. 'శృంగారం అపవిత్రం గాదు అనేందుకీ ఉపమలే సాక్ష్యం. శృంగారం కేవలం సంభోగ విప్రలంభాలే అయితే, ఇంత నవం నవాలంకృతి ఐన శృంగార గంగాతరంగిణి ఏ కోటిలోని దనాలి? కనుకనే శృంగారం అనంత ముఖాలు గలదని శాస్త్ర లన్నారు.'[3]

ఏవం విధంగా పోతన గంగా ప్రవాహాన్ని స్త్రీల వివిధావయవాలతోనూ చేష్టలతోనూ భిన్న భూమికలతోనూ అపూర్వ రామణీయకంగా ఉపమింపజేయటం ఆతని అనిదంపూర్వ శృంగార కళా నిర్వహణ చాతుర్య సాఫల్యమే.

---

2 శ్లో॥ రూపయౌవన సంపన్నా సఖీకేలి కృతోద్యమా
వాసోఽంగరాగ మాల్యర్తు వేలా శైల సరిత్ప్రియా ।
సంభోగరసికా హేలా భావహావ సమేధితా ॥
కలాశిల్పవిశాలాఢ్యా లలితా పరికీర్తితా । భావ ప్రకాశసము. పుట. 212

3 శృంగారం - పోతన. పుట. 152

# ఋతువర్ణనలు

ప్రకృతివనితకు ఋతువులు వయఃపరిణామ సూచికలు. కవి భావనాదృష్టిని బట్టి అవి నయన మనోహరంగా మనోరమంగా కావ్యగతంగా అవతరిస్తాయి. పోతన్న దృష్టిలో సర్వ ఋతువులూ రసికజన హృదయాపహారులే. కనుకనే పోతన గ్రీష్మ వర్ష శరద్ధేమంతాల్ని వరుసగా వర్ణించాడు. అది అతని ప్రకృతి పరిశీలన ప్రవృత్తికీ తద్దర్శనసమయ తన్మయ తకూ అందులోని శృంగార సంకేత గ్రహణ నైపుణికీ నిదర్శనం.

హేమంతాదులు మూలంలో ఉన్నా శృంగార స్పర్శ లేనేలేదు. కనుక అవి అమూల కల్పనలే. శరదృతు వర్ణనం మూలం కంటె ముగ్ధ మోహనంగా సాగింది. పోతన ప్రకృతిలోని నిసర్గ సమ్మోద శృంగారాన్ని సమగ్రంగా దర్శించాడు. శ్రీనాథుడి కావ్య మార్గంలో రస బంధురంగా అభివర్ణించాడు. ఆయా తావుల్లో అవి భావికథా సూచనలతో భావ బంధురంగా గోచరిస్తాయి.

## గ్రీష్మర్తువు

గ్రీష్మర్తువు ప్రాణికోటికి తాపహేతువు. కానీ అందులోనే 'మిథున కోటికి రతిమెండు దోచె' (10-714) ననటంలో ప్రాణిసహజ శృంగార ప్రీతి స్ఫురిస్తుంది. శృంగార భావుకుల సర్వకాల సర్వావస్థా సహజ లక్షణంగా రతిని సంభావించాడు పోతన. దాన్ని శృంగా రోపచారాలకు మిక్కిలి అనువైనదిగా భావించాడు.

గ్రీష్మంలోనే వసంతం ఉంది మూలాను వాదాల రెండిటా. అది బృందావన ప్రాంతంలోని రామగోవింద మందిరం. అందుచేతనే ఆ ప్రాంతం అంతా గ్రీష్మంలోనే వాసంతవు వాసనలతో గుబాళించింది. రసహృదయులకు భావనాబలంచేత సర్వకాలాలూ కామకళా విలాస నిలయాలుగా భాసిస్తాయి. ప్రకృతి సైతం వారిని చూచి రాజిల్లుతుంది. వారి హృదయాలు ఏతత్కాలోచితాలుగా పరిణమించి తద్గత సుమ సౌరభాల్ని ఆస్వాదించి పరవశిస్తాయి, శృంగార భావనా జగత్తులో హాయిగా విహరిస్తాయి.

## వర్షర్తువు

వర్షకాలం భోగులకు భోగ్యైనకాలం. దాన్ని సనాతన కవులు సర్వ శృంగార భావసంభరిత సమయంగా సంభావించారు. పోతన వర్షర్తువును శతధా శ్లాఘించి పరవశించాడు. కర్షక హలరేఖలు భూసతికి వర్షకాల భుజంగుడు చేసిన నవ నఖాంకురా (10-752) లనటంలో పోతన సురుచిర సుందర శృంగార దృష్టికి ప్రకృతి ఒక ప్రణయ కామినిగా తోచింది. ఇలా ప్రకృతిని ప్రేమకళానిలయంగా కామకళా విలాసాల ఆవాసంగా ప్రణయ విద్యా పరమ పట్టభద్ర కేంద్రంగా సంభావించాడు పోతన.

కం॥ చెలువుడు ప్రావృట్కాలుడు
పాలసిన పులకించు భూమి పులకము లనగా
మొలచి తలలెత్తి నిక్కుచు
సలలితగతి జాలువారె సస్యము లధిపా ! 10-753

ప్రావృట్కాలుడు ఉద్దీపన విభావంకాగా భూకాంతకు ఆనందంతో సాత్త్వికోదయం కలిగి రసోత్కర్ష సూచిత మయింది. ఈ సందర్భాలలో పోతన ప్రకృతి కవిగా కర్షకకవిగా గావించిన శృంగార భావనలు పరమ రమణీయాలు.

శృంగారవతులైన స్త్రీల శీల విశేషాల్ని దేశకాలాల్ని గుర్తించి రతి వివృద్ధి కోసం వారికి కామోపచారాలు చేయాలి. లోకంలో నాయికలు వేశ్య పరాంగన కులజ అనే భేదాలతో త్రివిధంగా ఉంటారు.కనుక వారికి ఈ ఉపచారాలు కూడ మూడు విధాలుగా వేరు వేరుగా ఉంటాయి. ఆ తేడాలు గమనించి పురుషుడు కామోపచారాలు చేసి సుఖించాలి. అటువంటి ఒక కామోపచారాన్నే ప్రకృతి గతంగా పరికించాడు పోతన. ఇట వేశ్యానాయికకు ఒక విటుడు సమర్పించుకొన్న విశేష కామోపచారం పరమ రమణీయం. 'మేఘ విముక్తంబులై, జలద సమయ విటుండు సరసగతి ధరణిసతి యురమ్మున దర్పించి నేర్పున సమర్పించు కర్పూరఖండంబుల వడువున బుడమిం బడు కరకలు' (10-754) రమణీయాలు. వానకారులో వడగళ్ళు పడటం ప్రకృతి సహజం. వాటిని కర్పూర ఖండాలుగా భావించటం విశేషం. కర్పూర సమర్పణం విటుల విజ్ఞతకు రసజ్ఞతకు సంకేతం. భోగులకది కామప్రరోచకం, సతులకు సంతోషదాయకం. భుజగ సమేతలైన కేతకుల్ని వనచరానంద కారిణులైన వారకాంతలతో ఉపమించటం వల్ల ప్రకృతి అంతా శృంగార రసభావ తరంగితంగా గోచరించింది. అవి వనచరులకు ఉద్దీపకా లయినాయి (10-754).

వేశ్యలు గుణవంతులైన పురుషుల పట్ల కూడ చిరాసక్తలు కానట్లు మెఱుపులు కూడ లోక ప్రియమైన మేఘాలపట్ల స్థిరంగా ఉండటంలేదని మూలభాగవత కథనం.

శ్లో ॥ లోకబన్ధేషు మేఘేషు విద్యుతశ్చల సౌహృదాః ।
స్థైర్యం న చక్రుః కామిన్యః పురుషేషు గుణిష్వివః ॥ 10-20-17

ఇది కామినులకు ఎవరిపట్లా అనురాగం ఉండదని భావించే రుద్రటుడి భావానికి మూలం.[4] ఈ విషయంలో మూల భావాన్నే పోతన్న వివరించినా సంస్కృతంలోని 'కామినీ' శబ్దాన్ని 'మగువ'గా మార్చి సాధారణీకరించాడు. 'మీన నయనల మేనుల మెఱుంగు సొంపు

4 శ్లో॥ సాధారణ స్త్రీ గణికా సా విత్తం పర మిచ్ఛతి ।
నిర్గుణేఽపి నవిద్వేషో నరాగోఽస్యా గుణిన్యపి ।
శృంగారాభాస ఏవ స్యా న్న శృంగారః కదాచన ।
ఇతి ద్వ్యమంత ముద్దిశ్య ప్రాహ శ్రీరుద్రటః కవిః । భావ ప్రకాశనము. పుట. 206

పెంపు సైరింపక కంపించి, సురిగి తిరిగి చనియెడి కరణి మేఘమధ్యంబులో బొలసి, మలసి నిలువక మరలి చను గ్రొమ్మెఱుంగులును, మెఱుంగుల పగిది మగువలు పురుషులం దగిలి నిలువరని జనుల కెఱుంగ నలువ మొఱయిడిన తెఱంగున మెఱయు నుఱుములును' (10-754) అని కొనసాగించి మేఘ గర్జన కారణాన్ని వివరించాడు. మేఘ గర్జనం సహజంగా స్త్రీలకు విరహ వేదనాభార కారణం. ఇలా స్త్రీ సంబంధమైన విషయాన్ని ప్రస్తావించి నలువ ముఖంగా వెలువరించాడు. స్త్రీల చంచల స్వభావాన్ని ప్రకృతీకరించాడు.

వర్షకాలంలో సర్వత్ర భుజంగ విట వారకాంతా ప్రసక్తి చేసి ప్రకృతితో వారిని ఉపమించాడు. ఈ భావన వల్ల ఆ కాలపు ప్రజల ఆలోచనారీతులూ వారి శృంగార భావుకతా తీవ్రతలూ తేటతెల్ల మౌతాయి. అంతేకాక అనాటి సమాజంలో ఒక వేశ్యకు లేదా విటుడికి ఉండే గౌరవాదరాలూ వారిపట్ల ప్రజలకుండే ఆరాధ్యభావం విదితమౌతుంది. ప్రకృతికి సర్వశృంగార సమృద్ధమైన ప్రతిరూపంగా వారకాంతలు సంభావింపబడ్డారు. కనుక ఆ ప్రజలది నిశిత శృంగార దృష్టి, అదే వారి భోగదృష్టి.

వర్షకాలంలోని మేఘానికీ శ్రీకృష్ణునికీ బింబ ప్రతిబింబ భావాన్ని గంభీరంగా కల్పించాడు పోతన. ఆ ఇద్దరూ శృంగార ఉద్దీపకులే.

సీ ॥ విశ్వమోహన మైన వేణు నినాదంబు
        సరస గంభీర గర్జనము గాగ
    మహనీయ నిర్మల మందహాసద్యుతి
        లలిత సౌదామినీ లతిక గాగ
    దలచుట్టు బాగున దనరు పింఛపు దండ
        శైల భేదను శరాసనము గాగ
    గరుణా కటాక్ష వీక్షణ సుధావర్షంబు
        సలిల ధారా ప్రవర్షంబు గాగ

తే ॥ జాడ నేతెంచు గోపాలజన మునీంద్ర
    చాతకంబుల దురవస్థ జక్క జేసి
    కృష్ణ మేఘంబు బహుతర కీర్తి నొప్పె
    విమల బృందావ నాకాశ వీథియందు. 10-759

ఈ వర్ణనల్ని కథాగతిలో కలిపి కథను సౌందర్యోద్దీపితం కావించాడు పోతన. అలా చేయటం వల్ల భావికథలోని శ్రీకృష్ణుని శృంగార వర్తనం రమ్యంగా ధ్వనిస్తుంది. ఇలా తన ప్రకృతి దర్శన దర్శయితృ ప్రతిభతో శ్రీకృష్ణ మేఘాలకు అభేదాన్ని దర్శించి రసోల్లసితం కావించాడు భావుకకవి పోతనమహాకవి. ఇది భావికథా ద్యోతకం కావటం మరింత శోభాస్పదం.

# శరదృతువు

మూలభాగవతంలోని శరదృతు వర్ణనం మత లోకహిత నీతి విషయాలతో కూడి ఉపమా సాదృశ్య సంభరితంగా సాగింది. పోతన దానిని ప్రకృతి పరంగా పరమాహ్లాదకరంగా అటనట అంగనా విషయాల్ని పొందుపరుస్తూ ఉపమలతో ఉల్లేఖాలతో శ్రవణ సుభగంగా మనోరంజకంగా వర్ణనల పణ్యారం చేశాడు. ఐనా మొత్తంమీద మూలానువాదాలకు స్వాభావికంగా భేదం ఉంది.

పంట పొలాలకు కావలి ఉన్న కాపుకన్నెల కెమ్మోవులు బింబఫలాలుగా భ్రమించిన శుక నికరాల కలకలాలు - 'గజకుంభ కనకకుంభ రుచిర కుచభార భీరుమధ్య సమంచితలగు చెంచితల' (10-763) వంటి జానపద స్త్రీల విసర్గ సౌందర్యాన్ని సాక్షాత్కరింపచేశాడు పోతన. సంస్కృత భాగవతంలోని భగవత్సంబంధమైన ఫల విషయాల్ని[5] స్పృశించనేలేదు. స్త్రీ విషయిక రతిని పశుపక్ష్యాదుల రతితో కలిపి చెప్పటం రసోచితం కాదని కాబోలు స్త్రీ ప్రసక్తిని విడనాడి ఔచితిని పాటించాడు. ఇలా పోతన నవ్య శృంగార భావనా విధానానికి విధానం ఈ శరద్వర్ణనం.

వ॥ కుల వధూరత్నంబు చెలువున సదృష్ట పయోధరంబై ధరణీకిం దొడవగుచు శరత్కాలం (10-763) ప్రవేశించిందట. ఈ సంప్రదాయ వధూ ప్రశంస అతని అంతరంగిక శృంగార ఆశంస. ఇది ఆర్ష సంప్రదాయ సంజనిత సంభావన. ఈ కులవధూ స్వరూపంలోని స్తనగోపనమే పరమ సౌందర్యమనీ శృంగార సారస్యమనీ లోకాని కది ఆరాధ్యమనీ ప్రకటించాడు.

శరత్కాల సౌందర్యం విరహుల బాధల్ని అధికం చేస్తుంది. అప్పుడు సాయుధ సామగ్రితో సమాయత్తమై విరహులపై మకరధ్వజుడు ధ్వజమెత్తుతాడు -

కం॥ చేగ గల చెఱుకు వింటను
బాగుగ నీలోత్పలంబు బాణంబుగ సం
యోగంబు చేసి మదనుడు
వేగిరమున విరహిజనుల వేటాడె నొగిన్. 10-765

శరత్కాల సౌందర్య పర్యవసాన స్వారస్యం ఇది. 'న వినా విప్రలంభేన శృంగారః పుష్టి మశ్నుతే' అని కదా ఆలంకారికోక్తి. అందుకనే విరహులను ఇలా వేగిర పరచటం. అది వారి భావనా బలంతో, ఊహల డోలికల తూగులతో కోరికల్ని పరిపోషిస్తుంది. కనుకనే రసికులు విప్రలంభంలో శుచిమధురుచిని చవిచూస్తారు. అందులోనే అసలైన ప్రేమభావం

---

5 శ్లో॥ గావో మృగాః ఖగా నార్యః పుష్పిణ్యః శరదాభవన్ ।
అన్వీయమానాః స్వవృషైః ఫలై రీశ క్రియా ఇవ ॥ 10-20-46

కలకాలం నిలుస్తుంది. ఏతద్రహస్యవేత్త పోతన. ఆయన భావనలో మన్మథుడు విరహులను పెట్టని బాధ అంటూ ఏదీ లేదు. అలాగే శరత్కాలంలో నీలోత్పలాలు విరహులకు వేదన కలిగించటం సహజం - అది ఏతత్కాలోచితమని కవి సరస సంభావనం.

## శరన్నిశలు

రాసలీలారంభంలో పోతన్న శరన్నిశా విశేషాల్ని విపులీకరించాడు. అది రాసక్రీడకు 'రసపట్టు'.

చం ॥ కలువల మేలి కందువలు కాముని కయ్యపు బాళిముల్ విర
క్తులు తలడించు వేళలు చకోరక పంక్తుల భోగ కాలముల్
చెలువలు సైరణల్ విడిచి చిక్కు తఱుల్ ఘన చంద్ర చంద్రికా
జ్వలిత దిశల్ శరన్నిశలు జారకదుర్దశ లయ్యె నయ్యెడన్. 10-961

శరన్నిశలు శృంగార రస కందాయానికి మూలకందాలు. కనుకనే శరన్నిశలే గోపికా జనానికి ఉత్తేజాన్ని ఉల్లాసాన్ని సంతోషాన్నీ సమకూర్చాయి. అప్పటి ఆ ప్రకృతి వారి అంతర ప్రకృతిని ప్రేరేచింది. ఆ రాత్రులు కలువల కనుకూలాలు. అవి కాముడి జైత్రయాత్రకు విడిసిన కామకళా కదన రంగాలు, విరక్తులకూ జారులకూ బాధాకరాలు. కినుకలు వీడి కాంతలు తమ కాంతుల కౌగిళ్లలో కరిగే కమనీయ ఘటికలు. ఇలా రాసలీలా విలాసానికీ మన్మథ సామ్రాజ్య ప్రాభవానికీ అటపట్టై అహ్లాద జనక సమయాలై కామతంత్రటీకలై శరద్రాత్రులు ప్రకాశించాయి. ఇది వక్ష్యమాణ రాసలీలా విలాస విహార నేపథ్య వర్ణనం.

పున్నమ చంద్రుని రాక అష్టాదశ వర్ణనలలో ప్రధాన మయింది. దానిని ఒక్కొక్క కవి తన భావనా బలంతో ఊహాపోహలతో సొంతం చేసుకున్నాడు. ఇలా పోతన కావించిన చంద్రోదయం రాసలీ లానుకూలంగా విలసిల్లింది.

ఆ ॥ కామతంత్రటీక కలువల జోక కం
దర్పు డాక విటుల తాల్మిపోక
చకిత చక్రవాక సంప్రీతి జనలోక
రాక వచ్చె మేలు రాక యగుచు. 10-962

ఇలా ఈ చంద్రోదయం సర్వరాస సంబంధ సంబంధి. కాముకులకు కోరికలు రేపే క్రొత్త భాష్యాలు బోధిస్తుంది. రాస బంధాల్ని నేర్పిస్తుంది. అలా గోపికలను శ్రీకృష్ణునితో కలుపుతుందని పోతన భావం. రాసలీలా ఘట్టానికి ఇదొక సంక్షిప్త భాష్యం. భావికథా సూచకం.

ప్రాకృతీ నిశాపతులను అనురాగ దంపతులుగా చిత్రించే ఈ సన్నివేశ వర్ణనం సంస్కృత భాగవత[6] సన్నిహితం.

కం॥ పతి తన కరముల కుంకుమ
సతి మొగమున నలదు భంగి సముదయ వేళాం
చిత కరరాగమున నిశా
పతి రంజించెన్ నరేంద్ర ! ప్రాకృతి మొగమున్. 10-963

ఇట ప్రతిసతీ తన పతి నుండి కోరుకొనే అనురాగాన్ని పతులు ఎలా అందించాలో అందులో వారి ప్రసాధన కెలా సహకరించాలో సూచించాడు. దానితోపాటు అనంతర కథలో తన కిరణాలతో చంద్రుడు ప్రాకృతిని ఆకర్షించినట్లే భావికథలోని శరద్రాత్రిలో గోపికల నందరినీ శ్రీకృష్ణుడు తన అనంతరూపాలతో సమాదరిస్తాడని కూడా ధ్వనింపచేశాడు.

చంద్రోదయం విరహుల పరంగా వివిధ భంగిమలలో ఊహించి కావించిన ఉల్లేఖనం పోతన భావ జనిత ఖేలనం. ఆనాటి గోపికలంతా విరహిణులే. ఆ గోపికా చకోరాలు ఉబ్బగా వచ్చిన చంద్రుడే శ్రీకృష్ణుడు (10-964). చంద్రోదయాన్ని గమనించిన పరమాత్మ జగన్మోహనంగా ఒక్క గీతాన్ని ఆలపించాడు. ఈ సందర్భంలో పోతన తగురీతిని మూలభావ పరిపోషణతో స్వతంత్రరీతిని శరన్నిశలలో చంద్రోదయాన్ని విరహిజన తాప వివర్ధనంగా శృంగారకళా విలాసంగా సురుచిరంగా చిత్రించాడు. హృదయమోహనమైన ఈ శరన్నిశల లోని శ్రీకృష్ణుని వేణుగానం గోపికల్ని పంచబాణ భల్ల భగ్న హృదయలుగా చేసింది, వారి ఉద్దీపనకు దోహదమయింది.

ఇది పోతన శరత్కాల చంద్రికా సదృ శాచ్ఛ శృంగార రస వ్యక్తీకరణ విధానం.

## హేమంత ఋతువు

'హేమన్తే ప్రథమే మాసి' (10-22-1) అని మాత్రమే మూలంలో హేమంతాన్ని గూర్చిన ప్రస్తావన కన్పిస్తుంది. తదాధారంగా నవ్య కల్పనలతో నవరత్న ఖచిత పద్య శిల్పాన్ని పోషించాడు పోతన. అందులో కామ భావ ప్రసక్తమైన కమనీయ పద్యపంచకం వుంది. అది అంతా సీమంతవతీ శృంగార శ్యామంతికమే.

హేమంతంలో వికసించే చేమంతులు ఇంతుల ముఖాలను పరమ శోభా శ్రీమంతంగా చేస్తాయి.

కం॥ శామంతికా స్రగంచిత
సీమంతవతీ కుచోష్ణజిత శీతభయ

---

6 శ్లో॥ తదోడురాజః కకుభః కరైర్ముఖం, ప్రాచ్యా విలుంప న్నరుణేన శన్తమైః ।
న చర్షణీనా ముదగాచ్ఛుచో మృజన్, ప్రియః ప్రియాయా ఇవ దీర్ఘదర్శనః ॥ 10-29-2

శ్రీమంతంబై గొబ్బున
హేమంతము దోచె మదను డేచె విరహులన్. 10-796

హేమంతపు టాధిపత్యానికి పట్టిన ఛత్రం ఈ తొలి పద్యం. స్తన సౌందర్యాన్నీ హేమంతంలోని వారి ఔద్ధత్యాన్నీ ఇది ఉత్కర్షిస్తుంది. ఇది సాలంకారలైన సీమంతినీ లోకం పట్ల లోకానికున్న ఆలోకనం. ఇది కామభావ ప్రేరకం. గాఢ పరిరంభ కారకం. స్తనాల వేడిమిని వర్ణించటం హేమంత ఋతువర్ణన ధర్మమనీ అలా వర్ణించాలనీ విన్నకోట పెద్దన సూచనం.[7] స్తనయుగం ఉష్ణకాలంలో శీతలంగాను శీతకాలంలో ఉష్ణంగాను ఉంటుందని కదా ! రతిపండిత లోకోక్తి.[8] పోతనోక్తి కూడ తదుక్తి యుక్తమే !

'పొత్తు జరిగె మిథునముల'కు (10-797) అని పోతన ఋతు సహజ రతిని సూచించాడు. హేమంతంలో ప్రేమికులు చలికి దొరికిపోతారు. ఇద్దరొకటౌతారు. చివరికి చలిని పారద్రోలుతారు. అన్నుల మిన్నుల చన్నుల దండ ఉండటంతో ప్రజలు విపన్నులు కాకున్నారట. కాకుంటే ఆపన్నులు కాకుండటం బ్రహ్మాదుల వశం కూడ కాదట. (10-799). చలికి వెఱచిన త్రిమూర్తులు కూడ స్త్రీమూర్తుల నాశ్రయించటం ఇందుకేనట.

శా ॥ ఈ హేమంతము రాక జూచి రమణీ హేలాపరీరంభ స
త్సాహాయ్యంబునగాని వీని గెలువన్ శక్యంబు గాదంచు దా
రూహాపోహవిధిం ద్రిమూర్తులు సతీ యుక్తాంగు లైనారు గా
కేహో ! వారలదేమి సంతత వధూ యోగంబు రా గందురే. 10-803

శృంగారరస లోకంలో పోతన వెలిగించిన దేవతా శృంగార మంగళ మణిదీపం ఇది. హేమంతంలో సీమంతుల గాఢోపగూహనాలే రసికులకు పరమౌషధాలని పోతన భిషగ్వర్యుని నిదానం.

శ్రీ హరి హేమంత బాధ భావికథా సూచనం.

కం ॥ ఈ హేమంతము రాకకు
శ్రీహరి యుక్కింత వణకి చింతింపంగా
నోహో వెఱవకు మనుచు
న్నాహరికిని శ్రీ కుచంబు లభయం బిచ్చెన్. 10-804

తర్వాతి కథలో గోపికలాచరించ బోయే కాత్యాయనీ వ్రతకామిత ఫలం ఇదే. ఇలాగే గోపికలు కూడా గోపాలుడిని తమ గాఢోప గూహనాలతో ముంచెత్తుతారని భావం.

---

7 కావ్యాలంకార చూడామణి, పుట. 3-107

8 శ్లో॥ కూపోదకం వటచ్ఛాయా తాంబూలం తరుణీకుచం ।
శీతకాలే భవేదుష్ణం ఉష్ణకాలేతు శీతలమ్ ॥

సర్వేసర్వత్ర హేమంతంలోని సీమంతినుల పయోధరాల ప్రౌఢతనూ పరిష్వంగాల పారీణతనూ ప్రవచించి ఏదో ఒక విశేష కల్పనం చేయటం పోతన సహజ శృంగార పాండిత్యానికి పరిపాటి. భరతాదుల మతమూ ఇదే. స్త్రీ సౌందర్యానికి ప్రధాన మండపం ఆమె స్తన మండలం. స్తనాలు కళాస్థానాలు, శృంగార రస కలశాలు, మదనోద్దీపకాలు. అందుకే పోతన ఏతద్వర్ణనంలో సిద్ధహస్తుడు. ఇలా ఈ కుచతట వర్ణనం రసిక జనమనోరంజనం. కనుకనే రీతి భేదమున్నా శ్రీనాథ పోతన్నలలో పోలిక లున్నాయి. ఒక్కొక్కఋతువులో ఒక్కొక్క విధంగా స్త్రీ సౌందర్య విశేష ప్రస్తావనల పారమ్యం గమనార్హం. అందులోని పోకడ పోతన భాగవత లక్ష్యం శృంగార రస పరిపోషణమే అని పరిష్కరిస్తుంది.

ఇలా అతని హృదంతర్గత శృంగార రసధుని వివిధ ఋతువర్ణనల ముఖంగా పరవళ్లు త్రొక్కింది.

## సూర్యాస్తమయం

బలరామ కృష్ణులు మధురానగరంలో విహరించి విడిదలకు వెళ్లిన వర్ణనం మూలభాగవతంలో అతి సంక్షిప్తం. 'అదిత్యేస్తముపేయివాన్' (10-42-23) సూర్యుడస్త మింపగా అని ఉన్న ఈ చిన్న వాక్యం పదకొండు పద్యాల లఘు కావ్యంగా సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనలుగా పరిణమించటం పోతన భావశాలితకు పరమోదాహరణం. ఈ ప్రకృతిని శృంగార రసలోక ప్రవృత్తికి ముడిపెట్టటం శృంగార కవి పోతన కున్న ఏతద్రసాభిమాన పర్యవసానమే. అది అతడి ప్రత్యేకత. అయన కావించిన ఈ సూర్యాస్త మయ వర్ణనం శృంగార చేతోమోదం.

కం॥ తరుణుడగు శీతకరునిన్
మరగి వియల్లక్ష్మి తన్నుమాని ముదుకడున్
ఖరకరుడు ననుచు త్రోల్చిన
కరణిన్ రవి పశ్చిమాద్రికడ గ్రుంకె నృపా ! 10-1288

ఆ రేరాజును చూచిన కళ్లకు తన మొగుణ్ణి చూస్తే మొట్టబుద్ధి పుట్టింది ఈ వియల్లక్ష్మికి. వగలాడికి ముసలాతడు తోడైతే వాని చింత ఇంతంతా? అనే అర్యోక్తి కిది నిదర్శనం. ఈ సన్నివేశం దుష్టుడైన కంసుని వధను సూచిస్తుంది. ఆ పురప్రజలు కృష్ణాగమనానికి నిరీక్షిస్తున్నారని ధ్వని. తరుణీలోక రసభావనకిది ప్రతిధ్వని.

ఇక లోకంలో వగలాడులేకాదు, అనురాగ వతులూ సాధ్వీమతల్లులు కూడా ఉన్నారనీ వారు కమలజాతి వారనీ సూచించే సందర్భంలోని కమల వర్ణనం గమనార్హం.

ఆ॥ కళలు కలుగుగాక కమల తో డగు గాక
శివుని మౌళి మీద జేరుగాక

సన్న్యా న్నొల్ల దపనుడైన మత్పతియని
సాధ్వి భంగి కమల జాతి మొగిడె. 10-1289

దుష్టులూ దుర్మార్గులూ అయిన తమ భర్తలు పెట్టే బాధల్ని పరమ సాధ్వులైన స్త్రీలు ఆనందంతో అనుభవిస్తారేగాని, సర్వగుణ సంపన్నులైనా శృంగార స్వరూపులైనా ఉన్నతులైనా ఉన్నవారైనాసరే పరపురుషుల్ని పొరపాటునకూడ కన్నెత్తి చూడరు. ముఖం ముడుచుకుంటారు ముకుళించిన కమలం లాగా.ఈ అనల్ప కల్పనా నైపుణి రమణీయం.

పై పద్యద్వయ భావంలో వనితా మనస్తత్త్వ తారతమ్యాన్ని నిరూపించాడు పోతన. ఇలా ప్రకృతిలోని అంశాల్ని నాయికా నాయకపరంగా నిరూపించిన సూర్యాస్తమయ వర్ణన నైపుణ్యం కవి శబ్దాన్ని సార్థకం చేస్తున్నది.

## తమోవర్ణనం

సూర్యాస్తమయ చంద్రోదయాల సంధి సమయం తమస్సు. అది పరమ శృంగార వైభవ చిహ్నమైన కస్తూరి కలయంపిగా పోతన కమనీయ భావన.

క ॥ ఎల్ల దిశలు నిండిన శ్రీ
వల్లభు గుణమహిమ బ్రహ్మ వాసించుటకై
చల్లిన మృగమద మనగా
వెల్లివిరిసె దమము గగన వీథుల నెల్లన్. 10-1292

కస్తూరికి బహువ్యాపక శక్తి ఉంది. దాని పరిమళపు గుబాళింపు మధుర హృదయాలను పులకింపచేస్తుంది. రసిక హృదయాలను శృంగారోద్దీపితం చేస్తుంది. శరీరానికి కాంతి నిస్తుంది. సంభోగ శక్తిని ఇనుమడింప చేస్తుంది. కస్తూరీమృగం నాభి నుండి వెలువడే ఈ సుగంధ ద్రవ్యానికి తాంబూల సేవనంలో ఉన్నత స్థానం ఉంది. శ్రీమంతులు వైభవ చిహ్నంగా వీథుల్లో కస్తూరీ జలాన్ని కలయంపి చల్లటం వసంతోత్సవాలు జరిపిన రాజుల కాలంలో జరిగింది. ఈ విధమైన శృంగార జీవనంలో కస్తూరికి అధిక ప్రాముఖ్యం ఉంది. కనుకనే ఆంధ్ర కవిలోకం దీన్ని విస్మరించకుండా వర్ణించింది. పోతన సహజ శృంగారకవి కనుక దానిచేత ప్రభావితుడు కావటం అతి సహజం.

## చంద్రోదయం

చంద్రుడిని ప్రాచీదిశాంగనా సిందూర తిలకమనీ విరహుల ధైర్యవల్లరుల్ని త్రెంచే దాత్రం అనీ (10-1295) వర్ణించటంలోని శృంగార భావన గమనార్హం. సిందూరం శృంగార సంబంధి. అనురాగ రసరంజని. కమల భవాండం అంతా వెన్నెలతో వెల్లివిరిస్తూ కర్పూరపు కుప్పలాగా తోచింది పోతనకు.

కం॥ దర్పిత తారాధిప పరి
సర్పిత కిరణౌఘ మిళిత సకల దిశంబై
యేర్పడి కమల భవాండము
కర్పూరపు గ్రోవిభంగి గనుపట్టె నృపా ! 10-1296

ఈ కర్పూరం కాముకులు తమకాంతల కిచ్చే శృంగారోద్దీపక అనురాగ పురస్సర బహుమానం. అందుచేతనే పోతన కంతటి అభిమానం. ఇది రసికుల తాంబూల చర్వణోపయుక్త సామగ్రిలో అగ్రగణ్యం.

## సూర్యోదయం

ఆ తర్వాతి సూర్యోదయ వర్ణనంలోని శృంగార కిరణజాల కాంతిరేఖలు సమస్తం అమూలకాలు. 'వ్యుష్టాయాం నిశి కౌరవ్య సూర్యేచాద్భ్యః సముత్థితే' (10-42-32) రాత్రి గడిచి పోగా సూర్యుడు తూర్పు సముద్రం నుండి పైకి వచ్చాడని మాత్రమే ఈమూల శ్లోక భావం. ఇందులో శృంగారచ్ఛాయ ఏదీ గోచరించదు. కానీ తర్వాతి పద్యషట్కంలో ఇది శృంగార భావ సముల్లసిత మయింది పోతన చేతిలో. ఈ వర్ణనంలోని భానూదయం పోతన శృంగార భావనకు మహోదయం.

సీ॥ పశ్చిమ దిక్కాంత బరగ గైసేయుచో
ముందర నిడుకొన్న ముకుర మనగ 10-1303

ఉదయాద్రి మీద ఉదయించే భానుడు పశ్చిమ దిక్కాంత పట్టిన ముకురం. ఆ ముకురం అతివలు ప్రియుడికోసం అందచందాలు రూపు దిద్దుకొనే సాధనం. స్త్రీలోకం తమ అంద చందాల నన్నింటినీ సింగారించుకొనేది తమ ప్రియుల కోసమే కదా! 'స్త్రీణాం ప్రియాలోక ఫలోహి వేషః' అనే ఆర్యోక్తి సారం ఇదే. సూర్యుడు పద్మినీ కాంతనోము ఫలం. పుణ్యం కొద్దీ పురుషుడని కదా నానుడి. అన్నిటికీ మించి రవి బింబం కోపతాపోపశమన ఘుటికగా భావించి (10-1303) ప్రణయ విరహ విషయాల్ని స్పృశించింది.

పద్మ మరందాలు క్రోలే తుమ్మెదలూ సౌరభాలు విరజిమ్మే పిల్లగాలులూ అన్నీ ప్రాతః ప్రకృతిలోని పరమ రమణీయ శృంగారోద్దీపకాలు (10-1301). అలాగే బాలభానుని భానువులు సోకిన బ్రహ్మాండం కుంకుమ సలిలపు క్రోవిలా కొమరొప్పింది (10-1305). పోతన తన సుకుమార భావాలతో శృంగార సౌధ శిఖరాల నధిరోహించి అటనుండి భావుక లోకానికి శృంగార భానూదయాన్ని దర్శింప చేశాడు. ఈ వర్ణనలో యుగకర్త అయిన శ్రీనాథ కవిసార్వభౌమునితో పోతనకవి ఎంత రమ్యంగా స్పర్ధవహిస్తాడో రసిక పాఠకులు గ్రహించగలరు.

ప్రకృతి సౌందర్యంతో పరవశించిన పోతన శృంగారాత్మ అపార ప్రతిభా విశేషాల్ని బహుముఖీనంగా ప్రదర్శించింది. వర్ణన సమయంలో ప్రకృతి సమస్తం ప్రణయ పరత్వంగా

భావించాడు పోతన. దానినుండి ప్రణయ మంత్ర సిద్ధిని పొందాడు. కనుకనే ప్రకృతి అంతా శృంగార ప్రవర్ధక ప్రసాధన సామగ్రీ సంభరితంగా కనిపించిం దాయనకు. ఆయన తన శృంగార భావనాలోకంలో భావుకలోకాన్ని తన వెంట త్రిప్పుతాడు. ఆనంద మరందాల నందిస్తాడు. ఈ సన్నివేశాలే కవుల్ని శృంగార శృంగాగ్రాన నిలిపేది. అవే ఆయా కవులను 'రసిక భావవిదుల' హృదయాలలో శృంగార కవులుగా చెరగని ముద్రవేసేవి. అలాటి వారికే లోకంలో చక్కని గౌరవాదరాలు దక్కేది. ఏతత్కారణంగానే వర్ణనలలో పోతన శృంగార ప్రకృతి ప్రస్ఫుటంగా ప్రతిఫలించింది. శృంగారకవిగా ప్రతిఫలం లభించింది.

# స్తుతిగత శృంగారం

స్తుతి పదానికి ప్రార్థన ప్రశంస పొగడ్త గీతి నతి నుతి వినుతి స్తవం కీర్తనం అనే అర్థాలను నిఘంటువులు పేర్కొన్నాయి. ప్రతాప విభూతి మూర్తి గుణ కీర్తనాదిక స్తుతివల్ల ఇష్టకార్యసిద్ధి చేకూరుతుంది. దీన్ని భగవత్ స్తుతికే పరిమితం చేశారు ఆదిశంకరులు[9]. కానీ వ్యక్తుల పొగడ్తలకు కూడా సాహిత్యంలో దీనికి తావుంది. స్తుతులలో వారి వారి శృంగార లీలలను కీర్తించటం కూడ కద్దు. అది వారి రసహృదయాలను దోచుకొనే యత్నమే. అందుకు భాగవతమే ప్రథమనిదర్శనం. లలితా సహస్రనామాలు శ్యామలా దండకం సౌందర్యలహరి కనకధారాస్తవం గీతగోవిందం కృష్ణ కర్ణామృతం వేంకటేశ్వర స్తోత్రం వంటి వాటిలో కూడ సుకుమార శృంగార స్పర్శ ఉంది.

శ్లో॥ కమలా కుచ చూచుక కుంకుమతో
నియతారుణితాతుల నీలతనో ।
కమలాయతలోచన లోకపతే
విజయీభవ వేంకట శైలపతే ॥ వేంకటేశ్వర స్తోత్రం శ్లో. 1.

కృష్ణకథా సాహిత్యంలో అనల్పంగా ఉన్న స్తుతిగత శృంగారం భాగవతంలో అనంతంగా గోచరిస్తుంది. అందులో కొన్ని భావాలు వ్యాసప్రోక్తాలైతే మరికొన్ని పోతన ప్రోక్తాలు. 'స్వభావము చేత పోతన భావకవి. అందువ భక్తి శృంగారములు వర్ణించు పట్టున అతి మాత్రమునకు పాల్పడు భావలోలుడు. ఆ ఘట్టములో ప్రత్యక్షరమునను ఆయవ ఆత్మ భావమే ప్రతిఫలించుచుండును'[10] అని పింగళివారి అభిభాషణం. పోతన

---

9 శ్లో॥ నమస్కారస్తథాశీశ్చ సిద్ధాంతోక్తి పరాక్రమః ।
విభూతిః ప్రార్థనాచేతి షడ్విధం స్తోత్రలక్షణం

10 భాగవత వైజయంతిక, పుట. 92

భాగవతంలో పాత్రగత అవస్థా భేదాల్ని బట్టి అనేక స్తుతిభేదాల్ని గుర్తించవచ్చు. అన్నింటిలోనూ శృంగారం కంఠదఘ్నంగా కన్పిస్తుంది.

భాగవతంలో భగవత్ భర్తృ ప్రియ ప్రియసఖీ ప్రకృత్యాది బహుముఖ స్తుతిగత శృంగారాన్ని సందర్శించవచ్చు.

## భాగవత కల్పతరు స్తుతి

కల్పవృక్షం కామిత ఫలాన్నిస్తుంది. భాగవత కల్పవృక్షం కోరిన ఫలరసాల నందిస్తుంది. అలాగే భావుకుడు శృంగారరస ఫలాన్ని భావిస్తే దాన్నే ప్రసాదిస్తుంది పోతనగారి 'భాగవతాఖ్య కల్పతరువు'.

మ ॥ లలిత స్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతా శోభితమున్ సువర్ణ సుమన స్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాలవాలంబు నై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్విజ శ్రేయమై. 1-20

శృంగార పరంగా పై పద్యాన్ని ఈ క్రింది విధంగా సమన్వయించవచ్చు.

| | | |
|---|---|---|
| భాగవతాఖ్య కల్పతరువు | : | భాగవతమనే కల్పవృక్షం |
| లలిత స్కంధము | : | కామోత్కంఠమైన గోపికాది స్త్రీజన కళాస్థానాలుగా పరిగణింపబడే అంస భాగాలు కలదీ |
| కృష్ణమూలము | : | ఆ గోపికలకు శ్రీకృష్ణుడు ఆలంబనంగా గలదీ |
| శుకాలాపాభిరామంబు | : | ఉద్దీపన విభావాలైన శుకపికాల కలస్వనాలతో అందగించినదీ |
| మంజు లతా శోభితమున్ | : | నాయికా సదృశమైన పూలతీవలతో సుమనోజ్ఞంగా విరాజిల్లు తున్నదీ |
| సువర్ణ సుమనః | : | మంచి రంగుకలిగినవీ మన్మథ బాణాలవంటివీ అయిన పూలు గలిగినదీ |
| సుజ్ఞేయమున్ | : | పై ఆలంబన ఉద్దీపనాలతో ఆస్వాదింప దగినదీ |
| సుందరోజ్జ్వల వృత్తంబు. | : | ఆదరణీయమైన, శృంగార రసనిర్భర మైన కథ గలదీ |
| మహాఫలంబు | : | అఖండ రసానందమే ఫలంగా గలదీ |
| విమల వ్యాసాలవాలంబు నై | : | స్వచ్ఛమైన శృంగార రస భేదాలకు నిలయమైనదై |

| | | |
|---|---|---|
| సద్విజ శ్రేయమై | : | సహృదయులకు మేలు కలిగించేదిగా |
| ఉర్వీన్ | : | జగత్తులో |
| వెలయున్ | : | విరాజిల్లుతుంది. |

ఇలా బమ్మెర పోతన ఆంధ్ర మహా భాగవతాన్ని సహృదయులకు పరిచయం చేసిన పద్యంలో శృంగార రసాన్నే నిక్షేపించాడు. దృశ్య కావ్యాల్లోని నాందీ ప్రస్తావనల లాగా వసంత ఋతువర్ణన సదృశమైన ఈ పద్యంచేత భాగవతంలో శృంగార రసాన్నే సూచించాడు.

## సరస్వతీ స్తుతి

దేవతా వర్ణనంలో పోతన దొక నవ్యభవ్యరీతి. దేవతాస్వరూప నిరూపణంలో కూడ శృంగార రసస్ఫూర్తిని కల్గించటం ఆ సహజపండితుడి నైజం. దానితో గుణ సమ్మేళనం కూడ చేయటం వల్ల ఆదేవతలు సౌందర్యమూర్తులుగా దృగ్గోచరమవుతారు. సౌందర్య మంటే నామ రూప గుణ సౌందర్యాదికమే కదా !

ఈ విషయంలో పోతన భాగవతంలోని వాణీ విధాతల స్తుతి సర్వాంగ సుందరం. బ్రహ్మను 'భారతీ హృదయసౌఖ్య విధాత'గా భావించాడు పోతన. ఇక్కడే ఉంది అసలైన దాంపత్యోపనిషద్రహస్యం. భర్త ఎప్పుడూ భార్య హృదయ రహస్యాన్నెఱిగి కరిగించాలని సూచన. సరస్వతిని 'తోయజాత భవచిత్త వశీకరణైక వాణి' గా చెప్పటంలో మాటా మన్న నలతో భర్త మనస్సును వశం చేసుకొనే నేర్పు భార్య కుండాలనీ సూచించాడు. అలాంటి కాపురాలలోనే అవధులు మీరిన ఆనందం కాపురముంటుంది. వాణిలాగానే ప్రతి నారీమణీ స్వాధీన పతిక కావాలని ఆ కవివర్యుని ఆకాంక్ష. సరస్వతీదేవిని గూర్చి ప్రత్యేకంగా -

ఉ ॥ క్షోణి తలంబు నెన్నుదురు సోకగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికి జంచరీకచయ సుందరవేణికి రక్షితానత
శ్రేణికి దోయ జాతభవ చిత్త వశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామ శుక వారిజ పుస్తక రమ్యపాణికిన్. 1-6

అని స్తుతించటం సురుచిర శృంగారరస సరణి. ఆమె సైకతశ్రోణి సుందర వేణి. ఇది ఆమె ఆంగిక శృంగారం. తోయజాత భవచిత్త వశీకరణైకవాణి. ఇది వాచిక శృంగారం. శుక వారిజ పుస్తక రమ్యపాణి అన్నపు డిది ఆహార్య శృంగారం. ఏవం విధంగా త్రివిధ శృంగారరస స్వరూపిణియైన సరస్వతిని తాను సందర్శించి సహృదయులకు సందర్శనీయం కావించాడు. ఏతద్రసమూర్తిని నిత్యం సాక్షాత్కరింప చేసుకొనే వాక్కును తనకు ప్రసాదింపమని ఆకవీశ్వరుని నిత్యాభ్యర్థనం. ఈ పద్యంలో గోపికాశృంగారం వారి విరహం రెండూ ధ్వనిప్రాయంగా కనిపిస్తాయి, వినిపిస్తాయి.

## శ్రీరామచంద్ర దర్శనం

పవిత్ర గంగా తరంగిణీ తీరంలో పోతనకు దర్శన మిచ్చిన శ్రీరాముడు 'మెఱుగు చెంగట నున్న మేఘంబు కైవడి నువిద చెంగట నుండ నొప్పు వాడు (1-14). ఆయన సీతారాముడు.

స్కంధాద్యంత పద్యాలలో సైతం పోతన గారికి సీతామనోభిరాముడే ప్రత్యక్షమౌతాడు. ఆ రాముడు 'జానకీ చిత్తచోరుడు (1-525) 'జనకసుతా మనో విమల సారస కోమల చంచరీ' కుడు (3-1043). 'శ్రీవిలసిత ధరణీ తన/ యా వదన సరోజ వానరాధిపుడు' (4-1), 'వర జనక సుతాభిషంగుడు,' (4-973), 'రసా తన/యా హృదయాబ్జ రంజనుడు' (7-482), 'జనక సుతా హృచ్చోరుడు'. (9-734) ఈ విశేషణాలన్నీ జానకీరాముని ప్రేమాంచిత హృదయానికి ఏకపత్నీ వ్రతానికి వారి అమలిన దాంపత్య శృంగారానికీ ప్రతీకలు.

శ్రీరాముడు 'సుందరీ శంబరారి' (4-974) 'సుందరీ మానహారి' (9-735) కూడ. కానీ సౌందర్యం మనోహరత్వం ఆయన సౌశీల్యం ముందు తలవొగ్గాయి. అవి అన్నీ ఆయన ఏకపత్నీవ్రతానికి వన్నె తెచ్చాయి. ఇలా పోతన గారి శ్రీరాముడు సుందర రాముడు శృంగారాభిరాముడు జానకీరాముడు.

## షష్ఠ్యంతాలు

షష్ఠ్యంతాలలో నాయక సంబంధమైన ఇతర లక్షణాలతో పాటు శృంగార విశేషణ షట్కం కూడ గోచరిస్తుంది భాగవతంలో. వీటివల్ల పోతనగారి శృంగార తత్త్వ పరిపోషకత్వం వెల్లడౌతుంది. ఆయన అక్కడక్కడ నిక్షేపించిన శబ్ద దీపాలవల్ల ఆపద్య సౌధాలన్నీ ప్రకాశిస్తాయి. హారి (కి) (1-27) మనోహర సౌందర్యమూర్తికీ, పీత వస్త్ర పరిధాయి (కి) (1-30) పీతవర్ణం అద్భుత రసానికీ శక్తికీ నిదర్శనం, అట్టివస్త్రాన్ని ధరించిన వాడికీ, గోపికానివహ మందిరయాయి (కి) (1-30), గోప నితంబినీ మనోహారి (కీ) (1-27) కాముకులు ఏకాంతంగా కాంక్షించే సురతమర్దనం వల్ల బడలిక చెందే పిరుదులున్న గోపస్త్రీల మనస్సులను ఆనందింపచేసేవాడికీ, రుక్మిణీ మనస్థాయికి (1-30) రుక్మిణి మనసులో స్థిరంగా ఉన్నవాడికీ, శేషశాయి (కిన్) (1-30) భోగ పరాకాష్ఠకు సంకేతమైన ఆదిశేషుడు పాన్పుగా గలవాడికీ తన భాగవతాన్ని సమర్పించాడు పోతన. రుక్మిణిలోను వ్రేతలందరిలోను కృష్ణుడు భోగించాడని సూచించాడు. ఇది శృంగారనాయక స్తుతిగతమైన పోతనగారి శృంగార స్ఫూర్తికి సురుచిర నిదర్శనం.

## కుంతీకృత శ్రీకృష్ణస్తుతి

సాగరాన్ని చేరే పవిత్ర గంగానదీ ప్రవాహ వేగంలాగా పరమేశ్వరుని చేరాలనే తొందర కుంతీ స్తవంలో కన్పిస్తుంది.

శా ॥ శ్రీకృష్ణా ! యదుభూషణా ! నరసఖా ! శృంగార రత్నాకరా !
లోకద్రోహి నరేంద్ర వంశదహనా ! లోకేశ్వరా ! దేవతా
నీక బ్రాహ్మణ గోగణార్తి హరణా ! నిర్వాణ సంధాయకా !
నీకున్ మ్రొక్కెద ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ ! 1-199

శ్రీకృష్ణుడు శృంగారరస పరిపూర్ణుడు. శృంగారరస వాహినులన్నీ ఆ శృంగార రత్నాకరునిలో జేరి సార్థకత భజించుకొన్నాయని కుంతి పాత్రపరంగా పోతనగారి భావన. ధార్మిక ఆర్థిక కాముక మోక్షాదిక శృంగారరసవాహినులన్నీ ఆ రససముద్రంలో విలీనమై సార్థకత భజించుకొన్నట్లు సంభావించవచ్చు.

భాగవతగత కథలన్నీ సముద్రగత వివిధ జంతు స్థాయికి చెందినవి. కాగా శ్రీకృష్ణ గాథ మాత్రం అగాధసముద్ర గర్భంలో గుప్తంగా ఉన్న అనర్ఘ రత్న సమూహం. ఏతద్రసా విష్కారమే రసానుభూతికి పరాకాష్ఠ. ఏవంవిధానేక రస విస్ఫూర్తి 'శృంగార రత్నాకరా!' అనే సాభిప్రాయ సంబోధనంలో భావుక హృదయానికి కల్గుతుంది.

# భీష్మకృత కృష్ణస్తుతి

యుద్ధరంగంలో శ్రీకృష్ణుడి శృంగార స్వరూపాన్ని సందర్శించి పరవశించాడు భీష్ముడు. అపై తన చిత్తాన్ని మొత్తాన్నీ మనీషాయత్తం చేశా డాయన.

మ॥ త్రిజగన్మోహన నీలకాంతి తను వుద్దీపింప ప్రాభాత నీ
రజ బంధుప్రభ మైన చేలము పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజ సంయుక్త ముఖారవింద మతి సేవ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడు వన్నెలాడు మది నావేశించు నెల్లప్పుడున్. 1-217

ఇక్కడ భీష్ముడు సందర్శించిన శ్రీకృష్ణుడు (1-217) 'వన్నెలాడు' అంటే 'పచ్చిశృంగారి' అని భావం. అట్టి ఆ శృంగార స్వరూపమే తనను ఆవేశించాలని కోరుకున్నాడు భీష్ముడంతటి ఘోటక బ్రహ్మచారి. ఇలా భావించటం శృంగార మాధుర్యానికి పరాకాష్ఠ. ఇందులో శ్రీకృష్ణుడు ఉద్దీపన విభావం.

శ్రీకృష్ణుడి ఆ శృంగార రూపం తనకు జన్మరాహిత్యాన్ని కల్గిస్తుందని భీష్ముడి నమ్మకం. గోపికా కృష్ణుడిగానే భావించా డందుకనే. వారు వలచి వలపింప నేర్చిన వనితలు గదా !

కం॥ పలుకుల నగవుల నడపుల
నలుకల నవలోకనముల నాభీరవధూ
కులముల మనముల తాలిమి
కొలుకులు వదలించు ఘనుని గొలిచెద మదిలోన్. 1-223

గోపికల విరహతాపాన్ని పోగొట్టిన శ్రీకృష్ణుడి దివ్యమంగళ శృంగార విగ్రహాన్ని భావించి పదాల పోహళింపుతో అతడి ఆ శృంగార మూర్తిని చిత్రీకరించి దర్శింపజేశాడు. ఇలా ప్రతిపద రస నిష్యందంగా మూలవాణి[11] కి మెరుగులు దిద్దటం పోతన శ్రీకృష్ణుడికి చేసిన అధికాధిక సురుచిర శృంగార చందనచర్చ మాత్రమే.

## బ్రహ్మకృత విష్ణుస్తుతి

మానవ మనస్సు చంచలం. కనుకనే మానవుడి విషయంలో లక్ష్మి సదా చంచలంగా ఉంటుంది. మాధవుడి మానసం అలాంటిది కాదు స్థిరమైంది. అందువల్లనే ఆమె ఆయన చెంతనే స్థిరంగా నిత్యసేవా నిమగ్నంగా ఉంటుందని బ్రహ్మ కీర్తించాడు.

తే ॥ చిర శుభాకార నిత్యలక్ష్మీ విహార !
భక్త మందార ! దుర్భవ భయవిదూర ! 3-304

ఆమె నిత్య సాంగత్యం వల్లనే లోకంలో ఆయన లక్ష్మీప్రదుడు కాగలిగాడు. ఇలా సారాంశంగా లౌకికంగా లక్ష్మి అస్థిరమనీ అవతారతత్త్వంలో నిత్యమనీ తెలుస్తుంది. ఇలాంటి సన్నివేశ భావాలు భాగవతంలో అనేకంగా గోచరిస్తాయి.

తే ॥ చిన్మయా కార ! నిత్యలక్ష్మీ విహార ! 4-171

తే ॥ చిర దయాకార యిందిరా చిత్తచోర ! 4-203

ఇలా పోతన లక్ష్మీనారాయణుల ఆదర్శ దాంపత్య శృంగార భావాన్నే పరిపోషిస్తాడు.

## దేవతానీకకృత లక్ష్మీస్తుతి

నృసింహుని శాంతింపజేయవలసిందిగా లక్ష్మీదేవిని అభ్యర్థిస్తూ దేవత లామెను స్తుతించారు.

కం॥ హరికిం బట్టపు దేవివి
హరిసేవా నిపుణమతివి హరి గతివి సదా
హరి రతివి నీవు సని నర
హరి రోసము డింప వమ్మ హరివరమధ్యా ! 7-340

---

11 శ్లో॥ లలిత గతి విలాస వల్గుహాస ప్రణయ నిరీక్షణ కల్పితోరుమానాః ।
కృతమనుకృతవత్య ఉన్మదాంధాః ప్రకృతిమగమన్ కిలయస్య గోపవధ్వః ॥ 1-9-40

ఇది లక్ష్మీనారాయణుల సంబంధ బాంధవ్యానికీ గుణగణ సౌందర్యానికీ స్థితి స్థాపనకూ సంబంధించిన వర్ణనలతో కూడిన స్తుతి. ఇక్కడ ఆమె యొక్క అంతస్సౌందర్య బహిః సౌందర్య కీర్తనం ఉంది. తద్వారా ఆమె సర్వ విషయిక శృంగారం వెల్లడౌతుంది.

## వింధ్యావళీకృత వామనస్తుతి

'పతి భిక్షాం మమ దేహి కోమలమతే పద్మాపతే' (8-652) అంటూ పతిభిక్షకోసం వింధ్యావళి తత మత్తద్విప యానగా కుచ నిరుంధచ్చేళ సంవ్యానగా కదలి వచ్చింది. ఆమె మాటల్లో అంతర సౌందర్యం, ఆకారంలో బాహిర సౌందర్యం కీర్తించ బడినాయి. ఆమెలో రెండింటి ఐక్యం చేకూరింది. ఆమె శ్రీహరిని కీర్తిస్తూ అన్నమాటలు -

కం॥ కాదనడు పొమ్ము లే దీ
రాదనడు జగత్త్రయైక రాజ్యము నిచ్చె
న్నా దయితు గట్టనేటికి
శ్రీదయితా చిత్తచోర ! శ్రితమందారా ! 8-655

ఇది వింధ్యావళి గావించిన ప్రశ్నపూర్వక స్తుతి. నీవూ సతీ సహితుడవే కదా ! నా స్థితిలో నీ భార్య వుంటే ఎలా బాధపడుతుందో ఊహించుకొని కరుణించమని కోరకుండానే కోరిన సన్నివేశంలో శృంగార స్ఫూర్తి కనబడుతుంది.

## సత్యవ్రతకృత మీనావతారస్తుతి

సత్యవ్రతుడనే రాజు మీనరూపుడైన శ్రీహరిని గూర్చి పల్కిన సందర్భం -

కం॥ శ్రీలలనాకుచవీథీ
కేళీ పరతంత్ర బుద్ధి గ్రీడించు సుఖా
లోలుడవు తామసాకృతి
నేలా మత్స్యంబవైతి వెతిగింపు హరీ ! 8-701

ఈ ప్రశ్నలో భగవచ్ఛృంగార క్రీడా విలాసం పోతన స్మృతి పథంలో మెరిసింది.

## అంబరీషకృత సుదర్శనచక్రస్తుతి

దుర్వాసుని రక్షించటానికి అంబరీషుడు చేసిన సుదర్శన చక్రలాఘవ స్తుతిలో శృంగార స్ఫూర్తి ఉంది.

ఆ॥ కలగి నిద్రవోవ గలలోన వచ్చిన
నిన్ను జూచి దీర్ఘనిద్ర వోదు
రమర వరులు శయ్య లందున్న సతులు ప్ర
భాత మందు లేచి పలువరింప. 9-130

రాజులకు శత్రువుల పట్ల సహజంగా ఉండే భావమయిన క్షాత్రంతోపాటు 'శయ్యలందున్న సతుల' ప్రస్తావన చేశాడు. అంబరీషుడు భక్తుడైనా రాజసుఖా లెరిగిన వాడు. కనుక ఇలా చేసిన పాత్రోచిత శృంగార రసావిష్కరణం పోతన హృదయావిష్కరణమే!

## కృష్ణకృత బలరామ ప్రశంస

వన విహారానికి బలరాముణ్ణి శ్రీకృష్ణుడు పురికొల్పే సందర్భంలో బలరాముడి రాకతో ప్రకృతికాంత పరవశించిందని మూల భాగవతంలోని భావం.

శ్లో ॥ ధన్యేయ మద్య ధరణీతృణవీరుధ స్త్వ
త్పాద స్పృశోద్రుమలతాః కరజాభి మృష్టాః
నద్యోఽ ద్రయః ఖగమృగాః సదయావలోకై
ర్గోప్యోఽ న్తరేణ భుజయోరపి యత్స్పృహాశ్రీః ॥ 10-15-8

ఈ ధరణి పూర్వం అనేక అవతారాలలో నీచరణ సౌభాగ్యాన్ని పొందినప్పటికీ స్వయం రూపావతారం వల్ల ఇతఃపూర్వం కంటె ఆమె ఇప్పుడు ధన్యురాలయింది. తృణలతలు నీ పాద స్పర్శచేత, వృక్షాలూ లతలూ నీనఖ స్పర్శచేత, నదులూ పర్వతాలూ నీ వీక్షణాలచేత, శ్రీదేవీ గోపికలూ కూడ తహతహలాడే నీ వక్షః స్థలంచేత ధన్యులైనారని దీని భావం. పోతన ఈ భావాన్నే తెలుగు పదాల పోహళింపుతో శృంగార రసభరితం కావించిన తీరు పరిశీలనార్హం.

సీ॥ నీ పాదములు సోకి నేడు నీరును తృణ
పుంజముతో భూమి పుణ్యమయ్యె
నీ నఖంబులు తాకి నేడు నానాలతా
తరు సంఘములు కృతార్థంబులయ్యె
నీ కృపాదృష్టిచే నేడు నదీ శైల
ఖగ మృగంబులు దివ్యకాంతి జెందె
నీ పెన్నురము మోవ నేడు గోపాంగనా
జనముల పుట్టువు సఫలమయ్యె

ఆ ॥ నని యరణ్య భూమి నంకించు పసులను
మిత్ర జనులు దాను మేపుచుండి
నలిన లోచనుండు నదులందు గిరులందు
సంతసంబు మెఱయ సంచరించె. 10-597

వ్యాస పోతవల కల్పనలను కొన్నింటిని వృక్షలతాదులకు కల్పించే దోహద క్రియ లుగా ఎంచవచ్చు. కొన్నింటిని నాయక పరమైన శృంగార చేష్టలుగా, నాయకానుభవాలుగా పరిగణించవచ్చు. కానీ నాయికా నాయకుల మధ్య జాతి భేదం వల్ల రసాభాస మేర్పడుతుంది. ఏమైనా పోగడ్తలో ఇలా రసోత్పత్తికి ప్రకృతిని పరవశింపచేయటంలో వ్యాస హృదయాన్ని పోతన శృంగార రసోదంచితంగా ఆవిష్కరించా డనవచ్చు.

## గోపికాకృత శ్రీకృష్ణస్తుతి

తమ వస్త్రాల నపహరించిన చిన్నికృష్ణుని గూర్చి గోపికలన్న మాటలు మన్మథ భావస్ఫోరకాలు.

కం॥ మామా వలువలు ముట్టకు
మామా ! కనిపోకు పోకు మన్నింపు తగన్
మా మానమేల కొనియెదు
మా మానస హరణ మేల మానుము కృష్ణా ! 10 - 818

గోపికామాన సంరక్షణం మాట మర్చిపోయి, మాటల పాటల్లో పడి పోతుంది వరవశించిన పాఠకుడి హృదయం. 'వాక్యం రసాత్మకం కావ్యం' అన్నదానికి ఇందులోని గాథ శృంగార భావన నిదర్శనంగా నిలుస్తుంది. 'తెలుగు దేశంలో మామా బావా వరసలు ఎంతో చొరవ తీసి కలవిగా ఇప్పటికిన్నీ అలాగే ఉన్నై, శృంగారానికి అలంబనమైనవిన్నీ'[12].

## భూదేవీస్తుతి

గోపికలు కృష్ణ విరహచిత్తలై అతనికోసం అన్వేషిస్తూ చేసిన భూదేవీ సౌభాగ్యస్తవం.

కం॥ కిటియై కౌగిట జేర్చెను
వటుడై వర్ధిల్లి కొలిచె వడి గృష్ణుండై
యిటు బదచిహ్నము లిడె గ్రిం
దటి బామున నేమి నోచితమ్మ ధరిత్రీ ! 10-1017

ఈ భావానికి మూలాధారం (10-30-10) ఉన్నా గత మూడు జన్మల్లోనూ భూరమణికి నారాయణమూర్తికిఉన్న సాంగత్యాన్ని కీర్తించారు గోపిక లిందులో. ఇందులోనే ఆమె పొందిన రతికేళీ సౌఖ్యానికి వారికి గలిగిన ఈర్ష్య ద్యోతక మవుతుంది స్తుతిగతంగా.

## గోపికాభ్యర్థనం

కం॥ కొంటివి మా హృదయంబులు
కొంటివి మా మనము లజ్జ గొంటివి వలువల్
గొంటి వికనెట్లు చేసెదొ
కొంటెవు గద నిన్ను నెఱిగికొంటిమి కృష్ణా ! 10-820

ఇందులో సర్వాంగ సమర్పణ బుద్ధితో వ్యవహరిస్తున్న నాయికా శృంగారం ద్యోతకం. భీష్మ స్తుతిలో 'వన్నెలాడు' లాగా ఇక్కడ గోపికల లజ్జ, మనసు దోచుకున్న కొంటెవాడుగా

12 శృంగారం - పోతన. పుట. 200

పేర్కొనటం పోతనగారి కున్న శృంగార ప్రీతికి నిదర్శనం. ఇలా 'వచ్చెదము నీవు పిల్చిన' మొదలైన భావాలు శృంగార వ్యక్తీకరణ సమర్థాలు. ఈ తెలుగుదన మెఱిగిన పోతన కవి పనితనం ప్రశంస్యం.

## శరన్నిశ - గోపికాస్తుతి

శరద్రాత్రిలో వేణునాద మాధుర్యానికి పరవశించి కృష్ణ సన్నిధికి వచ్చారు గోపికలు కృష్ణుడి మీది గాఢానురాగంతో. వారు చేసిన సాముహిక అభ్యర్థన ఇది. 'మరుదు మేకొని యేచిన వచ్చినార' (10-991) మనీ 'మనోజాగ్నిచే/బొగులం జాలము కౌగలింపుము' (10-992) 'మన్మథేక్షు కో/దండ విముక్త బాణముల దానల మయ్యెద మాదరింపవే' (10-993) అనే మూల భాగవత గత భావాలేకాక, వారి 'అడుకుయులు' కూడ పెంచినాడు పోతన్న.

సీ॥ నీ యధరామృత నిర్ఝరంబులు నేడు
చేరి వాతెఱలపై చిలుకకున్న 10-994

సీ॥ ఈ పంచబాణాగ్ని నేమిట నార్తుము
నీ మంజు వాగ్వృష్టి నెగడదేని 10-997

అని కామార్తలైన గోపికల భావాలలో కృష్ణుడు శ్రీయువతీ ధైర్యచోరుడుగా నిలిచి పోయాడు. ఇలా అయోగ శృంగారావస్థలన్నీ పోతన గోపికల అభ్యర్థనలలో నిబంధించాడు 'సిరికి నుదార చిహ్నముల జేయు భవచ్చరణారవిందము' (10-989) లనటంవల్ల వారిలో స్తుతిగతంగా కామ సూత్రాలను నిక్షిప్త పరచి నట్లే.

## గోపికా గీతలు

ఏరసం పట్ల ప్రత్యేకానురాగం లేని వ్యాసుడే పాత్రౌచితి దృష్ట్యా గోపికా గీతలలో శృంగార భావాలు గుప్పించాడు. వాటికి అనువాదంలో పోతన తుదిమెఱుగులు దిద్దాడు. మరికొన్ని కొనమెఱుపులు మెఱిపించటం చేత గోపికా గీతలన్నీ శృంగార గీతికలైనాయి. కామార్తలైన ఆ గోపికల మాటలు విరహగీతికలే !

ఆ॥ విషజలంబు వలన విషధర దానవు
వలన గాలివాన వలన వహ్ని
వలన మిగులు వాని వలనను రక్షించి
కుసుమశరుని బారి గూర్పదగునె ? 10-1037

ఎన్నో అలవికాని అనంతమైన అవదల నుండి రక్షించిన నీవు మమ్మల్ని మన్మథుడి పాలుపేయటం సమంజసం కాదని అభ్యర్థించారు. దీనికి మూలం (10-31-3) ఉన్నా వారి కామభావ మాధుర్యం కమనీయం.

శ్రీకృష్ణుడి ప్రత్యవయవ స్పర్శతోడి సుఖానుభవం వల్లనే విరహతాపం విముక్తమైతుందనే వారి అభ్యర్థనలో దాగి ఉన్న ఎన్నో కామ శాస్త్ర రహస్యాలు సహృదయైక సంవేద్యాలైనాయి. చివరకు వారిచేత పోతన పల్కించింది విరహార్తిభరమైన అభ్యర్థనం.

కం॥ తియ్యవిలుకాడు డీకొని
ప్రయ్యలుగా దూఱనేసె వనితల మనముల్
వియ్యాన నింక నయినన్
గుయ్యాలింపం గదయ్య గోవింద హరీ ! 10-1056

'నేడు రెండు మూ/డమ్ముల యేటుకా డెదుర నడ్డము రా దగదే కృపానిధీ' (10-1055) అని ప్రాధేయ పడతారు గోపికలు.

## రుక్మిణీకృత శ్రీకృష్ణస్తుతి

సర్వేంద్రియ సమర్పణ బుద్ధితో శ్రీకృష్ణుడి కోసం ఎదురు చూసింది రుక్మిణి. ఆమె అయోగ విప్రలంభాన్ని సందేశాత్మక సంప్రార్థనలో పోతన వ్యక్తీకరించాడు.

సీ ॥ ప్రాణేశ ! నీ మంజు భాషలు వినలేని
కర్ణరంధ్రంబుల కలిమి యేల?
పురుషరత్నమ! నీవు భోగింపగా లేని
తనులత వలని సౌందర్యమేల?
భువన మోహన! నిన్ను బొడగానగా లేని
చక్షురింద్రియముల సత్త్వమేల?
దయిత! నీ యధరామృతం బానగా లేని
జిహ్వకు ఫలరససిద్ధి యేల?

ఆ ॥ నీరజాతనయన ! నీ వనమాలికా
గంధమబ్బలేని ఘ్రాణమేల?
ధన్యచరిత ! నీకు దాస్యంబు సేయని
జన్మమేల? యెన్నిజన్మములకు. 10-1708

'పంచేంద్రియ సంపుటిలో పంచభూతాల గుణాలను ధ్వనింప జేయడం ఈ పద్యంలో ఉన్న రమణీయ రహస్యం.'[13] ఆ ప్రయత్నంలో వెలిసిన ప్రతిభావం శృంగారంతో విరిసి ప్రతిభావంతమయింది. అలాగే రుక్మిణి తాను పంపిన ప్రేమ సందేశంలో -

---

13 మందార మకరందాలు, పుట. 45

తే॥ కరుణ జూడుము కంసారి! ఖలవిదారి !
శ్రీయుతాకార! మానినీ చిత్తచోర ! 10-1701

అన్నది. లక్ష్మీసహితుడైన విష్ణుమూర్తి ఆమె విరహాన్ని భరించలేడనీ ఆయన అవతారం అయిన గోపాలుడు మానినీ చిత్తచోరుడై ప్రసిద్ధి చెందాడనీ నియూఢి. కనుక తానే స్వయంగా వచ్చి స్వీకరింపుమని ఆమె ప్రార్థన. ఇందులోని శృంగారం అభ్యర్థనమే కాక కర్తవ్యబోధకం కూడా.

## సత్యాకృత కృష్ణస్తుతి

యుద్ధానికి వస్తానని సత్య శ్రీకృష్ణుని అభ్యర్థించటంలోని సందర్భోచిత సంభాషణ శృంగారోద్దీపనమే. సపత్నీ సంఘంలో భర్త్రు విజయాన్ని కీర్తించడం సత్యకు సంతోష సంధాయకం. ఆ విషయ ప్రస్తావనంతో శ్రీకృష్ణుని మనస్సీమను దోచుకొని మమతల కోవెల గట్టి అందులో శృంగారాధిదేవతగా ఆరాధిత కావాలని ఆమె ఆకాంక్ష. అందుకే ఈ అభ్యర్థనం (10ఉ -151) తో భర్త తనను బహుమాన పురస్సరంగా చూచే భాగ్యం కలిగింది. తర్వాత ఆమె చేసింది ప్రశంసాత్మక సంప్రార్థనం. సంగ్రామ రంగానికి వెళ్లాలనేది ఆమె కుతూహలం.

ఉ ॥ దానవు లైననేమి మఱి దైత్యసమూహము లైన నేమి నీ
మానిత బాహుదుర్గముల మాటున నుండగ నేమి శంక ? నీ
తో నరుదెంతు నంచు గర తోయజముల్ ముకుళించి మ్రొక్కి న
మ్మానిని దన్ను భర్త బహుమాన పురస్సర దృష్టి జూడగన్. 10ఉ -155

స్త్రీలు ప్రశంసావర్షాన్ని కురిపిస్తే పురుషుల హృదయ క్షేత్రంలో పండని మమతానురాగాలుండవు కదా ! 'ఎంతవారలైనా కాంతదాసులే'[14] కదా ! అలాగే ఆ ప్రశంసలు సాధించని విజయాలుండవు కదా !

## ఉషాకృత చిత్రరేఖాస్తుతి

చెలికత్తె అయిన చిత్రరేఖా దూతీనైపుణ్యాన్ని ఉషాసుందరి వినుతించటం కృతజ్ఞతా సూచకమైన వినుతి.

సీ॥ అతివ ! నీ సాంగత్య మను భానురుచి నాకు
గలుగుట గామాంధకార మడగె
దరళాక్షి ! నీ సఖిత్వంబను నావచే
గడిచి వియోగాబ్ధి గడవగంటి
నబల ! నీ యనుబంధ మను సుధావృష్టిచే
నంగజ సంతాప మార్ప గంటి

---

[14] త్యాగరాజు : 'ఎంత నేర్చినా .....' (ఉదయ రవిచంద్రిక రాగం, ఆదితాళం)

వనిత ! నీ చెలితనం బను రసాంజనముచే
నా మనోహర నిధానంబు గంటి
తే॥ గలల దోచిన రూపు గ్రక్కన లిఖించు
వారు నొ నన్ను దోడ్తెచ్చు వారు గలరె?
సిటిలో జాడ బుట్టించు నేర్పు నీక
కాక గల్గునె మూడు లోకములయందు ! 10ఉ - 369

లోకంలోని ప్రేమ పురాణాలలో శృంగారదూతీ నైపుణ్యం దాని అవశ్యకం ఎంతగానో వినుతింపబడినాయి.

## అనేకరాజకృత కృష్ణస్తుతి

కారాగృహ విముక్తులైన రాజులు శ్రీకృష్ణుని మాధవుడుగా గుర్తించి కీర్తించిన సన్నివేశం -

ఉ ॥ వేదవధూ శిరో మహితవీథుల జాల నలంకరించు మీ
పాద సరోజ యుగ్మము శుభస్థితి మా హృదయంబు లందు ని
త్యోదిత భక్తిమై దగిలియుండ నుపాయ మెఱుంగ బల్కు దా
మోదర ! భక్త దుర్భవ మహోదధితారణ ! సృష్టికారణా ! 10.ఉ. 749

వారు కోరుకొనేది వేదవధూశిరో (ఉపనిషత్తుల) విషయమే ఐనా నవవధూ శృంగార క్రీడా స్ఫూర్తి కలుగుతుంది. పాదపద్మాలు హృదయ సీమపై ఉంచటం అనే కామ సూత్ర స్పర్శకూడా ఈ సన్నివేశంలో స్ఫురిస్తుంది.

ఇలా భాగవతంలోని కొన్ని స్తుతిగత శృంగార సన్నివేశాలు హృదయాన్ని పరవశింప చేస్తాయి. సహృదయ హృదయాకాశాల్లో శృంగార భావాలు మలయ మారుతాలుగా వీస్తాయి. అప్పుడు మనః కమలాలు వికసిస్తాయి. అప్పుడే భాగవతం రసోల్లసితమై కావ్యస్థాయి నందుకొంటుంది. అందుకు పోతన్నగా రవలంబించిన శిల్పమిది.

# వేణుగాన శృంగారం

శ్లో ॥ గీతేన ప్రీయతే దేవః సర్వజ్ఞః పార్వతీపతిః
గోపీపతి రనంతోఽపి వంశధ్వని వశంగతః ॥

ఇది సంగీత రత్నాకరకారుడు చేసిన సంగీత ప్రశంస.

'గీతం వాద్యం చ నృత్యం చ త్రయం సంగీత ముచ్యతే' అని సంగీత నిర్వచనం. వీటిలో ద్వితీయ స్థానీయమయింది వాద్యం. అది గీత నృత్యాలకు ఉపబలకంగానే కాక స్వతంత్రంగానూ రసభావ వ్యక్తీకరణ సాధకం గానూ ఉంటుంది. అట్టి వాద్యాలు

పలురకాలు. వాటిలో వేణువు ఒకటి. అది దశవిధ ప్రణవ నాదాలలో అగ్రగణ్యం.[15] అది వాయుపూరక వాద్యం. వేణువును వెదురుతోనూ పలులోహాలతోను గజదంతంతోనూ నిర్మించవచ్చు. గజదంత నిర్మితమయిన దాన్ని 'విషాణవేణు' వనీ శృంగ వేణువనీ అంటారు. వంశ (వెదురు) నిర్మితాన్ని వేణువనీ వంశి అనీ వంశమనీ వ్యవహరిస్తారు. మురళీత్యాది నామాలతోకూడా ఇది లోకవిదితమే. పై అన్నింటిలో వంశీనాదమే మధురతమం శ్రుతి సుభగం అని సంగీతజ్ఞుల అభిభాషణం. భాగవత కృష్ణుని కథలో గీతనృత్యాల కలయికతో కూడిన వేణునాద మాధుర్యాన్ని కూడ ఆస్వాదించవచ్చు. పోతన భాగవతంలో మురళీధరుడు 'విషాణవేణు ధారి'(10-546) గాను 'శృంగ వేణు' ధారి (10-583) గాను దర్శనమిస్తాడు.

ఆలాపన సమయాన్ని బట్టీ రాగ స్వర భేదాల్ని బట్టి కూడ వేణునాద మాధుర్యపు రుచులు మారుతాయి. నాదసుధా ధారల మత్తులో అతివల్ని మన్మథోద్దీప్తల్ని చేస్తుంది ఈ వేణుగానం. శరద్రాత్రి సమయంలో వేణువును పూరించాడు శ్రీకృష్ణుడు. విష్ణుపురాణంలో "కలపదం' (అస్ఫుటపదం) లో గీతాన్ని పాడినట్లుంది. సంస్కృత భాగవతం (10-29-3) లో కూడ 'జగౌకలమ్' అని ఆ శబ్ద ప్రయోగమే ఉంది. టీకాకారుడైన విశ్వనాథచక్రవర్తి 'కల' శబ్దం నుంచి కృష్ణ మంత్రానికి బీజమైన 'క్లీం' శబ్దాన్ని నిష్పన్నం చేశాడు. దాన్ని కామ గీతమని నిర్వచించాడు. కాగా వ్యాసుడు 'అనంగ వర్ధనం'గా (10-29-4) పేర్కొన్నాడు[16]. పోతన్న దాన్నే మారవికార హేతువుగా కీర్తించాడు.

ఈ వేణుగానాన్ని జయదేవుడు స్త్రీల విషయంలో షట్కర్మసాధక మహామంత్రంగా పేర్కొన్నాడు.

శ్లో ॥ అంతర్మోహన మౌళి ఘూర్ణన చలన్మందార విభ్రంశన
స్తంభాకర్షణ దృష్టిహర్షణ మహామంత్రః కురంగీదృశామ్ ।
దృప్యద్దానవ దూయమాన దివి షద్దుర్వార దుఃఖా పదాం
భ్రంశః కంసరిపో ర్వ్యపోల యతు వశ్శ్రేయాంసి వంశీరవః ॥

గీతగోవిందకావ్యం. పుట. 228

మోహన వశీకరణ మారణ స్తంభన ఆకర్షణ ఉచ్చాటన విషయాల్లో శ్రేయస్సు కలిగిస్తుందట వంశీనాదం. అలాగే శ్రీకృష్ణుడు గోపికల్ని వశీకరించుకున్నది ఈ వేణుగానంతోనే అని వేంకటేశ్వర స్తోత్రం కూడ తెల్పుతుంది.

శ్లో ॥ కలవేణురవా వశగోపవధూ
శతకోటివృతా త్స్మర కోటి సమాత్ ॥

---

15 హంసోపనిషత్తు. శ్లో. 16

16 శ్రీకృష్ణచరిత్రము. పుట. 165

దీనినిబట్టి గోపికల చిత్తాకర్షణకు మూలకారణం మురళీనాద మాధుర్యమే.

ఇక శ్రీ కృష్ణకర్ణామృతంలో 'ముఖరిత వేణు విలాస జీవితు' డనీ 'వేణు నాద రసికు' డనీ లీలాశుకుడు శ్లాఘిస్తే, పోతన 'స్వవశుండై మధురాధరామృతముచే వంశంబు పూరించు' ననీ దాని మాధుర్యానికి శ్రీకృష్ణుడే తన్మయుడైనాడనీ పేర్కొన్నాడు. భాగవతంలో శ్రీకృష్ణు డెప్పుడూ 'వేణు నాదపాశ బుద్ధలోకు'డే. కనుక దానికి విశ్వమోహన శక్తి ఉంది. శ్రోతలకు ఉత్సాహాన్నిచ్చి ఉద్యూతల్యాగించి కదనుత్రొక్కించే లక్షణం కూడ ఉంది. మాయా గోవత్సాల్ని గోష్ఠాల్లోకి పిలిచే సందర్భం స్మరణీయం. శ్రీకృష్ణుడెప్పుడూ 'విషాణవేణు చిహ్నితుడే'. వేణు నాదానికి లాలిత్యం ఉంది. దానితో 'లాలిత వేణు రవాభిరాముడై' (10-625) నాడు. గోపికలు లాలిత మనస్కలైనారు.'

వేణుగీతం మక్కువలు ఎక్కువ చేస్తుంది. అతివల సిగ్గునూ ఎగ్గునూ చిదిమి వేస్తుంది. వ్రేతల్ని గుములుగా గూర్చి వారి 'జిలిబిలి' (శృంగార సంబంధమైన) ముచ్చటలకు మూలమయింది (10-768). వేణునాదం విన్న వ్రేతల మనస్సులు పలుభావాల నిలయాలైనాయి. వారిలో ఒక గోపిక తన చిత్తాన్ని గూర్చి చిత్తగిస్తుంది ఇలా -

కం॥ తలకెను గొబ్బున చిత్తము
నళినాక్షుని మధుర వేణునాదము నా వీ
నులు సోకినంత మాత్రన
చెలియా ! యికనెట్లు వెరవు చింతింపగదే. 10-771

అంతటి అనంతశక్తి ఉండబట్టే వేణువు దాని పర్వాలను నేత్రాలుగా అర్పించిందని (10-777) గోపిక లీర్ష్య చెందారు. ఆయనను వారి మనస్సులలోనే 'ప్రతి పదంబును' (ప్రత్యణువును) ఆలింగనం చేసుకున్నారు. అయన పట్ల వారి వలపు పన్నిదాన్ని పెంచి నిత్యసాన్నిహిత్య సౌభాగ్య కాంక్షితల్ని చేసింది. చరాచర చేతన జగత్తు నంతా చైతన్య చకచ్చకితం చేసింది వేణునాద చాతుర్యం. ప్రకృతి మొత్తం అలా మానవాకృతిని దాల్చి కృష్ణ పదసేవాయత్తమైంది. ఇది అద్భుత కల్పనం ! ఈ వేణునాదం సర్వలోకాలకూ పరివ్యాప్తమై ప్రభావితం చేసినట్లుగా సంభావింపబడింది. దీని ప్రభావాన్ని కేవలం తానుగా గాక గోపికా ముఖతః వర్ణించి కథలో విలీనం చేయటం ఉత్తమశిల్పం.

నదీసముదాయానికి సైతం వేణుగానం ఉద్దీపన మయింది. అందులో ఒక ప్రౌఢ నాయికా వర్తనం దర్శనమిస్తుంది.

మ ॥ క్రమమొప్పన్ నదులెల్ల వంశరవ మాకర్ణించి సంజాత మో
హములన్ మన్మథ సాయకక్షత విశాలావర్తలై హంస వా
క్యములం జీరి తరంగ హస్తముల నాకర్షించి పద్మోపహా
రములన్ గృష్ణు పదార్పనంబు సలిపెన్ రామా ! విలోకించితే. 10-789

ఇందులోని నదీ ఆవర్తాలను మన్మధ బాణాల వల్ల కలిగిన గాయాలుగా ఉత్ప్రేక్షించి శృంగార రసాన్ని సంప్రోక్షించి వాటి కామవేగాన్ని సంలక్షించాడు పోతన. ఈ నదీ సౌందర్యం కొంత మౌలికమే అయినా దాన్ని సర్వాంగ శోభాస్పదంగా తీర్చిదిద్దింది పోతన శృంగార లేఖిని.

సరసగానవివేకం లేని మృగీ మృగాలకు సైతం వేణు నాద మాధుర్యం వల్ల 'రతి' ఉదయించింది. అవి మెత్తని చూడ్కులతో (10-785) అంటే ప్రణయ పూర్వక దృష్టులతో శ్రీకృష్ణుని బహుమానించాయి. ఇటువంటి భావాల్నే భక్తి రసామృత సింధువు కర్త 'మధుర రతి' గా గుర్తించాడు. ఆ మనోజ్ఞ మురళీగానం విన్న కేకినులు నాయకాగమనంగా భావించాయి. ఆనందంతో మురిసిపోయాయి. ఈ సందర్భంలోని మేఘ మయూరాల నాయక నాయికా భావనం (10-782, 1127) పోతన స్వతంత్ర కల్పనం. వేణునాదం విన్న ఖేచరాల విషయంలో శాంత శృంగారాల సమ్మేళనం గోచరిస్తుంది. ఆ గానం విన్న వాటి చిత్తం కృష్ణాయత్తం అయింది.

మ ॥ జగతీజంబుల శాఖలెక్కి మురళీ శబ్దామృత స్యందముల్
మిగులన్ వీనుల ద్రావి వ్రేగుపడి నెమ్మిం గృష్ణురూపంబు చి
త్రగమై యుండగ నడ్డు పెట్టుక్రియ నేత్రంబుల్ దగన్ మూసి యీ
ఖగముల్ సొక్కెడి జూచితే మునిజనాకారంబులన్ గామినీ ! 10-788

మురళీనాదం ఉద్దీపనకాగా అనుభావంగా కృష్ణుని రూపం చిత్తంలో మెదలి కనుతెప్ప పడ్డది. అది మునిజనాకారంగా భావించటంతో శాంత శృంగారాల నొక సరసన చేర్చినట్లయింది.

భిల్ల వనితలు ఆ హరి మురళీరవామృతం సోకి మోహాక్రాంతలైనప్పటి వారి రూపం ఒక భావ చిత్రంలా భాసిస్తుంది.

కం॥ ఉల్లసిత కుచభరంబుల
నల్లాడెడి నడుముతోడ నలరుల దండల్
భిల్లి యొకతె హరికిచ్చెను
హల్లోహల కలిత యగుచు నంగన కంటే ! 10-792

ఎంతటి మోహకలిత ఐనా భిల్లాంగనలో వైదగ్ధ్యం ఉండదు. పైగా జాతి భేదం ఉంటుంది. అపై వారిది ఏక పక్షప్రణయమే కనుక ఇది శృంగారాభాసం అవుతుంది. ఏమైనా మొత్తంమీద వేణునాదం వారి హృదయాల్ని శృంగారోన్ముఖం చేసింది.

శ్రీకృష్ణుడు అంగుళీ ప్రావీణ్యంతో సుస్వరమైన వేణువును పూరించే సమయంలో నిలింపాంగనలు ఆ గానాన్ని విన్నారు. రూపాన్ని దర్శించారు.

శా॥ భ్రూ విక్షేపముతోడ డాపలి భుజంబుం జెక్కు గీలించి కె
మ్మోవిన్ వేణువు గూర్చి సుస్వరముగా మ్రోయించుచు న్నంగుళీ
ప్రావీణ్యంబు విభుండు సూప గని సంప్రాణేశలై యుండియున్
నీవీబంధము లూడ జొక్కుదురు పో నింగిన్ నిలింపాంగనల్. 10-1125

ఆ నిలింపాంగనలు సప్రాణేశలై ఉన్నా పంచాశుగ భ్రాంతలైనారు. వారి మొలనూళ్ళు జారిపోయాయి. నీవీబంధాలు వీడిపోయాయి. మోహపారవశ్యంలో నాథాంక మధ్యంలో వాలిపోయారు (10-784, 1125). మనసులో చొక్కుతూనే వారు సొక్కిపోయారు. ఇంతటి వారి కామావేశానికి కారణమయింది వేణుగాన మాధుర్యమే. ఈ సన్నివేశం గోపికలకు మరింత ఉద్దీపకం. వీరు వారన్న భేదం లేకుండా గిరులూ తరులూ త్రిలోక చరులూ కూడ మురళీ రవానికి మురిసిపోయి రసపారవశ్యానికి లోనైనారు.

కం॥ గిరు లెల్ల జలము లయ్యెం
దరు లెల్లను బల్లవించె ధరణీ గగన భూ
చరు లెల్లను జొక్కిరి హరి
మురళీ రవామృతము సోకి ముద్దియ! కంటే! 10-793

ఇందులో దృశ్యగత సర్వాంశ సంగ్రహణం ఉంది. రస పారవశ్యం ఉంది. ఈ మాటలు గోపికల ముఖతః వ్యక్తం కావటం వల్ల వారిలోని నిగూఢ శృంగార వేదన వ్యక్తమవుతుంది. వారి ఈ 'జిలిబిలి ముచ్చట'లకు మూలం 'అస్పందనం గతి మతాం పులకస్తరూణాం' (10-21-19) అన్న ఒక చిన్న వాక్యమే. అది ఒక వ్యాఖ్యాన సదృశమైన శృంగార కందంగా అవతరించి అందగించింది. చక్కని సన్నివేశం సాక్షాత్కరించింది.

వేణుగాన మాధుర్య ప్రస్తావన సమయంలో దానికి అంగాలుగా భాసించిన గీత నృత్యాల్ని గూర్చిన సమీక్షణం సమంజసం. వాటి వ్యష్టి సమష్టి ప్రయోగ సందర్భాలు కూడ పరిశీలనార్హాలు. భాసురమైన శరద్వాసర సమయంలో

సీ॥ కర్ణావతంసిత కర్ణికార ప్రభ
గండభాగద్యుతి గడలు కొలుప
భువనమోహన మైన భ్రూ విలాసంబుతో
వామభాగానత వదన మొప్ప
నపసవ్యకర మృదులాంగుళీ చాతురీ
షడ్జధ్వనికి మర్మ సరణి జూప
డాకాలి మీద నడ్డము సాచి నిల్పిన
పద నఖద్యుతి భూమి బ్రబ్బికొనగ

తే॥ మౌళిపింఛము కంఠదామమును మెఱయ
వలసిత గ్రామముగ నొక్క వేణు వందు

బ్రహ్మగాంధర్వ గీతంబు పరగ జేసె
జతుర నటమూర్తి గోపాల చక్రవర్తి. 10-767

మూలంలోని 'మకుజవేణుం' (10-21-2) అనే పదానికి గీత నృత్యాభినయాలను జోడించి చేసిన అనల్పకల్పనం ఈ అద్భుత రూప చిత్రణం. ఇది ఆంధ్రుల కారాధ్య రూపంగా ఇంటింటా వెలసింది. ఇది సంగీత సంప్రదాయాన్ని సందర్శింపచేసే శ్రీకృష్ణుడి నట స్వరూపం. ఆ మూర్తి మూలంగానే వేణునాద శృంగారం ఉత్పన్న మయింది. అది మార వికార హేతువయింది వ్రేతలకు. ఈ ఘట్టంలో గీతానికి షడ్జ స్వరాన్ని గూర్చి పోతన సంగీత స్థితిని సుస్థిరం చేశాడు. వేణుగాన మోహనశక్తికి వ్రేతలు ససంభ్రమ లైనారు (10-771). ఇలాంటి సన్నివేశాలు అనేకం. ఈ అన్ని సందర్భాల్లోనూ శ్రీకృష్ణుని సౌందర్య స్వరూపాన్ని కూడ భావించుకోవాలి. రూపం లేకుండా రసావిష్కారానికి అస్కారం లేదు కదా ! అదే రూప రసాలకున్న లంకె.

రాసక్రీడా సమయంలో శ్రీకృష్ణుని వేణునాదంతో సుందరీ ద్వయ వీణా నిక్వాణం శ్రుతి కలిపింది. అప్పుడు అయన 'కామినీ జన కబరికా సౌగంధిక గంధ బంధుర కరాంగుళీ కిసలయంబులు యతిలయంబులం గూడి వివరంబుగ మురళీ వివరంబుల సారించి పూరించుచు' (10-1081) ఉద్దీపింప చేశాడు. ఫలితంగా సన్నివేశం చాళితి బంధాలకు ఆలవాలమైన సంభోగ శృంగారంగా పర్యవసించింది.

ఇలా మనోమోహనమై గీత నృత్యాలతో సర్వలోక సమ్మోహన కారణమైంది ఈ వేణుగానం. ఆ పై అఖండ రసానందానుభూతికి భూమిక అయింది. మునులుగా శాంత రసప్రధానులై వేదనాదోపాసన గావించినా తృప్తిగాంచక యుగాంతరంలో శ్రీకృష్ణ రసావతారంలో కామోత్కంఠిత శృంగార కాంతలై వేణు నాదాకృష్టలై తన్నాదామృత ధారల్లో పరవశించి పరమధన్యలైనారు.

# కౌలీన శృంగారం

శ్లో ॥ అద్వైతం సుఖదుఃఖయో రనుగతం సర్వాస్వవస్థాసు య
ద్విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మిన్నహార్యో రసః ।
కాలే నావరణాత్యయా త్పరిణతే య త్స్నేహసారే స్థితం
భద్రం తస్య సుమానుషస్య కథమప్యేకం హి తత్ప్రార్థ్యతే ॥

ఉత్తరరామచరితం 1-32

ఏ దాంపత్యం సుఖదుఃఖాదుల్లో ఒక్కటిగానే ఉంటుందో, ఏ దాంపత్యం అన్ని అవస్థల్లోనూ అంటే సంపత్తుల్లోనూ విపత్తుల్లోనూ అనుగుణంగా ఉంటుందో, ఏ దాంపత్యం హృదయానికి ఊరట కల్గిస్తుందో, ఏ దాంపత్యం ముదిమి పైకొన్నా రక్తి హరించుకొనిపోదో, ఏ దాంపత్యం కాలక్రమంగా పరిణమిస్తూ స్నేహసారంగా నెలకొంటుందో, అట్టి

సుమానుషత్వం భద్రంగా ఉండాలని ఉత్తర రామచరిత్ర నాటకంలో భవభూతి శ్రీరాముని ముఖతః పల్కించాడు.

పోతనార్యుని శ్రీరాముడు తన సతి సీత భూవివరం చొచ్చి నపుడు ఈ విధంగా దుఃఖిస్తాడు.

మ ॥ ముదితా ! యేటికి గ్రుంకి తీవు మనలో మోహంబు చింతింపవే
వదనాంభోజము సూపవే మృదువు నీ వాక్యంబు విన్పింపవే
తుదిసేయం దగదంచు నీశ్వరుడునై దుఃఖించె భూపాలు డా
పద గాదే ప్రియురాలి బాసిన యెడన్ భావింప నెవ్వారికిన్. 9-356

ఇందులో కట్టకడపటి వరకు శ్రీరామునికి సీత పట్లగల నిట్టలమైన కౌలీన శృంగార ప్రీతి ప్రతిష్ఠితం. భవభూతి చెప్పిన కౌలీవ శృంగార లక్షణానికి ఈ పద్యం లక్ష్యభావం.

కులీన కాంతాగత శృంగారం కౌలీన శృంగారం. అది సమాన శీలం గల దంపతుల సాంసారిక జీవన మాధుర్యసారం. కులీనలు స్వీయలు. వారు సంపదల్లో గానీ విపదల్లో గానీ ప్రియుని వీడరు. శీలం సత్యం ఋజుత్వంతో కూడిన రహః సంభోగ లాలసలు[17]. సంప్రదాయ బద్ధలు. వీరిపట్ల శృంగారమంటే విభావాను భావ సంబంధమైందే కాదు, మధుర భావన మేదైనా శృంగారమే. సాంసారికంగా వివిధ భూమికల్లో అది అనుభూత మైతుంది. అనురాగ దాంపత్యశృంగార మురళి కౌలీన శృంగారంలో రవళిస్తుంది. ఇదే గార్హస్థ్య శృంగారంగా కూడ వ్యవహృతం. ఏ తత్ప్రాముఖ్య ప్రచారం కోసమే పోతన్న అమూలకంగా కొన్ని సందర్భాల్ని స్వయం ప్రతిభా సంపన్నాలుగా తీర్చాడు. ధర్మార్థకామాలన్నీ కౌలీనం లోనే లీనమైతాయి. ఈ కౌలీన శృంగారాన్నే సంతాన పరిణతి పర్యంతం ఒకదశగానూ తర్వాత కుటుంబనిర్వహణంలో వచ్చే సాధక బాధకాలు ఒక దశగానూ పరిగణించవచ్చు.ఈ దశాద్వితయంలో సర్వకామాలూ సభార్యాకంగా నిర్వహించేవే. కనుక అవి అన్నీ కౌలీన శృంగారోత్పన్నాలే.

కౌలీన శృంగారంలో వధువు ప్రథమగణ్య. ఆ నవవధువుకు కొన్ని ప్రత్యేక లక్షణా లుండాలని లోకం నిర్దేశించింది. వాటిని పోతన రుక్మిణిలో నిక్షేపించాడు.

మ ॥ ధ్రువకీర్తిన్ హరి పెండ్లియాడె నిజ చేతోహారిణిన్ మాన సై
భవ గాంభీర్య విహారిణిన్ నిఖిల సంపత్కారిణిన్ సాధు బాం
ధవ సత్కారిణి బుణ్యచారిణి మహాదారిద్ర్య సంహారిణిన్
సు విభూషాంబర ధారిణిన్ గుణవతీ చూడామణిన్ రుక్మిణిన్. 10-1780

---

17 శ్లో॥ న ముంచతి ప్రియం స్వీయా సంపత్స్వపి విపత్స్వపి ।
శీలం సత్యార్జవోపేతా రహః సంభోగ లాలసా ॥ భావ ప్రకాశనము, పుట.208

ఏతల్లక్షణవతి ఇరువంశాల వారికీ శాశ్వతకీర్తినీ సంపత్తినీ సమకూరుస్తుంది. మనోహర రూపం అభిమాన సంపద లక్ష్మి గోరికళ బంధుప్రీతి అతిథి పూజాంతి ఉత్తమ వధూలక్షణాలు. ఇవి కౌలీన శృంగారానికి జీవనాడులు.

వధూవరులకు అనురూప లక్షణాలుంటే లోకం ఆనందిస్తుంది. మేలు కలుగుతుందని ఆశిస్తుంది. అది వారి పూర్వ పుణ్యంగా భావిస్తుంది. అప్పుడే పెండ్లి నూరేళ్ల పంట అనే అభాణకం అర్థవంత మైతుంది.

మ ॥ తగు నీ చక్రి విదర్భరాజ సుతకున్ దథ్యంబు వైదర్భియుం
దగు నీచక్రికి నింత మంచిదగునే దాంపత్య మీ యిద్దఱిం
దగులం గట్టిన బ్రహ్మ నేర్పరి గదా దర్పాహతారాతియై
మగ డౌ గావుత జక్రి యీ రమణికిన్ మాపుణ్య మూలంబునన్. 10-1737

వీరి సంసారచక్రం అవక్రంగా సాగి అనురాగ రంజితమై లోకాని కారాధ్యం అవుతుంది. వివాహంలో వయః ప్రాముఖ్యాన్ని పోతన గుర్తించాడు. గార్హస్థ్య శృంగార వృద్ధికి అది మూలం. భర్తకు వయోభేదం అధికంగా ఉంటే, అంటే భర్త వయోవృద్ధుడైతే ఆ కాపురం మరోరూపం ధరిస్తుంది.

ఆ ॥ పద్మనయన ! మగడు ప్రాయంపువాడైన
గాపుబెట్టి కొంత గావ నేర్చు
గడగి ముసలి తపసి గావంగ నేర్చునే
యువతి ముసలి గూర్చు టొప్పు దెందు. 9-64

ఆనాటి బాల్య వివాహాల మీద సంధించిన బాణం ఇది. అంతేకాదు. పరపురుషుల ఆకర్షణల బారినుండి తమ భార్యలను రక్షించుకోవలసిన బాధ్యతను భర్తలు గుర్తెరగాలన్నది వాత్స్యాయనోక్తి[18]. అది ఇక్కడ ధ్వనితం.

స్వయంవరంలో, ఉత్తమ వరుణ్ణి మాత్రమే వధువు ఎన్నుకుంటుంది. ఆ ఎన్నుకోవటంలో ఆమె వాంఛితం ఇమిడి ఉంటుంది. ఉత్తమ కన్య వరుడిలోని ఏ గుణాల్ని ఎందుకోసం ఎంచుకుంటుందో లక్ష్మి నిర్ణయం వల్ల తెలియవచ్చు.

లక్ష్మిస్వయంవరంలోని నాయిక 'ప్రౌఢ కన్యకారత్నం'. నాయకుడు 'శృంగార చందన శీతలుండు'. ఆమె ప్రౌఢ. కనుకనే స్వయంవరంలోని 'సకల సత్పురుష జనన వర్తనంబులు మానసించి పరిహరించి' (8-281) ముకుందుణ్ణి కోరుకుంది. అందుకు ఆమె మాపసించిన లక్షణాలివి -

---

[18] వాత్స్యాయన కామసూత్రాలు. సం. 2 పుట. 197

సీ॥ అమర ముక్తైదువనై యుండవచ్చును
వరుసకు సవతు లెవ్వరును లేరు
వెలయంగ నక్రాంత విభవ మీతని యిల్లు
శృంగారచందన శీతలుండు
గలగ డెన్నడు శుద్ధకారుణ్యమయ మూర్తి
విమలుండు గదిసి సేవించవచ్చు
నెఱినాడి తిరుగడు నిలుకడ గలవాడు
సకల కార్యములందు జడతలేదు

ఆ॥ సాధురక్షకుండు షడ్వర్గ రహితుండు
నాథు డయ్యెనేని నడపనోపు
నితడె భర్త యంచు నింతి సరోజాక్షు
బుష్పదామకమున బూజ సేసె. 8-282

ఇలా వరనిర్ణయంలో వధూలోకం విచక్షణ కలిగి ఉండాలి. అలాగే వరుడు పురుషోత్తముడి లాగా సర్వలక్షణ లక్షితుడైతేనే లక్ష్మి కోరిన విధంగా కాపురం సాగేది. ఆమె కోరిన కాపురమే సాక్షాత్తూ కోలీన శృంగారానికి కాణాచి.

కళ్యాణ సమయంలో కాంతామణికి మోహం మొల్లలై విరుస్తుంది. సిగ్గు మొగ్గలు తొడిగి సింగారంగా వికసిస్తుంది. స్వయంవరంలో లక్ష్మి వరుడివైపు చూపోపలేకపోయింది.

ఆ॥ మోహరుచుల వలన ముద్దియ తలయెత్తు
సిగ్గు వలన బాల శిరము వంచు
నింతి వెఱగు వలన నెత్తదు వంపదు
తనదు ముఖము ప్రాణదయితు జూచి. 8-284

అచ్చమైన కొత్త పెళ్ళి కూతురు లక్షణం ఇది. తెలుగునాట పెండ్లి పీటలమీది వధూవరుల వర్తనం ఇందుకు నిదర్శనం. పరస్పర సందర్శనానికి వారుపడే తహతహ దీనికి కారణం. ఆ మధురక్షణాలు వారి వైవాహిక జీవనకాలంలో శాశ్వతంగా నిలిచే శృంగార జ్ఞాపికలు. పెండ్లి సమయంలో కండ్లు కలిస్తేనే కంతుడు దండెత్తేది. అప్పటి దాకా సిగ్గు దొంతరలు ఇద్దరినీ ముంచెత్తుతూనే ఉంటాయి. అదే కోలీన శృంగార ప్రథమావస్థ.

కం॥ హరి సూచిన సిరి సూడదు
సిరి చూచిన హరియు జూడ సిగ్గును బొందున్
హరియును సిరియును దమలో
సరిచూపుల జూడ మరుడు సందడి వెట్టెన్. 8-285

ఇలా సిగ్గు మొగ్గలు ఆ సమయంలో వధూవరుల కిద్దరికీ సహజమని భావం. అది కొలీన శృంగార మధురోహల కంకురారోపణం. ఇలా నూతన దంపతులను ముసురుకొన్న లజ్జా తీవ్రవేగతలు అనుభవ రసికులకే గాని బాగాతెలియవేమో ! సంప్రదాయ వివాహాల్లో వరుడు సాక్షాత్తుగా నారాయణుడుగా సంభావితుడు. వధువు లక్ష్మీదేవియే. ఈ రీతిగా అర్ష వైవాహిక సంప్రదాయ పరిపోషణం జరగాలని పోతన ఆశయం. అందుకే లక్ష్మీ స్వయంవర ఘట్టాన్ని ఇంతగా కొలీన శృంగార రస బంధురం కావించాడు.

క్రీడలూ విహారాలు దంపతుల కుల్లాస జనకాలు. సంసారులు నెలకో పర్యాయమైనా విందులూ వినోదాలు జరుపుకోవాలి. అలాటి సరదాలు వారి శృంగార జీవ చైతన్యాన్ని నిత్య నూతనం చేస్తాయని వాత్స్యాయన మతం. పోతన అభిమతమూ అదే. పడకటింటి సౌరభాలు సతీపతులకు శృంగార భోగ భాగ్యాలు. అవి నిత్య శృంగారులకు అనునిత్యం ఉపాదేయాలు.

మందార వనాలు అమృత సరస్సులు చంద్రశిలాతలాలు పూలపాన్పులు పరిమళ పుష్పాలు సుగంధ ద్రవ్యాలు దంపతులకు నవ్య శృంగార భవ్య భావాల్ని ప్రోది చేసి వారిని శృంగారోన్ముఖం చేస్తాయి. మత్తుగొల్పి మదన తాండవం చేయిస్తాయి. కనుకనే కాలోచిత విహారక్రీడలు సల్పాలి. ప్రేమ జంటల విహారాలకూ వినోదాలకూ సరదాలకూ సౌరభాలకూ పడకటింటి పండగలకూ లక్ష్మీనారాయణుల విహారం ఒక ఉత్తమ ఉదాహరణం.

మ ॥ అల వైకుంఠ పురంబులో నగరిలో నా మూల సౌధంబు దా
పల మందార వనాంత రామృత సరః ప్రాంతేందుకాంతోప లో
త్పల పర్యంక................................................................ 8-95

ఉపవిష్టులైన రమానారాయణుల వినోదక్రీడలు వారి తరిగిపోని కొలీన శృంగారానికి దోహదాలు. వారి పర్యంక రచనా విధానం విశేషమయింది. ఆయా ఋతువులలోని శీతోష్ణస్థితుల కనుగుణంగా శృంగారోద్దీపకంగా శయ్యలను అలంకరించుకోవాలి. ఈ విధమైన శయ్యారచన ఒకకళ. ఇది కామశాస్త్రానికి గల అంగవిద్యలలో ఒకటి. అంగనామణులకు ఇందులో ఆసక్తి అధికంగా ఉండటం లోకసహజం.

పతి సమక్షంలో నవోఢ లజ్జాప్రతిరుద్ధ అవుతుంది. అది కులీనవనితకు సహజం. అదే ఆమెకు సంశోభిత శృంగారాభరణం. శ్రీమహావిష్ణువు గజరాజాక్రందనం విని ఉన్నపళంగా శృంగారతల్పంనుండి 'కుచోపరి చేలాంచల' మైనా వీడకుండా బయల్దేరాడు. అప్పటి ఆ మహాలక్ష్మి స్థితి గమనార్హం. ఆమె 'గోవింద కరారవింద సమాకృష్యమాణ సంవాద చేలాంచల' (8-99)గా దివినుండి భువికి రాసాగింది ఆబాలగోపాలంతో. ఈ అసదృశ కల్పనం లోకానికి అద్భుతానందదాయకమైన కనువిందు.

శా ॥ తాటంకాచలనంబుతో భుజ నట ద్ధమ్మిల్ల బంధంబుతో
శాటీ ముక్త కుచంబుతో నదృఢ చంచ త్కాంతితో శీర్ణ లా

లా టాలేపముతో మనోహర కరాలగ్నోత్తరీయంబుతో
గోటీందు ప్రభతో నురోజ భర సంకోచ ద్వలగ్నంబుతోన్. 8-102

ఇందులోని నవవధూ రూపలావణ్య సంభ్రమాలు సహజం. అవే నాయకుడికి హృదయావర్జకాలు. ఆమెది భువన మోహన చలత్ సౌందర్యం. పట్టిన కొంగుతో భర్త పరుగిడుతున్నా అదేమని అనలేనిది ఈనవోఢ. అప్పటి ఆమె లజ్జాభిమానాలే కులీన శృంగార భావతరంగాలు.

కం॥ అడిగెద నని కడువడి జను
నడిగిన దను మగుడ నుడుగడని నడ యుడుగున్
వెడ వెడ సిడిముడి తడబడ
నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్. 8-103

భర్తృ సన్నిధిలోని ఈ నవోఢా సందిగ్ధభావ పదనిసలు కులీన కాంతా శృంగారానికి సరిగమలు. ఆమె స్వీయ. ఆమెలో భోగేచ్ఛ మాత్రమే ఉంటుంది. ఆమె శృంగారపు చూపు తీవలన్నీ అతడిని బంధిస్తాయి. అందుకు లక్ష్మి ప్రతీక. ఇందులో నవవధూ రూపలావణ్య సంభ్రమాలు సందర్శనీయాలు. అవే నాయకుడికి హృదయాకర్షకాలు. నవోఢా వర్తనం ఇదే. ఇలాగా నవవధూ చేష్టితాలు సహజంగా అధిక లజ్జా భరితాలుగా ఉంటాయి. బంధువులకు నమస్కార పురస్కార లైనప్పటి వీరి అవస్థ సుమనోహరం[19].

ఇలా ప్రతివరుడూ విష్ణువులాగా నవోఢాపరిచరిష్ణుడు కావాలి. దేవతల లాగానే మానవులు కూడ నిత్యయౌవనులూ నిత్య శృంగారులూ కావాలని పోతనార్యుని ఆకాంక్ష. గజేంద్ర మోక్షణంలోని శ్రీమన్నారాయణమూర్తి శృంగార వర్తనం పోతనగారి నిస్సీమ శృంగార ప్రియత్వానికి సంకేతం. 'కరి కరేణు కరపీడన' జరిపించే పర్యంతం పరధ్యాన లేని విష్ణుమూర్తి తన ధ్యాస నప్పు డిక చెంతనున్న లక్ష్మీసతి మీదికి సారించాడు. కథాంతంలో ఆమెతో చేసిన భాషణం నవోఢా పరిచరిష్ణు పదానికి నిర్వచనం. అతని 'సాదర సల్లాప మందహాస పూర్వక ఆలింగనంతో ఆమె దరహసిత వదనకమల' (8-134) అయింది. ఆ స్థితిలోని ఈ ఆలింగన సౌభాగ్య కల్పనం సతి హృదయాన్ని ఎరిగి కరిగించే రతి పండిత లక్షణం. అది కులీన కాంతల మీద ఆలింగనం చూపే ప్రభావానికి ఉదాహార్యం. ఇలా ఆదరింపులు ఆలింగనాలు కులీన శృంగారానికి మూలకందాలు. రసిక భావవిదుల కిట్టివి రసానంద సందోహాలు.

---

19 కం॥ చంచద్ఘన కుచభారా
కుంచితయై క్రొత్త పెండ్లికూతు రగుట నిం
చించుక సిగ్గు జనింపగ
బాంచాల తనూజ మ్రొక్కె బద్మాక్షునకున్. 10. ఉ . 104

నవవధువులు ఆర్ష సంప్రదాయంలో ఎలా ఉంటారో వారి దృష్టిలో భర్తృ చింతనంలో దైవచింతనం ఎలా ఇమిడి ఉంటుందో లక్ష్మీవచనాలు విపులీకరిస్తాయి. విష్ణుమూర్తి తనను ఆదరిస్తుంటే దానికి సమాధానమిస్తున్న లక్ష్మి వచనాలు అందుకు నిదర్శనాలు.

కం॥ దేవా ! దేవర యడుగులు
భావంబున నిలిపి కొలుచు పని నా పని గా
కో వల్లభ ! యేమనియెద
నీ వెంటనె వచ్చుచుంటి నిఖిలాధిపతీ ! 8-132

పోతనకు కులీన శృంగారం పట్ల గల ఆదరం ఇలాంటిది. అలా ఆరాధించటం లోనే కులీన కాంతాశృంగారం భావ నిర్భరంగా ఉంటుందని ఆయన భావం. ఇది గార్హస్థ్య శృంగారోల్బణానికి మూలం. భర్తృ భావానికి అనుగుణమైన వర్తనం భార్యకుంటే వారి గృహసీమ స్వర్గ సీమే. ఆ కాపురంలో శృంగారం మూడుపూ లారు పండ్లే.

కులీన కాంతల బులిబులి కోపం వారి ముఖానికి శోభ నిస్తుంది. సతీపతుల గిల్లికజ్జాలు సరసోక్తులు విరసోక్తులు వారికి ప్రాణం. ప్రణయ కలహానంతరం సాగే రతి పారవశ్యం అనుభవైకవేద్యం. అది స్మరణ మనోహరం. ఆ మధురానుభవం కోసమే రసిక హృదయాలు ఉవ్విళ్లూరుతాయి. ఈ విషయంలో రుక్మిణితో శ్రీకృష్ణు డాడిన మాటలు రతి రహస్య సూత్రాలు.

ఉ॥ కింకలు ముద్దు బల్కులును గెంపు గనుంగవ తియ్య మోవియున్
జంకెలు తేటిజూపు లెక నక్కములున్ నెలవంక బొమ్మలున్
గొంకక పీడనాడుటలు గూరిమియుం గల కాంత గూడుటల్
అంకిలిలేక జన్మఫల మబ్బుట గాదె కురంగలోచనా ! 10ఉ. 285

కులీన కాంతలకు రతిపాండితి అవసరం. అందులోని మెలకువలు తెలియాలి. అందు కనుకూలలుగా వారిని మార్చుకోవటం కోసమే పతు లిలా ప్రవర్తిస్తారు. తద్వారా అమితానంద పారవశ్యులౌతారు. ఏతత్సుఖం కోసమే రసికులు గిల్లికజ్జాలు పెట్టుకుంటారు. వారి మనసు తెలుసుకుంటారు. కాని అవి నిజమని భావించి ప్రణయాన్ని ప్రళయంగా మార్చుకోరాదు ప్రమదలు. ఈ విషయాన్నే కృష్ణుడు రుక్మిణికి వివరిస్తాడు.

చం॥ అలికులవేణి ! నవ్వులకు నాడిన మాటల కింత నీ మదిం
గలగగనేల? వేటలను గయ్యములన్ రతులందు నొవ్వగా
బలికిన మాట లెగ్గులని పట్టుదురే? భవదీయ చిత్తముం
దెలియగ గోరి యే బలికితిన్ మదిలో నిజవర్తి నేటికిన్. 10ఉ. 283

ఇవి సతీ జనహృదయాలకు పతులు పెట్టే పరీక్షలట. అవి వారి వినోదాలలో ఒక భాగమే. అవి కొలీన శృంగారానికి శోభాస్పదాలు. అయా సందర్భాలలోనే ప్రేమ పాకాన పడేది. అప్పుడు మన్మథుడు వారి మధ్య నిలుస్తాడు. వారు పునః ప్రణయ పట్టాభిషిక్తు లౌతారు.

నాయికా ప్రణయకోప నివారక మంత్రోపదేశం చేశాడు పోతన. అది వారి పాదాలకు 'నతి' సేయటం, అంటే పాదాలకు నమస్కరించటం. అందులోనూ క్రమం ఉంది. అది అంతిమ బాణం. దానికి తిరుగులేదు. వామనుడు చేయి చాచి యాచించినపుడు కొలీన శృంగారమూర్తి అయిన బలిచక్రవర్తి మదిలో స్ఫురించింది ఆ హస్తానికి గల ప్రశస్తి. దాన్ని ఈ విధంగా నిరూపించటంలో పోతన గారి గార్హస్థ్య శృంగార ప్రీతి ద్యోతమాన మౌతుంది. అటువంటి హస్తలాలనం తన జన్మకు చరితార్థంగా సంభావించాడు బలిచక్రవర్తి. అలిగిన అదిలక్ష్మిని వశీకరించు కొన్న విష్ణుమూర్తి హస్త విన్యాసం ఇందుకు తార్కాణం.

● శా ॥ అదిన్ శ్రీసతి కొప్పుపై దనువుపై నంసోత్తరీయంబుపై
బాదాబ్జంబులపై గపోల తటిపై బాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందు కరంబు గ్రిందగుట మీదై నా కరంబుంట మే
ల్గాదే? రాజ్యము గీజ్యమున్ సతతమే? కాయంబు నాపాయమే? 8-591

కులీన కుపిత కాంతా విషయంలో అంటే, గార్హస్థ్య శృంగారంలో 'నతి' తప్పుగాదు. సరికదా అది సరస ప్రవర్తనం. అందుకు పాటుకు రానివారు పడతులు కారు. కనుక 'నతి' కి మించిన తారక మంత్రం కొలీన శృంగారంలో నాయకులకు మరొకటి లేదు. అదే రతి మన్మథ మంత్రం.

ప్రవాసం నుంచి వచ్చే భర్తను దూరంనుంచే స్వాగతించే వనితల స్వరూపం చలచ్చిత్ర సదృశం. వారి హృదయాల్లో భర్తృ భావం తొణికిస లాడుతుంది. అప్పటి వారి సంభ్రమం సంభావనీయం. అప్పుడు కులీన కాంతలకు సిగ్గే సింగారమై ముంచు కొస్తుంది.

కం॥ శిశువుల జంకల నిడి తను
కృశతలు విరహాగ్ని దెలుప గృహగేహళులన్
రశనలు జాఱఁగ సిగ్గుల
శశిముఖు లెదురేగి రపుడు జలజాక్షునకున్. 1-262

విరహ కృశతవల్ల మోహపారవశ్యం వల్ల మొలనూళ్ళు జారటం అనురాగ దాంపత్య మాధుర్య ద్యోతకం. ఇందులో కులీన కాంతల పునస్సమాగమ కాంక్ష సువిదితం. కృష్ణుణ్ణి చూచిన శుద్ధాంతకాంతల సంభ్రమం ఇది. ఇది సర్వ కులీన కాంతా జన సహజం. మగ డూళ్ళోలేని రోజుల్లో కులీనల్లో నిత్యకృత్యా లన్నింటా అనాసక్తి ప్రబలటం సహజం. శ్రీకృష్ణుడి శుద్ధాంతకాంతలు అందుకు ఉదాహృతి. వారు 'హరి బాసిన దినములందు

శరీర సంస్కార కేళీ విహార హాస మందిర గమన మహోత్సవ దర్శనం బొల్లసి యిల్లా ... (1-267). భర్త దూరదేశగతుడైతే భార్య క్రీడలు అలంకరణాలు సాంఘికాలైన ఉత్స... పాల్గొనటం పరిహాసా లాడటం పరగృహాలకు వెళ్లటం అనే ఐదు కర...ను పరిత్యజించాలి.[20] ఇది భారతీయ సంప్రదాయం. ఇలా ముమ్మూర్తులా కృష్ణ కాం...తలు ప్రోషిత భర్తృకలే. ప్రవాసం నుండి వచ్చిన భర్త తన భార్య స్థితిని చూచి ఆదరించటం ఆమెకు ఆనందప్రదం. అది ఒక కళ. ఈ వాచిక శృంగారం కౌలీన శృంగారంలో అంతర్భాగమే. శ్రీకృష్ణుడు తన శుద్ధాంత కాంతల విరహకృశతలు చూచి ఆదరించిన వైన మిది.

సీ ॥ తిలక మేటికి లేదు? తిలకినీ తిలకమ !
పువ్వులు దుఱుమవా? పువ్వుబోణి !
కస్తూరి యలదవా? కస్తూరికాగంధి !
తొడవులు తొడవవా? తొడవు తొడవ !
కలహంస బెంపుదే? కలహంస గామిని !
కీరంబు జదివింతె? కీరవాణి !
లతల బోషింతువా? లతికాలలిత దేహ !
సరసి నోలాడుదె? సరసిజాక్షి !

ఆ ॥ మృగికి మేత లిడుదె? మృగశాబలోచన !
గురుల నాదరింతె? గురువివేక !
బంధు జనుల బ్రోతె ? బంధు చింతామణి !
యనుచు సతుల నడిగె నచ్యుతుండు. 1-266

వారి సంబోధనలన్నీ సాభిప్రాయ విశేషణాలే. అవి వారి అనురూప సంబోధనలే. ఇది ప్రోషిత భర్తృకా స్వరూప సమ్యగ్వర్ణనం. ఇందులోని పరిమళ ద్రవ్యాలూ లతా హంస మృగశాబ పోషణాలూ శృంగార భూషణాలు. తమ భార్యలను సమయోచితాలైన ఉదాత్త భావనాభిరుచుల కాలవాలమైన ఉచిత వేష భూషాలంకృతలుగా ఉండమని ప్రోత్సహించటం సర్వకాల సర్వావస్థల్లోనూ శృంగార పురుషుల లక్షణం. వారు జగమంతా శృంగార మయంగానే భావిస్తారు.

గృహస్థ వ్యవస్థలోని ఈ భార్యాలాలనం పోతన భావనంలో మహోన్నతం. భర్తల ఆదరింపులో భార్యలు పరవశిస్తారు. వారు ప్రశ్నల వర్షం కురిపించినా ప్రత్యుత్తరం ఇవ్వలేని పరవశలు. వారు మాటల్లోనే మైమరచి పోతారు. 'బుద్ధిన్ విలోకించి'

---

20 శ్లో॥ క్రీడాం శరీర సంస్కారం సమాజోత్సవ దర్శనం ।
హాస్యం పరగృహే యానం త్యజేత్ప్రోషితభర్తృకా ॥
- గౌడీయ శ్రీమద్భాగవతం స్కం. 1, పుట. 185

కరయుగ్మంతో కౌగిలించి కల్యాణ బాష్పాలను ఆభరణ శ్రేణులుగా ధరిస్తారు. ప్రతి క్షణం నవప్రాప్తానురాగాన్ని అనుభవిస్తారు (1-268) ధర్మ బద్ధమైన గార్హస్థ్య శృంగారంలో.

బహుపత్నీకుడైన వ్యక్తి తన భార్యల మనో వృత్తుల్ని గూర్చి నిశితంగా భావించాలి. అందరి పట్ల సమానానురాగం కలిగి ఉండాలి. అందరి అనురాగాన్నీ దోచుకోవాలి. అలా కాకుంటే ఆ కాపురం 'కల్లోల కడలి' గా మారుతుంది. శ్రీకృష్ణుడి ఆలోచనలు (1-260) అతని భార్యల మనోభావాలు (1-263) భాగవతంలో అందుకు నిదర్శనాలు.

భర్తకు సమానురాగం ఉన్నా భార్యల మానసాల్లో భేదాలుండటం వల్ల నరకం అనుభవించిన వ్యక్తి యయాతి. ఆ ఇద్దరు ముద్దుగుమ్మల మధ్య సమత కూర్చలేక శతమతమైన వ్యక్తిగా మిగిలిపోయాడు. ఒక భార్యకు అపత్యరూపమైన అర్థ శృంగారాన్ని కూర్చటానికి మరోభార్యకు భయపడుతూనే సాహసించి అవస్థల పాలైనాడు. ఈవ్యవహారం అంతా కౌలీన శృంగారానుభవంలోని అవకతవకలకు ప్రతిరూపమే.

స్త్రీలు తమ జీవితంలో నగానట్రలను చీరసారెలను అందచందాలను ఆభరణాలను ప్రముఖంగా కోరుకుంటారు. అందులో అలంకరణాలు వారికి ఆరోప్రాణం. వారి ఆ శృంగార రచన చతుర్విధాలు. అవి వస్త్ర మాల్యానులేపన భూషణాలు. జలజలోచనుడి వద్దకు ఉత్కలికతో వెళ్లే శుద్ధాంత కాంతల వేషం ఇది.

సీ ॥ వికచ మరంద నవీన సౌరభ లస
　　　న్మందారకుసుమ దామములు తుఱిమి
　చారు సుగంధ కస్తూరికా ఘనసార
　　　మిళిత చందన పంక మెలమి నలది
　కనక కుండల కనత్కంకణ నూపుర
　　　ముద్రికా భూషణములు ధరించి
　యంచిత ముక్తా ఫలాంచల మృదుల ది
　　　వ్యాంబరములు చెలువార గట్టి

తే ॥ యర్ధ చంద్రుని నెకసక్కె మాడునట్టి
　యళిక ఫలకల దిలకము లలర దీర్చి
　పెంపు దీపింప నుడురాజ బింబముఖులు
　నవ చతుర్విధ శృంగార మవధరించి. 10ఉ. 670

ఈ అలంకరణాల శోభవల్ల సతులకు పతులపై ఉత్కలిక అధిక మైతుంది సహజంగా. అంతేకాక సర్వ రస ప్రస్తావనల్లోను ఆభరణాల శోభ భాగవతంలో సర్వేసర్వత్ర కనిపిస్తుంది.

కౌలీన శృంగారానికి భార్య ప్రాణం. ఆమె ఉత్తమ లక్షణాలతో కౌలీన శృంగా రానంద పౌధ శిఖరాల నధిరోహిస్తుంది. అందుకే సీత తన వర్తనం ద్వారా సతులకు పతి

వశీకరణ మంత్రాన్ని ఉపదేశించింది. అర్ధ గృహిణీ ధర్మాన్ని ప్రబోధించింది. అదే ఆ మంత్ర రాజం.

ఆ ॥ సిగ్గు వడుట గల్గి సింగారమును గల్గి
భక్తి గల్గి చాల భయము గల్గి
నయము బ్రియము గల్గి నరనాథు చిత్తంబు
సీత దనకు వశము చేసికొనియె. 9-337

ఆమె వర్తనం వల్లనే లోకంలో సీతారాములు ఆదర్శ దంపతులై లోకారాధ్యులైనారు. అందుకే ప్రతికళ్యాణ వేదిక మీద మంగళ వాద్యాలు సీతారామ కళ్యాణ స్ఫోరకాలుగా ప్రతిధ్వనిస్తాయి. ఉత్తమ ఇల్లాలు భర్తను చూస్తూనే 'ఆనంద రసమగ్న' అవుతుంది. అలాంటి వారి కాపురంలో అనురాగ రసం తళుకొత్తి నిత్యానందం లాస్యం చేస్తుంది. కృష్ణమందిరం నుండి తిరిగి వచ్చిన కుచేల దర్శనంతో పరవశించే అతని భార్యావర్తనం ఇందుకు నిదర్శనం.

గృహస్థ వ్యవస్థలో భార్యా స్వరూప స్వభావాలకు ప్రముఖ స్థానం ఉంది. ఆమెకు కొన్ని ప్రధాన ధర్మా లున్నాయి. భర్తను ఆనందింప చేసి తద్వారా ఆనందాన్ని పొంది అనురాగ జీవితాన్ని గడపాలి. అందుకు ఆమె గార్హస్థ్య శృంగార వర్తనం ముఖ్యం.

సీ ॥ నిలయము వాటించి నిర్మల దేహియై
శృంగార మేప్రొద్దు జేయవలయు
సత్య ప్రియాలాప చతురయై ప్రాణేశు
చిత్తంబు ప్రేమ రంజింప వలయు
దాక్షిణ్య సంతోష ధర్మమేధాదుల
దైవతమని ప్రియు దలపవలయు
నాథుడే పద్ధతి నడచు నా పద్ధతి
నడచి సద్బంధుల నడప వలయు

ఆ ॥ మార్దవమున బతికి మజ్జన భోజన
శయన పాన రతులు జరుప వలయు
విభుడు పతితుడైన వెలది పాతివ్రత్య
మహిమ బుణ్యు జేసి మనుప వలయు. 7-416

భార్య నిత్యాలంకృతగా ఉండాలి. తన వర్తనం ద్వారా భర్తను రంజించి గృహమే కదా ! స్వర్గసీమ అని అత డనుకొనేలాగా చేయాలి. సర్వలక్షణ సంపన్నలే శృంగార రస రూపిణులైతారు. సతి సర్వకార్యాల్లోనూ పతి కనుకూలవతిగా ఉండాలి. అప్పుడే గార్హస్థ్య శృంగారం నెలకొనేది. అవసరమైతే సహనం వహించి భర్తను సన్మార్గగామునిగా చేయాలి. కాపురాన్ని ఆనంద నందనవనం చేసి నిత్య శోభాస్పదం చేయాలి. 'గృహిణీ గృహభాగ్య

ముచ్యతే' అన్నట్లు ఇంటిని చూస్తూనే ఇల్లాలిని చూడ ముచ్చట కొల్పాలి. ఇంటి శోభకు ఇల్లాలే మూలం. అది ఆమె కున్న శృంగార ప్రీతి మీద అధారపడి ఉంటుందని వాత్స్యాయనుడి మతం. దీన్నే ఆత్మీయతా ముద్రతో భద్రపరిచాడు పోతన. ఏతల్లక్షణ వతులే 'ఉదాత్తవనితలు'. ఇంకా వీరి చేష్టా విశేషాల్ని ఇలా గమనించవచ్చు -

శ్లో ॥ ఉదాత్త కేశవాసోఽంగ మాల్య భూషాసు సాదరా ॥
శయ్యాభరణ సంస్కార పరిబర్హ సమేధినీ ।
స్థిర స్నేహా కృతజ్ఞా చ దదాత్యాశ్రిత వత్సలా ॥
మానయంతీ చ మానార్హా నిత్యోత్సవ రతాఽపిచ ।
బంధు సంబాధ ముదితా కృతజ్ఞా ప్రియవాదినీ ॥
ఏవమాది గుణై ర్యుక్తా ముదాత్తాం పరిచక్షతే'। భావప్రకాశనము. పుట. 210

ఏతదుత్తమ లక్షణ సంకలితలు ఉదాత్త నాయికలు. వారిదే కౌలీన శృంగారంలో ఉన్నత స్థానం. కనుకనే పోతన వారినే సంభావించాడు.

రతి క్రీడలో సతి చాశీతి బంధాలతో పతికనుకూలవతి అయితే వారి శృంగార మాధుర్యం మనోరమం. అందువల్లనే రుక్మిణి 'పతి యే రూపము దాల్చినన్ దదనురూపం బైన రూపంబుతో' (10ఉ. 230) రతిక్రీడలో సహకరించింది. ఇందులోని అనేక రతి బంధ విశేషాలనూ ఆమె రతిపాండితినీ అభ్యూహించవచ్చు. ఇది సతీపతుల ఐక్యానురూప సంసిద్ధికి సిద్ధపథం.

సరస్వతీస్తుతి (1-6) సందర్భంలో పోతన ప్రతిసతీ స్వాధీనపతిక కావాలని ధ్వనింప జేశాడు. అలాగే ప్రతి భర్తా సతీహృదయ సౌఖ్యవిధాత కావాలని (1-3) ఆకాంక్షించాడు. కనుక కౌలీన శృంగారంలో భార్యా వర్తనంతో పాటు పోతన భర్తృవర్తనాన్ని కూడ నిర్దేశించాడు. భర్తలు అంగవిద్యలు కామకళలు శృంగార విద్యలు ఎరిగి సతీ హృదయ రంజకులు కావాలి. బహుభార్యానక్తుడి సంగతి అయితే వేరే చెప్పనవసరం లేదు. అందరికీ అన్ని రూపులై (10ఉ. 617) వర్తించాలి.

గార్హస్థ్య శృంగారంలో సతీపతులిద్దరూ రతిపండితులే అయితే ఆ సంసారం రతిమన్మథ సామ్రాజ్య మైతుంది.

సీ ॥ పొలతుల వాలు జూపుల యంద చాంచల్య
మబలల నడుముల యంద లేమి
కాంతాలకములంద కౌటిల్య సంచార
మతివల నడుపుల యంద జడిమ
ముగుదల పరిరంభముల యంద పీడన
మంగనా కుచముల యంద పోరు
పడతుల రతులంద బంద సద్భావంబు
సతుల బాయుట యంద సంజ్వరంబు

తే ॥ ప్రియులు ప్రియురాండ్ర మనముల బెరసి తార్పు
లంద చౌర్యంబు వల్లభు లాత్మ సతుల
నాగి క్రమ్ముళ్లు వట్టుటం దక్రమంబు
రామచంద్రుండు పాలించు రాజ్యమందు. 9-334

ఆ విధమైన సామ్రాజ్య స్థాపనే పోతన ధ్యేయం. అదే కౌలీన శృంగారానికి ఆటపట్టు. రాజ్యాల్లో సామాన్యంగా ఉండే లోపాలు రామరాజ్యంలో రామాలోకాన్నాశ్రయించి రాణించినట్లు పోతన్న గారు కావించిన ఈ కల్పనం అనల్ప శృంగార భావానుసంధానంగా భావించాలి.

'విపత్తి కాలే గృహిణీ పరీక్షా' అని ఆర్యోక్తి. స్త్రీయలు భర్తల్ని ఆపద సమయంలో ఆదుకుంటారు. కాకుంటే ఆకులతకు లోనైతారు. అవసరమైతే కదనరంగానికైనా కదలి పోతారు. ప్రాణాలనైనాపణంగా పెడతారు. అందులోనూ తమ సహజ శృంగారాన్ని గుప్పిస్తారు. శ్రీకృష్ణుడు సత్యభామను యుద్ధానికి వద్దంటున్నా 'నీ / మానిత బాహుదుర్గముల మాటున నుండగ నేమిశంక?'(10 ఉ.155) అంటూ సత్య భర్త శక్తిని ప్రశంసించింది. దానితో ఆమెను 'బహుమాన పురస్సర దృష్టితో' చూచి కరకమలాలతో గ్రుచ్చి యెత్తి ఆదరించటంతో ఆ మానినీ హృదయానందం నిస్సీమంగా నిలిచింది. అపై కదనరంగంలో తానే అగ్రగామిగా పోరింది. శృంగార వీరాల్ని సమపాళ్లలో రంగరించింది. ఇలా భర్తకు చేదోడై అర్థ శృంగార సాధనకు సహకరించింది.

లోక శ్రేయస్సు కోసం భర్త ప్రాణాల్ని కూడా పణంగా పెట్టే సర్వమంగళ లాంటి సాహసం గల ఇల్లాళ్లూ ఉన్నారు. హాలాపాన సమయంలో పార్వతి -

కం॥ మ్రింగెడి వాడు విభుండని
మ్రింగెడిదియు గరళ మనియు మేలని ప్రజకున్
మ్రింగు మనె సర్వమంగళ
మంగళ సూత్రంబు నెంత మది నమ్మినదో ! 8-241

ఆమె తన మంగళ సూత్రం మీద ఉన్న నమ్మకం కొద్దీ భర్తను హాలాపాన భక్షణకు ప్రోత్సహించింది. కులీన స్త్రీలు తమ మంగళసూత్ర బలమే తమ భర్తలకు శ్రీరామరక్షగా నమ్ముకుంటారు. ఈ నమ్మకం మరే యితర శృంగారాల్లోనూ లేని మధురతర భావం.

భర్తృ సన్నిధిలో ఎన్నడూ నోరు మెదవని స్త్రీలు సైతం విపత్తులో ప్రదర్శించే వాక్పమత్కృతి విస్మయావహం. 'పతిభిక్షాం మమదేహి కోమలమతే పద్మాపతే' (8-652) అని వింధ్యావళి విష్ణుమూర్తిని ప్రార్థించటంలో తన స్థితిలో అతడి భార్య ఉంటే ఆమె మనసు ఎలా ఉంటుందో ఊహించుకొని తన పతిని రక్షించమని ఆమె అభ్యర్థించింది. ఇంతటి ఈ భావగర్భిత వాచికత కౌలీన శృంగార శోభావహం. వారి గౌరవాన్ని అది ఇనుమడింప జేస్తుంది. అలాగే కాళీయుని భార్యలు పతి భిక్ష కోసం వచ్చి -

ఆ॥ నీవు సేయు పెండ్లి నిత్యంబు భద్రంబు
పిన్ననాటి పెండ్లి పెండ్లి గాదు. 10-686

అని కృష్ణునితో అనటం వారి భర్తృరక్షణ పరతంత్రం. ఇది అంతర్నిగూఢ భర్తృ భావనాకలిత కౌలీన శృంగారం. పతివినా వీరికి వేరే లోకమే లేదు.

కౌలీన శృంగారరస పరమార్థం సంతాన లబ్ధిలోనే సార్థకం. ఆ సంతానంపట్ల కలిగేది వాత్సల్య భావం. కొందరు దీన్ని రసంగా నిరూపించటానికి యత్నించినా శృంగార రసంలోనే అంతర్గతంగా ఎక్కువమంది ఆలంకారికులు భావించారు.ఈ వాత్సల్య భావోల్లసిత ఘట్టాలు భాగవతంలో ఒండు రెండున్నాయి. కుమారోదయ సమయంలో పితృహృదయం సహజంగా అతివేలానందంతో ఉప్పొంగుతుంది. అది బుధుణ్ణి గన్న చంద్రుణ్ణి చూస్తే తెలుస్తుంది.

ఆ॥ బుద్ధిమంతుడైన బుధుడు పుత్రుండైన
మేను పెంచి రాజు మిన్ను ముట్టె
బుద్ధిగల సుతుండు పుట్టినచో దండ్రి
మిన్ను ముట్ట కేల మిన్నకుండు ? 9-385

ప్రతి తండ్రీ తన తనయుడెంతటి వాడో కావాలని కలలు కంటాడు. ఆ కలలు ఫలిస్తే అతడి ఆనందానికి అవధులుండ విలాగే. అలాగే పుత్రుడి ఉత్తమ గుణాలు విన్న మాతృమూర్తి హృదయం ప్రేయోభావ నిర్భరం కావటం సహజం. శ్రీకృష్ణుని ఉన్నతిని గూర్చి భర్తృముఖతః విన్న యశోద హృదయస్థితి ఇందుకు హృద్యమైన నిదర్శనం.

కం ॥ పెనిమిటి బిడ్డని గుణములు
వినుతింప యశోద ప్రేమ విహ్వల మతియై
చనుమొనల బాలు గురియగ
గను గొనలను జలము లొలుకగా బెగ్గిలియెన్. 10-1442

మాతృస్థాన సార్థక్యం కన్న కౌలీనంలో స్త్రీలకు అమందానందం మరొకటి ఉండదు కదా !

పిల్లలు పెరిగి పెద్దవారైనా వారు సంతానవంతులైనా సరే ! తల్లుల దృష్టిలో వారు పసిబిడ్డలే. భారతంలో కుంతి కూడా పాండవుల వనగమన సందర్భంలో ద్రౌపదితో ఇలాగే సహదేవుణ్ణి గూర్చి 'కడు పసిబిడ్డ వీడ'ని పలికి, ఆమెకు అప్పగించింది. పిల్లలను చూస్తే తల్లుల హృదయాల్లో వత్సలత ఉప్పొంగ వలసిందే.

కం॥ బిడ్డడు మ్రొక్కిన దల్లులు
జడ్డన నంకముల నునిచి చన్నుల తుది బా
లొడ్డగిల బ్రేమభరమున
జడ్డు వడం దడిపి రశ్రుజలముల ననఘా ! 1-258

శ్రీకృష్ణుడు నమస్కరించగా దేవకీ ప్రముఖులైన ఏడ్వురకూ హృదయాలు వాత్సల్యంతో ఉప్పొంగాయి. ఆ తల్లుల అనన సీమలు అనందాశ్రు తరంగితా లైనాయి. ఇదే కౌలీన శృంగారం లోని మాతృత్వ మాధుర్యం.

కుటుంబ నిర్వహణంలో సామాన్య సంసారి తన భార్యను పరామర్శించే విధం వేరు. పూర్వ రంగంలోని కామ శృంగారం కాక సాంసారిక వృత్తి చోటు చేసుకుంటుంది. అది మనోహరం. వారి గృహాలు కొడుకులూ కోడళ్లతో బంధువుల రాక పోకలతో పెట్టు పోతలతో ఆదర సత్కారాలతో శుభాస్పదాలు కావాలి. అదే వారి కుటుంబ ధర్మం. ప్రజాతంతువు నెలకొన్న తర్వాత శారీరక శృంగారం కన్నా మానసిక ఆనందానికే ప్రాధాన్యం పెరుగుతుంది. మరే ఇతర వ్యవస్థలోనూ ఈ మాధుర్యానికి తావులేదు. అందుకే శ్రీకృష్ణుడు తన భార్యలను పరామర్శిస్తూ కుటుంబ సంబంధ విషయాలనే ప్రస్తావిస్తాడు.

మ ॥ కొడుకుల్ భక్తి విధేయు లౌదురు గదా? కోడండ్రు మీ వాక్యముల్
కడవం బాఱక యుందురా? విబుధ సత్కారంబు గావింతురా?
తొడవుల్ వస్త్రములుం బదార్థ రస సందోహంబులుం జాలునా ?
కడమల్ గావు గదా? భవన్నిలయముల్ గల్యాణ యుక్తంబులే? 1-265

కామ భోగా లనుభవించిన తరువాత దంపతులకు కుటుంబంలోని చిన్న పెద్దల యోగ క్షేమాలే పరమ ప్రీతికరాలు. అందులో కలిగే ప్రేమానురాగాలే వారి మానసిక పరితృప్తికి చరమ సీమలు. సురమాత తన సుతులైన ఇంద్రాదులు అడవుల పాలైనందుకు చింతించింది. భర్త కశ్యపబ్రహ్మ గావించిన ఊరడింపు ఆమెకు ప్రాణం పోసినట్లయింది. అతడి ధర్మప్రబోధం గృహస్థ శృంగారానికి క్రొత్త సింగారం. ధర్మ నిర్వహణ సాధు సంతర్పణ అతిథి పూజనం వంటి ధర్మకార్య నిర్వహణాదుల్లో నిమగ్నమైన సతి పట్ల పతికి కలిగే గౌరవానురాగాలు గార్హస్థ్య శృంగార ధర్మాలు. అవి నిత్య సందీపితాలు.

దితి కామమోహిత అయిన పద్ధతి 'వినయ ప్రణయం' . శర్మిష్ఠ యెదురు వేచి యయాతి కడకు రావటం అనపత్య సంబంధమైన అర్థ శృంగారం. గోపికలది కామ శృంగారం, కర్దమ దేవహూతుల శృంగార పరిణామం మోక్షశృంగారం. ఇలా అనేక రీతులుగా గార్హస్థ్య శృంగారం భాగవతంలో సర్వత్ర సందర్శనీయం. కనుకనే శ్రీకృష్ణు డెంతటి అవతారమూర్తి అయినా గృహస్థ జీవన కళా నిర్వాహకుడై సర్వపురుషార్థాలూ సాధించి లోకానికి ఆదర్శమూర్తి అయినాడు.

ఉ ॥ వారక కృష్ణు డిప్పగిది వైదికవృత్తి గృహస్థధర్మ మే
పారగ బూని ధర్మమును నర్థము గామము నందు జాపుచున్
గోరిక మీఱ సజ్జనులకుం గతి దాన యనంగ నొప్పి సం
సారి గతిన్ మెలంగె నృపసత్తమ ! లోక విడంబనార్థ మై. 10ఉ. 1323

ధర్మాన్నీ అర్థాన్నీ కామాన్నీ గృహస్థ జీవితంలో నెలకొల్పి శ్రీకృష్ణుడు లోకాన్ని జాగృతం చేసినట్లు భాగవతం నిరూపిస్తుంది. అతిమానుషుడైన శ్రీకృష్ణుడి లాగా అందరూ వైశిక శృంగార నాయకులు కాలేరు. కానీ కొలీన శృంగార నాయకులు కావటంలో కష్టం లేదు. ఇందువల్ల ధర్మార్థ కామాల్ని అందరూ చక్కగా పండించు కోవచ్చు. అనురాగ మయమైన ఈ శృంగార యోగంతో జీవితాన్ని ఆనందధామంగా తీర్చి దిద్దుకోవచ్చు.

ఈ రీతిగా భాగవతం అతిమానుష, మానుష శృంగార రత్నాకరం.



# ఆధార గ్రంథ సూచిక

## తెలుగు గ్రంథాలు


| | | |
|---|---|---|
| ఆంధ్ర ధ్వన్యాలోకము | ...... | వేదాల తిరువెంగళాచార్యులు |
| ఆంధ్ర భాగవత విమర్శనము | ...... | డా ॥ ప్రసాదరాయ కులపతి |
| ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు | ...... | పుట్టపర్తి నారాయణాచార్యులు |
| ఆంధ్ర వాగ్గేయకారుల చరిత్ర | ...... | బాలాంత్రపు రజనీకాంతరావు |
| ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము | ...... | కె. వెంకట నారాయణరావు |
| ఆంధ్ర వాఙ్మయము - కృష్ణ కథ | ...... | డా ॥ ధారా రామనాథ శాస్త్రి |
| ఆంధ్ర సాహిత్య చరిత్ర | ...... | పింగళి లక్ష్మీకాంతం |
| ఆంధ్ర సాహిత్య దర్పణము | ...... | వేదం వేంకట రాయశాస్త్రి |
| ఆధునికాంధ్ర కవిత్రయ శారదా సమారాధనం | ... | డా ॥ బొడ్డుపల్లి పురుషోత్తం |
| కాదంబరీ రసజ్ఞత | ...... | పేరాల భరతశర్మ |
| కావ్యాలంకార సంగ్రహము | ...... | సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి (వ్యాఖ్య) |
| గానకళాబోధిని | ...... | యన్.సి. పార్థసారథి, ద్వారకాపార్థ సారథి |
| తెలుగు సాహిత్యము రసాభాసము | ...... | ఇప్పగుంట మాధవరావు |
| పోతన | ...... | వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి |
| పోతన భాగవత నీరాజనము | ...... | టి.టి.డి. ప్రచురణ |
| భాగవతము అకాడమీ ప్రతి | ...... | బమ్మెర పోతన |
| భాగవత వైజయంతిక | ...... | కరుణశ్రీ (సం ॥) |
| భాగవతానుశీలనము | ...... | ధూళిపాళ శ్రీరామమూర్తి |
| భోగినీ దండకము | ...... | బమ్మెర పోతన |
| మందార మకరందాలు | ...... | సి. నారాయణ రెడ్డి |
| శృంగారం - పోతన | ...... | బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి |
| శ్రీ కృష్ణ చరిత్రము - సం. 1 | ...... | బాలాంత్రపు సూర్యనారాయణ రావు (అను.) |
| శృంగార శ్రీనాథము | ...... | వేటూరి ప్రభాకర శాస్త్రి |

శ్రీ మద్భాగవత రహస్యము ....... ఎక్కిరాల కృష్ణమాచార్య

సంస్కృత వాఙ్మయ చరిత్ర ....... మల్లాది సూర్యనారాయణ శాస్త్రి

## సంస్కృత గ్రంథాలు

అభినయ దర్పణం ....... పోణంగి శ్రీరామ అప్పారావు (వ్యాఖ్య)

అష్టోత్తర శతోపనిషదః ....... వావిళ్ళ ప్రచురణ

గీతగోవింద కావ్యము (వావిళ్ళ ప్రచురణ) ....... జయదేవుడు

ఉత్తరరామ చరిత నాటకం ....... భవభూతి

ధ్వన్యాలోకః (చౌఖాంబా ప్రచురణ) ....... ఆనంద వర్ధనాచార్య

నవరస గంగాధరం ....... జమ్మలమడక మాధవ రామశర్మ (అను.)

నాట్య శాస్త్రం ....... పోణంగి శ్రీరామ అప్పారావు (వ్యాఖ్య)

ప్రతాప రుద్రీయం ....... జమ్మలమడక మాధవరామ శర్మ (అను.)

భావ ప్రకాశనం ....... జమ్మలమడక మాధవరామ శర్మ (అను.)

రసమంజరి ....... భానుసూరి

రసార్ణవ సుధాకరం ....... బులుసు వేంకట రమణయ్య (వ్యాఖ్య)

వాత్స్యాయన కామసూత్రాలు

జయ మంగళ వ్యాఖ్య ....... పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి (అను.)

వాత్స్యాయన కామసూత్రాలు ....... రెంటాల గోపాలకృష్ణ (వ్యాఖ్య)

శృంగార ప్రకాశము ....... జమ్మలమడక మాధవరామ శర్మ (అను.)

శ్రీమద్భాగవతము (శ్రీధరీయ వ్యాఖ్య) ....... వావిళ్ళ ప్రచురణ

## ఆంగ్ల గ్రంథం

**Sringara Praksa .... Dr. V. Raghavan (Commentory)**

